# బ్రహ్మవిద్యాదర్పణము

## (HINDUISM IN THE LIGHT OF THEOSOPHY)


దివ్యజ్ఞానసమాజఉపన్యాసకుఁడు

చిట్టిమూరు రామయ్య, బి. ఏ., ఎల్. టి.,

గారిచే రచియింపఁబడినది.




(మూఁడవకూర్పు)


"వసంతా ఇన్‌స్టిట్యూట్"

థియాసాఫికల్ సొసైటి




అడయారు, మద్రాసు



1941

# బ్రహ్మవిద్యాదర్పణము

## (HINDUISM IN THE LIGHT OF THEOSOPHY)

దివ్యజ్ఞానసమాజఉపన్యాసకుఁడు

చిట్టమూరు రామయ్య, బి. ఏ., ఎల్. టి.,

గారిచే రచియింపఁబడినది.

(మూడవకూర్పు)

"వసంతా ఇన్‌స్టిట్యూట్"

థియాసాఫికల్ సొసైటి

అడయారు, మద్రాసు

1941

DEDICATED

WITH KIND PERMISSION

TO

MRS. ANNIE BESANT, F.T.S.

BY

HER DEVOTED PUPIL

THE AUTHOR

# అవతారిక

మనుజుఁ డెవఁడు? ఎందుండి వచ్చినవాఁడు? ఎచటికిఁ బోవువాఁడు? వా డేమి చేయవలెను? ఏవిధముగ నేల చేయవలయు? అను నీమొదలగు విషయములు ఎల్లవారును దెలిసికొనఁదగినవి గదా! ఇవి వివరముగను సులభముగను నొక్కచోఁ దెలియఁజేయు నాంధ్రగ్రంథములు దొరకుట యరుదు. సంస్కృతభాషయందు బరిచయము గలవారును ఆ భాషా పాండిత్యము గలిగి యనేక గ్రంథములఁ జదివినను నివి యంత సులభముగ దెలియవు. అందుచే నివియన్నియును దేటతెల్లముగ దెలియున ట్లీగ్రంథము సులభశైలితో వ్రాయఁబడియున్నది. దివ్యజ్ఞానసమాజము (The Theosophical Society) వా రీమొదలగు ననేకవిషయములను బరిశీలించి ప్రకృతిశాస్త్రములందు బ్రవీణత గలవారి యుక్తులకును లౌకికానుభవమునకును ననుకూలముగ ననేకగ్రంథముల వ్రాసియున్నారు. వానిని శోధించి కొన్ని ముఖ్యాంశము లీగ్రంథమున గ్రంథకర్త వివరించియున్నాఁడు. మఱియు సర్వజనులకు సులభసాధ్యముగ నుండవలయునను నుద్దేశ్యముతో నీగ్రంథమును స్వల్పక్రయమునకు నీయ నిశ్చయించినాడు.

లోకోపకారమునకై గ్రంథకర్త చేసిన యీ యుద్యమమును భగవంతుఁడును వారిభక్తులగు మహర్షులు ననుగ్రహించి నెఱవేర్తురు గాక.

అడయార్ }
13-6-12 }

తూముచెర్ల రామచంద్రరావు,
పెన్షన్డ్ సబ్జడ్జి, అడయార్.

---

# మొదటికూర్పు పీఠిక

"థియసాఫికల్ సొసైటి" యను నామాంతరమునఁ బరఁగు దివ్యజ్ఞానసమాజమను సభ ముప్పదియాఱు సంవత్సరములక్రిందట స్థాపింపఁబడి యిప్పుడు ప్రపంచమున సమస్తదేశములయందు వ్యాపించియున్నది. ఆసభవారిచేఁ బ్రచురింపఁబడిన గ్రంథములు అనేకభాషలలో ననేకుల కత్యంతానందమునిచ్చుచు, విశేషముగ మేలొనరించుచున్నయవి.

ఆసమాజము ముఖ్యోద్దేశ్యము లెవ్వియన, లోకమునందలి పెక్కుమతములయందుండు సారభూతములగు సిద్ధాంతముల వెల్లడిచేసి యామతము లన్నింటియందలి ముఖ్యాంశములన్నియు నొక్కరీతిగనే యున్నవనియును, ఆమతము లన్నింటికి మూలమొక్కటియగు పరవిద్యయే యనియును, నిరూపించి తద్ద్వారా మానవకోటియం దంతట గలిగియుండు మతవైషమ్యముల మాన్పి సోదరభావమును, ఐకమత్యమును స్థాపించుట యొకటి. మఱియు మానవునియందును, బాహ్యప్రపంచమునందును, అతీంద్రియములై దురూహములగు ధర్మములను, తత్త్వములను బరిశీలించి తత్త్వసారమును స్వానుభవముచే వెల్లడిచేయుట రెండవది.

ఈ యుద్దేశ్యములతో ననేకగ్రంథము లనుభవజ్ఞులగు వారిచే నాంగ్లేయభాషయందు వ్రాయఁబడియుండ నాగ్రంథ

ములన్ని మతములవారికిని, వారివారి మతగ్రంథముల యందలి పరమరహస్యములను విస్పష్టముగ విపులముచేయ సమర్థములుగ నున్నయవి. వానిం జదివినవారు వానివలనఁ గలుగు నానందము ననుభవించుచు, ఆగ్రంథములు మన దేశభాషలలో లేమిచే నాంగ్లేయభాష నభ్యసింపని యనేకులకు సాధ్యములు గాకపోవుటకుం జింతిల్లి వానిని దేశభాషలలో రచించిన బాగుగ నుండునని యోచించుచుండ కడపపురమున నుండు దివ్యజ్ఞానసమాజశాఖయగు తత్త్వజ్ఞాన సభ కధ్యక్షులగు మహారాజశ్రీ అనుముపల్లె నంజుండప్ప బి.ఏ., బి.యల్ గారు ఆగ్రంథములయందలి ముఖ్యాంశములను సులభశైలితో పామరులకుంగూడ దెలియునట్లు తెనుఁగుభాషతో వ్రాసి వేలకొలఁది ప్రతులను ముద్రించి యనేకులకు నుచితముగ నీయ నారంభించిరి. వారిక్కార్య మనేకసంవత్సరములుగఁ జేయు చున్నారు. ఇట్లు లోకోపకారముకొఱకు వ్యయప్రయాసముల కోర్చి పాటుపడుచుండు మ-రా-రా-శ్రీ నంజుండప్ప బి.ఏ., బి.యల్ గారును, మఱియు నీదివ్యజ్ఞానసమాజమున మిగుల శ్రద్ధతోఁ బనిచేయుచుఁ జెన్నపుర రాజధానియందలి దివ్యజ్ఞానసమాజ శాఖల కన్నింటికిఁ బైవిచారణకర్తగా పనిచేయు చుండు, మహారాజశ్రీ టి. రామచంద్రరావు బి.ఏ., బి.యల్ గారును ఆపత్రికలయందలి విషయముల నన్నింటిని నొక్కటిగఁ జేర్చి గ్రంథరూపముగ వ్రాసిన నెక్కుడు యుపయుక్తముగ నుండునని యోచించి యీకార్యమును నాన సాగింప

వలయునని నా కాజ్ఞనియ్యఁగా వారియాజ్ఞ నుల్లంఘింపం జాలక యికార్యమును బూనితిని. ఆపిదప నాపత్రికలయం దలి విషయములమాత్రము గాక యాసభవారిచేఁ బ్రచురింపఁ బడిన యితరగ్రంథములయందలి ముఖ్యవిషయములంగూడఁ జేర్చివ్రాసిన మేలుగనుండునని యోచించి యాంగ్లేయభాష యందలి యనేక గ్రంథములనుండి సారమునుగ్రహించి యీ విషయముల నన్నింటిని సంస్కృతగ్రంథములనుండి ప్రమాణ ములతో నాంధ్రులకు సులభముగ నర్థమగునట్లు నాశక్తి కొలఁది వ్రాసితిని. ఇందు సాధ్యమైనంతమట్టుకు క్రొత్తక్రొత్త మాటలను వాడక వేదాంతగ్రంథములయందలి పరిభాషనే యుపయోగించుచున్నాడను.

సిద్ధాంతములన్నియు వేదాంత గ్రంథములయం దుండు నవియేగాని క్రొత్తవిగావు. ఐనను సంస్కృతమున బహుగ్రంథ విమర్శనముతోఁగాని సాధింపరాని విషయములన్నియుఁ బెక్కుస్థలములనుండి యొక్కొక్కదిక్కున చేర్చి క్రోడీకరించి సులభసాధ్యములుగ వ్రాయఁబడినవి.

సామాన్యముగఁ బైపైన చూచువారలకుఁ గ్రొత్తవిగఁ గన్పడు కొన్ని విషయములు శాస్త్రసమ్మతములుగ నిరూపింపఁ బడి ప్రమాణములతోడఁ జూపఁబడినవి.

సామాన్యముగ హిందువులలో భువరాది లోకములు దొంతికుండలవలె నొకదానిపై నొకటియున్నట్లు గొందఱు తలఁచుట గలదు. దివ్యజ్ఞానసామాజికులు వ్రాసిన గ్రంథ

ములందెల్ల యెడల నాసిద్ధాంతము సమంజసము కాదనియు, లోకములన్నియు నొకదానిలో నొకటిగఁ దూఱుకొని యొక్క స్థలముననే యున్నవనియును, ఊర్ధ్వలోక మొక్కొక్కటియు దానికంటెఁ గ్రిందిలోకముల నన్నింటిని దూఱి యంతటను వ్యాపించి వాని నతిక్రమించి పైనఁగొంతదూరముగూడ నున్నదనియుఁ జెప్పుచున్నారు. ఈవిషయము పరిశీలించిచూడ శ్రుతిసమ్మతమని స్పష్టమగుచున్నయది. ఉపనిషత్తు లన్నింటిలో గొప్పదియగు బృహదారణ్యకమునందును, మఱియు సుబాలోపనిషత్తునందును ఈవిషయము స్పష్టముగ నిరూపింపఁబడియున్నది. భువర్లోకము భూలోకములో నోతప్రోతముగ నున్నదనియును, అట్లే సువర్లోకము భువర్లోకములో నోతప్రోతమనియును, ఆలాగుననే యూర్ధ్వలోకములన్నియు వానిక్రిందిలోకములలో నోతప్రోతములుగ నున్నవనియును జెప్పఁబడియున్నది. ఓతప్రోతమనగా వస్త్రమునందు పడుగు, పేక (నిడివి, వెడల్పు దారముల) వలె నొకదానిలో నొకటి చొచ్చి వ్యాపించి యున్నవని యర్థము.

జీవుని యుపాధుల విషయమునఁగూడఁ జక్కఁగ విచారించిన వేదాంతగ్రంథములయందలి విభాగమునకును, థియసాఫికల్ సొసైటివారుచేయు విభాగమునకును భేదము గానరాదు. సంస్కృతగ్రంథములయందు సూక్ష్మశరీరమని మొత్తముగఁ జెప్పఁబడునది, దివ్యజ్ఞానసమాజగ్రంథములలోఁ బ్రాణములకునికిపట్టయియుండు ప్రాణమయకోశమును, కేవల కామ

క్రోధాది మనోవికారముల కునికిపట్టగు కామమయశరీర మును, శుద్ధసంకల్పములు, ఊహాపోహాలు లోనగుమనో వృత్తుల కునికిపట్టగు మనోమయ విజ్ఞానమయకోశములునుగ విభజింపఁబడియున్నది. పైఁజెప్పిన కామమయ మనోమయ శరీరములు రెండును గలిసి వేదాంతగ్రంథములయందుఁ బేర్కొనఁబడియుండు మనోమయకోశ మగును.

మఱియు ననేకులు పురుషప్రయత్నమువలని ప్రయోజనము కొంచెమైనను లెక్కించక యంతయును విధిలిఖితమనియును, పురుషునకు స్వాతంత్రమించుకయైనను లేదనియుఁ దలఁచుట గలదు. దైవము పురుషకారము విషయమై శాస్త్రముల యందుఁ జెప్పఁబడిన విషయములను బ్రమాణములతోడ నెత్తి యుదహరించి పురుషకారముయొక్క యావశ్యకతయు, దైవమునకును బురుషకారమునకును గల సంబంధమును స్పష్ట ముగ నిందు నొక్కి వ్రాయఁబడినది.

ఈ చిన్నగ్రంథమునఁ గర్మబ్రహ్మస్వరూపములు రెండును సంక్షేపముగ విచారింపఁబడి యుండుటచే నెల్లరకు నుపయోగ కరముగ నుండుననను నమ్మకముతో నిద్దానిని జిజ్ఞాసువులకంద ఱకు వినయపూర్వకముగ నర్పించుచున్నాఁడను.

గుణదోషములఁ బరిశీలించి గుణములను గ్రహించి దోష ముల సహింతురని ప్రార్థించువాఁడను. మఱియును జదువరులు గ్రంథమునందలి విషయములను గుఱించి సవరణలనుగాని, మార్పులనుగాని సూచించినచో వానిని వందనపూర్వకముగ

గ్రహించి ముందుకూర్పున కవకాశముండిన వానిని వినియోగించెదను.

ఈగ్రంథమును బ్రచురించుటకు ముందుశోధించి సంస్కరించిన పెన్షనర్ సబ్జడ్జిగారగు మ-రా-రా-శ్రీ టి. రామచంద్రరావుగారికిని, సబ్జడ్జిగారగు మ-రా-రా-శ్రీ వావిలాల వేంకటశివావధానులుగారికిని, ఎంజనీరు మ-రా-రా-శ్రీ విండ్లచెరువు గోపాలయ్యగారికిని, బ్రహ్మశ్రీ అన్నవరము రాఘవశాస్త్రులుగారికిని నావందనముల సమర్పించుచున్నాను.

ఆదినుండి నాకు సహాయులై గ్రంథమును బూర్తిచేసి భాషాస్ఖాలిత్యముల నన్నింటిని సవరించి వ్రాసి అచ్చుప్రతులను దిద్ది గ్రంథమును గొనసాగించిన నాస్నేహితులును, సహోపాధ్యాయులును, కడప మ్యునిసిపల్ హైస్కూలునందాంధ్రోపాధ్యాయులు నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారికి నావందనముల నిచ్చుచు వారికి నాయపారకృతజ్ఞత నిచ్చుట విన్నవించుకొనుచున్నాను.

కడప
12-6-12

చిట్టిమూరు రామయ్య.

# రెండవకూర్పు పీఠిక

ఈచిన్నపుస్తకము రెండవకూర్పు ప్రచురించవలసినంత భాగ్యము కలిగినందులకు కృతజ్ఞతాపూర్వకముగ చదువరులకు వందనముల సమర్పించుచున్నాడను. గ్రంథమునందలి శబ్దజాలమును స్వల్పముగ సవరించి యచ్చటచ్చట కొన్ని విషయములు విస్తరించి వ్రాసితిని. మొదట కూర్పునందువలెనీ కూర్పునందును బ్రహ్మశ్రీ టి. రామచంద్రరావుగారు ఆమూలాగ్రముగ పరిశీలించి, యుచితములగు సవరణలను సూచించినందుకు వారికి నా వందనముల నర్పించుచున్నాడను.

ఈగ్రంథము ఆంధ్రదేశమున చదువరులచే ప్రీతితో ఆదరించబడుటయేగాక కర్నాటక భాషయందును ద్రావిడభాషయందును భాషాంతరీకరణము చేయఁబడి యాయాభాషలలో సైతము చదువరులచే ఆదరింపఁబడినందులకు ఎంతయు కృతజ్ఞుఁడను.

ఏ గురువుల అనుగ్రహామువలన, వారి కైంకర్యములో నొకటిగ నీగ్రంథము వ్రాయఁబడెనో, ఆ మహనీయులు ఈ రెండవకూర్పును అనుగ్రహించి, చదువరులను వారియనుగ్రహ పాత్రులుగ చేయుదురుగాకయని ప్రార్థించెద.

అడయార్ }
మార్చి 1920 }

చిట్టమూరు రామయ్య.

# మూడవకూర్పు పీఠిక

ఈగ్రంథము మొదటి రెండుకూర్పులును ఆంధ్రలోకము నందు గొప్పప్రఖ్యాతిగాంచినవి. దీనిని సమాజసభ్యులేగాక తదితరులుగూడ ననేకులు చదివి ధన్యులైరి. అందుచేత రెండవ కూర్పు ప్రతులు చెల్లిపోయినవెంటనే తిరిగి మూడవకూర్పు ముద్రించనందున చాలమంది నిరాశను వెలిబుచ్చిరి. కాని, కొన్నియనివార్యకారణములచే నాలశ్యమైనది. అందుకు పాఠకులు మన్నింతురు గాక !

దీనిలో నొక్కొక్క యధ్యాయమును ప్రత్యేక మొక్కొక్కపుస్తకముగ ప్రచురించిన బాగుండునని కొందరును, మరి కొన్నివిషయముల నొకటి రెండధ్యాయములుగ జేర్చిన బాగుండునని కొందరును సలహాలిచ్చిరి. ఆయాలోచనలో కొంత తడవైనది, గాని, తుదకు గ్రంథమును యథాతథముగ ప్రచురించుటయే యుక్తమని, యనేకకారణములచే, దోచినది. అందుచేతనే ఇందక్కడక్కడ ప్రమాదజనితదోషముల దిద్దుట దక్క తదితరమార్పులేమియు జేయలేదు.

ఈకూర్పునకు కావలసిన సవరణలజేసి, అచ్చుప్రతులను (ప్రూఫులను) దిద్ది మాకు సహాయముచేసిన శ్రీ గుంటూరు వెంకటసుబ్బారావుగారికి కృతజ్ఞులము.

ఇదివరకువలె నీగ్రంథ మాంధ్రలోకమున ముముక్షువుల కత్యంతోపయుక్తమై, సేవించి, గ్రంథకర్త యాశయమును నెరవేర్చుగాక !

అడయార్ }
31-7-41 }

వసంతాశ్రమ సిట్యూట్.

ఓమ్

# విషయసూచిక

## మొదటి యధ్యాయము



బ్రహ్మవిద్య యన్నిమతములకు మూలము. మతము లన్నింటియందలి ముఖ్యాంశములు సమములు. సర్వమతసామాన్యములగు ముఖ్యాంశములు.

## రెండవ యధ్యాయము



గురుస్వరూపము, సనాతన ధర్మస్వరూపము, గురువులలోఁ దారతమ్యములు, సిద్ధులగు పరమగురువులు, వీరలే కారణ గురువులు, కార్యగురువులు, అపరిపూర్ణులు, శిష్యధర్మములు.

## మూఁడవ యధ్యాయము



పరబ్రహ్మము, అవ్యక్తము లేక నిర్గుణము. సగుణబ్రహ్మము, ఈశ్వరుఁడు. ఒక్కఁడగు నీశ్వరుఁడు త్రిమూర్తులుగ

నభివ్యక్తమాయెను. ఈశ్వరశక్తి లేక మాయాశక్తి ప్రకృతి యందుఁ బ్రవేశించి, దానికి వ్యాపారము గలుగఁజేయును. శక్తిత్రితయము, పృథివ్యాదిలోకములు.

## నాల్గవ యధ్యాయము



జీవు లీశ్వరాంశములు. జీవులు నిత్యులు-షడ్వికారరహితులు. ఉపాధులు—లింగదేహము-స్థూలసూక్ష్మశరీరములు.

## ఐదవ యధ్యాయము



తేజస్స్వరూపము. వివిధపదార్థముల తేజస్సు వేర్వేఱుగ నుండు. కొన్ని పరిశుద్ధ తేజస్సు గలిగియుండుటచే గ్రాహ్యములు. మఱికొన్ని యపరిశుద్ధతేజస్సు గలిగియుండుటచే త్యాజ్యములు. మనోవృత్తులుమాఱునట్లు తేజస్సు మాఱును. యోగులతేజస్సు పరిశుద్ధమై విశేషదూరము వ్యాపించియుండుటచే నది వారి యాశ్రమమనఁబడును. తీర్థములు దివ్యక్షేత్రములు.

## ఆఱవ యధ్యాయము



జీవునకు శరీరములు లేనిచో వ్యాపార మసాధ్యము. శరీరములు నశ్వరములు, శరీరి నిత్యుఁడు. స్థూలశరీరము, అన్నమయ

కోశము, ధర్మసాధనములలో మొదటిది. దానిం బరిశుద్ధముగఁజేసికొను నుపాయములు. సూక్ష్మశరీరము: (1) ప్రాణమయకోశము. (2) కామమయ శరీరము, కామక్రోధాదుల కునికిపట్టు. మరణానంతరము కొన్నిమార్పులఁజెంది యాతనా శరీరమగు. జీవితకాలమునందలి మనోవృత్తులవలని ప్రయోజనము. (3) మనోమయ శరీరము.—సామాన్యుల మనోమయ శరీరము. నాగరికుని మనోమయ శరీరము. నివృత్తి మార్గము నవలంబించు వారి మనోమయ శరీరము. (4) విజ్ఞానమయకోశము. కారణశరీరము—ఆనందమయకోశము.

## ఏడవ యధ్యాయము



మనస్సు శుద్ధమని యశుద్ధమని రెండుభాగములు. ఇంద్రియములతోఁజేరి వర్తించుచుండును; ఇంద్రియముల నిగ్రహించుట మనోనిగ్రహమునకు సాధనము; నిగ్రహముచే మనశ్శక్తి వృద్ధికాఁదగు. ఇందుకు ముఖ్యసాధనము ధ్యానము. సంకల్పములవలన సూక్ష్మలోకమున సంకల్పరూపము లుత్పత్తియగు. సమాన సంకల్పములు గలవారిం జెంది యా సంకల్పముల వృద్ధిచేయును. సత్సంకల్పములచే లోకమున కపారమగు మేలుచేయదగు. దుస్సంకల్పములచే లోకమునకు విశేషము కీడగు. సత్పురుషుల యాశీర్వచనములవలని యుపయోగము. మనస్సు నిగ్రహించనివారి యాశీర్వచనములు

## పదియవ యధ్యాయము



కారణములేక కార్యము పుట్టదు. కార్యముండినచో కారణముండియే తీరును. నైజములగు బుద్ధిసౌక్ష్మ్యము, సుగుణదుర్గుణములు, లోకమునఁ గలుగు ఫలప్రాప్తియు, పూర్వజన్మకర్మానుసారములుగాని యకారణములు కావు. పూర్వజన్మకృతకర్మ ఫలము దైవమనఁబడును. పురుషప్రయత్నములేకయే దైవము ఫలము నియ్యఁజాలదు. పురుషకారముచేత పూర్వకర్మఫలములఁ గొంత మార్పఁదగును. పురుషయత్నముతో నింద్రత్వము, రుద్రత్వము సైతము సాధింపఁదగు. జ్యోతిశ్శాస్త్రము ప్రకారము జననకాల గ్రహసంపత్తి పూర్వకర్మఫలములను సూచించునుగాని గ్రహములు కర్మములఁ జేయించువారుకారు. సంచిత, ప్రారబ్ధ, క్రియమాణకర్మములు. జ్ఞానముచే సంచితకర్మము నశించును. ఈశ్వరార్పణముగఁ జేయఁబడు క్రియమాణకర్మము బంధరూపముగాదు. మోక్షహేతువగు. జ్ఞానులగువారు లోకహితార్థము కర్మములం బూని వర్తింతురు.

## పదునొకండవ యధ్యాయము



ధర్మమననేమి? జీవులపరిపక్వము ననుసరించి ధర్మము వేర్వేఱుగ నుండును. జీవులు తమోగుణప్రధానులు, రజో

గుణప్రధానులు, సత్వగుణప్రధానులు. హిందువుల వర్ణధర్మములును, ఆశ్రమధర్మములును ఈగుణవిభాగము ననుసరించినవి. ఆయావర్ణముల కుండఁదగు లక్షణములు లేనిచో ఆ వర్ణము నామమాత్రము. గుణములనుబట్టి వర్ణనిరూపణముగాని జన్మమునుబట్టి కాదు. వర్ణాశ్రమధర్మములు. వానియుద్దేశ్యములు. కర్తవ్యములగు ధర్మములను శాస్త్రములు విధించుచున్నవి గాని పూజ్యతను, సన్మానములను, సూచించుటలేదు. ప్రవృత్తి నివృత్తిమార్గములు.

## పండ్రెండవ యధ్యాయము



మానవజన్మము ప్రాప్తించినది మొదలు మోక్షప్రాప్తి యగువఱకు జీవునకు మూఁడుమార్గములు గలవు. కర్మమార్గము, భక్తిమార్గము, జ్ఞానమార్గము. మార్గములు మూఁడైనను గమ్యస్థాన మొక్కటియే.

## పదుమూఁడవ యధ్యాయము



అన్నిమతముల యందును, జీవుని పరిశుద్ధుని జేయుటకు సంస్కారములు విధింపఁబడియున్నవి. సంస్కారములయందలి ముఖ్యలక్షణములు. మంత్రములు, వానియుచ్చారణమువలని ప్రయోజనములు. హిందూశాస్త్రములయందు విధింపఁబడిన

ముఖ్యసంస్కారములు. వానివలని ప్రయోజనములు. యజ్ఞములు—జీవునకు ఋణములను దీర్చుకొనుటకు సహకారులు. పంచమహాయజ్ఞములు. గృహస్థుని నిత్యకృత్యములు—పాకయజ్ఞములు. శ్రాద్ధములు. శ్రౌతయజ్ఞములు. హింసారూపములగు యజ్ఞము లవశ్యములు కావు. జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. కర్మములు నిష్కామముగను సంగరహితముగ లోకోపకారముగనుఁ జేయ ముక్తిహేతువులగు. ఇట్టిమార్గమున జీవునకు పరమాత్మసంయోగము గలుగ యథార్థమగు యోగియగు.

## పదునాల్గవ యధ్యాయము



ఎట్టివారలకు జ్ఞానమార్గము సాధ్యము? పరవిద్య, అపరవిద్య. సాధనచతుష్టయము. జ్ఞానస్వరూపము, జ్ఞానలక్షణములు. జ్ఞేయస్వరూపము. పరిపూర్ణజ్ఞానిలక్షణములు. పరమార్థ సన్న్యాసి—కుటీచక, బహూదక, హంస, పరమహంసలు.

## పదునైదవ యధ్యాయము



భక్తిమార్గము, సులభము, నిరపాయము. భక్తిస్వరూపము. భక్తిసాధనములు—వైరాగ్యము, ధ్యానము, అహింస, సర్వభూతహితము. సత్సాంగత్యము. నవవిధభక్తులు.

## పదునాఱవ యధ్యాయము



పూజ—బాహ్యము, ఆంతరంగికము. బాహ్యపూజకు ప్రతిమాదులు సహకారులు. సంధ్యావందనము. రాజయోగము. యోగాంగములు—యమనియమాదులు.

## పదునేడవ యధ్యాయము



కలియుగధర్మములు, అవాంతర యుగధర్మములు, ముముక్షువులచే ననుష్ఠేయములగు సద్ధర్మములు. ఇప్పటి కాల మహిమ.

---

శ్రీ పరబ్రహ్మణే నమః

# బ్రహ్మవిద్యాదర్పణము

## మొదటియధ్యాయము

## బ్రహ్మవిద్య

ఉ॥ వింతగ లోకజాలముల వేడుకమీఱ సృజించి వాని న
త్యంతముదమ్మునం బొదలునట్లుగఁ బెంచి స్వకీయయత్నమె
క్కింత యెఱుంగరామి దివిజేశ్వరులున్ వెఱఁగంది చూడగా
నంతయుఁదానరై వెలుఁగునట్టి పరాత్పరుఁడోముతన్ మిమున్ ॥

అనేకకోటిబ్రహ్మాండనాయకుండును, వేదవినుతుండును, సకలజ్ఞుఁడును నగు భగవంతుఁడు మానవకోటిని సృజించి, దాని నిశ్శ్రేయోభివృద్ధికయి దేశకాలానుగుణ్యముగ బహు మార్గములు చూపించియున్నాఁడు. వారు వా రాయామత ముల ననుష్ఠించుచుఁ దమతమ మతమే సత్య మనియును, దమ తమ మతమునందే పరమాత్మతత్త్వము పరిపూర్ణముగఁ జూపింపఁబడుచున్నదనియును, దమ మతమునం దక్క మఱి దేనియందును సత్యము గానరాదనియును, తాము తప్పఁ దక్కినమతస్థులందఱు నజ్ఞానసాగరనిమగ్ను లగుటచే వార

లకు మోక్షప్రాప్తి యసాధ్యమనియును భావించుచు, యథార్థ తత్త్వము తమకుమాత్రమే తెలియునను నభిమానముచే నిండిన వారలై, యితరులను దూషించుచున్నారు. ఇట్లొక్కొక్క మతస్థు లన్యమతస్థులయం దసూయఁ జూపుచుండుటం బట్టి మతవైషమ్యములు సామాన్యములుగ నున్నయవి.

ఐనను విద్వాంసులు తమతమ మత గ్రంథములనే పూర్ణముగ శోధింప నట్టివైషమ్యమున కవకాశము చూడక పోవుట యే కాక యేకత్వమును జూచుటకుఁ జాలియున్నారు. వారు పరమతగ్రంథములనుగూడ నిష్పక్షపాతముగ శోధించి చూడ నన్ని మతములయందును ముఖ్యాంశము లొక్కటిగనే యున్న వి యనియును, వివిధమతములయందలి పరస్పర భేదములు స్వల్పములనియును, అట్టి భేదము లముఖ్యములయందే గాని ముఖ్యమగుతత్త్వమునం గానరా వనియును దృఢముగ విస్పష్ట మగుచున్నది. ఇట్లు సమన్వయ మగుచుండ యథార్థతత్త్వ మొక్కటియే యనియు, బాహ్యదృష్టికిం జూపట్టు భేదములు సైతము దేశకాలభేదములం బట్టి వచ్చియుండఁ దగుననియు నూహింపఁదగియున్నది.

ఈమతము లన్నింటియందు ముఖ్యాంశములనఁదగు సిద్ధాంతములే మతము లన్నింటికి మూలమగు బ్రహ్మవిద్య. దీనినే గుప్తవిద్య యనియుం జెప్పుదురు.

ఈ రీతిని బ్రహ్మవిద్య సర్వమతములకు మూలమని యెఱింగినచో జనులు తమతమ మతముల నవలంబించుచుఁ బరమత

వైష్యములు లేక యైకమత్యము గలిగియుండఁ గలుగుదురు. అట్లైన మత మనునది మానవకోటియం దైకమత్యమును బుట్టింపజాలునది యగు. మానవులయందు సకల వైషమ్యములకు మతమే కారణమని యాధునికులు చెప్పువార్త కల్ల యగు.

భగవంతుఁడు ప్రతికల్పమునందును బూర్వకల్పాంతమున నుండినరీతినే ప్రపంచమును సృజించును.

ధాతా యథాపూర్వ మకల్పయత్

అట్లు వర్తమానకల్పాదియందు సృజించిన మానవకోటికి దోవజూపి, వారిని గృతార్థులం జేయుటకై పూర్వకల్పములఁ బరిపూర్ణులయి బ్రహ్మవేత్తలగు మన్వాదిమహాత్ములను లోకమున జన్మింపఁజేసె. ఆమహనీయులు, తాము కృతార్థులయ్యును, పామరజనోద్ధారణార్థమై యవతరించి, వర్తమానకల్పమున మానవులచే ననుష్ఠేయము లగు నానాధర్మములను బ్రతిపాదించిరి. ఆధర్మములన్నియు నీకల్పమునఁ గాలానుగుణముగ ననుష్ఠేయము లగును. ఆమహనీయులు మహర్షులై రాజులై ధర్మమార్గముల నుపదేశించి శిక్షించి ప్రజలచే నామార్గముల ననుష్ఠింపఁ జేసి వారిని గ్రమక్రమమున నుచ్చస్థితికిఁ దెచ్చుటకు బహుకాలము పాటుపడిరి. తల్లి కొంతకాలము దనుక పిల్లలను బోషించి కైదండయొసఁగి నడిపించి శిశువు కొంత నడువనేర్చిన పిమ్మట స్వతంత్రముగ నడుచుటకు నేర్చుకొన

వలయునని ప్రత్యక్షముగ శిశువునకు దనసహాయము నిచ్చు టను మాని దాని కపాయము గలుగకుండ దూరమున నుండి కనిపెట్టియుండురీతి నామహాత్ములు కేవలబాలిశులగు మానవులఁ గొంతకాలము రక్షించి శిక్షించి పిదప వారికి స్వతంత్ర జ్ఞానము గలుగుటకై తాము విరమించి యదృశ్యులయి కనిపెట్టియుందురు.

ఇట్లు విచ్చలవిడిగ విడువఁబడిన మానవులు కాలక్రమమున నుపదిష్టధర్మములను మఱచి గ్రహింపఁజాలక చక్కఁగ ననుష్ఠింపక తప్పుత్రోవలం బోవుచుండ నట్టివారిని గుమార్గములనుండి మరలించి యుద్ధరింప దయాసముద్రులగు నామహాత్ముల కూటమునుండి యొకానొకరు కాలోచితముగ నాయాదేశములయం దవతరించి కాలానుసారముగ బ్రహ్మవిద్యయందలి కొన్ని విషయముల నుపదేశించి వారలకు సన్మార్గముం జూపి మరల మఱుఁగు పడుచుండిరి.

ఇట్లు పెక్కుదేశములయందుఁ గాలానుగుణముగ నవతరించినవారే ప్రపంచమునందలి వివిధమతస్థాపకులు. మతస్థాపకులందఱు నామహానుభావుల సమాజమునుండియే యవతరించినవారు. వారలచే స్థాపింపఁబడిన మతములన్నియు నాబ్రహ్మవిద్యావృక్షశాఖలే. మతములన్నియు నామూలమునుండియే తమసారమును గ్రహించుచున్నవి. వివిధ మతములయందు ముఖ్యాంశములన్నియు సమములైయుండుట కిదియే కారణము. ఐనను ఆవిద్య వేఱువేఱుకాలములయందు వేఱువేఱుదేశ

ముల భిన్న భిన్న ప్రజల కుపదేశింపఁబడియుండుటచే నాయా దేశ కాలముల ననుసరించియు, జనుల రుచివైచిత్ర్యములం బట్టియు, బాహ్యాచారములయం దనేక భేదము లుండక తీరదు. కావు ననే నానావిధ మతములయందుఁ బరస్పరభేదములు కన్పట్టు చున్నవి. జ్ఞాని యగువాఁడు బాహ్యములగు భేదములం జూడక యంతస్సారమగు నైక్యమును జూడఁదగు. పర్వతా గ్రములయందు మేఘుఁడు వర్షింప వర్షజల మచ్చటనుండి నలుప్రక్కలం బ్రవహింప నాజలము ప్రవహించు భూలక్షణ మును బట్టి యొకచో నాజలము కృష్ణవర్ణముగను, ఒక్కచో రక్తవర్ణముగను, వేఱొక్కచోటఁ బీతవర్ణముగను నిట్లనేక వర్ణములుగ వ్యక్తమగుచున్నదికదా! పర్వతాగ్రమునుండి వెలువడు శుద్ధోదకస్థానీయము బ్రహ్మవిద్య. నానాదేశముల యందు నానావర్ణములుగ బ్రవహించు నద్యుదకస్థానీయ ములే తచ్ఛాఖలగు మతములు. భిన్నవర్ణములు దేశీయము లేకాని మూలమున లేవు. అనఁగా నానామతములయందలి సమానధర్మము లుదకస్థానీయములు. పరస్పరభేదములు భిన్నవర్ణస్థానీయములు. ఇట్లన్నిమతములకు మూలము బ్రహ్మ విద్యయే. భగవంతుఁ డద్వితీయుఁడై, ఏకమై యెట్లు ప్రకా శించు చున్నవాఁడో అటులే బ్రహ్మవిద్యయు నేకమై సర్వ వ్యాపినియై యున్నయది.

ఇట్టి బ్రహ్మవిద్యను బరిపూర్ణముగ రక్షించుచు లోకహి తార్థము బ్రహ్మవిద్యాస్వరూపులై యుండు వారు పైఁజెప్పిన

మహాత్ములసమాజమున నుండువారే. ఆమహాత్ములు ఇక్కాలమునందును నున్నవారే యని వారి యనుగ్రహపాత్రు లగు పెద్దలు చెప్పుచున్నారు. భగవ చ్ఛ్రీశంకరాచార్యులవారును వివేకచూడామణియందు వారి నిట్లు వర్ణించియున్నారు.

శ్లో. శాంతా మహాంతో నివసంతి సంతో
వసంతవ ల్లోకహితం చరంతః,
తీర్ణా స్స్వయం భీమభవార్ణవం జనా
నహేతునాన్యా నపి తారయంతః
అయం స్వభావ స్స్వత ఏవ యత్పర
శ్రమాపనోదప్రవణం మహాత్మనామ్,
సుధాంశు రేష స్వయమర్కకర్కశ
ప్రభాభి తప్తా మవతి క్షితిం కిల ॥

తా. శాంతస్వరూపులును మహాత్ములును వసంతునిం బోలి లోకహితముకొఱకు వర్తించువారును, భయంకర సంసారసాగరమును దాము తరించి నిర్వ్యాజకరుణచేఁ బామరులయి భవసాగరమున మునింగియున్న యితరజనులను దరింపఁజేయు వారునునై యెప్పుడును నామహాత్ములు నివసించియే యున్నవారు.

అట్టి మహాత్ము లిపుడును హిమవత్పర్వతసిద్ధక్షేత్రములయందు రాజయోగు లయి నివసించియున్నవా రనియును, ఆధునికులలో సయితము అనేకజన్మపుణ్యసంసిద్ధు లయినవారలకుఁ గన్పడి వారిని దమయనుగ్రహమునకుం బాత్రులం

జేయుచున్న వారనియును, అనుభవజ్ఞులు దృఢముగఁ జాటించు చున్నవారు.

ఇక్కాలమున నన్ని దేశములయందును సనాతనధర్మములు పూర్వపక్షములై జనులు కేవల ప్రకృతిబద్ధులయి నిరీశ్వర వాదులగుచుండ నట్టిబాలిశుల యజ్ఞానముం బాపి యుద్ధరింప నామహాత్ములలో నిద్దరు కరుణించి యోగ్యులగు తమశిష్యు లకుఁ బ్రసన్నులయి వారలచే దివ్యజ్ఞానసమాజ మనుపేర నొకసమాజమును స్థాపింపఁజేసిరి. ఆసమాజము స్థాపింపఁబడిన కొద్దికాలముననే ప్రపంచమునం దెల్లయెడలను వ్యాపించి బ్రహ్మవిద్యాసారమును ఇక్కాలమున కనుగుణముగ బోధించి ప్రపంచమునందలి నానామతములఁ బునరుజ్జీవితములుగఁ జేయుచున్నది. పైఁజెప్పినరీతిని బూర్వమునుండి కాలానుగుణ ముగ నానాదేశములయందు నానావిధమతముల స్థాపించు చుండిన యీసిద్ధసమాజమువారే యిక్కాలమున వేఱొక్క మతమును స్థాపింపక పూర్వమతములను సమరసముచేసి మత ద్వేషములం బాపి యైకమత్యమును వృద్ధిచేసి నానాత్వమునం దేకత్వమును నిరూపించుటకై ఆసమాజము నేర్పఱచియు న్నారు. మతాభిమానము లేశమైనను లేని యనేకులు ఆ సమాజముద్వారా తమతమమతములయం దభిమానము గల వారై తన్మతాచారముల నెక్కుడుశ్రద్ధతో ననుష్ఠించుచున్నా రు. ఈసమాజ మేయేదేశములయందు వ్యాపించిన నాయా దేశములయందలి మతములు పునరుజ్జీవితములై తద్దేశీయుల

కాయామతములయందుఁ బ్రకృష్టాభిమానము వృద్ధియగు చున్నది. ఇంతియకాదు. ఎల్లరకు నితరమతములయం దాద రణబుద్ధి కలిగి పెక్కుమతస్థులయందు సోదరభావము పుట్టి యైకమత్యము వర్ధిల్లుచున్నది. ఈసమాజము ఒక్కమతము నుండి వేఱొకమతమునకు మాఱుట యయుక్తమనియును, ప్రతి జీవుఁడును పరిపూర్ణత్వము జెందుటకు వలయునుపాయముల నన్నిమతములు బోధించుచునే యున్నవనియును, దమతమ మతాచారములఁ జక్కఁగ ననుష్ఠించిన జీవుఁడు పరిపూర్ణుఁడు కాజాలుననియును, దృఢముగఁ జాటించుచున్నయది. ప్ర పంచమునందలి మతము లన్నియు కడపట నొకటేపదవిని పొందించును.

> ప్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
> ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితి చ
> రుచీనాం వైచిత్ర్యాత్ ఋజు కుటిల నానాపథజుషాం
> నృణా మేకో గమ్యః త్వమసి పయసా మర్ణవ ఇవ ॥
>
> (మహిమ్నస్తోత్రము)

తా. వైదికమార్గము (అనగా పూర్వమీమాంస), సాం ఖ్యము, యోగము, పశుపతిమతము, వైష్ణవము, ఈమొద లగునవి భిన్న భిన్నమార్గములు. కొందరొకదాని శ్రేష్ఠమని యు, మరికొందరింకొకదాని మంచిదనియును తలతురుగాని అన్నియును రుచిభేదముల ననుసరించి ఒక్కొకరి కొక్కొక మార్గము యుక్తమగును. తుదకు మానవులకు, అన్నిమార్గ-

ముల ద్వారా పొందదగిన గమ్యస్థాన మొక్కటియే. నదుల కన్నింటికి గమ్యస్థానము సముద్రమే అయినట్లు, మానవు లందరు పొందదగిన ప్రాప్యస్థానము తామే.

ఈఅర్థమునే సూతసంహితయందు మఱియువిశేషముగ బోధింపఁబడియున్నది. సామాన్యముగ వేదబాహ్యములని యును దూష్యములనియును ఎంచఁబడు మతములగు బౌద్ధ జైనఆగమములు సైతము సాక్షాత్ పరమేశ్వరునుండి వెలు వడినవియే యని నిరూపింపఁబడియున్నది.

కాపాలం లాకులంచైవ తయో ర్భేదాన్ద్విజర్షభ
తథా పాశుపతం సోమం భైరవప్రముఖాగమాన్
తేషామేవోప భేదాంశ్చ శతశోథ సహస్రశః
విష్ణ్వాగమాన్ స్తథాబ్రాహ్మాన్ బుద్ధార్హా ద్యాగమానపి
అనేకభేదభిన్నాని తథా శాస్త్రాంతరాణి చ
నిర్మమే శంకరస్సాక్షాత్ సర్వజ్ఞస్సంగ్రహేణ తు

* * * * *

తర్కైకే తేహి మార్గాస్తు నహంతవ్యామనీషిభిః
యథా తోయప్రవాహానాం సముద్రః పరమావధిః
తథైవ సర్వమార్గాణాం సాక్షాన్నిష్ఠామహేశ్వరః
యేన యేన ప్రకారేణ జనై రేభిరుపాసితః
తత్తన్మార్గానుగుణ్యేన సాధకత్వం హ్యుపైతి సః ॥

(సూతసంహిత, యజ్ఞవైభవఖండ, ౨౨వ అధ్యాయము)

తా. కాపాలము, లాకులము, పాశుపతము, సోమము, భైరవము మొదలగు ఆగమము లనేకభేదములు. విష్ణ్వాగమ

ములు, బ్రాహ్మాగమములు, బుద్ధాగమము (బౌద్ధమతము), అర్హాగమము (జైనమతము) మఱియు వేలకొలది శాస్త్రాంతరములును అన్నియును సాక్షాన్మహేశ్వరుని నుండి వెలువడినవియే. విజ్ఞులగువారు ఈమార్గములను తర్కములతో ఖండించరాదు. నదుల కన్నింటికి సముద్రమే పరమావధి అయినట్లు మార్గంబు లన్నింటికిని కడపట ప్రాప్యస్థానము మహేశ్వరుఁడే. ఏయేమార్గమున ఉపాసించిన ఆయామార్గముననే పరమపురుషార్థమును పొందుదుము.

మహానుభావులైన ఋషులభావ మిట్లుండ, ఇక్కాలమున ఒక్కొకమతమువారును తమమత మొక్కటియే పురుషార్థసాధనమని యన్యమతములవారలను దూషించుచున్నారు. అట్టి మతవైషమ్యములు మాని సర్వమతములయందలి సామాన్యధర్మములను గుర్తించి సోదరభావముతో ప్రవర్తింపవలయును.

సర్వమతసామాన్యములగు ముఖ్యాంశములు :

## I. ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ

జగదీశ్వరుఁడును, జగదుత్పత్తిస్థితిలయ హేతుభూతుండును, సర్వసాక్షియు, సచ్చిదానందస్వరూపుఁడును నగు నీశ్వరుఁ డొక్కండు, నద్వితీయుఁడు నయి యున్నవాఁడు.

ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యొవ్వనియందుడిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం

ఎవ్వఁడనాదిమధ్యలయుఁడెవ్వఁడు సర్వము దాన యైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్ ॥

(భాగవతము)

నానా దేశములందు నానావిధమతములయందుఁ బెక్కు నామములచే నెఱుఁగఁబడు నీశ్వరతత్త్వ మొక్కటియే. హిందువులచే భగవంతుఁ డనియు, సదాశివుఁడనియును, మహావిష్ణువనియును, బ్రహ్మమనియును మఱియును బెక్కు నామములం బిలువఁబడు తత్త్వమునే "అల్లా" యని మహమ్మదీయులును, "జుహూవా" యని హీబ్రూవులును, "ఆర్మజ్డ్" అని పారశీకమతస్థులును, "గాడ్" అని యాంగ్లేయులును బిలుచుచున్నారు. పేరు లెన్నియైనను నేమి? పేరులచే నిరూపింపఁబడు తత్త్వ మొక్కటియే. సకలమతములును ఈశ్వరుఁడొక్కఁడే యని యుద్ఘోషించుచున్నవే కాని పలువు రీశ్వరులని చెప్పు సిద్ధాంత మొక్కటియుం గానము.

హిందువులు ముప్పదిమూఁడుకోట్ల ఈశ్వరుల నుపాసించువారని పరమతస్థులగు కొందఱియభిప్రాయము. ఇది హిందూమత సిద్ధాంత మెఱుఁగమిచేఁ గలుగునది కాని వేఱుకాదు. అట్టి సిద్ధాంతము హిందూమత సిద్ధాంతమునకుఁ బ్రత్యక్షవిరుద్ధ మని చెప్పవలయునా? అవాఙ్మానసగోచరుఁడు, నిరంజనుఁడు, నిర్వికల్పుఁడు, నేకము నద్వితీయుఁడును నగు నీశ్వరుఁడు త్రిమూర్తులుగ వ్యక్త మగునని వివిధమతములయందును

ఘోషింపఁబడుచునే యున్నది. వారలక్రిందఁ దదాజ్ఞాప్ర వర్తకులగు నసంఖ్యాకులయిన దేవతలు పెక్కు తారతమ్య ముల నొప్పి వర్తించుచున్నవారు. ముప్పదిమూఁడుకోట్లను సంఖ్య యీశ్వరునియం దన్వయించునదికాదు. తదాజ్ఞాప్ర వర్తకులగు దేవతలను దెల్పునది. ఇంద్రాదిదేవతలు ఈశ్వరు లని భావించువారును గలరా? లేరని నొక్కివక్కాణింపనగు. అట్లే యితరమతములయందునుగూడ నీశ్వరాజ్ఞాప్రవర్తకులగు దేవకోటు లనేకతారతమ్యముల నొప్పియున్నారని నమ్ము చునే యున్నారు. మహమ్మదీయులును, క్రైస్తవులును "ఏన్ జల్స్" అనియును "ఆర్కేన్‌జల్స్" అనియును దూత లనియును బిలుతురు. ఈవిషయమునందు సైతము నామభేద ములచే నిరూపింపఁబడు వస్తు వొక్కటియే. పూజ్యులగు దేవ దూతలు పెక్కండ్రు కలరని నమ్ముక్రైస్తవులు లోనగువారు హిందువులు దేవతలం జేర్కొనుచో వారల మూఢు లని యధిక్షేపించుచున్నవారు. ఐనను అన్ని మతములయందును సామాన్యజనుల కగోచరులై సూక్ష్మలోకసంచారులగు దేవత లున్నారనియును, ఆదేవతలు మానవులకుఁ గీడుమేలు లొన ర్పఁజాలియున్నా రనియును నమ్ముచునేయున్నవారు. కావున సర్వేశ్వరుఁడును, సర్వనియంతయును, సర్వోత్కృష్టఫల దాయకుఁడును నగు నీశ్వరుఁ డొక్కఁడనియును, దదాజ్ఞాప్ర వర్తకులగు దేవత లనేకులనియును సర్వమతములవారు సా మాన్యముగ నమ్మువిషయములు.

## II. జీవాత్మలు : ఈశ్వరాంశములు

అన్ని మతములవారు జీవతత్త్వము నిరూపించుచో జీవుఁడు కేవలశరీరము కాఁడనియును, శరీరమునకంటె విలక్షణుఁడును, శరీరమున కధీశ్వరుఁడును నగు జీవుఁడు వేఱుగ నున్నవాఁడని యును, ఆజీవుఁడు ఈశ్వరాంశ మనియును బ్రతిపాదించు చున్నారు. శరీరమే జీవుఁడని చెప్పునట్టిమత మొక్కటియుం గానరాదు. ఆజీవుఁడు ఈశ్వరాంశమై యుండుటంబట్టి యీ శ్వరునిం బోలి సచ్చిదానందస్వరూపుఁడై యున్నవాఁడు. ఈశ్వరుఁడు మహాజ్యోతి స్వరూపుఁడును, జీవాత్మ లాజ్యోతి నుండి వెలువడిన విస్ఫులింగములనియును ముండకోపనిషత్తు నను, ఈశ్వరాంశములని భగవద్గీతయందును నిరూపింపఁబడి యున్నది.

యథా సుదీప్తాత్పావకా ద్విస్ఫులింగా
స్సహస్రశః ప్రభవంతే సరూపాః,
తథాక్షరా ద్వివిధా స్సోమ్యభావాః
ప్రజాయంతే తత్ర చైవాపియంతి ॥
(ముండకోపనిషత్తు)

మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః ॥ (గీత)

## III. పరమపురుషార్థము

జీవు లీశ్వరాంశములు గనుక విస్ఫులింగములం దేరీతి నని వెలువడివచ్చుమహాజ్యోతిలోని శక్తులన్నియు లీనములైయు

న్నవో యారీతి నీశ్వరునిలోని సమస్తశక్తులును లీనమై బీజభూతములుగ నున్నయవి. ఈశక్తులన్నియు వికసించి వ్యక్తమగుటయే పరమపురుషార్థము. దీనికొఱకే జీవులను సంసారమునందు జగదీశ్వరుఁడు ప్రవేశింపఁజేయుచున్నాఁడు. జీవులు సంసారమందు బ్రవేశించి యనేకజన్మములెత్తి స్వకర్మానుసారముగ నిహపరలోకములయందు సుఖదుఃఖముల ననుభవించి శుద్ధచిత్తులయి పరిపక్వదశయందు వైరాగ్యభక్తిజ్ఞాన పరిపూర్ణత నొంది పరమేశ్వరునియందువలె సమస్తకల్యాణ గుణములను బూర్ణముగ నొందుదురు. దీని నీశ్వరసన్నిధానము చెందుటయనియు, నీశ్వరస్వరూపము నొందుటయనియు, స్వస్వరూపమును బొందుటయనియును జెప్పవచ్చును. ఇదియె ముక్తి. వివిధమతస్థులు రుచివైచిత్ర్యముచేఁ బురుషార్థస్వరూపమును బలువిధములుగ వర్ణించుచున్నను నాయామత మూలగ్రంథములను జక్కఁగఁ బరిశీలించి సమరసముచేసి చూడ నాస్వరూపవర్ణనమునందు స్వల్పభేద ముండవచ్చును గాని తాత్త్వికభేద మింతైన నున్నట్లు చెప్పఁబోలదు. మఱియు నందఱును నీపురుషార్థము నుపదేశించి దానిని సాధ్యమగునంత శీఘ్రముగను సులభముగను బొందు నుపాయములఁ బరిశీలించి ఘోషించుచుఁ దమతరువాతివారిని దృఢముగఁ బురుషప్రయత్నము సేయఁబురికొల్పుచున్నారు. ఇంద్రియగోచరమగు నీభూలోకముగాక సూక్ష్మములును, నింద్రియాగోచరములునగు నితరలోకములున్నవనియు నవియన్నియుఁ

జీవునకు నానావిధ అనుభవములకు స్థానములై జ్ఞానము నొసంగుననియును వారందఱు రూఢిగ నంగీకరించుచున్నారు. ఇట్టి పరమపురుషార్థమునే ముఖ్యముగ నిరూపించి తత్సాధనముల బోధింపని మతమొక్కటియుం గానరాదు.

## IV. సాధనమార్గము

జీవుఁ డీభూలోకమునఁ బెక్కుమాఱులు జన్మించి కర్మానుసారముగ నిహపరలోకములయందు సుఖదుఃఖముల ననుభవించి, యా యనుభవముచేఁ బ్రతిజన్మమునందును జ్ఞానమును వృద్ధిచేసికొనుచుఁ గాలక్రమమున ననేకజన్మసంసిద్ధిచేఁ బరమపురుషార్థమును బెందు నని హిందూమతమున వెల్లడిగఁ జెప్పఁబడియున్నది. ఆజ్ఞానమును సాధించుటకు ముఖ్యముగ నీభూలోకము పాఠశాలవంటిది. భూలోకమున సాధింపఁదగిన జ్ఞానమును బరిపూర్ణముగ సాధించువఱకు జీవుఁడు మరల మరల జన్మించి యీభూలోక మనుపాఠశాలకు రాక తీరదు. పరమదయానిధి యగు భగవంతుఁడు జీవులు పరిపూర్ణు లగునంతవఱకు భూలోకమున వారికి జనన మొసఁగి కృతార్థులను జేయునుగాని యొక్కజన్మమునసె పరిపూర్ణులు కానిమాత్రమున వారిని శాశ్వతనరకప్రాప్తులను జేయఁడు. మఱియు నొకజన్మముననే మనుజుడు పూర్ణుఁడగుననుటయు అసాధ్యమైనపని.

పురాణేతిహాసములలో చెప్పినయొకఅంశమును మాత్రము మనము మరువరాదు. ఈముక్తి యనునది తాను బ్రహ్మానందము ననుభవించుటకే కాదు. కరుణానిధియగు పరమేశ్వరుఁడు సమస్తలోకములను తనయపారకృపతో నేలుచున్నాఁడు. వారియనుగ్రహమువలన మనము పరిపూర్ణులము కాగా ఆపరిపూర్ణతను వారిమహత్కార్యముతో తోడ్పడుటయందే వినియోగించుట పరమధర్మము. ఇంతకంటె నుత్తమమగు పురుషార్థ మేమున్నది. ప్రసిద్ధ మహాపురుషులందఱు దీనినే బోధించియున్నారు. ప్రహ్లాదుఁడు తనకు ప్రసన్నమైన శ్రీ నృసింహమూర్తినిగూర్చి యేమిచెప్పెనో చూడుడు.

శ్లో. ప్రాయేణ దేవ! మునయ స్స్వవిముక్తి కామాః
మౌనం చరంతి విజనే న పరార్థనిష్ఠాః
నైతాన్ విహాయ కృపణాన్ విముముక్షు ఏకో
నాన్యత్త్వదన్య శరణం భ్రమతో నుపశ్యే ॥

తా. ఓదేవా, తఱుచుగా మునులు తమముక్తిని మాత్రము గోరినవారలై, విజనస్థలమున మౌనము నవలంబించి సంచరింతురు. అట్టివారు ఇతరుల శ్రేయస్సువిషయమై యాసక్తిగలవారు కారు. ప్రపంచమునందు దీనులైయున్న వీరిని విడిచి యొక్కఁడనే మోక్షాసక్తుఁడను గాను. సంసారమున దిరుగు నీజనమునకు రక్షకుఁడవు నీవు తప్ప మఱియొకరిని గానను.

ఈవిషయమునే మనవారు ఇపుడు మరచిపోయి తమ తమ కృతార్థతనే ముఖ్యముగ యోచించుచు, లోకదుఃఖమును

మరచిపోవుచున్నారు. ఇది చాల ప్రమాదము. మహానుభావుల ధర్మము లోకసంగ్రహమే. ఈఅంశమును దివ్యజ్ఞాన సమాజమువారు విశేషముగ నొక్కి చెప్పుచున్నారు.

ఈపునర్జన్మవిధి హిందూబౌద్ధమతములయందు మాత్రమే బోధింపఁబడి యున్నదనియును, తమతమ మతములయందు లేదనియును నాధునికులగు పారశీకమతస్థులయుఁ గ్రైస్తవులయు, మహమ్మదీయులయు నభిప్రాయము. ఐనను మహమ్మదీయులలోఁ దత్త్వజ్ఞులగు "సూఫి" తెగవారి గ్రంథములలో నీసిద్ధాంతము గన్పట్టుచునే యున్నయది. క్రైస్తవుల మత గ్రంథమగు 'బైబిల్'లోఁ బెక్కుచోట్ల నీసిద్ధాంతము విస్పష్టముగ సూచింపఁబడియే యున్నది. ఈకాలపుఁ గ్రైస్తవులలోఁ గొందఱును, మహమ్మదీయులును నీసిద్ధాంతమును నమ్మరుగాని శ్రద్ధాళువులై తమ తమ గ్రంథములను జక్కఁగ శోధించిన విద్వాంసు లెల్లరును దీనిని నమ్ముచునే యున్నవారు. ఇక్కాలపుఁ గ్రైస్తుమతబోధకులు సైతము కొందఱీసిద్ధాంతమును దమప్రజలకు బహిరంగముగ బోధించుచునే యున్నవారు. దివ్యజ్ఞానసమాజశాఖలు ప్రపంచమునందు వ్యాపించుచు రాఁగ రాఁగ నీముఖ్యసిద్ధాంతము నెల్లయెడల నన్నిమతములవారు నంగీకరింప మొదలుపెట్టిరి.

## V. కర్మము

ఈరీతిని జీవులు భూలోకమునఁ బెక్కుపర్యాయములు జన్మించి సంసారప్రవాహమున ననేకకర్మములు—లౌకిక కర్మ

ములును, మతాచారకర్మములును—చేసి, వానిఫలానుసార ముగఁ బరలోకమునొందుదురు. వారు మనస్సుచేఁగాని, ఇంద్రియములచేఁగాని, కాయముచేఁగాని చేయు కర్మము లొక్కొక్కటియుఁ దదనుగుణమగు ఫలము నిచ్చుచునే యున్నవి. ప్రతిమనుష్యుఁడును దాను జేయు కర్మానుసారముగ నిహలోకమునను, బరలోకమునను దప్పక ఫలముల ననుభవించును. కావున నీజన్మమున శ్రద్ధతోఁ బుణ్యకర్మములఁ జేయుచుండిన నిహపరలోకసుఖముల నొందుటయే గాక మీఁది జన్మమునందును నట్టి పుణ్యకర్మములందు రుచి గలుగఁజేసి యట్టి పుణ్యకర్మములందె ప్రవర్తించునటులఁ బ్రేరేపించు శుభవాసనలతోడను, అట్టి పుణ్యకర్మములను మఱికొంత దార్ఢ్యముతోను, మఱికొంత సులభముగను జేయు స్వభావముతోడను, శక్తితోడను, జన్మించును. ఆ మీఁదిజన్మమున నా జీవున కిట్టిపుణ్యకర్మములఁ జేయ నవకాశము నిచ్చు దేశకాలనిమిత్తములు నొనఁగూడును. ఆకారణమున జీవుఁ డెక్కుడుగ నట్టి పుణ్యకర్మములనే యొనర్చి యుత్తరోత్తరజన్మములఁ జిత్తశుద్ధినొంది కాలక్రమమున మోక్షసాధన జ్ఞానసంపన్నుఁడగుచు సంసారచక్రమునుండి విముక్తుఁడయి మోక్షమును జెందుచున్నాఁడు. అట్లుకాక కామక్రోధములు గలిగి పాపకృత్యములను జేసిన జీవుఁ డిహపరలోకముల దుఃఖమును జెందుటయేగాక పిదప జన్మములందు సైతము పాపకృత్యములయందు రుచియును బ్రేరణయును గలుగఁజేయు నశుభ

వాసనలతో జన్మించి యట్టి పాపకర్మములందే ప్రవర్తించు స్వభావము గలవాఁడగు. మఱియుఁ బుణ్యకార్యముల కనను కూల మగు స్వభావముగలిగి పుణ్యకర్మములఁ జేయఁ బ్రతి కూలములగు సందర్భములతో జన్మించును. ఐనను జీవుఁ డీశ్వరాంశ మగుటంబట్టి స్వస్వరూపము నెఱిఁగి పురుషప్రయత్నము చేయ స్వతంత్రుఁడే యగునుఁ గానఁ బుణ్యకర్మములను జేయుటయందును, బాపకర్మములను విడుచుటయందును, పురుషకారమునుజూపి క్రమక్రమముగఁ బరిశుద్ధుఁడును పరిపూర్ణుఁడును కావచ్చును. చేసిన పుణ్యపాపకర్మములకు మాత్రము ఫలానుభవమును బొందకతీరదు. పాపకర్మములందుఁ బ్రవర్తించి మీఁది జన్మములందుఁ బూర్వ దుర్వాసనలు గలవాఁడయ్యును దనకుఁ గల స్వభావమును సందర్భములును బ్రతికూలము లయ్యును శాస్త్రవిచారముచేఁ గాని, సత్సాంగత్యముచేఁ గాని పాపపుణ్యముల నెఱిఁగి తాను భగవదంశస్వరూపుఁడ నను జ్ఞానమును బలపరచుకొని ధైర్యముతో దుర్మార్గమును వదలి సన్మార్గమునం బ్రవర్తింప నిశ్చయించి పూనికతో ప్రయత్నించి, పరిపూర్ణుడగును. ఇట్టి శక్తి పరమ దయానిధి యైన పరమేశ్వరుఁడు తనయంశమగు జీవున కొసఁగి యున్నాఁడు. కావున నెట్టి పాపియైనను జీవుఁడు స్వస్వరూపము నెఱిఁగి కర్మప్రాప్తములగు దుర్వాసనలను నిర్మూలముచేయ దృఢనిశ్చయుఁడై పశ్చాత్తాపముచేతను, సర్వభూతకారుణ్యముచేతను, భగవద్ధ్యానారాధనములచేతను, బరిశుద్ధుఁ డయి

కృతార్థుఁడు కాఁగలఁడు. కావున మనుష్యుఁడు పాపకర్మ ములను జేయుచోఁ గర్తృత్వము భగవంతునియం దారో పించి భగవంతుఁ డట్టి బుద్ధిని బుట్టించె ననుట యవివేకము. విధి యనునది జీవుఁడు స్వతంత్రముగఁ జేసిన కర్మఫలమే గాని, అకారణమగు భగవంతుని యిచ్ఛకాదు. కావున విధివశత యనునది మనము చేయఁబోవు కర్మములయం దన్వ యించుట యంతసరిగాదు. ఈకర్మసిద్ధాంతము హిందూబౌద్ధ మతములు మాత్రమే బోధించు చున్నవనియును, నితర మత సిద్ధాంతములకు విరుద్ధమనియు నీకాలపు వారిలోఁ గొందఱు భావించుచున్నను, ఇతర మతగ్రంథములందును గూడ నీవిష యము గానవచ్చుచున్నది. క్రైస్తవుల మతగ్రంథమునం దును "ఎట్టిబీజముల విత్తుదువో యట్టి ఫలముల నీవనుభవిం తువు", "ఎంత నీ వితరుల కిత్తువో యంతయే మరల నీ కీయఁబడును", అను నీ మొదలగు వాక్యములవలన నీసిద్ధాంత మే కదా స్పష్టముగ నిరూపింపఁబడుచున్నది. ఇట్లే యితర మతములయందును ఈ విషయము కనఁబడుచున్నది.

కావున నో సోదరులారా! రండు. మన మెల్లర మీా విషయములఁ జక్కఁగఁ బరిశీలింతము. మన మన మతగ్రంథ ములఁ జక్కఁగఁ జదివి యందలి ధర్మముల ననుష్ఠింతము. మన మతాభివృద్ధికై పాటుపడి కృతార్థుల మగుదము. మతము లన్నియుఁ బ్రహ్మవిద్యాతరుశాఖలే యనియు, నాశాఖలన్ని యు నిష్టఫలదాయకములే యనియు, నెఱింగి పరమతవైషమ్య

మును మాని యన్నిమతముల నాదరింతము. సర్వజ్ఞుఁడును, పరమదయానిధియును నగు పరమేశ్వరుఁడు తదంశస్వరూపులైన జీవుల కాయావారికిఁ దగిన శ్రేయోమార్గముల నాయా మతరూపమున నేర్పఱచియున్నాఁ డని నిశ్చయించి యాయా మతములయం దాయావారికి శ్రద్ధాభక్తులు గలుగఁజేసి ఆ యామార్గముల ననుష్ఠించునటులఁ బురికొల్పుదము. వైషమ్యములు మాని యందఱము సోదరభావమున నత్యంతప్రేమతో నన్యోన్య సహకారులమై భగవత్కైంకర్యమును జేయుదము. లోకమునం దసూయా స్పర్ధాతిరస్కారాదిరూప మైన ద్వేషమును మాన్పి సకలజనులను భక్తిప్రేమామృతభరితులనుగఁ జేసి లోకమందంతట నైకమత్యము నెఱపి లోకోపకారము నకుఁ బాటుపడుదము. లోకమునంతయు సుఖపూరితముగఁ జేయుదము. పరమేశ్వరప్రీతిఁ జేయుదము. కృతార్థుల మగుదము.

సర్వేజనా స్సుఖినోభవంతు !

---

## రెండవయధ్యాయము

## గురుశిష్యధర్మములు

సృష్ట్యాదిని భగవంతుఁడు మానవుల సృజించి వారలఁ గృతార్థులనుజేయ మన్వాదిమహాత్ములను సైతము మానవ కోటియందు నవతరింపఁ జేసె నని పూర్వాధ్యాయమున సూచింపఁబడియె. ఆ మహనీయుల స్వరూప మించుక విచా రింపఁదగియున్నది.

ఒక్కొక్క బ్రహ్మకల్పమునందును జన్మించు జీవులయం దనేక తారతమ్యములు గలవు. వారిలోఁ గొందఱైనను బూని కతోఁ దమధర్మముల నెఱింగి చక్కఁగ ననుష్ఠించి తత్ఫల ములఁ బూర్ణముగ నొందఁజాలియుందురు. ఇట్లు గొందఱు స్వధర్మములఁ జక్కఁగ ననుష్ఠించి యనేకజన్మములఁ గ్రమ క్రమమునఁ బక్వమునొంది సంసారసాగరమును దాఁటి పరి పూర్ణులయి, సిద్ధులై, ధర్మస్వరూపులై, యీశ్వర తాదాత్మ్య మును జెంది ముక్తులై యీశ్వరాజ్ఞాపరిపాలనమునె పూని లోకహితము పొంటె వర్తించుచుఁ గల్పాంతమున నీశ్వరుని యందు లీనమైయుందురు. పూర్వకల్పమునఁ గడతేరిన యమ్మహాపురుషులు వర్తమానకల్పాదియందు అధికారికులై

పామరజనోద్ధారణార్థము జనన మొందుదురు, కాని కేవల సామాన్యజనులవలెఁ గర్మనిబద్ధులై జననమొందువారు కారు. ఇట్టివారే ఋషు లనునామమునఁ బరఁగువారు. వారలు పరిపూర్ణబ్రహ్మానందానుభవము కలవారయ్యును, సంసారసాగరమున మునింగియుండు నజ్ఞులయం దపారకరుణచే లోకమున మాటిమాటికి సమాననామరూపములతో[1] జన్మించి శరీరధారులై వర్తింతురు! లోకమున నసంఖ్యాకులగు జీవులు పామరులై సమస్తదుఃఖభాజనులయి సంసారమున వర్తింపుచుండఁ దాము నిర్వాణసుఖ మనుభవింప నిచ్ఛలేనివారలై యపారదయచే లోకమున జీవులందఱును గడతేరుదనుక నీ మహాపురుషులు పాటుపడ నిశ్చయించి వర్తింతురు. వీరలు బ్రహ్మవిద్యానిధులై జగమునందలి యజ్ఞానాంధకారమును దొలఁగించి బ్రహ్మజ్ఞానమను వెలుఁగును బ్రకాశింపఁజేసి జగము నుద్ధరింపఁ బూనియున్నవారు. వారలు పరమాత్మతత్త్వమును, పరమాత్మకును జీవులకును బ్రపంచమునకును గలసంబంధమును, సమస్తభూతముల యథార్థతత్త్వమును సమస్తభూతములు ప్రాప్యస్థానమును బొందుటకు సాధనము

1 పరిపూర్ణులైన జన్మమున వారుధరించిన స్థూలశరీరమునే, తమయోగబలముతో, వేలకొలది వత్సరములకాలము నిలుపుకొని కాని, లేక ఇష్టానుసార మాశరీరమును విడిచి మరియొకశరీరము ధరించినను, పూర్వపు నామరూపములనే ధరించిగాని, లోకమునవర్తింతురు. వారు జరామరణములను జయించినవారనబడుదురు.

లగు మార్గములను జక్కఁగఁ దెలిసియుండుటం జేసి ప్రకృతి జనసామాన్యమునకు వలయు ధర్మములను నిరూపింపఁ దగి యున్నవారు. మహర్షులనఁ దగువారలే కల్పాదియందు రాజులుగ సహితము జన్మించి సకలజనుల రక్షించి యందఱచే వారివారికిం దగిన ధర్మము లనుష్ఠింపఁ జేయుదురు. అప్పుడు సర్వజనోపయోగముగ వర్ణాశ్రమధర్మముల స్థాపించి జీవకోటులయోగ్యతానుసారముగ వర్ణాశ్రమవిభాగమును జేసి తగినకట్టుబాటుల నేర్పఱచి లోకమును బరిపాలించుచుందురు. మనుస్మృతి లోనగు ధర్మశాస్త్రములన్నియు మహర్షిప్రోక్తములే. ఆపురాతనగ్రంథములయందు రాజధర్మములును, భృత్యధర్మములు, సాంఘికనియమములు, బ్రహ్మవిద్యాసారము మొదలగునవి సమగ్రముగఁ బ్రతిపాదింపఁబడియున్నవి. బ్రహ్మవిద్యాసార మనఁదగు పరవిద్యను భగవంతుఁడు మనువు, ఇక్ష్వాకు మొదలగు రాజర్షులమూలముననే లోకమున వ్యాపింపఁజేసెనని శ్రీగీతాశాస్త్రమునఁ జెప్పఁబడియున్నది.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్ ॥
ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయోవిదుః ।
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప ॥

(గీతా 4—1, 2.)

తా. శాశ్వతమైన యీయోగమును నేనర్జునా సూర్యునకుపదేశించితి. అతఁడు మనువునకుం జెప్పె. మను విక్ష్వాకు

నృపున కెఱిఁగించె. ఇట్లు క్రమక్రమముగ వచ్చిన యీ యోగ సారమును రాజర్షు లెఱుఁగుదురు. అట్టి యీ యోగము చిర కాలము జరుగఁగా నశించెను.

మహర్షులచేఁ బ్రతిపాదింపఁబడిన ధర్మము లన్నియుఁ గాలానుసారముగ గల్పాంతమువఱకు ననుష్ఠేయము లయియున్నయవి. చక్కఁగ బరిశీలించి చూడ నాధర్మములు ఒక్కదేశమునకుమాత్రముగాని, ఒక్క కాలమునకుఁ గాని నిర్దేశింపఁ బడినట్లుగానరావు. అవి యధికారానుగుణముగ సర్వజనానుష్ఠేయములును, సర్వలోకోపయుక్తములును, అయియున్నయవి; సర్వజ్ఞులయిన వారిచే విధింపఁబడి యుండుటం జేసి జీవుని సర్వోత్తమ మగుపదవిని జెందించుటయం దతిసమర్థము లయియున్నవి. ఆధునికులు వారలవలెఁ బరిపూర్ణజ్ఞానులు గామిం జేసి, నావిధుల తాత్పర్యము గ్రహింపలేక వానిస్వారస్య మెఱుంగఁజాలకున్నారు. ఆధర్మము లన్నియుఁ జక్కఁగ ననుష్ఠింపఁబడినచో లోకమున మానవకోటికి మాత్రమే గాక చరాచరములగు సమస్తభూతములకు నత్యంతసుఖ మొనఁగూర్పఁ జాలియుండును. మఱియు నీ ధర్మాచరణమున నెయదృశ్యము లగు భువరాదిసూక్ష్మలోకవాసులగు దేవతలకును, మానవులకును ఆనుకూల్యము సిద్ధించి లోకమున దేవతాప్రసాదసాధ్యములగు వృష్ట్యాదులు సకాలమునఁ గల్గుటయును సస్యములు ఫలించుటయును సిద్ధించి లోకమునకుఁ బరమ సుఖావాప్తి గలుగఁజాలును. అజ్ఞానముచే నాధర్మములను

విడిచినట్లైన లోకమున మానవకోటియందు అన్యోన్యవైష
మ్యభావము కలుగుటయేగాక సకలారిష్టములు గలుగుటకును
ఆస్పదమగుచున్నది. వర్తమానకల్పమున మహర్షులు కొంత
కాలము మానవకోటియందు జన్మించి జీవకోటులకు మార్గ
దర్శకులైయుండి కాలక్రమమున జీవకోటుల శ్రేయస్సు నుద్దే
శించియే యదృశ్యులయి యున్నవారు. అదృశ్యులయ్యును
లోకాభివృద్ధినిగోరుచు, లోకుల వర్తనముల నిరీక్షించుచు, వా
రెప్పుడనుష్ఠేయధర్మలోపమున క్షీణత నొందుదుగో అప్పుడు
తా మవతరించిగాని, పరిశుద్ధులును, నిష్కాములును, లోక
సంగ్రహమే ధర్మముగ నెంచి ప్రపంచాభివృద్ధికై పాటుబడ కంక
ణముకట్టుకొని లోకమున పనిచేయువారును అగు తమ శిష్యు
లమూలమునగాని చక్కఁజేయుచుఁ గల్పాంతమువఱకు సనా
తనధర్మములను గాపాడుచు, లోకమున యోగ్యు లగుమాన
వులకు సహాయులగుచుఁ గాచియున్నవారు. కల్పాంతరము
నుండి యవతరించిన యాధికారికులు గాక వర్తమానకల్పము
నందు జన్మించిన జీవులలోఁగూడ ధర్మానుష్ఠానబలముచేఁ
జిత్తశుద్ధినొంది స్థితప్రజ్ఞులై, భగవద్భక్తులై, గుణాతీతులై
యీశ్వరభావమునొంది జీవన్ముక్తులయినవారు నమ్మహనీయ
సంఘమునం జేరి వారలవలె మహర్షిశబ్దవాచ్యు లగుచున్నారు.
అట్టి జీవన్ముక్తులు సంసారసాగరమగ్నులై యుండు పామరు
లను దరింపఁజేయుటకుఁ బలుమరు నీభూలోకమున జన్మించి
పాటుపడుటయుం గలదు. వారలు సదా బ్రహ్మానందభరితులై

యోగ్యులగుశిష్యులను వెదకుచు నట్టివారి మనస్సులయందుఁ బ్రవేశించి వారి యజ్ఞానమును దొలఁగించి పరిశుద్ధులను జేసి వారలఁ దమవలెఁ బరిపూర్ణులుగఁ జేయుటకుఁ బాటుపడు చున్నవారు. అట్టివారి యనుగ్రహమునకుం బాత్రులయిన యెడల వారిసహాయము తప్పక కలుగును. మానవులు స్వప్రయోజనపరులై యుండునంతవఱకు వారల యనుగ్రహము నొందఁజాలరు. పరోపకారబుద్ధి వృద్ధికానుకాను వారల కటాక్షవీక్షణమునకు నర్హులయి శీఘ్రకాలమున వారి ప్రత్యక్ష సందర్శనమునకుం బాత్రులయి వారలవలెఁ గాలక్రమమునఁ బరిపూర్ణులై జీవన్ముక్తులు కాఁజాలుదురు. వీరలే పరమగురువు లని పిలువఁబడువారు.

## గురువులు

గురువనఁగా నజ్ఞానమునుబోఁగొట్టి జ్ఞానోపదేశము చేయు వారు. సంసారసముద్రమును దరించి యితరులను దరింపఁ జేయఁబూనినవారలే గురువులు.

అవిద్యాహృదయగ్రంథి బంధమోక్షోభవేద్యతః
తమేవ గురురిత్యాహుర్గురుశబ్దార్థవేదినః ॥

తా. అజ్ఞానజనితమైన హృదయబంధములకు మోక్ష మెవరివలనఁ గలుగునో వారిని గురువని గురుశబ్దార్థము నెఱిఁగిన పెద్దలు వచించుచున్నారు.

బ్రహ్మాండమున గురువు లనేక తారతమ్యముల నొప్పి యున్నవారు. ముఖ్యముగా గురువులను పరిపూర్ణ లనియు, నపరి పూర్ణులనియును రెండువిధములుగ విభజింపనగు. ప్ర ప్రథమమున నానందస్వరూపుఁడును, సకలజ్ఞానప్రదాతయును, సంసారరూపమగు నజ్ఞానమును దహించి మహాశ్మశానవాసి యు నగు పరమేశ్వరుడే "గురోర్గురుః" అను నామమున నొప్పువాఁడు. వారి వెనుక వారికిం బ్రతినిధులయి మానవుల వారి పాదారవిందములఁ జేర్పగలవారే పైఁజెప్పఁబడిన జీవన్ముక్తులసమాజము. వీరలు కారణగురువు లనియుం బిలువఁ బడుదురు. వీరు లోకహితార్థము స్థూలశరీరధారులై, ఇప్పు డును హిమవత్పర్వతప్రాంతముల నున్నవారని ముందే సూ చింపఁబడియె. ఐనను వీరు సూక్ష్మశరీరములతో జగంబునం దంతట సంచరించుచున్నవారు.

> చరంతి హ్యవనౌ కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః,
> మాదృశాం గ్రామ్యబుద్ధీనాం బోధాయోన్మత్తలింగినః
> కుమారో నారదఋభురంగిరా దేవలోఽసితః
> . . . . . . . . . . . .
> ఏతే పరేచ సిద్ధేశాశ్చరంతి జ్ఞానహేతవః ॥
>
> (భాగవతము, ౬ స్కంధము)

తా. భగవద్భక్తులగు బ్రాహ్మణులు, కుమారనారదులు ను, ఋభువును, అంగిరసుండును, దేవలాసితులును, పరాశర మైత్రేయ భరద్వాజ వసిష్ఠాదులును, మఱియు ననేకులు

సిద్ధులును మాబోటియల్పబుద్ధులకు పరమార్థ జ్ఞానప్రదాతలై, యున్మత్తాదిచిహ్నములుగలవారై (అనఁగా వారి మహిమను బయలు పఱుపక) స్వేచ్ఛగా భూతలంబున సంచరించు చున్నవారు.

పూర్వకాలమందు జనులు శ్రద్ధాళువులుగ నున్నందున వారల కీమహాత్మ్యలు అప్పుడప్పుడు దర్శనమిచ్చుచుండిరి. ఇప్పుడన్ననో మానవులు కేవలవిషయాసక్తులై, స్వప్రయో జనపరులై, భక్తిశ్రద్ధావిహీనులై యుండుటంబట్టి యమ్మ హాత్మ్యల సందర్శింప నర్హులుగాకయున్నారు. ఐనను భగవత్స్వ రూపు లగు వారిని మనము చూడఁజాలకపోయినను మనల నామహాత్మ్యలు సర్వకాలములయందు దివ్యదృష్టితోఁజూ చుచు, మన జ్ఞానవృద్ధికొఱకును, బరిశుద్ధతకొఱకును యత్నిం చుచున్నారు. సప్తర్షులు, నారదుఁడు, వ్యాసశుకాదులు, గోత్ర ఋషులు, ఉద్ధవమైత్రేయులు లోనగు వారలీకారణ గురు వర్గమునఁ జేరియున్నవారలు. వీరలు పరిపూర్ణులయి, భగ వత్స్వరూపులయి, తమకువలయుప్రయోజనమెద్దియు లేకున్న ను జీవులను దరింపఁజేయుటయే పనిగాఁ బూని ప్రతిఫలము నించుకంతయుఁ గోరక సూర్యుఁడు లోకమునకు వెలుగునిచ్చు నటులఁ బాటుపడుచున్నవారు. ప్రపంచమున జనులను బరి పాలించుటకుఁ జక్రవర్తియొక్కఁడుండ వారియాజ్ఞకులోఁబడి మంత్రివర్గమును, రాజప్రతినిధులు నుండురీతిని జ్ఞానపరిపాలన మునందు "గురోర్గురుః" అనఁబరఁగు మహాదేవుఁడు చక్ర

వర్తిస్థానముననుండఁ బైఁ జెప్పిన మహాత్ముల సమూహము రాజప్రతినిధులం బోలియున్నది. ఐనను వీరందఱును దఱచుగ నదృశ్యులై పనిచేయువారలు. కావున సామాన్యజనులకు జ్ఞానోపదేశము చేయుటకొఱకుఁ దమశిష్యులలోఁ గొందఱిని జన్మింపఁజేసి మఱియు లోకమున జన్మించియుండువారలలో నుత్తములను గొందఱఁ దమశిష్యులనుఁగా జేసికొని వారిమూల మున నజ్ఞులగువారలకు జ్ఞానము నుపదేశింపఁజేయుచు భక్తి శ్రద్ధలవృద్ధిఁజేయుచు జగంబున బ్రహ్మవిద్య మఱువకయుండు నట్లు కాపాడుచున్నవారు. వీరలే పైనుదహరింపఁబడిన య పరిపూర్ణులగు గురువులు. వీరలే కార్యగురువు లనియును బిలువఁబడుదురు. వీరు భూలోకమున జన్మించి చిత్తైకాగ్ర్య ముతో నీశ్వరధ్యానముచేయుచు, భూతదయ నభ్యసించుచు గారణగురుప్రేరితులయి, తాము ను దమశిష్యప్రశిష్యులతో యోగ్యులగుసామాన్యజనులకు రాజయోగమార్గముల నుప దేశించుచుఁ, బరుల మేలుకొఱకుఁ బాటుపడుచుఁ గొంత కాలము భూలోకమునఁ గలిసి మెలసి వర్తించుచు జ్ఞానధన మును వెదజల్లి కాలక్రమమున జీవన్ముక్తులై కారణగురువుల సమాజమును జేరుదురు. ఆశిష్య ప్రశిష్యులలోఁ గొందఱు మాత్రము మహాత్ములగు కారణగురువుల సందర్శనమునకుఁ బాత్రులయి వారి యాజ్ఞానుసారము లోకమున వర్తించుచుం దురు. మఱికొందఱు అట్టియుత్తమపదవిని జెందకయుండియుఁ దదనుగ్రహపాత్రులై వారిచేఁ బ్రేరితులై లోకుల జ్ఞానాభివృద్ధి

గొలుసుఁ బాటుపడుదురు. తలుచుగ లోకమున సజ్జనులును విచారపరులునై యుండువారలకు ఆకస్మికముగ నెవఁడో యొక పురుషుఁడు వచ్చి మనస్సందేహములఁ బాపి సత్పథమును జూపిపోవుట వినుచున్నాము. ఇట్లు మంచిమార్గమును జూపిన పురుషులు కారణగురువుల ప్రేరేపణమున వచ్చినవారలే యని యెన్నఁదగియున్నయది. ఇట్లుకారణగురువు లనేకవిధములుగ జీవులను సన్మార్గప్రవర్తకులుగఁ జేయుచుందురు. అందొకటి రెండుమార్గములు ముఖ్యముగ నిందు సూచింపఁబడును.

౧. దేశకాలానుగుణముగఁ దమలో నొకరు భూలోకమున నవతరించిగాని లేక తమ ముఖ్యశిష్యుల సమయానుసారముగ నానాదేశముల జన్మింపఁ జేసికాని జీవకోటికి భక్తి జ్ఞాన వైరాగ్యమార్గముల యథార్థతత్త్వము నుపదేశించి, తమ ప్రవర్తనముచే మార్గదర్శులై, బరిశుద్ధులను జేయుదురు.

౨. జీవన్ముక్తులగు కారణగురువులు సూక్ష్మశరీరధారులయి యజ్ఞుల యజ్ఞానాంధకారమునుజూచి చింతించి పరమకారుణ్యముతో దానిం దొలఁగించు నిచ్ఛతో వారి హృదయకవాటములయొద్దఁ గాచియుందురు. ఆమహాత్ములకు జీవులందఱియందు సమానమగు కరుణ కలిగియుండినను జీవులు తమ కామక్రోధాదులచేతను, అహంకార మమకారముల చేతను వారల యనుగ్రహము నొందఁజాలక యున్నారు. సూర్యుని వెలుగు సమస్తగృహములందుఁ బ్రవేశించి ప్రకా

శింపఁజేయ సిద్ధముగనుండ గృహస్థువు ద్వారములను, గవాక్షములను గట్టిగ మూసికొనినచో నావెలుఁగు గృహమునం బ్రవేశింపఁజాలక యుండునుగదా. ఐనను సూర్యకిరణములు కవాటమునొద్దనుండి చీఁకటి కోర్వఁజాలక గృహస్థు లెప్పుడైన వాకిలి తెఱచినయెడల నప్పు డవి యింటిలోఁబ్రవేశించి యంధకారమును బోఁగొట్టి గృహమును బ్రకాశింపఁజేయును. అట్లే మనుష్యుల హృదయములకుఁ గామక్రోధాదులు, నహంకారమమకారములును దట్టమగు కవాటప్రాయములై కారణగురువులను హృదయములయందుఁ బ్రవేశింపకుండున ట్లడ్డపడుచున్నవి. ఎప్పుడైన జీవులు కామక్రోధాదుల నించుకయైన వదలి హృదయకవాటమును దెఱచినయెడల దయామయులగు నామహాత్ములు హృదయములం బ్రవేశించి యజ్ఞానాంధకారమును దొలఁగించి భక్తిజ్ఞానవైరాగ్యముల సమంచితముగ నభివృద్ధినొందించి కాలక్రమమున వారికిఁ బ్రత్యక్షముగూడ నగుదురు. కావున నాజీవన్ముక్తులు సర్వకాలములయందును జీవులను దివ్యదృష్టిచేఁ జూచుచునేయున్నవారు. ఏజీవుని హృదయమందైనను భక్తిశ్రద్ధలును, భూతదయయు వెలయుచుండునో అట్టివానిని వారు దివ్యదృష్టిచేగాంచి శిష్యునిచేఁ బిలువబడకయే యాఁకలిగొన్న బిడ్డయొద్దకుఁ దల్లి పరుగిడి వచ్చులాగున బరుగిడివచ్చి జ్ఞానోపదేశముచేసిపోవుచుందురు. ధ్రువున కరణ్యమునందును, బ్రహ్లాదునకు గర్భమునందును దివ్యదర్శియగు నారదమహర్షి వారలహృదయపారిశుద్ధ్య

మును దెలిసికొని పిలువబడకయే వచ్చి మిగుల కరుణతో నుపదేశించెను కదా! మఱియును బరీక్షిన్మహారాజుచేఁ బిలువఁబడక దయానిధియగు శుకమహర్షి వచ్చి శ్రీమద్భాగవత పురాణమును బోధించెను గదా! అట్లే జీవులు పరిశుద్ధాత్ములైనయెడల వారలకు జ్ఞానోపదేశము చేయ నిప్పుడును నా మహాత్ములు రాసిద్ధముగనున్నవారు. ఆమహాత్ముల దయకుఁ బాత్రులై వారి శిష్యులుగనుండు జీవులుకొంద ఱిప్పుడును నీ జగమునఁ బ్రవర్తించుచున్నవారు.

## శిష్యధర్మములు

మహాత్ముల యనుగ్రహమునకు బాత్రుఁడు కాఁగోరు శిష్యుఁడు పరిపూర్ణుఁడగు కారణగురువువంటివాఁ డగుటకుఁ బ్రయత్నించవలెను. గురువు పరిపూర్ణదయాస్వరూపుఁడును, బరిశుద్ధుడునై యుండును గావున శిష్యుఁడును దయాస్వరూపుఁడును, బరిశుద్ధుఁడును నగుటకు యత్నింపవలయు. కామక్రోధములను, అహంకారమమకారములను, విషయాసక్తిలోనగు వానిని నశింపఁజేసికొనవలయును. దీనికి ముఖ్యసాధనము ధ్యానమే. ధ్యానమన కారణగురువునుగాని, ఈశ్వరుని గాని మనస్సున నిలిపి పూజించి ప్రేమించుట. ధ్యేయమూర్తి యొక్క కళ్యాణగుణములను మనస్సున మననము చేసి నిత్యప్రవర్తనమునం దభ్యసించినయెడల "యద్భావం తద్భవతి" యను న్యాయానుసారముగ ధ్యాని ధ్యేయమూర్తి సారూప్య

ము నొందును కావున శాంతము, ఇంద్రియనిగ్రహము గల గురువును ధ్యానించిన నట్టివాఁడే యగు. ఈశ్వరునిగాని గురువునుగాని ధ్యానించుచుండఁ దదీయ తేజస్సు ధ్యానిమనంబునం బ్రవేశించి సంసారమాలిన్యమును నశింపఁ జేయును. వేపాఁకు తినిన చేఁదు చక్కెరదినుటఁచే నెట్లు తొలఁగింపఁబడుచుండునో అట్లే కోపస్వభావము గలవాఁడు ఈశ్వరుని శాంతమూర్తినిగా ధ్యానించిన నాకోప ముపశమించును. కామిగా నుండువాఁడు కామదాహకుఁడగు సదాశివుని ధ్యానించిన నిష్కాముఁడగును. ఇట్లే యితరదుర్గుణపుంజములుగల వారా యాగుణములకు విరుద్ధములగు నీశ్వరకల్యాణగుణముల ధ్యానించిన నాయాదుర్గుణములు నశించి సద్గుణములు వృద్ధియగును. ఇంతియగాక భక్తుడు సర్వభూతసమబుద్ధితో సర్వజన శ్రేయోభివృద్ధికొఱకు ధ్యానముచేయవలయు. ఇట్టి ధ్యాన మొనరించిన నతనియందు స్వప్రయోజనపరత్వము, అహంకారము పూర్ణముగ నశించి పరిశుద్ధత గలుగును. అప్పుడతనికి గారణగురువు ప్రత్యక్షసందర్శన మొసంగును. కాఁబట్టి శిష్యుఁడు శ్రేయఃప్రాప్తిని గోరినచో వానికి భూతదయయు, నీశ్వర ధ్యానమును బక్షికి రెక్కలవలె ముఖ్యసాధనములయియుండును. ఆభూతదయ యథాశక్తి భూతసేవారూపముగ గన్పడవలయునుగాని, కేవలము మానసికముగను వాచికముగను నుండిన చాలదు. మనస్సు తనవశమున నుండిననేగాని వీని నభ్యసింప సాధ్యముకాదు. మనస్సున జలనస్వభావమును వృద్ధిచేయు

నవి యింద్రియములు గాన మొదట నింద్రియముల వశవర్తు లనుగాఁ జేసికొనవలయును. ఆపిదప స్వతః చంచల స్వభావము గల మనస్సును విషయములనుండి మరలించి యేకాగ్రముగఁ జేయఁదగు. ఇట్లేకాగ్రమగు మనస్సుచే ధ్యానముచేయుచు, నీశ్వరుని యనంతకళ్యాణగుణములను సదా మననముచేయు చు, నాగుణముల నభ్యసించుచుండవలయును. ఈరీతిని సా ధించుచుఁ గ్రమక్రమమున సాధనచతుష్టయము అనఁగా నిత్యానిత్యవస్తువివేకము, వైరాగ్యము, శమాదిషట్కసం పత్తియు, ముముక్షుత్వము నను నీ నాలుగుసాధనములను సం పాదింపవలయును. ఈ సాధనచతుష్టయసంపత్తి గల్గుటకు సాత్వికాహారములను గొనుటయు, రాజస తామసాహారముల వర్జించుటయు, బ్రహ్మచర్యము నవశ్యకములు.

ఈ విధముగ ధర్మముల శ్రద్ధతో ననుష్ఠించుచు రానురాను జీవునకు అజ్ఞానతమస్సు వదలి దివ్యదృష్టి కలుగును. జ్యో తిస్స్వరూపుఁ డగుకారణగురువు లోచనగోచరుఁడై పరిపూర్ణ జ్ఞానోపదేశము చేసి పరమేశ్వరసాక్షాత్కారము గావించును. జీవుఁడు బ్రహ్మానందభరితుఁడై పరమేశ్వరునివలె లోకాను గ్రహమందే సదా నిష్ఠుఁడైయుండును. సదాశివుఁడు హాలా హాల విషమును తాను మ్రింగి, లోకమును రక్షించినట్లు పూర్ణుఁ డగు మహానుభావుఁడును లోకదుఃఖమును తానుభరించి లోకము ననుగ్రహించుచుండును. మహానుభావుడగు రంతి దేవుఁడు ప్రార్థించిన దదియే గదా!

ఆర్తిం ప్రపద్యే ఽఖిలదేహభాజాం
అంతఃస్థితో యేన భవంత్యదుఃఖాః

తా ॥ సమస్తదేహధారుల దుఃఖము నాకు వచ్చుగాక. నేను (నా మనశ్శాంతి) వారలయందు ప్రవేశించి వారందఱు దుఃఖములేనివారగుదురుగాక యనియే నేను ప్రార్థించునది. మనమందరము రంతిదేవునివలె నగుదుముగాక.

---

## మూఁడవయధ్యాయము

### ఈశ్వరుఁడు

ఆదియందు "ఏకమేవాఽద్వితీయమ్" అని శ్రుతులయం దుపపాదింపఁబడియుండు నిర్గుణపరబ్రహ్మ మొక్కటియె యుండెఁ. అది యవాఙ్మానసగోచరము. ఆతత్త్వమున్నదని గాని లేదనిగాని వచింప నసాధ్యము.

నాసదాసీన్నోసదాసీత్ ॥ (ఋగ్వేదము)

నసత్తన్నాసదుచ్యతే ॥ (గీత)

ఆతత్త్వము నిట్టిదని వాక్కులచే వర్ణింప నసాధ్యము. దాని యందు వెలుఁగును, దమస్సును, దినమును, రాత్రియును, విద్యయు, నవిద్యయు, ధర్మము, అధర్మమును గూఢముగ నిహితములయి యున్నయవి. ఆతత్త్వమును వర్ణించులక్షణ మొక్కటియుఁ గానరాదు. ఆపరబ్రహ్మమును "నేతి, నేతి" అనఁగా "ఇదికాదు, ఇదికాదు" అనువాక్యములచే వర్ణించి యున్నారు. బుద్ధిగ్రాహ్యములగు లక్షణములన్నియు నాతత్త్వ మును సూచింపఁజాలవు. ఏవిధమున వర్ణించినను ఆవర్ణన లాతత్త్వమునం దన్వయించవు. కావున "నేతి, నేతి" యను శబ్దములచే గ్రహింపఁదగి యున్నయది.

యదాఽతమ స్తన్నదివా న రాత్రిర్న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః । ....
ద్వే అక్షరే బ్రహ్మపరే త్వనన్తే విద్యావిద్యే నిహితే యత్రగూఢే । ....
(శ్వేతాశ్వతరోపనిషత్తు)

అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్ ।
అన్యత్ర భూతాశ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద ॥ (కఠోపనిషత్తు)

మహావాక్యములచే సైతము నిరూపంపఁబడు వస్తు విద్దియే.

ఇది అవిజ్ఞాతమనియు, నవిజ్ఞేయమనియును వర్ణింపఁబడి యున్నది. ఐన నవ్యక్త మగు నాతత్త్వమునుండియే వ్యక్త మగు ప్రపంచమంతయు వెలువడినది. ప్రపంచమునందుఁ బరస్పర విరుద్ధములుగఁ గన్పడు తత్త్వములన్నియు ననఁగా ద్వంద్వములనఁబడు నవియన్నియు నాతత్త్వమునుండి వ్యక్తము లాయె. ఆతత్త్వము ద్వంద్వాతీతము. దానినుండి యీశ్వరుఁడును, మూలప్రకృతియును వెలువడఁగా వానినుండి చరాచరాత్మకమగు ప్రపంచమంతయు నభివ్యక్తమయ్యెను.

అవ్యక్తమనియు, నిర్గుణమనియు నిరూపింపఁబడియుండు పరబ్రహ్మమునుండి యపరబ్రహ్మమనియును, సగుణబ్రహ్మమనియు, నీశ్వరుఁ డనియును బిలువఁబడు తత్త్వము వ్యక్తమాయెను. ఈతత్త్వము పరబ్రహ్మమునకంటె నన్యము కాదు.

ఏతద్వై సత్యకామ, పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః ॥
(ప్రశ్నోపనిషత్తు)

ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తం చైవామూర్తం చ
మర్త్యం చామర్త్యం చామృతం చ స్థితం చ యచ్చ సచ్చ త్యచ్చ ॥
(బృహదారణ్యకము)

ఈసగుణబ్రహ్మము వ్యక్తమగునపుడు మూలప్రకృతితోఁ జేరియుండుటచే నీశ్వరుఁడును, మూలప్రకృతియు నను ద్వితయ మేకకాలమున వెలువడె నని చెప్పనగు. ఈప్రకృతి పురుషుల సంయోగముననే చరాచరములగు సమస్తభూతము లుద్భవించెను.

ఈ పురుష ప్రకృతులకు సంబంధము గలుగఁజేయునది యీశ్వరశక్తియే. ఈశక్తియే మాయాశక్తియనియును బిలువఁబడుచున్నది. చంద్రచంద్రికలకును, అగ్నికి దాహశక్తికిని వలె నీశ్వరునకును మాయకు నవినాభావసంబంధము చెప్పఁబడి యున్నది.

ఈశ్వరుఁడు సచ్చిదానందస్వరూపుఁడు. అనగా సత్, చిత్, ఆనందములను లక్షణత్రితయముతోఁ గూడి యున్నవాఁడు. అట్లే ప్రకృతియు సత్త్వరజస్తమస్సు లను గుణత్రితయముతోఁగూడినది. ఈశ్వరునియందలి లక్షణత్రయము ప్రకృతియందుఁ బ్రతిఫలింప నొక్కఁడగునీశ్వరునినుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను మూర్తిత్రయ మభివ్యక్తమైనది. జగత్సృష్ట్యాదివ్యాపారములకొఱకు మూఁడురూపములు ధరించి నను ముమ్మూర్తులచే నెఱుఁగఁదగు తత్త్వమేకమగు నీశ్వరుఁడే. ఒక్కొక్కఁడును సచ్చిదానంద రూపుఁడయ్యు నొక్కొక్కనియం దొక్కలక్షణము ప్రధానమై యున్నయది. ఈశ్వరుఁడు రజోగుణమునం బ్రతిఫలించి సద్రూపుఁడై సృష్టికర్తయగు బ్రహ్మయయ్యెను. సత్త్వమునందుఁ బ్రతిఫలించిన

యీశ్వరుఁడు చిద్రూపుఁడై స్థితికర్తయగు విష్ణువయ్యెను. తమస్సునందుఁ బ్రతిఫలించిన యీశ్వరుఁడు లయకర్తయై అజ్ఞానలయముచే ఆనందదాయకుఁడైన మహేశ్వరుఁడాయెను. ఈశ్వరుని సచ్చిదానందలక్షణములలో నొక్కొక్కటి ముఖ్యముగ నీత్రిమూర్తులలో నొక్కొక్కరియందు వ్యక్తముగ నుండును.

శ్లో॥ సత్వం త్రిలోకస్థితయే స్వమాయయా
బిభర్తిశుక్లం ఖలు వర్ణమాత్మనః ।
సర్గాయ రక్తం రజసోపబృంహితం
కృష్ణం చ వర్ణం తమసా జనాత్యయే ॥
(భాగ. ౧౦ స్కం. 3 అధ్యా. ౨౦. శ్లో.)

తా॥ అనఁగా పరబ్రహ్మ స్వరూపుండవగు నీవు త్రిలోకరక్షణముకొఱకు సత్వగుణముతోఁగూడి శ్వేతవర్ణమును, జగత్సృష్టికొఱకు రజోగుణముతోఁగూడి రక్తవర్ణమును, లోకప్రళయముకొఱకుఁ దమోగుణముతోఁగూడి కృష్ణవర్ణమును స్వమాయాబలమున నీ వొక్కఁడవే ధరించుచున్నావని శ్రీకృష్ణమూర్తిని వసుదేవుఁడు స్తుతించియున్నవాఁడు. ఈవిషయమునే తిక్కనసోమయాజిగారు నిర్వచనోత్తరరామాయణమున నిట్లు చెప్పియున్నారు.

ఉ॥ సత్త్వరజస్తమోగుణవశస్థితిఁ గైకొని లీలనీవ బ్ర
హ్మత్వముఁ దాల్చి లోకముల కన్నిటికిన్ జననం బొనర్తు వి
ష్ణుత్వముఁదాల్చి వానికి మనోజ్ఞతర స్థితి వృత్తిఁ జేర్తు రు
ద్రత్వము దాల్చి వానికుచితంబగు సంహృతిఁగూర్తురాఘవా ॥

ఈశ్వరశక్తిసహితము ముమ్మూర్తులతోడ శక్తిత్రితయముగ భాసిల్లుచున్నది. ఆశక్తియిచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తియని మువ్విధములుగ వ్యక్తమగుచున్నది. అందుఁగ్రియాశక్తి బ్రహ్మతోఁజేరి సరస్వతిగను, జ్ఞానశక్తి విష్ణువుతోఁగూడి లక్ష్మిగను, ఇచ్ఛాశక్తి మహేశ్వరునితోఁజేరి యుమగను వెలయుచున్నది. మాయాశక్తి ప్రకృతియందుఁ బ్రవేశించి సదా వర్తించుచుండుటచే మూలప్రకృతి మాయయని పిలువఁబడుటకలదు.

ఏకమగు బ్రహ్మము బహుత్వమగుట కిచ్ఛయించి ప్రకృతిని వశపఱచుకొని తపోమహిమచే జగత్తును సృజించెను.

> సోఽకామయత బహుస్యాంప్రజాయేయేతి,
> స తపో తప్యత, స తపస్తప్త్వా ఇదగ్ సర్వమసృజత ॥

భగవంతుఁడు బహుత్వము నిచ్ఛయించి సృష్ట్యున్ముఖుఁడు కాఁగా భగవంతునియందు లీనమైయుండిన భూతములన్నియు వెలువడి ప్రకృతియందుఁ బ్రవేశించి వ్యక్తము లయ్యెను. అందు మొట్టమొదట నింద్ర, వాయ్వగ్ని, వరుణ, క్షితిదేవతలుద్భవించి ఆకాశవాయుతేజస్సలిల భూతత్త్వస్వరూపులై తదధిపతులయి ప్రకాశించిరి. వీరలు ఒక్కొక్కరు సప్తలోకములలో నొక్కొక్కదాని కధిపతులై యున్నవారు.

ఇవియే ప్రసిద్ధములైన పంచమహాభూత వికారములైన సప్తలోకములు.

పృథివీతత్త్వవికారమే భూలోకము. దీనికి క్షితిదేవత యధిపతి. అప్తత్త్వవికారము భువర్లోకము. దీనికి వరుణుఁ డధిపతి. తేజస్తత్త్వవికారము సువర్లోక మహర్లోకములు. వీని కగ్ని యధిపతి. వాయుతత్త్వవికారము జనలోక తపోలోకములు. వీనికి వాయు వధిపతి. ఆకాశతత్త్వవికారము సత్యలోకము. దీని కధిపతి యింద్రుఁడు. ఈయేడులోకములమీఁద నింకను రెండు లోకములున్నట్లు గ్రంథములయందు సూచింపఁబడి యున్నయది. అవి వైకుంఠగోలోకము లనునామములచేఁ బరఁగుచున్నవి. వైకుంఠము అహంకారతత్త్వ మను నామాంతరముగల యనుపాదక తత్త్వముతోడను, గోలోకము మహత్తత్త్వ మను పేరంబరగు నాదితత్త్వము తోడను, నీరెండు తత్త్వములతోఁ జేయఁబడియున్నవి. మఱియుఁ బ్రళయకాలమున నీశ్వరునియందు లీనమైయున్న జీవాత్మలును బహిర్ముఖులై వ్యక్తమగుదురు. జీవాత్మలు భగవదంశములగుటచే నాదియందు నవ్యక్త మనఁబరఁగు ననుపాదకతత్త్వమున లీనమైయుండి వ్యక్తమై పాంచభౌతికమగు ప్రపంచమునందుఁ బ్రవేశింతురు.

ఈలోకములయందు మొదట భూర్భువస్స్వర్లోకములను మూఁడింటియందు జీవాత్మలు సంసారచక్రనిబద్ధములై పరిభ్రమించుచుండును. ఈమూఁడులోకములే గ్రంథములందుఁ ద్రిలోకీయను నామమునఁ బరఁగుచున్నవి. ఈలోకములే బృహదారణ్యకోపనిషత్తునందు మనుష్యలోకము, పితృలోకము, దేవలోకము అని నిరూపింపఁబడియున్నవి.

అథ త్రయోవావలోకా మనుష్యలోకః పితృలోకో
దేవలోక ఇతి ॥

సామాన్యముగ జీవు లీలోకత్రయమును అతిక్రమింపఁ జాలరు. ఐనను ఇంద్రియనిగ్రహముచేతను, యోగాభ్యాసము చేతను, భక్తిజ్ఞానవైరాగ్యముల చేతను బరిశుద్ధులయి పరి పక్వము నొందినవారలు మహర్లోకమును దాఁటి జనతపస్సత్య లోకములను బొందఁ గల్గుదురు. ఈలోకము లన్నియు జీవులకు సుఖానుభవరంగములుగ నేర్పడియె. ఇట్లు సత్యలోకమును బొందిన జీవుఁడు శబ్దబ్రహ్మస్వరూపుఁడై ముక్తిసాన్నిధ్యము నొందిన వాఁడగును. ఈలోకములన్నియు నొకటికంటె నొకటి సూక్ష్మములై యొకదానిలో నొకటి వ్యాపించి యుండుటచే నొక్కస్థలమునందె యన్నిలోకము లున్నవని తెలియఁదగు. ఐనను ఒక్కొక్కలోకమును దానికంటె క్రిందిలోకమున కంటె సూక్ష్మమయి తిలబీజమునఁ దైలమువలె నాలోకము లను నిండి వాని నతిక్రమించి వ్యాపించియున్నది. ఊర్ధ్వ లోకములని పిలువఁబడులోకములన్నియు నొకదానిపై నొకటి యున్నవనుటకాదు.

ఊర్ధ్వశబ్దముచే నుత్కృష్టతయు, సూక్ష్మతయు నెఱుంగ నగుఁ గాని స్థలమునం దౌన్నత్యముగాదు.

---

## నాల్గవయధ్యాయము

## జీవస్వరూపము

జీవుఁ డీశ్వరాంశ యని పై యధ్యాయమున సూచింపఁ బడియె.

> మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
> మనష్షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ।
> శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
> గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥ (గీత)

జీవులు భగవదంశ లగుటంబట్టి సచ్చిదానందస్వరూపు లయ్యెదరు. వారు ప్రళయకాలమునం దీశ్వరునందు లీనమై యుండి కల్పాదియందు బహిర్ముఖులై పాంచభౌతిక శరీరములను బొంది యాయాలోకములందు సుఖదుఃఖ రూప మగు ననుభవములను బొంది జ్ఞానమును గ్రహింతురు. దీనిచే లోకము లన్నియు జ్ఞానదాయకములగు భోగస్థానములని యేర్పడును.

సామాన్యముగ జీవుఁడు శరీరములకంటె విలక్షణుఁడు. శరీరముల కధీశ్వరుఁడు. శరీరములు నశించుచుండ శరీరియగు జీవుఁడు నాశములేక యుండువాఁడు. జననమరణములు పాంచభౌతికమగు శరీరమునకుఁ గాని జీవునకు లేవు.

> న జాయతే మ్రియతే వా కదాచి
> న్నాయం భూత్వా భవితావానభూయః ।

అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ (గీత)

తా. ఈయాత్మ ఒకప్పుడైనను బుట్టుటగాని చచ్చుటగాని లేదు. ఇంతకుముందు లేకయుండు స్థితిగాని ఇఁకమీఁద లేక పోవునట్టి కాలముగాని లేదు. పుట్టుకలేనివాఁడును, నిత్యుఁడును, నిర్వికారుఁడును, సనాతనుఁడును నగును. శరీరము నశించుచుండినను నశించువాఁడుకాఁడు.

జననమరణములు, వృద్ధిక్షయములు, లేనిజీవుఁడు పాంచ భౌతికమగు శరీరములం బొంది మనస్సు చేతను, ఇంద్రియములచేతను నానా లోకములయందు సుఖదుఃఖరూపమగు ననుభవముల నొంది తత్సారమును గ్రహించుచున్నవాఁడు. ఈ జీవుని స్వరూపము నించుక విచారింతము.

జీవుని స్వరూప మీరీతిని వేదాంతపంచదశి యనుగ్రంథమున విద్యారణ్యస్వాములవారు వర్ణించియున్నవారు.

చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చ యః పునః ।
చిచ్ఛాయా లింగదేహస్థా తత్సంఘో జీవ ఉచ్యతే ॥ ౨-౧౧

కూటస్థచైతన్యమును, లింగదేహమును, లింగదేహమందలి చిచ్ఛాయయు నీమూఁడును గూడి జీవుఁడనఁబడును. జీవుఁ డీశ్వరాంశ మగుటం బట్టి సచ్చిదానందస్వరూపుఁడగు. ఆకాశతత్త్వమునుండి యొక భూతసూక్ష్మమును గ్రహించి కేవలావిద్యోపాధి గలిగి యానంద ప్రతిబింబమును జైతన్యస్వరూపము గలవాఁడును నగు. దీనికి దివ్యజ్ఞానసమాజము

వార లాత్మయని పేరిడిరి. అంతట వాయుతత్త్వమునుండి యొక భూతసూక్ష్మమును గ్రహించి చిత్స్వరూపమగు చిచ్ఛాయ యగును. దీనినే దివ్యజ్ఞానసమాజమువార లాత్మోపాధిక బుద్ధి యని చెప్పుదురు. తరువాతఁ దేజస్తత్త్వమునుండి యొకభూత సూక్ష్మమును (అణువును) గ్రహించి సద్రూప మగు లింగశరీర మనఁగా మిగిలియుండు శరీరములకు బీజరూపమైన దానిని నిర్మించును. దీని సమాజమువారు మనస్సని చెప్పుచున్నారు. కనుక వారు జీవుని "నాత్మబుద్ధిమనస్స"ని పిలుచుచున్నారు.

ఈరీతిని జీవుఁడు తక్కిన లోకములం దొక్కొక్క భూత సూక్ష్మమును గ్రహించి యాయాలోకములందుఁ దనకు శరీర ముల నిర్మించుకొనును.[1] ఇట్లు భూలోకమునఁ బృథ్వీతత్త్వము లోని స్థూలభాగముతోఁ జేయఁబడిన స్థూలశరీరమును ధరించు చున్నాఁడు. ఈశరీర మన్నమయకోశ మని పిలువంబడుచున్న యది. దీనియందుఁ గర్మేంద్రియ జ్ఞానేంద్రియములకు స్థాన ములగు గోళములున్నయవి. జీవుఁడు వీనిచే జాగ్రదవస్థయందు స్థూల ప్రపంచమున వ్యవహరించుచుండును. స్థూలశరీరము యొక్క పోలికకలిగిన ప్రాణమయకోశము పృథివీతత్త్వము నందలి సూక్ష్మభాగముతో నిర్మింపఁబడియుండును. దీని యందుఁ బ్రాణములు ప్రసరించుచునుండును. ఈకోశము స్థూల శరీరములో నంతటను వ్యాపించి వెలుపల సహితము కొంత

[1] ఈవిషయము తొమ్మిదవ యధ్యాయమున. విస్తరించి వ్రాయఁబడి యున్నది.

దూరము వ్యాపించియుండును. ఇది యెల్లరకు దృగ్గోచరము కాకున్నను యోగదృష్టిచేఁ జూచువారలకు గోచరమగును. ఇది సూక్ష్మశరీరమునం దొకభాగమని చెప్పనగు. జీవుఁడు భువర్లోకమున నప్తత్త్వముతోఁ జేయఁబడిన శరీరమును దాల్చును. దీనియందుఁ గర్మేంద్రియజ్ఞానేంద్రియములుండును. ఇదియు రాగద్వేషములకును, సర్వకామములకు నునికిపట్టు. ఈశరీరము యోగదృష్టిని జూడ నన్నమయ ప్రాణమయ కోశములం దంతట నిండి యారెండింటికి బాహ్యమునఁ గొంత దూరమువఱకు వ్యాపించియున్నట్లగపడును. వివిధములగు విషయేచ్ఛలు, కామక్రోధములు, లోభమోహములు లోనగునవి మనస్సున నంకురింపఁ దత్సదృశముగ నీశరీరము వివిధవర్ణములుగ మాఱుచుండును. కామక్రోధాదులులేని మహాత్మునియందుఁగాని శిశువునందుఁగాని యీశరీరమున నిట్లు మాఱుచుండు వర్ణములు కనఁబడవు. ఇదియు సూక్ష్మశరీరమునం దొకభాగముగ నెన్నఁదగు. దీనిని గామమయ శరీరమని చెప్పనగు. మఱియు సువర్లోకమునఁ దేజస్తత్త్వ సంబంధమగు ప్రకృతితో నిర్మింపఁబడి యాలోకమున జీవుఁడు వర్తించుటకుపాధి యగు శరీరము నొందు. ఈశరీరమున జీవుని మనోవృత్తులన్నియు నిమిడియుండును. వివిధములగు సంకల్పములు మనస్సున నుత్పత్తి యగునపుడు ఈశరీరమునందును దత్సదృశముగ వర్ణము మాఱుచుండును. అనఁగా మనస్సునందు దుర్వృత్తులు పొడమ నీశరీరము బొగ్గుమొదలగు

పదార్థములవంటి యసహ్యాకరములగు వర్ణములు కలదియగు. అట్లుగాక నిష్కామప్రేమ మభివృద్ధికాఁగా నాశరీరమున మనోహరమగు రోజాపువ్వు (గులాబి) వర్ణము కనఁబడును. ఇట్లే భక్తికలిగినచో నత్యద్భుతమగు నీలవర్ణము కనఁబడును. ఇట్లు వివిధములగు వృత్తులు నానావిధవర్ణములుగ యోగ దృష్టికిఁ జూపట్టును. ఇదియును బైఁబేర్కొనిన యస్తత్త్వము తోఁ జేయఁబడిన శరీరమును సామాన్యముగ నొక్కటిగ వర్తించుచు మనోమయకోశ మనుపేర నొప్పుచుండును. ఈ శరీరముయొక్క వృత్తులు మనోవృత్తు లని యెఱుంగఁదగు. ఈశరీరము ముందుదహరింపఁబడియున్న కోశముల నన్నింటిని వ్యాపించి బయటఁ గూడఁ గొంతదూరము వ్యాపించియుం డును. ఈకోశములన్నియు జన్మజన్మమునకు మాఱుచుండునవి. మఱియు నా తేజస్తత్త్వసూక్ష్మభాగములతో నిర్మితమై జీవు నకు ముక్తిపర్యంతము విడువని యుపాధియై పైనుదహరింపఁ బడిన శరీరముల కన్నింటికంటె సూక్ష్మతరమై యుండు శరీర మును జీవుఁడు మహర్లోకమునఁ దాల్చును. ఇదియ వేదాంత శాస్త్రమున విజ్ఞానమయకోశమనఁ బరఁగు. ఈకోశము జీవుని శుభాశుభవాసనల కన్నింటి కునికిపట్టవు. జీవుని వాసన లన్నియు నిందు బీజరూపముగ నుండుటచే నిది యనేక జన్మ ములకు మూలమై యున్నది. మఱియు సూక్ష్మసూక్ష్మతర ములగు మనోవృత్తుల కన్నింటి కిది యుత్పత్తిస్థానము. ఇం దుత్పత్తియగు మనోవృత్తులన్నియుఁ దఱుచుగఁ గామవివర్జిత

ములై యుండు. ఇయ్యది శుద్ధమనస్సున కుపాధి యని చెప్పనొప్పు. ఇదియును గూడఁ బైవక్కాణించిన శరీరముల నన్నింటిని వ్యాపించి వానివెలుపలను సహితము వెలయు చుండు. ఇది యోగదృష్టికి నత్యద్భుత తేజోమయముగఁ గన్పడును. మహర్లోకమునకంటె నూర్ధ్వములైన మూఁడు లోకములయం దానందమయకోశ ముండఁ దగు. ఆదియం దిది కేవల అణుమాత్రముగ నుండి జీవునకు భక్తిజ్ఞానవైరాగ్యము లతిశయింప నతిశయింప మిక్కిలి తేజోవంతమయి దివ్యస్వరూపమున వెలుఁగుచుండును. ఈవిషయము రాఁబోవు నధ్యాయమున విస్తరించి వ్రాయఁబడు.

జీవునకుఁ బైఁ జేర్కొనఁబడిన శరీరము లన్నియు నుపాధులుగనుండ స్థూలశరీరమగు నన్నమయకోశముమాత్రము సామాన్యజనులకు దృగ్గోచరమగును. తక్కుంగల శరీరము లన్నియు యోగదృష్టికి మాత్రమే గోచరములగు. యోగదృష్టిచే నాలోకింపఁబడినపుడు స్థూలశరీరమన్నింటికంటె స్థూలముగను, జిన్నదిగనుఁ గన్పడుచున్నది. తక్కిన యుపాధు లన్నియు స్థూలశరీరమున వ్యాపించి దానిం జుట్టుకొనియుం, డును. ఇవి యొకదానికంటె నొకటి సూక్ష్మమై యొకదానికంటె నొకటి తేజోవంతమై కన్పడుచుండు. కావున స్థూలశరీరమునకు వెలుపలనుండి యోగదృష్టికిమాత్రము కనఁబడు భాగము తేజస్సని పిలువఁబడుచున్నయది.

## అయిదవయధ్యాయము

### తేజస్సు.

తేజస్సన వెలుఁగు. స్థూలపదార్థములకు వ్యతిరేకమయ్యు దానిని జేరి ప్రకాశించుచుండు వెలుఁగు తేజస్సు.[1] మనుష్యునందువలెఁ బ్రపంచమునందున్న ప్రతివస్తువు చుట్టును దదనుగుణమగు తేజస్సు అండమువలె నుండునని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. దీపముగల గాజుకుప్పె చుట్టును గొంతదూరమువఱకు దీపకాంతి ప్రసరించుచుండును గదా! ఆగాజుకుప్పె పోవుచోటులందెల్లను వెలుఁగుసహితము పోవుచుండునుగదా! అట్లు ప్రతివస్తువు (అనఁగా పాషాణములు, వృక్షములు, జంతువులు, మనుష్యులు, ఋషులు, దేవతలు) చుట్టును నానావస్తువులకుఁ దగిన తేజస్సు వెలయుచుండును. ఇయ్యది దివ్యదృష్టిగలవారికిమాత్ర మగపడును. జాత్యంధుఁడు సూర్యరశ్మిని దెలిసికొనఁజాలక సూర్యరశ్మియే లేదని వాదించినను దృష్టిపాటవము గలవారి కది కనఁబడుచున్నయట్లు తేజస్సును మన చర్మచక్షుస్సులచేఁ జూడఁజాలక మనమది లేదనుకొని

[1] తేజః=అనఁగా త్వగింద్రియవ్యతిరేకేణ ప్రకాశవిశిష్టాయాత్వక్ —శంకరభాష్యము.

నను దివ్యదృష్టిగలవారికి గోచరమై యది స్థిరముగ నిరూపింపఁబడుచున్నది. ఆ తేజస్స్వరూపమును బట్టి వస్తుగుణములను దెలియఁదగు. యోగమహిమచే నొప్పు మహనీయులు సామాన్యజనులను జూచినంతనె వారి గుణముల గ్రహించుచుండుట గ్రంథములందు సూచింపఁబడి యుండుటఁ గానమా? మనుష్యులయందువలె నితరవస్తువులయందు సైతము నానా విధములుగ దేజస్సు కనఁబడుచుండును. కొన్నింటియందు దుర్గుణములను సూచించు హేయ మగు తేజస్సును, మఱి కొన్నిఁటియందు సామాన్యమగు తేజస్సును, ఇంకను గొన్నిటి యం దుత్తమమును బరిశుద్ధము నగు దివ్య తేజస్సు నున్నట్లు యోగులు చెప్పుచున్నారు. ఈకారణమునుబట్టి ధర్మశాస్త్రములయందుఁ గొన్నికొన్ని పదార్థములు పరిశుద్ధము లనియును, పూజార్హము లనియును, భోజనార్హము లనియును, ధారణార్హములనియును నిర్దేశింపఁబడియున్నయవి. తులసియు, దానిపూసలును విష్ణు ప్రీతికరములనియును, విష్ణు భక్తులు వాని నుపయోగించినఁ బరిశుద్ధులగుదు రనియును; అట్లు బిల్వము, రుద్రాక్షలు శివప్రీతికరములగుటచే శివభక్తులకు ధారణార్హము లనియును నిర్దేశింపఁబడియున్నదికదా! మఱియు భోజనపదార్థములయందుఁ గూడఁ గొన్ని పరిశుద్ధ తేజోవంతము లగుటచేఁ సాత్వికము లనఁదగి జ్ఞానవైరాగ్య ప్రదము లనియును, మఱికొన్ని మలిన తేజోవంతము లగుట వలన రాజసము [illegible] కామ

క్రోధాదులను, నిద్రాలస్య ప్రమాదాదులను వృద్ధిచేయు నని యును నిరూపింపఁబడియున్నయవి. ధర్మశాస్త్ర కర్తలు యోగదృష్టిచే నొప్పు మహాత్ము లగుటంబట్టి యాయా పదార్థ ములయందున్న తేజోవిశేషములఁ బరిశీలించి సాత్విక రాజస తామసాహారములఁ జక్కఁగ విభజించి నిర్ణయించి యున్న వారు. ఆధునికులలోఁగొంద ఱప్పదార్థముల యందున్న రాగముచేతను, అట్టి దృష్టి లేనివారగుటచేతను, ఈ భేదము లసంగతములని యార్షోక్తులను నిరాకరించుచున్నవారు. కాని యవి పరిపూర్ణజ్ఞానముచేఁ జెప్పఁమాటలు కావు. కాఁబట్టి ధర్మశాస్త్రములననుసరించి భోజనార్హములగు సాత్త్విక పదా ర్థములను మాత్రము గ్రహించుచు, నిషిద్ధపదార్థములం ద్య జించుచుండిన మనుష్యుఁడు దన తేజస్సును బరిశుద్ధముగఁ జేసి కొని బాగుపడును. అట్లు గాక రాజసతామసాహారములఁ గొనినయెడల శరీర మపరిశుద్ధమై మలిన తేజస్సు గలిగి సత్ప్ర వర్తనమునకును, భక్తిజ్ఞానవైరాగ్యాద్యభ్యాసమునకును బ్రతి బంధకమగును.

మనుష్యునకును ఇట్టి తేజస్సుగలదు. జీవుని సూక్ష్మశరీర ములన్నియు స్థూలశరీరమునం దంతటవ్యాపించి యాశరీరము వెలుపల సహితము కొంతదూర మావరించియుండు ననియు నాభాగము తేజస్సని వ్యవహరింపఁబడుననియు ముందే చెప్పఁ బడెను. మఱియు నాశరీరములు మనోవృత్తుల ననుసరించి భిన్న భిన్న వర్ణములు గలవిగ మాఱుచుండు ననియును జెప్పఁ

బడియె కాదే! గాజుకుప్పె (లాందరు)లో తెల్ల పగలువత్తిని వెలిఁగించినచో నావెలుఁగు దానిచుట్టు కొంతదూరము వఱకు వ్యాపించి యాగాజుకుప్పెవెంటఁ బోవుచుండును. అటుల వివిధవర్ణములుగల వెలుఁగుల నిచ్చు పగలువత్తుల నొకదాని వెనుక వేఱొకదాని నాగాజుకుప్పెయందు వెలిఁగింప దాని వెలుఁగుసహితము దాని ననుసరించి మాఱుచుండును గదా! మనుష్యునిశరీరము గాజుకుప్పెగను, మనస్సు వెలుఁగుచుండు పగలు వత్తిగను భావింపుఁడు. మనోవృత్తులు మాఱినట్లెల్ల మనోమయకోశముయొక్క వర్ణము మాఱుచుండునని ముందే సూచింపఁబడియె. మనస్సు మాఱినటుల శరీరము చుట్టునుండు తేజస్సు మాఱుచుండును. మనస్సునఁ గోపము్రదేకమైనయెడలఁ జుట్టునున్న తేజస్సు రక్తవర్ణముగను, కామో్రదేక మగుచో నది దాసానిపూవు రంగువలె (జపాకుసుమతుల్యముగ) మాఱును. కేవల స్వ్రప్రయోజన పరత్వము గలిగినచో నా తేజస్సు పండుపోఁకరంగుగ మాఱును. ఎక్కుడగుబుద్ధిప్రసారము గలుగుచో నది సువర్ణ వర్ణముగలది యగు. పరోపకారబుద్ధి గలిగి భక్తిజ్ఞానము లభివృద్ధియై, సదా ధ్యానపరుఁడై యుండు రాజయోగి తేజస్సు స్ఫటికముఁబోలి నిర్మలమై సూర్యకాంతి ననుకరించుచుండును.

సామాన్యజనులయం దీతేజస్సు శరీరముచుట్టు నించుమించుగ రెండడుగులు వ్యాపించియుండును. పరిపూర్ణుఁడగు రాజయోగులలో కొందరి తేజస్సు రెండుమూఁడుమైళ్లువఱకు వ్యా

పించి యుండునని యనుభవజ్ఞులు వచించుచున్నారు. సాధారణముగ మానవు లొకనినొకరు కలిసినపుడు వారిశరీరములఁ నావరించియుండు తేజస్సు లొకదానితో నొకటి కలియును. అట్లు కలియుటవలన వారలగుణము లొండొరుల కాపాదించును. కోపియగువాఁడు శాంతుని సమీపించిన యెడల వారిద్దరి సూక్ష్మశరీరముల సంస్పర్శముచే నతని క్రోధగుణ మించుక శాంతముగ మాఱదగు. లేక శాంతుని శాంతగుణ మొక్కించుక కోపముగ మాఱినను మాఱనగు. ఈయుభయులగుణములలో నెవ్వారి గుణము దృఢతరముగ నుండునో వారిగుణములు ఎదుటివారిగుణముల నెక్కుడుగ మార్పఁజాలి యుండును. రక్తవర్ణము గల జలము స్వచ్ఛజలమును గలియుటచే స్వచ్ఛజ్వాలమునందుఁ గొంచె మెఱుపు రంగును, రక్తవర్ణజలమునందు రక్తవర్ణము తగ్గుటయును గలుగునుగదా! అందు రక్తవర్ణమగు జల మెక్కుడుగనుండినచోఁ దుదకు రక్తవర్ణమే ప్రధానమగు. లేక స్వచ్ఛమగు జలమధికముగ నున్నచో దానిగుణము ప్రధానముగ నుండును. అటులే మానవు లిరువురు కలియునపుడు దృఢతరగుణము లెవరియందుండునో వారిగుణము లితరుని గుణములను మార్పఁజాలి యుండును. కావుననే సత్పురుష సాంగత్యమువలన సద్గుణము లభివృద్ధియగును. దుష్టుల సాన్నిధ్యముచే వారిగుణము లితరులకు సహిత మలవడును. తపస్సంపన్నులును, పరోపకార పారీణులును, పరమదయాళురును, శాంతస్వరూ

వులును నగు మహాత్ముల యాశ్రమములందు నైజవిరోధులగు జంతువు లన్యోన్య మిత్రములయి వర్తించుచుండుట గ్రంథ ములయందుఁ జదివియున్నాముకదా! ఇందుకుఁ గారణ మా మహాత్ముల శాంతమగు తేజోమహిమయే యని తెల్లమగు చున్నది. ఆమహాత్ముల శాంతగుణము వారిచుట్టును వ్యాపించి యాప్రదేశముల సంచరించు భూతకోటుల నన్నింటిని శాంత స్వభావములు గలవానినిగాఁ జేయ జంతువులు గూడ సహజ వైషమ్యములను మఱచి యన్యోన్య మిత్రభావములతోఁ గలసి మెలసియుండును.

ఈవిషయము మానవు లెల్లరును జక్కఁగఁ దెలిసికొనఁ దగినది. ఎవ్వరైనను మనోవాక్కాయముల దుర్వృత్తి గల వారైనయెడల వారి తేజస్సు మలినమై వారి సాంగత్యముచేయు వారికిని, వారిచ్చు నన్నపానాదుల గ్రహించువారికిని, వారు చేయు దానములఁ బ్రతిగ్రహించువారికిని, మఱియు వారిసం తతివారికిని నాదుష్టతేజస్సు వ్యాపించుటచే వారెల్లరు దుష్ట బుద్ధులై చెడిపోదురు. ఇట్లొకఁడు చెడుటచే ననేకులు చెడిపోవు టయేగాక, ఆదుష్టతేజస్సు క్రమక్రమమునఁ బ్రబలి గ్రా మమంతయు, మఱియు ననేకగ్రామములకును వ్యాపించును. ఇట్లనేకులు చేయు పాపకృత్యముల వలని దోషము మొదటి వానికిం గొంతవఱకు నాపాదించును. అట్లే యొకానొక గృహ మునందుఁ బరమ పతివ్రత యగు నారీమణియు, ఏకపత్నీ వ్రతుఁడును, దయాళువు నగు పురుషుఁడును నివసించు చుం

డినచో వారి పరిశుద్ధ తేజస్సు సమీపమున నున్నవా రందఱి యందు వ్యాపించి యందఱకు సద్బుద్ధిని బుట్టించి యనేకులకు మేలుచేయును. అట్లందఱిని సత్స్వభావము గలవారినిగఁ జేసిన పుణ్యఫల మా స్త్రీపురుషులం జెందు. కావున నెల్ల వారును సర్వకాలసర్వావస్థలయందుఁ బరిశుద్ధమనస్కులై, సర్వభూతహితకాములై కరుణాపారావారులై భక్తిజ్ఞాన వైరాగ్యముల నభ్యసించు చుండవలయును. అట్లుండువారు తమకుఁ దెలియకపోయినను లోకమునకు మహోపకార మొనరించుచుండువారే. తాము సంసారసాగరమును దాఁటుటయేగాక సన్నిధిమాత్రమున నితరులను సహితము మంచి వారినిగాఁ జేయుచుందురు. అట్లుగా కెవ్వఁడేని దుర్వృత్తి యం దుండువాఁడు తాఁ జెడుటయేగాక తన సహవాసముచే లోకమునకు మహాపకారియగును. ఎల్లవారు నీవిషయమును జక్కఁగఁ దెలిసికొని సదా దుర్వృత్తిని వదలి సద్వృత్తి నభ్యసింపవలయును.

ఎవ్వఁడేనియు భోజనకాలమున నీశ్వరధ్యానము సేయుచు భుజించినయెడల నాయన్నము శరీరదార్ఢ్యమును వృద్ధిచేయుట మాత్రముగాక దివ్యతేజస్సు కలదగుటవలన మనోబుద్ధులఁ బరిశుద్ధములఁ జేసి జ్ఞానవైరాగ్యములను సహితము వృద్ధి చేయఁ దగియుండును.

> అన్నం బ్రహ్మ రసో విష్ణు ర్భోక్తా దేవో మహేశ్వరః ।
> ఏవం ధ్యాత్వా ద్విజో భుంజన్నన్నదోషైర్నలిప్యతే ॥

అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

తా. అన్నము బ్రహ్మస్వరూపము. రసము విష్ణుస్వరూపము. భోక్త మహేశ్వరుఁడు. ఈరీతిఁ దలంచుచు భుజించు ద్విజుఁ డన్నదోషములచే నంటఁబడఁడు.

ఓయర్జునా! నే నగ్ని స్వరూపుఁడనై దేహుల దేహములను బొంది ప్రాణాపాన వాయువులం గలిసి నాల్గువిధములగు నన్నమును బచనము చేయుచున్నాను.

కావుననే భక్తులు భోజనకాలమునందు జ్ఞానవైరాగ్య సిద్ధికై యీశ్వరధ్యానమును జేయుచునుందురు.

అన్నపూర్ణే సదాపూర్ణే శంకర ప్రాణవల్లభే ।
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం మే దేహి పార్వతి ॥

అని ధ్యాన మొనరించుచు భుజించుచుందురు. అటుల పాకము చేయువారును, వడ్డించువారును బరిశుద్ధ సంకల్పులై యీశ్వరుని దలంచుచునే పనిచేయవలయును. అట్లు చేయక దుస్సంకల్పములు గలవారైనయెడల వారి మలిన తేజస్సు అన్నమునందు వ్యాపించి భుజించువారిని సహితము మాలిన్యము గలవారినిగాఁ జేయును.

మఱియు భక్తుఁడు సర్వకాలములయందుఁ బరోపకార పరుఁడై యుండవలయు ననుట సర్వశాస్త్రసమ్మతమగువిషయముకదా! ఇట్టు పరులకు మేలుచేయుటకై దుష్టులసాన్నిధ్య

మునకుఁగాని, ప్రాకృతజన సంఘములోనికిఁ గాని భక్తుఁడు పోవలసి యున్నపుడు నిలుకడతోఁ గొలఁదికాల మీశ్వరుని ధ్యానించి, సర్వభూతహితకాముడై తనమనస్సు ప్రేమతో నించి, ప్రేమస్వరూపుడై జనసంఘములో బ్రవేశించ నగు. అట్లు దృఢముగ సంకల్పించి భగవంతుని వేఁడినచో నతని తేజస్సులో నొకభాగము రక్షకమగు కవచముగ మాటి యతనిని రక్షించును. ఇట్లే నిద్రించుటకు ముందు సహితము ఇతరుల దుస్సంకల్పములు లోనగునవి నిద్రించు వాని నంటక యుండునటు లీశ్వరుని ధ్యానించి లోకహితమును మనస్సున దృఢముగ సంకల్పించి పరుండవలయును.

సాధారణముగ మలినతేజస్సు గల మానవులు తత్తుల్యమగు మలినతేజస్సు గల యితరులను దమయొద్ద కాకర్షించు కొందురు. ఒక్కనిసంకల్పము లితరులను సైతము పొందును. అట్లొకఁడు కోపిగనుండినచోఁ గోపు లగు నితరుల కోప సంకల్పముల నాకర్షించుకొని దానిచేఁ దనకోపమును వృద్ధిచేసి కొనును. ఇంతియగాక పూర్వము క్రోధాత్ములయి యుండి మృతినొంది పిశాచరూపులుగ సూక్ష్మలోకముల సంచరించు చుండు జీవులను సహితము తనయొద్ద కాకర్షించుకొని వార లచేఁ బ్రేరితుఁడై యనివార్యక్రోధమునకు లోఁబడి యనేక పాపకార్యములను జేయును.[1] ఇట్లితరుల దుర్గుణములను, తత్స

[1] అరణ్యపర్వములో ఘోషయాత్రలో దుర్యోధనుఁడు ప్రాయోపవేశమున నుండ నపుడు భూతములు బోధించిరనుకథ ప్రమాణము.

దృశేములగు నితరుల సంకల్పములను, తత్సమానులును విదేహులును నగు నితరదుష్టులనుగూడ నాకర్షించుకొని క్రమక్రమమున వృద్ధినొందు చుండును. అట్లుగాక లోకమునందెల్లవారును భక్తులును, జ్ఞానులును, విరాగులును, ధర్మాత్ములును గావలయునని సదా యీశ్వరుని ధ్యానించుచు సద్ధర్మములను భక్తి జ్ఞాన వైరాగ్యములను అభ్యసించుచు, సర్వభూతహితమును, జేయుచుండు పురుషుఁడు తన తేజస్సు నపారముగఁ బరిశుద్ధముగఁ జేసికొనును. ఆ తేజస్సు ఇతర యోగులయొక్కయు, ఋషులయొక్కయు దివ్య తేజస్సుల నాకర్షించును. అట్టియోగి సాన్నిధ్యమునకు సూక్ష్మశరీర ధారులగు ఋషులును, మఱియు దేవతలును వచ్చి యోగిమనంబునం బ్రవేశించి యందలిమాలిన్యమును దుదముట్ట నశింపఁజేసి పోవుదురు. ఇట్లభ్యాసముచేయు యోగుల తేజస్సు దినదినాభివృద్ధి గలిగి తుదను బ్రహ్మకోశములవఱకును వ్యాపించును. మహాత్ముల తేజ స్సెంతదూరము వ్యాపించి యుండునో ఆదేశమంతయు నా తేజోమహిమచే నిండియుండుటవలన నామహాత్ముని యాశ్రమ మని చెప్పఁదగు.

> నిగృహీతేంద్రియగ్రామో యత్రయత్ర వసేన్నరః ।
> తత్ర తత్ర కురుక్షేత్రం నైమిశం పుష్కరాణి చ ॥

ఇంద్రియసముదాయమును జయించిన నరుఁడే యే స్థలముల నివసించునో అందందుఁ గురుక్షేత్రము, నైమిశారణ్యము, పుష్కరము ఉండును. అనఁగా నాక్షేత్రము, కురు

క్షేత్ర నైమిశారణ్య పుష్కరములతో సమాన మని తాత్పర్యము.

ఎవ్వరేనియు నా యాశ్రమమునం బ్రవేశింప నా తేజోరాశి వారలం బరిశుద్ధులంజేసి వారలను భక్తులుగఁ జేయఁగలుగు. ఇప్పుడును గంగ మొదలగు మహానదులయందును, ననేక పుణ్య క్షేత్రములయందును, అనాది దేవాలయములయందును ఋషుల దివ్య తేజస్సు వ్యాపించియే యున్నయది. ఆయాస్థలములయందు మహాత్ములగు మునులు బహుకాలము తపస్సు చేసి పామరజనులను జిరకాల ముద్ధరించుటకొఱకుఁ దమ శక్తిని మహిమను ఆయా తీర్థక్షేత్రములయందు స్థాపించి యున్నవారు. ఈకారణముల వలనను, మఱియు నాగమోక్త విధులననుసరించి ప్రతిష్ఠింపఁబడియుండుటవలనను దేవాలయములు దివ్య తేజస్సుతో నిండియున్నవి. మఱియును గాశి మొదలగు దివ్యక్షేత్రములకును గొప్ప దేవాలయములకును ఋషు లదృశ్యరూపముల నేతెంచి యాక్షేత్రముల మహిమ క్షీణింపకయుండ దమ తపశ్శక్తిచేఁ గాపాడుచుందురు.

కావున నెల్లవారు నమ్మహనీయుల మార్గము ననుసరించి పరిశుద్ధులై యితరుల పారిశుద్ధ్యము కొఱకు ధ్యానించుచు లోకమునందలి పరిశుద్ధ తేజస్సును నభివృద్ధిచేయుటకు సదా ప్రయత్న మొనరింతురు గాక.

# ఆఱవయధ్యాయము

## జీవునిశరీరములు

బ్రహ్మాండమున ననేకలోకము లున్నవనియు, జీవుఁడా యాలోకములందు వ్యవహరించుటకుఁ దగిన యుపాధు లా యా లోకసంబంధమగు ప్రకృతితోఁ జేయఁబడు ననియు ముందు సూచింపఁబడియె. ఆయా లోకసంబంధమగు ప్రకృతితోఁ జేయఁబడిన యుపాధి, అనఁగా, శరీరము, ఒకటి లేనిచో నాలోకానుభవము జీవునకుఁ గలుగనేరదు, కనుక, నాలోకసంబంధమగు జ్ఞానము దొరకదు. బ్రహ్మాండమునందలి లోకము లన్నింటియందును సాధ్యమగు జ్ఞానము నంతయు సంపాదించుకొనుటకే గదా జీవుఁడు పంచభూతాత్మకమగు నీ ప్రపంచమునం బ్రవేశించి యున్నవాఁడు. దృష్టాంతముగ నీ భూలోకమును జూతము. పృథ్వీతత్త్వముచేఁ జేయఁబడిన స్థూలశరీరము జీవునకు లేకపోయినచో నీప్రపంచజ్ఞాన మేలాగు గలుగును? శరీరమున కన్నొకటి లేనిచో రూపజ్ఞానము లేదు గదా! అనఁగా నానావిధము లగు వర్ణములు, నానావిధములగు కాంతులు, నానావిధములగు రూపములు ఆజీవునికగోచరములుగదా! అట్లే శ్రోత్రేంద్రియము లేనిచో శబ్ద

జ్ఞానము సున్న యేగదా! ఈలాగున నీయొక్కొక్క యింద్రి యములేనిచో నొక్కొక్కవిధమగు జ్ఞాన మసాధ్యమగుట వలన స్థూలోపాధిలేని జీవున కీలోకజ్ఞానమే లేకపోవును. జీవున కిట్టి జ్ఞానమును సంపాదించుకొనవలయు నను నిచ్ఛ గలిగి గదా తత్సాధనము లగు నీయుపాధులును దేవతల సహాయముచే నిర్మించుకొనెను. ఆత్మశక్తులు క్రమక్రమమున నభివ్యక్తములు కాఁగా ఆత్మ చూడఁదలచినచో నుపాధి యందు గన్ను లుత్పత్తియాయెను. ఆఘ్రాణించు కోరికగలుగ నాసిక ముత్పత్తియాయెను. అటులనే ఆత్మకోరిన కోరికలచే వాని కుపయోగకరములగు కరణముల శరీరమునందుఁ బుట్టించుకొనెను. కరణములద్వారా జ్ఞానమును బొందునది యాత్మయే.

మఘవన్మర్త్యం వా ఇదగ్ శరీరమాత్తం మృత్యునా తదస్య
అమృతస్య అశరీరస్య ఆత్మనోఽధిష్ఠాన మాత్తో వై సశరీరః ।
అథ యో వేదేదం మన్వానీతి స ఆత్మా మనో అస్య దైవం చక్షుః
సవా ఏష ఏతేన దైవేన చక్షుసా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే ॥
(ఛాందోగ్యోపనిషత్తు)

తా. ఈశరీరము నశ్యమగునది. మృత్యువుచే భక్షింపఁ బడును. అనఁగా మృత్యువునకు లోఁబడినది. అయినను అమృతస్వరూపుఁడు, నశరీరుఁడు నగు నాత్మ కధిష్ఠానముగ నున్నది.

ఏతత్త్వము-ఎవరు—దీనిం దెలిసికొనియెదనని తలఁచునో ఆతత్త్వమే ఆత్మ. మనస్సు, ఇంద్రియములు నను కరణ

ముల ద్వారా యీకామముల ననుభవించి యానందించు వాఁడు.

ఇట్లు శరీరము లన్నియు జ్ఞానసాధనములు కావున నీ శరీర ముల విషయము విశదముగ విచారింపఁ దగినది.

## స్థూలశరీరము, అన్నమయకోశము

జీవునకుం గల శరీరములు మూఁడు. స్థూలశరీరము, సూక్ష్మ శరీరము, కారణశరీరము. వీనికే పంచకోశములనియు సంజ్ఞ కలదు. స్థూలశరీరమన నన్నమయకోశము. సూక్ష్మశరీర మందుఁ బ్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు నున్నయవి. కారణశరీర మానందమయకోశము. అన్నమయ ప్రాణమయకోశములు రెండును భూలోకసంబంధమగు పృథివీ తత్త్వప్రకృతివికారములు. ఒక్కొక్కమహాభూత వికారము నందును స్థూల సూక్ష్మతారతమ్యములుగల యేడు భాగము లున్నయవి. అందులో పృథివీతత్త్వాంతర్భాగములగు పృథి వ్యప్తేజోభాగములచే నిర్మింపఁబడినది అన్నమయకోశము. మిగత నాలుగు సూక్ష్మభాగములతో నిర్మింపఁబడినది ప్రాణ మయ కోశము.

శరీరములన్నింటిలోను చిన్నదియై స్థూలమై, యల్పకాలిక మైనది స్థూలశరీరము. ఇందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియగోళ ములు (అనఁగా నవయవములు)న్నయవి. వీనిమూలమున నింద్రియమనస్సుల ద్వారా జీవునకు భూలోకజ్ఞానము కలు

గును. ఇది యన్ని శరీరములలో చిన్నదియైనను ధర్మసాధన ములలో మొదటిదియును ముఖ్యమైనదియు నగును. పనిచేయు వాని కొలిముట్లువలె మనశరీరము పరిశుద్ధముగను, సూక్ష్మ గ్రాహిగను నుండవలయునుగదా! త్రుప్పుపట్టి పదనులేని కొలిముట్లులతో పనివాఁ డెంత నిపుణుఁ డైనను ఏమియుఁ జేయఁజాలఁడు గదా!

మొట్టమొదట శరీర మారోగ్యము గలిగి దృఢమైనదిగ నుండవలయును. ఇందుకు శరీర పారిశుద్ధ్యము, పరిశుద్ధము లగు నన్నపానాదులు, వ్యాయామమును, మంచిగాలియు నత్యా వశ్యకములు. దినదినము స్నానము చేయకుండినచో రోమ కూపములన్నియు మురికిచే నిండి లోపలి మురికి బయట రా వీలులేకుండుటచేఁ బలువిధములగు రోగములకుఁ గారణ మగును. కావున నన్నిమతములయందును దినదిన మొక పర్యాయ మైనను స్నానముచేయుట విధింపఁబడియున్నది. మనగృహములను గృహసమీప ప్రదేశములను బరిశుద్ధముగ నుంచుకొనవలయును. లేనియెడల గాలిచెడి యనారోగ్యకర మగును. నిర్మలోదకమును ద్రాగవలయు. మద్యమును వర్జింప వలయును. ఆహారములందు తామసాహారము బొత్తుగ వర్జింప వలయును. చెడినపదార్థములు, పర్యుషితము లనఁగా చల్ది పదార్థములు, సారముపోయిన పదార్థములు, మాంసములు, నల్లమందు మొదలగు మత్తుపదార్థములు, ఉల్లి మొదలగు వస్తువులు విడువఁదగినవి. ఇట్టి పదార్థములను సేవించినచో

శరీరము దృఢముగఁ గనఁబడినను సూక్ష్మములగు విషయ ములఁ గ్రహింపఁజాలనశక్తమై యుండును. రాజసాహారములు విడువఁదగినవియే. సత్పురుషుల సాంగత్యముచేతను, బుణ్యస్థల పుణ్యతీర్థ సేవలచేతను, దేహము పరిశుద్ధమగును. శరీర మును జాగరూకతతోఁ బెంచినచో నది ధర్మాచరణమునకు శ్రేష్ఠమగు సాధనమగు.

మనకుఁ బుట్టుకతో వచ్చిన శరీరము మార్ప సాధ్యము గాదని తలచరాదు. శరీరము ప్రతి నిమిషమును మాఱుచునే యున్నయది. దానియందలి యణువు లెల్లప్పుడును బహిర్గత ములగుచునేయున్నవి. అట్లే ప్రతినిమిషమునను, ఉచ్ఛ్వాస నిశ్వాసముల చేతను, అన్నపానాదుల చేతను నూతనముగ నణువులు శరీరమునం బ్రవేశించుచునేయున్నవి. ఈరీతి నేడు సంవత్సరముల కాలమున శరీరమంతయు నొకసారి పూర్ణముగ మాఱునని శరీరతత్త్వజ్ఞులు నిరూపించియున్నారు. ఏడుసం వత్సరములనాఁడు శరీరమునం దుండిన యణువులలో నొకటైన నిప్పుడు శరీరమున నుండదు. ప్రవాహమునం దొక్కజలకణ మైనను, ఒక్కనిమిష మొక్కస్థలమున నిలువకుండినను నొడ్డుననుండి చూచువారలకు నదీప్రవాహ మొకరీతిగనే యుండునట్లు తోఁచురీతిని శరీరమునందలి యణువు లెడ తెగక మాఱుచుండినను శరీరము మాఱనట్లు మనకుఁ దోఁచును. ఇట్లు మాఱుచుండు శరీరమును బ్రయత్నముతో మంచిదిగఁ జేసికొనుట సులభము.

మఱియు నొక్కవిషయమును మఱువరాదు.

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ ॥

శరీర మాత్మ కుపాధిగావున నది యాత్మస్వాధీనమం దుండఁ దగినది గాని యాత్మ దీనికి లోఁబడి యుండఁగూడదు. మనము శరీరమని యెంచి దానిని స్వేచ్ఛగా విడువరాదు. శరీరము మనదని తెలిసికొని మనము చెప్పినపనుల నదిచేయునట్లు చూచుకొనవలయును. మనము సంరక్షించు గుఱ్ఱములు మొదలైనవానివలె దానిని శుద్ధిగానుంచి పోషించుచు మనము చెప్పినపనులు దానితోఁ జేయించుచు రావలయును.

ఈవిధమున బాల్యమునందుండి శరీరమును శిక్షించుచు వచ్చినచో దానిని సులభముగ స్వాధీనమునకుఁ దెచ్చుకొనఁ గలుగుదుము. బాల్యమునందు లేఁతతీఁగెవలె శరీరమును ద్రిప్పుకొననగును. వయస్సు రానురాను మ్రానివలె దానిని వంచుట కష్టమగును. కావున బాలుర కీవిషయమును బోధించి వారలచే నభ్యసింపఁజేయుట మంచిది.

## సూక్ష్మశరీరము

సూక్ష్మశరీరమందుఁ బైఁ జెప్పినరీతిని మూఁడుకోశము లున్నయవి. వానిలోఁ బ్రాణమయకోశ మన్నింటిలో స్థూలము. మనోమయకోశము దానికంటె సూక్ష్మము. విజ్ఞానమయకోశ మన్నింటిలో సూక్ష్మము.

## ప్రాణమయకోశము

ఇది పైఁజెప్పినరీతిని పృథివీతత్త్వమందలి సూక్ష్మభాగములచే నిర్మింపఁబడినది. ప్రాణములు దీనినుండియే స్థూలశరీరమునకు వ్యాపించును. దీనినుండియే స్థూలశరీరమునకును మనోమయకోశములోని యింద్రియములకును సంబంధము గలిగియుండును. ఈకోశము స్థూలశరీరమునం దంతటను వ్యాపించి నిండుకొని యాశరీరమున వెలుపలిభాగమున సైతము కొంచెము దూరమువఱకు వ్యాపించియుండును. స్థూలశరీరమునకంటె సూక్ష్మమై దాని ప్రతిబింబమువలె నుండును. ఇది సాధారణముగ స్థూలదృష్టికి గోచరముగాదు. సూక్ష్మదృష్టిగలవారి కించుక యూదావర్ణముగలిగి గోచర మగునని యనుభవజ్ఞులు చెప్పుచున్నారు.

సాధారణముగ నీకోశము స్థూలశరీరమునుగూడియే యుండును. బలమగు వ్యాధికల్గినప్పుడును మఱికొన్ని సమయములందును స్థూలదేహమును విడిచివచ్చునని తెలియుచున్నది. అప్పుడు స్థూలశరీరము కేవల బలహీనముగ నుండును. అయిననెల్లప్పుడును దీనికి స్థూలదేహముతోఁ దంతురూపముగ సంబంధ మెడతెగకయేయుండును. స్థూలశరీరము మాఱునట్లెల్లనిదియును మాఱుచుండును.

శస్త్రచికిత్స చేయుటకై మైకపువస్తువులఁ బ్రయోగించినప్పుడు స్థూలశరీరము నిశ్చేతనమై పడియుండ నీప్రాణమయకోశము బహిర్గతమగును. అందుచే స్థూలశరీరము

నకును మనోమయకోశమునందలి యింద్రియములకును సంబంధము వదలి యుండుటచే స్థూలశరీరము పడుబాధ మనకుఁ దెలియరాదు. మైకముపోయి స్థూలశరీరమునందుఁ బ్రాణమయకోశము ప్రవేశించినతోడనే బాధ తెలియ వచ్చును.

మరణకాలమందు మాత్రము స్థూలశరీరమునకును నీకోశమునకును సంబంధము గలుగఁజేసియుండు తంతువు తెగి రెండును వేఱగును.

బ్రహ్మాండమున కంతటికి సూర్యభగవంతుఁడు ప్రాణదాతయైయుండుట తెల్లమేగదా! సూర్యబింబమునుండి తేజస్సు ప్రాణరూపముగ వెలువడి ప్రపంచమునంతయు వ్యాపించి సకలభూతముల నాడులయందుఁ బ్రవేశించి శరీరములను వీర్యవంతములుగఁజేయుచున్నది. ఇట్లు సూర్యునినుండి వెలువడు తేజస్సునుండి యొక్కొక్కభూతము తనకు వలయు ప్రాణశక్తిని నాడులచే స్వీకరించుకొనుచుండును. కావుననేగదా సూర్యుని ప్రకాశములేనిది యేభూతముగాని యభివృద్ధిఁ జెందఁజాలదు. ఈశక్తి ప్రాణమయకోశము ద్వారముగ స్థూలశరీరమునకు వ్యాపించును. స్థూలశరీర మపరిశుద్ధముగను, ననారోగ్యముగ నున్నప్పుడు ప్రాణమయకోశముగూడ నపరిశుద్ధమై దుర్బలమగుటచే వలయునంత ప్రాణశక్తిని నాడులచే గ్రహింపఁజాలక దుర్బలమగును. దీనిచే స్థూలశరీరము మఱికొంత దుర్బలమగును.

స్థూలశరీరము సంపూర్ణారోగ్యముగలిగియుండిన నీ ప్రాణమయకోశము సూర్యునినుండి వెలువడు ప్రాణశక్తిని స్థూలశరీరమునకు వలసినంతకంటె నెక్కుడుగ గ్రహించుచుండు ననియు, నప్పుడు ఎక్కుడగు ప్రాణశక్తి స్థూలశరీరమునుండి తేజోరూపముగ బయలువెడలుచుండునట్లు సూక్ష్మదృష్టికిఁ గానవచ్చుచుండుననియు ననుభవజ్ఞులు చెప్పుచున్నారు. కావున మంచి యారోగ్యముగలవారల ప్రక్కను బలహీనులు కొంతకాలము పరుండినచో నాబలవంతుల శరీరమునుండి వెలువడుప్రాణశక్తిని బలహీనులు గ్రహించుటచే బలముగలుగును. అట్లుగాక సామాన్యుఁడగు వాఁడు రోగిప్రక్కను బరుండినచోఁ గొంతకాలమునకు దానుబలహీనతనొందును.

మరణకాలమునఁ బ్రాణమయకోశము స్థూలశరీరమును బూర్ణముగ వదలిపోవునని చెప్పఁబడియెఁగదా ! అంత స్థూలశరీరము శిథిలమగుట కారంభించును. ప్రాణమయకోశమును స్థూలశరీరము ననుసరించి శిథిలమగును. స్థూలశరీర మెంత శీఘ్రముగ శిథిలమగునో అది యంత శీఘ్రముగ జీర్ణమగును. స్థూలశరీరము అగ్నిసంస్కారముచేయబడి భస్మముకాగా ప్రాణమయకోశము సహితము తుదముట్టనశించును. శాస్త్రముల యందు శవమున కగ్నిసంస్కారము విధింపఁబడియుండుట కిదియే ముఖ్యోద్దేశ్యము. భూస్థాపనము చేయఁబడినచో స్థూలశరీరము జీర్ణమగుటకుఁ జిరకాలముపట్టును. కావున ప్రాణమయకోశము నశించుటకును నాలస్యమగును.

## మనోమయకోశము

మనోమయకోశము రాగద్వేషాదులగు నన్నిమనోవృత్తుల కు నునికిపట్టు. దీనియందు రెండుభేదములు గలవు. రాగద్వేష ముల కునికిపట్టయి కామవికారమగు కామమయశరీర మొకటి. మిగిలిన మనోవృత్తుల కధిష్ఠానమగు మనోమయశరీరము రెండవది. లోకమున సామాన్యజను లందఱికి రాగద్వేష పురస్సరముగఁగాని ప్రవృత్తి సాధారణముగనుండదు గాన నీరెండుశరీరములును సాధారణముగఁ గలిసియే వర్తించు చుండును.

## కామమయశరీరము

ఇది యోగదృష్టికిమాత్రము గానవచ్చుచున్నది. అనేక వర్ణములతోఁ బ్రకాశించుచుండును. మనోవృత్తులు మాఱు నట్లు దీనివర్ణములు మాఱుచుండును. అది యన్నమయప్రాణ మయకోశముల రెంటిలోపలనుండి వ్యాపించి వానికి వెలు పలను గొంతదూరమువఱకు నుండును. బాలురయందు మనో వికాసములేకుండుటం బట్టి వారి కామమయశరీరము సాధారణ ముగ తెల్లగనుండును. రాగద్వేషములు హెచ్చను హెచ్చను ఈశరీరమునఁ దదనుగుణములగు వర్ణము లేర్పడుచుండును.

ఈకోశము సమస్తమానవుల కుండినను, పశుప్రాయులగు వారియందు స్పష్టముగ నేర్పడియుండదు. చెదరిపోయిన మేఘమువలె రూప మేర్పడకయుండును. జ్ఞానమధికము

కాను కాను స్పష్టమగు రూప మేర్పడి యండాకారముగఁ దేలును.

ఆదియందు జీవుఁడు విశేషముగఁ గామక్రోధములకు లోఁబడియుండుటచే వాని కనురూపములగు వర్ణములు కలిగియుండును. కామముపుట్టినచో మడ్డిరక్తవర్ణముగల్గును. మట్టివర్ణము స్వప్రయోజనపరత్వమును సూచించు. అతిక్రోధముగల్గినచో మెఱయు రక్తవర్ణముగల బాఁకులవలె రూపములు దీనినుండి భువర్లోకమున బయలువెడలుననియు, భువర్లోకప్రకృతివికారములగు నీరూపము లాక్రోధమునకు విషయమగువారిమనోమయకోశములకుం దగిలి వారికిఁ గీడుచేయుననియు యోగదృష్టి గలవారు చెప్పుచున్నారు. కామముపుట్టినచో నా సంకల్పములును రూపమును దాల్చి యితరుల మనోమయకోశమును దాఁకునఁట. నిర్వ్యాజప్రేమగలిగినచో దివ్యమైన రోజాపువ్వువర్ణములు గల రూపములు వెడలునఁట. ప్రేమాతిశయముచేఁ దల్లి బిడ్డను జేతనెత్తుకొని ముద్దు లిడుచుండు సమయమున నీకోశమంతయు రోజావర్ణము గలిగి వర్తులాకారములగు తేజోరూపములు శరీరమునందు నిండియుండు నట్లు కనఁబడునఁట. అతిలోభియగువాని శరీర మసహ్యమగు మట్టిరంగుగలిగి యీశరీరముచుట్టు నినుపకట్లు కట్టఁబడినట్లు చూపట్టునఁట. ఇట్లొక్కొక్క మనోవృత్తి పుట్టినపుడు దాని కనురూపమగునట్టి వర్ణములు గలిగియుండును. ఈరీతిఁ బశుప్రాయుఁడగువానిసూక్ష్మశరీరము అసహ్యాకరము లగు వర్ణ

ములు గలిగియుండ, జ్ఞానము వృద్ధియయి యింద్రియమనో నిగ్రహములు గలుగుచు రాఁగా నీశరీరము మిగుల మనోహర వర్ణములఁ గలిగి చూడసొంపుగ నుండునఁట. రక్తవర్ణము, మట్టిరంగు మొదలగు నసహ్యాకరమగు వర్ణములు మాఱిపోయి ప్రేమాతిశయమును జూపట్టు గోజాపువ్వువర్ణమును బుద్ధి కౌశల్యమును జూపు బంగారువర్ణము, భక్తింజూపు నీలవర్ణ మును, అనుకంపను దెల్పు నాఁకు పచ్చరంగు మొదలగు మనో హరములగురంగులతో నిండినదగు నఁట.

కావునఁ దొలుత పశుప్రాయులుగా నుండినప్పు డీశరీర మాకార మేర్పడక హేయములగు వర్ణములు గలిగి యుం డును. జ్ఞానపరిపాకము కాను కాను స్పష్టముగ నండాకార ముగా నేర్పడి రమణీయములగు వర్ణములు గలిగియుండును. అప్తత్త్వమునందును బృథివీతత్త్వమందుండు రీతి ననేక స్థూల సూక్ష్మ తారతమ్యములగు ప్రకృతిభాగములు గలవు. అందు స్థూలప్రకృతిసముదాయములు మడ్డివర్ణములు గలిగియుండును. సూక్ష్మములు కాను కాను రమణీయములగును. కామక్రోధ పూరితములగు మనోవృత్తులు పుట్టినచో నవి స్థూలప్రకృతి నాకర్షించి రూపమును దాల్చుటచే మడ్డిరంగులు గలిగియుం డును. మనోవృత్తులు పరిశుద్ధములు కాను కాను సూక్ష్మ సూక్ష్మతర ప్రకృతిభాగముల నాకర్షించి రూపములు దాల్చు టచే వానిరంగులు రమణీయములుగ నుండును. కావున కామ క్రోధముల జయించి యింద్రియ మనోనిగ్రహము లభ్య

సించుచు రాను రాను ఈశరీరము పరిశుద్ధమై రమణీయవర్ణ ములు గలదియగును.

ఈసూక్ష్మశరీర మూర్ధ్వములగు భువరాదిలోకానుభవము గలుగుటకు జీవున కుపాధి యగునని చెప్పఁబడెను. మొదట మొదట జీవునకుఁ గలుగు ననుభవము లన్నియు బాహ్యము లగు భూలోకవిషయానుభవములుగనె యుండును. ఇంద్రియ గోళములు స్థూలశరీరమునం దున్నయవి గదా! ఐనను ఇం ద్రియములు సూక్ష్మరూపమున నీకామమయ శరీరమున నున్న యవి. బాహ్యవిషయములచే స్థూలశరీరమునందలి గోళము లకు స్పర్శకలుగఁగనే వానిమూలమున స్థూలశరీరమునందలి నాడులలోఁ గొన్నింటియందు నతిసూక్ష్మముగఁ జలన మొకటి పుట్టి శిరస్సునందలి మెదడునందుఁ జేరి సూక్ష్మశరీరమునందలి యింద్రియములను జేరును. ఇంద్రియములు చలించినపుడె జీవునకు విషయజ్ఞానము గల్గును. ఈరీతిని సూక్ష్మశరీరము స్థూలశరీరమునకును జీవునకును ద్వారమై బాహ్యప్రపంచ జ్ఞానమును గలుగఁ జేయుచుండును. ఐనను స్థూలశరీరము విశ్ర మించుకాలమున సూక్ష్మశరీరము స్థూలశరీరమును విడిచి వచ్చును. కేవల జ్ఞానహీను లగు మనుష్యులయం దీసూక్ష్మ శరీరము భువర్లోకమునఁ దలుచుగా నిశ్చేష్టితమైయుండును. అతిబాలుఁడు స్థూలదేహావయవములు గలిగియుండియు భూ లోకమందు సంచరింపఁజాలక భూమియందు పడియున్నట్లు జ్ఞానహీనుని సూక్ష్మశరీరము భువర్లోకమునఁ దిరుగఁజాలక

పడియుండును. జ్ఞానము వృద్ధి కాను కాను ఆలోకమందు సంచరింప శక్తికలుగుచువచ్చును. ఇప్పుడు నాగరికులగు జ్ఞానవృద్ధిగలవారల కందఱికి నీశరీరముతో సుషుప్తికాలమున సంచరించుచు నాలోకానుభవముల నొందశక్తిగలిగియున్నది. ముందు జ్ఞానాభివృద్ధినిబట్టి యీ స్వతంత్రసంచారశక్తియును వృద్ధియగుచుండును. తిరుగ మేల్కాంచినపు డాయనుభవములు తొలుత జ్ఞాపకమునకు వచ్చుట యరుదు. కొంచెము కొంచెము జ్ఞాపకము వచ్చినచో నవియే స్వప్నము లనఁబడుచున్నవి. మొదలు కొనయు లేక యసంగతము లగుకొన్ని స్వప్నములు మాత్రమట్టివి గావు. అవి స్థూలశరీరమునందుఁ గలుగు నజీర్ణాది వికారములవలనఁ బుట్టినవి. వానిని స్వరూపముననె గుర్తించఁ దగియుండును. అవి తప్ప తక్కిన స్వప్నములన్నియు సూక్ష్మశరీరమునందు జీవునకుఁ గలుగు ననుభవములే యగును. మేల్కాంచిన సమయమున మాత్రము పలుమరు కొంచెము జ్ఞాపకమున్నట్లుండి జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనయత్నించఁగా నాకొంచెమునకును విస్మృతికలుగును. ఇట్లు క్రమక్రమమున జ్ఞప్తికివచ్చుట వృద్ధియగుచురాగా దప్పక సాధనచతుష్టయసంపత్తి కలిగి భూతసేవాతత్పరుఁడై, పరమగురువుల సాన్నిధ్యముఁ జెంది వారియనుగ్రహమున నేర్చి చేయు యోగాభ్యాసబలమునఁ గుండలినీశక్తి వికసించి సప్తచక్రములును బక్వమయినచో జీవునకు నిచ్ఛామాత్రమున భువర్లోకానుభవమును సూక్ష్మదేహముతోఁ బొంది యా

యనుభవములను బూర్ణముగ జాగ్రదవస్థయందు జ్ఞప్తికిఁ దెచ్చుకొనుశక్తిగలుగును.

జాగ్రదవస్థయందు జ్ఞప్తిరాకున్నను భువర్లోకమందు సంచరించు శక్తిగలవారందఱును నిద్రలో నాలోకమునందు సంచరించుచు వారు వారు జాగ్రదవస్థయందుఁ గోరినపనులు చేయుచుందురు. వారు జాగ్రదవస్థయందు లోకోపకారము చేయఁ గోరుచుందురేని వారు నిద్రలో భువర్లోకవాసుల కాయారీతి నుపకారము చేయుచుందురు. ఆభువర్లోకవాసులు భూలోకమున నివసించుచుండి నిద్రలో భువర్లోకమునకుఁ బోయిన వారైననుసరే, మరణానంతరమున భువర్లోకమున నివసించు వారైననుసరే వారి కందఱికిని సహాయము చేయనగును. వారికిఁ బరోపకారబుద్ధి వృద్ధికానుకాను పరమగురువులుగాని వారి శిష్యులుగాని వారిని చేఁబట్టి వారికి భువర్లోకమునఁ దగు పనులు నియమించి లోకోపకారముచేయ నవకాశ మిచ్చుచుందురు. కావునఁ బరోపకార బుద్ధిని జాగ్రదవస్థయందు వృద్ధిచేయుచు వచ్చినచో నిద్రకాలమును వ్యర్థముగఁ బోనీయక లోకోపకారముచేయు నవకాశము గలిగియుండును. అట్టి బుద్ధిని మన మందఱము వృద్ధిచేసికొనుచు వచ్చుటయే గాక బాలురకు నట్టి బుద్ధిగలుగునటుల బాల్యమునుండి శిక్షించుచు రావలయును.

జీవితకాలమున నీకామమయశరీరము స్థూలశరీరమునకుఁ బ్రతిబింబరూపమును దాల్చియుండును. మరణానంతరము స్థూల

శరీరమును విడిచిపోయిన వెనుక నీకామమయశరీరము వేఱు రూపమును జెందును. భూలోకమునందలి ప్రకృతి స్థూల సూక్ష్మతారతమ్యములుగ నుండునట్లు భువర్లోకప్రకృతియం దును స్థూలసూక్ష్మతారతమ్యములుగ నేడువిధము లుండును. ప్రేత భువర్లోకమును జేరుచో నాకామమయశరీరమందలి భువర్లోకప్రకృతి స్థూలసూక్ష్మతారతమ్యమున నేడుపొరలుగా నేర్పడి స్థూలభాగము వెలుపలను దానికంటె సూక్ష్మ భాగ ములు లోలోపలను నేర్పడి యేడుపొరలు ఏర్పడును. ఇట్లు మార్పుచెందిన శరీరమునే యాతనాశరీరమని హిందూశాస్త్ర ములు చెప్పుచున్నవి.

జీవుఁడు భూలోకమున నుండుకాలమునఁ బహుప్రాయుఁడై కామక్రోధములకుఁ బూర్ణముగ లోఁబడి కేవలవిషయాసక్తుఁడై యుండినచో వానికామముల కనుగుణముగ స్థూలములగు నణువులు యాతనాశరీరమునం దెక్కుడుగఁ జేరి మొదటి పొర మిక్కిలి దృఢమైనదగు. దానికి మూలమగు కామములఫల మంతయు ననుభవించునంతవఱకు నాపొర దృఢముగనుండి అనుభవములు పూర్తియైనచో నాపొర జీర్ణమై మిగిలిన పొరలు మాత్రము నిలుచును.

సామాన్యములగు విషయకామము లన్నియుఁ దారతమ్య క్రమమున మఱిమూఁడు పొరలతో సంబంధించి యవియుఁ గ్రమక్రమమున ననుభవముచే నశించును. ఈ నాలుగుపొరలు నశించువఱకుఁ జీవునకుఁ బ్రేతసంజ్ఞ యుండును. అటుపిమ్మటఁ

బితృలోకమును జేరును. ఈపొర లేర్పడినపిదప జీవుఁడు వానిలోఁజిక్కి యీపొర లనుభవముచే నశించువఱకు నిర్బంధముగనుండి యనుభవించుచుండును. సంవత్సరాంతము వఱకుఁ జేయు నుత్తరక్రియలు ఈదశయం దుండు జీవునకు సహాయకరములు. జీవునకు బంధకములుగనుండు పైఁజెప్పిన మొదటి నాల్గుపొరలను జీర్ణింపఁజేసి, ప్రేతత్వమును వదలించి జీవుని బితృలోకప్రాప్తునిగఁ జేయును. అంతవఱకు నాక్రియ లుపయోగకరములు.

ఈయాతనాశరీరవిషయమం దొకరహస్యము గలదని విజ్ఞులు చెప్పుచున్నారు. కామమయశరీరము మనకామములకనుగుణముగ నేర్పడుచున్నది. కావున మనోదార్ఢ్యముచే దానిని స్వాధీనపఱచుకొొన నవకాశముండును. జీవుఁడు తనకు మరణానంతర మిట్టి నిర్బంధములగు పొరలేర్పడక యుండవలయు నను విషయమును మరణకాలమున మఱువక దృఢముగ మనోనిశ్చయము చేసినచో భువర్లోకమున నిట్టిపొరలుగా నేర్పడి వానిని బంధించక యాశరీరము పూర్వముండురీతిననే యుండనగును. అట్లయినచో వారు భువర్లోకానుభవములు యథావిధిగ ననుభవించుచుండినను దన్నుఁ దానెఱిఁగి స్వాతంత్రిముగ ననుభవింప నవకాశముగలుగును. లేనిచోఁ బొరలేర్పడి వానిలోఁజిక్కి యేమియుఁ జేయనోపక యుండును. అనుభవ మనునదేమో తప్పకపోయినను స్వాతంత్రముగ ననుభవించుటయందును బరతంత్రముగ నుండుటయందును విశేష

భేదము గలదు. జీవుఁ డీలోకమున దుఃఖములువచ్చినచో వానికి లోఁబడి యవివేకమున నేమియు నెఱుఁగక పరతంత్రుఁడై యనుభవించవచ్చును. అటుగాక వాని ననుభవించుట తప్పకపోయినను వివేకముగలిగి మనోదార్ఢ్యముతోఁ స్వతంత్రుఁడై యనుభవించి వివేకమును వృద్ధిపఱచుకొనఁజాలును. ఈ రెండుమార్గములకును దారతమ్యముండురీతిని భువర్లోకమునఁ బారలలోఁజిక్కి యనుభవించుటకును వానిని దప్పించుకొని స్వతంత్రముగ ననుభవించుటకును దారతమ్యముగలదు. వివేకవంతు లీరహస్యమును మనసున నుంచుకొని సకాలమున వినియోగపఱచవలయును.

## మనోమయశరీరము

మనస్సు శుద్ధమనియును నశుద్ధమనియును రెండుభాగములు. అం దశుద్ధమనస్సన్నఁ గామసంకలితమైనది. ఎప్పుడును గామములతో మిశ్రమమై కామములకు లోఁబడి కామము లీడేర్చుకొనుటకై ప్రవర్తించునది. శుద్ధమనస్సు కామవివర్జితమై జ్ఞానసాధనమైనది. జీవునకు మనస్సుతో సమానమగు సాధన మొక్కటియు లేదు.

కిమితరచ్చేతస్సమమ్ సాధనమ్

ఈ రెండింటియందును గామసంకలితమైనది యశుద్ధమనస్సు. ఇదియె పైఁజెప్పఁబడిన కామమయశరీరము. మనో

మయశరీరమనునది రాగద్వేషములతోఁ గూడని మనో
వృత్తుల కన్నింటి కునికిపట్టు.

ఈయుపాధి సువర్లోకసంబంధమగు తేజస్తత్త్వముయొక్క
స్థూలభాగముచే నిర్మింపఁబడునది. పైఁజెప్పినరీతిని సామాన్య
జనులు రాగద్వేషయుక్తులుగనే ప్రవర్తించుచుందురు గావున
తరుచుగ కామమయమనోమయశరీరములు రెండును గూడియే
ప్రవర్తించుచుండును. అందుచే నట్టి మనోవృత్తులు గలిగినచో
నారెంటియందును వికారములుపుట్టును. రాగద్వేష వియుక్త
ములగు వృత్తులు పుట్టినచో నవి మనోమయశరీరమునందు
మాత్రము చలనము గలిగించి దానిని మార్చును.

మనుజునకు మృగమునకుం దారతమ్యము మనస్సును
బట్టి కలిగినదేకదా! ఇంద్రియములును, ఇంద్రియవ్యాపార
ములును, మృగములందును గాననగుచున్నవియే గదా!
ఆహారనిద్రాభయమైథునములు పశువులందును మనుష్యులందు
నొక్కటియేగదా! యుక్తాయుక్తవివేచనముచేయుట, ముం
దువెనుక లాలోచించుట, తనస్వభావమును గ్రమక్రమమున
సంస్కరించుకొని పరిశుద్ధముగ జేసికొనుట, తనస్వరూప
మును, ఇహపరలోకాది జగత్స్వరూపమును, ఈశ్వరస్వరూప
మును, నెఱుంగుట మొదలగు నివియన్నియు మనుష్యుని
వ్యాపారములు. ఇవి మృగములయం దసాధ్యములు. వీని
కన్నింటికిని మనస్సు సాధనము. కావుననే " కిమితరచ్చేతస్స
మమ్ సాధనమ్ " అని యనుభవజ్ఞులగు పెద్దలు చెప్పిరి.

మనోమయశరీరము జీవునకు బహుముఖ్యమైన యుపాధి

జీవుల పరిపక్వస్థితినిబట్టి వారిమనోమయకోశములు ముఖ్యముగ మూఁడువిధములుగ నుండును.

౧. సామాన్యజనులశరీరము.

౨. బుద్ధికుశలత గలిగి కొంతమాత్రము నాగరికులగు జీవుల మనోమయశరీరము.

౩. జ్ఞానియగువాని మనోమయశరీము.

## సామాన్యుల మనోమయశరీరము

కేవల పశుప్రాయులగువారికిఁ గామమయశరీర మేరూప మేర్పడక యుండును గదా! వారి కీశరీరముగూడ దానితోఁ జేరియే చెదరఁగొట్టఁబడిన మేఘమువలె నుండును. ఐనను బశువులకంటె నట్టి వానికి "వేదస్వస్తనం, వేద లోకాలోకాః" (రేపువచ్చునది తెలియును, దాను జూచినది చూడనిదియుఁ దెలియును) అని చెప్పినరీతిని బూర్వస్మరణములు, ముందాలోచనయు లేశమాత్రమైనను గలిగి, యనుభవమై జన్మములు మాఱుచు రాఁగా క్రమక్రమముగ రూపము లేర్పడుచు వచ్చును. ఐన నిట్టి యనుభవముచే జ్ఞానము చాల వఱకు వృద్ధియగునంత దనుక నీ మనోమయశరీరము కామమయ శరీరముతోఁ గూడియే వర్తించుచుండును. మరణానంతరమును బహుస్వల్పకాలమే సువర్లోకవాసము గలిగియుం

డును. వారి మనోమయశరీరము చాలవఱకు కామమయశరీర మునకు బ్రతిబింబమై దానివలె వర్ణములును రూపములును గలిగియుండును.

### బుద్ధికుశలతగల నాగరికుని మనోమయశరీరము

ఇట్టివాఁడును చాలవఱకు రాగద్వేషములతోఁ గూడియే ప్రవర్తించుచుండునుగావున వానికిని సాధారణముగఁ గామమయ మనోమయశరీరములు రెండును జాగ్రదవస్థయందుఁ గూడియే వర్తించుచుండును. ఐనను వాఁడు రాగద్వేషవియుక్తుఁడై గ్రంథకాలక్షేపము భగవద్ధ్యానము లోకోపకారచింతయు మొదలగు వ్యాపారములను దఱుచుగఁ జేయుచుండును గావున వాని మనోమయశరీరము క్రమక్రమముగ రూపమేర్పడుచుండును. దానివర్ణములాయామనోవృత్తుల కనుగుణముగ మాఱుచుఁ గ్రమక్రమముగ రమణీయము లగుచుండును. పైఁజెప్పినప్రకారమున నిద్రకాలమున వానికిఁ గామమయశరీరమందు స్వతంత్రప్రవృత్తి కలిగియుండును గాని యీమనోమయశరీరమునందుఁ బ్రవృత్తియుండదు. సామాన్యుల కామమయశరీరమువలె వానికి మనోమయశరీరము వ్యాపారము లేక యుండును.

### నివృత్తిమార్గము నవలంబించినవాని మనోమయశరీరము

అట్టివాని మనోమయశరీరము పైరెండుశరీరములకంటె రూపము చక్కఁగ నేర్పడి బహు మనోహరములగు వర్ణ

ములు గలిగియుండును. రాజస తామస గుణములుగల సంకల్ప రూపములచే స్థూలప్రకృతి యాకర్షింపఁబడుననియు సత్త్వగుణముచే సూక్ష్మప్రకృతి యాకర్షింపఁబడుననియు, గామమయశరీరవిషయమందుఁ జెప్పఁబడియెఁగదా! మనోమయశరీరమందును ఆరీతినసే వర్ణము లేర్పడును. కావున జ్ఞానము వృద్ధియయి సాత్వికవృత్తులు వృద్ధియగుచు రాఁగా నీశరీరము బహురమణీయమై ఆయావృత్తుల కనుగుణములగు వర్ణములఁ దాల్చియుండును.

## విజ్ఞానమయకోశము

ఇది జీవునకు ముందుదహరింపఁబడిన యుపాధు లన్నింటి కంటెను సూక్ష్మతరమైన యుపాధి. మిగిలిన యుపాధులు జన్మజన్మమునకు మాఱుచుఁ గ్రొత్తవిగ నిర్మింపఁబడును. ఈ యుపాధులతో జీవుఁడు భూర్భువస్స్వర్లోకములతో సంబంధము గలవాఁడగును. ఈమూఁడులోకములలో జీవుఁడు సంసార చక్రమునందుఁ దిరుగుచుండును. భూలోకమును విడిచి భువర్లోకమును, దానిని విడిచి సువర్లోకమును, దానినుండి మరల భువర్లోక భూలోకములను బొందుచుండును. ఈమూఁడులోకముల కావల మహర్లోకముండును. అది తేజస్తత్త్వముయొక్క సూక్ష్మభాగములతోఁ జేయఁబడినది. విజ్ఞానమయకోశ మట్టి సూక్ష్మభాగములతో నిర్మింపఁబడునది. అది గ్రుడ్డువలె వల యాకారముగనుండును.

మరణానంతరమున సువర్లోకమున అచ్చటి శరీరము నశిం చఁగా జీవుఁడు మహర్లోకమును స్పృశించును. అపుడు జీవున కుండు నుపాధి విజ్ఞానమయకోశము. విజ్ఞానమయకోశమున వర్తించుచైతన్యమే జీవుఁడనఁబడును. ఈకోశము జన్మజన్మ మునకును మాఱుటలేదు. ప్రతిజన్మమునను గలిగిన యనుభవ ములనుండి గ్రహింపఁబడిన జ్ఞానసారమంతయు దీనియందుఁ జేరుచుండును. సామాన్యజనులకుం గల జ్ఞానము కొంచెమే గావున వారియం దీకోశము వర్ణశూన్యమైయుండును. కామ క్రోధాది వికారములును, గామమిశ్రితములగు మనోవృత్తు లును ఈకోశము నంటవు. నిష్కామములైన సాత్త్వికమనో వృత్తులును సద్గ్రంథపరిశీలనముచేఁ గలుగు జ్ఞానమును ఎక్కువ కాను కాను ఈకోశము దివ్యములగు వర్ణములతో నొప్పచు వచ్చును. ఈకోశము మఱియన్నికోశములలో వ్యాపించి వాని వెలుపలను గొంత దూరమువఱకుఁ దెలియనగు.

తాత్త్వికజ్ఞానమును, పారమార్థికబుద్ధియు వృద్ధికానుకాను ఈకోశము మిగుల తేజోవంతమైన వర్ణములు గలిగియుం డుటయేగాక గొప్పదిగ నగుచువచ్చును. ముక్తిపదవి సమీ పించు మహనీయుల కీకోశము బహుదూరము వ్యాపించుట యేగాక దానియందుఁ గానవగు వర్ణములుసహితము భూలోకమున నెన్నటికిని గోచరములుగాని యపూర్వము లైనవిగ నుండు నని యనుభవజ్ఞులైన యోగులు వ్రాసి యున్నారు.

ఇహలోకమందుఁగాని, పరలోకమందుఁగాని స్వప్రయోజనము నుద్దేశించి చేయు కార్యము లొక్కటియు నీకోశమును వికసింపఁ జేయఁజాలవు. నిష్కామములగు వృత్తులును సద్గ్రంథ సారగ్రహణమును మాత్రము దీనిని వృద్ధిఁజెందించును. పరోపకారతత్పరులై భగవద్ధ్యానము చేయుచు శమదమాది సాధనములు సంపాదించుచు వచ్చువారి కీకోశము వికసించును. మిగిలినవ్యాపారము లన్నియు నశ్వరఫలముల నిచ్చుచు సంసార చక్రమునందె భ్రమింపఁజేయును. కావున దీనిని దృఢముగ నెఱింగి యెల్లవారును శాశ్వతములగు ఫలముల నీయఁజాలుమార్గము నవలంబించి పరమపురుషార్థమును బొంది లోకోపకారపరులగుటకు యత్నింతురుగాక.

## కారణశరీరము

ఇదియే ఆనందమయకోశమని వేదాంతగ్రంథములయందుఁ బిలువఁబడుచున్నది. ఇది వాయుతత్త్వప్రకృతితోఁ జేయఁబడును. సామాన్యజనులయం దిది బీజాంకురన్యాయముగ నుండును. ఆత్మజ్ఞానము వృద్ధియై జీవుఁడు పరిపక్వస్థితికివచ్చి పైమెట్టుచేరగా నీకోశము వికసించి స్పష్టమగు రూపము దాల్చును. ఆత్మజ్ఞానమనఁగా సమస్తభూతములయందుండు నాత్మయు, దనయందుండు నాత్మయు నొక్కటియే యను జ్ఞానము, నానాత్వమునం దేకత్వమును జూచుట. తొలుదొలుత నీజ్ఞానము పరోక్షముగనుండినను యుక్తియుక్తముగ దోఁచి

నను స్వానుభవమునకు వచ్చియుండదు. జీవున కీయుపాధి పరిపక్వముకాఁగా భిన్నభిన్నములుగఁ గన్పడు నన్నింటియందును ఏకత్వజ్ఞానము దృఢమై భిన్నభావము సంపూర్ణముగ నశించును. శోకమోహములు తుదముట్టఁ బోవును.

శ్లో. సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥
యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి ।
తస్యాహం నప్రణశ్యామి సచమే నప్రణశ్యతి ॥
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

(గీత.)

తత్ర కో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః ।

(ఈశావాస్యోపనిషత్తు.)

---

# ఏడవ యధ్యాయము

## మనస్సు

మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామ వివర్జితమ్ ॥
మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్ ॥

(అమృతబిందూపనిషత్తు.)

తా. మనస్సు శుద్ధమనియు నశుద్ధమనియును రెండువిధములగు. కామసంయుక్త మశుద్ధమనియుఁ, గామవిహీనము శుద్ధమనియుఁ జెప్పనగు. మనస్సే జీవునకు బంధమోక్షములకుం గారణము. మనస్సు విషయాసక్తమైనపుడు బంధకారణమును, నిర్విషయమైనచో ననఁగా విషయవిముఖమై యీశ్వరాయత్తమైనచో మోక్షకారణమనియును శ్రుతి యనువదించుచున్నది.

జీవుఁడు తేజస్తత్త్వప్రకృతితోఁ జేయఁబడిన శరీరమును దాల్చి యాశరీరములో వర్తించునపుడు మనశ్శక్తి నుపయోగించును. కనుక మనోమయ విజ్ఞానమయకోశములయందు వర్తించు నాత్మశక్తియే మనస్సని పేర్కొనఁబడుచున్నది.

మనస్సు అనుశబ్దము మన్ అనుధాతువునుండి యుత్పన్నమై తెలిసికొనుశక్తి యను నర్థమును బోధించుచున్న యది.

అనఁగా మనస్సు జీవునకు జ్ఞానసాధనమునకు ముఖ్యమయిన కరణము. కావున నది యంతఃకరణ మనఁబడును. జీవుఁడు బాహ్యప్రపంచ జ్ఞానమును బొందుటకు మనస్సను సాధనము నుపయోగించువాఁడు. జీవుఁడు కామరహితుఁడై వర్తించు నపుడు మనస్సు శుద్ధజ్ఞానసాధనమై యుండు. సర్వకామముల కునికిపట్టయి కామమయశరీరముతో గలిసి వర్తించునపుడు మనస్సు కామ సంకలితమై కామమునకు లోఁబడి దానికి సహకారియై ప్రవర్తించుచుండును. ఇదియ యపరిశుద్ధ మనఁబడు మనస్సు. బహుకాలమువఱకు జీవుఁడు కామమయుఁడై కామములందగిలి వర్తించుచుండును. కామరహితమైన కర్మ మొక్కటియు నప్పుడు రుచింపదు. అట్టి జీవునియందు శుద్ధమనః ప్రవృత్తికవకాశము కలుగుట యరుదు. బహుకాల సుఖదుఃఖానుభవముచే జ్ఞానము కలిగి వైరాగ్య ముత్పత్తియైనచోఁ గొంచెముగ విషయవిముఖుఁ డగుట కాస్పదము గలిగి శుద్ధ మనస్సునకు వ్యాప్తికలుగును. అంతవఱకు నశుద్ధమనస్సునకు మాత్రము ఎక్కుడుఁగ వ్యాప్తి కలిగి యుండుటచే నద్దాని లక్షణములను, ధర్మములను జక్కఁగ నెఱింగినయెడల దానిని వశపఱచుకొని క్రమముగ శుద్ధమనస్సుగ మార్చుటకు నవకాశము గలుగును.

మనస్సు చంచలస్వభావ మైనది. ఎల్లప్పుడు నొకవిషయమునుండి వేఱొకవిషయమునకుఁ బరుగిడుచునే యుండును. ఈ కారణమునుబట్టి మనస్సు కపితుల్యమని చెప్పుట కలదు.

సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశాశాఖా స్వటతి ఝుటితి స్వైరమభితః ।
కపాలిన్భిక్షోమే హృదయకపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బధ్వా శివభవదధీనం కురు విభో ॥

(శివానందలహరి.)

అది సామాన్యముగ నింద్రియములతోఁ జేరి వర్తించుచుం డును. అట్లు వర్తించుటచే మనశ్శక్తి విశేషముగ నశించును. ఇంద్రియముల నిగ్రహించుటచే మనశ్శక్తి యింద్రియమార్గ మున నశింపక నిలిచి క్రమక్రమముగ వృద్ధియగును.

నదీజలములఁ గాలువలుగఁ ద్రిప్పి యొక చెఱువునకుం జేర్చి నచో నాచెఱువు కట్టయందుఁ గొన్నిరంధ్రము లుండెనేని చెఱువులోఁ జొచ్చు జలమంతయు నారంధ్రములనుండి వెలువడి నిష్ప్రయోజక మగుటయే గాక కట్ట తెగి యనేకులకు హాని కరమునైయుండు. ఆ తటాక రంధ్రములం బూడ్చి యుక్తమగు జలద్వారముల నిర్మింప నందలి జలమంతయుఁ బదిలపఱుపఁ బడి సకాలమున నాజలద్వారములనుండి వెలువడి సుక్షేత్ర ములపైఁ బ్రవహించి వానియందలి సస్యములను జక్కఁగ ఫలింపఁజేయుటచే ననేక భూతకోటుల కపారముగ మేలు చేయును గదా! అట్లే యాత్మశక్తియను ప్రవాహము బుద్ధి మార్గమున మనస్సనుతటాకమునఁ బ్రవేశించి యింద్రియము లను రంధ్రముల మార్గమున బయలు వెడలి విషయములయందు నశించుటయే గాక ముందటి యధ్యాయమునఁ జెప్పిన రీతి

సనేకులకు మహోపకారము చేయును. అట్లుగాక యింద్రియ ములను నిరోధించి మనస్సును విషయ విముఖముగఁ జేసినచో మనశ్శక్తి వృద్ధియై యనేకులకు మహోపకారము చేయుటకు సహితము చాలియుండును. ఇట్లింద్రియవ్యాపారమును నిలిపి మనశ్శక్తిని వృద్ధిచేయుటయే యోగమనఁబడును.

తాం యోగమితి మన్యంతే స్థిరామింద్రియధారణామ్ ॥

(కఠోపనిషత్తు.)

దేహేంద్రియముల వ్యాపారముచే వానిశక్తి తగ్గురీతిని మనోవృత్తులచే మనశ్శక్తి వ్యయమగుచుండును. సంకల్పము లచే మనశ్శక్తి వ్యయమగుచుండుఁ గావున నద్దానిని వ్యర్థసం కల్పముగఁ జేయఁగూడదు. ధర్మ మాచరించుటయందును, బరోపకార మొనరించుటయందును మాత్రము వ్యయపఱుపఁ నగునేకాని నిష్ప్రయోజకములగు కార్యములయందుఁ గాని, పాపకార్యములందుఁగాని వినియోగింపరాదు. మనశ్శక్తి యనునది పురుషార్థముల సాధించుటకై మానవుల కొసఁగఁ బడిన దివ్యశక్తి. ఆశక్తిని బ్రతిక్షణమందును నిరుపయోగము లును, ఇతరులకు మేలు చేయఁజాలనివియు నగు సంకల్పములు చేసి వ్యర్థముచేయుట పాపమని చెప్పవచ్చును. మనస్సును ఇంద్రియములం గూడి విషయములయందు స్వేచ్ఛగా విహ రింపఁ బోనిచ్చిన నది శక్తిహీనమగును. జీవితకాలమంతయుఁ గామక్రోధాహంకార మమకారములచేతను, విషయాసక్తిచే తను మనశ్శక్తిని నశింపఁజేసికొనువాఁడు కట్టకడపట చింతింప

వలసిన వాఁడే యగును. అట్లుచేయక మనస్సును జక్కఁగ నియమించుకొని మనశ్శక్తిని వృద్ధిచేయవలయును. ఈరీతిగా నియమితమైన మనస్సు మిగుల వీర్యవంతమై యోగాభ్యాసాదుల కర్హమై గొప్ప కార్యముల నెన్నియో సాధింపఁ గలుగు.

ఆదినుండి యింద్రియములతోఁ గూడి వర్తించుచుండుటచే మనస్సు విషయాసక్తమై యెప్పుడును విషయసంయోగమును గోరుచుఁ దత్ప్రతిబంధకములగు వాని నన్నింటియందును ద్వేషభావముకలిగియుండును. ఇట్లు సామాన్యముగ మానవుల యందు మనస్సు రాగద్వేషాదులకు లోఁబడియుండు. రాగద్వేషములు సర్వానర్థమూలము లని భగవద్గీతాశాస్త్రము నందు భగవంతుఁడు నొక్కి వక్కాణించియున్నాఁడు.

ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తే ష్వూపజాయతే ।
సంగా త్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే ॥
క్రోధాద్భవతి సమ్మోహ స్సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥

(గీత. ౨ అధ్యా.)

విషయచింతనముచేఁ గామమును, కామముచేఁ గ్రోధమును, క్రోధముచే నవివేకమును (అనఁగా యుక్తాయుక్త వివేచనాజ్ఞానము లేకుండుటను), కడపట సకలపురుషార్థహానియు నగునని తాత్పర్యము.

మఱియు నీ కామక్రోధములు జ్ఞానమునకుఁ బ్రతిబంధకము లనియును, వానిజయింపక పురుషార్థప్రాప్తి లేదనియును,

కామక్రోధోద్భవమగు వేగమును జయించినవారలు బ్రహ్మ నిర్వాణమును బొందుదురనియును భగవంతుఁ డుపదేశించి యున్నాఁడు.

> శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్ ।
> కామక్రోధోద్భవం వేగం స యుక్తస్ససుఖీ నరః ॥
>
> (గీతా ౫ అ.)

కావున మనస్సు నాశ్రయించియుండు కామక్రోధాదులగు దుర్గుణముల నశింపఁజేసి మఱియు శమదమాది సద్గుణముల మనంబున నెక్కొలుపుట యవశ్యకము. దుర్వాసనలు దృఢముగానున్నచో సన్మార్గమున ప్రవర్తించుటయే యసాధ్యము గదా! శాస్త్రములయందు నిషేధింపఁబడిన ధర్మములను వదలి యశుభవాసనలను కొంతమట్టుకయినను తొలుత పోగొట్టుకొనవలయును. దుర్గుణములను యథావిధిగా నశింపఁజేయవలయుననిన, తత్ప్రతిపక్ష సద్గుణములను సాధించుటయే సులభమార్గమని యోగశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇట్లు చేయుటకు ముఖ్యసాధనము ధ్యానము. ధ్యానమనఁగా నతి చంచలమగు మనస్సును నిలిపి యేకాగ్రముగఁజేసి భగవంతుని యందుఁగాని, తత్సదృశులగు పరిపూర్ణగురువులయందుఁగాని స్థిరముగ నిలుపుటకై యత్నించుట. ఇట్టిధ్యానమున మనస్సు పలుతెఱంగులఁ బరుగిడుచుండ నద్దాని నిరోధించి ధ్యేయమూర్తియందు నిలుపుటచే మనశ్శక్తి సహితము వృద్ధియగును. దేహమునకుఁ బరిశ్రమమువలె మనస్సునకు ధ్యానము దార్ఢ్య

ము నిచ్చునది. ధ్యేయమూర్తియొక్క కళ్యాణగుణములఁ బలుమాఱు మననముచేయుటచే నాగుణములు మనంబున దృఢముగ నిలిచి వృద్ధియగు. దీనికిముం దనేక జన్మార్జితములైన దుర్వాసనల నశింపఁజేయవలయును. కావున నికార్యము దీర్ఘకాలమునంగాని సాధించునదిగాదు. దుర్వాసనలన్నియు నేకకాలమున మనోనిశ్చయముచే నశింపఁజేయుట సాధ్యముకానిపని. ఒక్కొక్కటిగ వేఱువేఱుగా మనస్సునుండి తొలఁగింపవలయు. ముందు సూచింపబడినరీతి నాయా దుష్టగుణమునకు విరుద్ధమగు కళ్యాణగుణమును ధ్యేయమూర్తియందారోపించి యాగుణస్వరూపునిగ ధ్యానించిన నాదుర్గుణము తుదముట్ట నశించి తద్విరుద్ధమగు సద్గుణము స్థిరముగ మనంబున నిలుచును. ఇట్లు క్రమక్రమమున నొక్కొక్క దుర్గుణమును దొలఁగించి సద్గుణముల దృఢముగఁ జేసికొనవలయు. ఇట్లు కామక్రోధములు, అసత్యము, అసూయ మొదలగుదుర్గుణముల నొక్కొక్కటిగఁ దొలఁగించి యౌదార్యము, భూతదయ, సత్యము, అనసూయలోనగు సద్గుణముల వృద్ధిచేసికొనుటకు నత్యధిక ప్రయత్నము చేయఁదగు. ధ్యానము కొద్దికాలము చేయుటచేఁగాని, ప్రతిదినము చేయక యప్పుడప్పుడు చేయుటచేఁగాని, శ్రద్ధలేక చేసినఁగాని, ఫలము సిద్ధింపఁజాలదు.

దీర్ఘకాలాదరనైరంతర్య సత్కారసేవితోదృఢభూమిః ।

(యోగసూత్రము.)

దీర్ఘకాలము నిరంతరముగ నాదరముతోఁ జేయు ధ్యానము మాత్రము ఫలము నీయఁజాలును.

మనశ్శక్తి ధ్యానముచే వృద్ధినొందునని చెప్పఁబడియెఁ గదా! మనశ్శక్తి వృద్ధియగుచో సంకల్పసిద్ధియగు. అనఁగా మనస్సున సంకల్పించిన దంతయు నెఱవేఱును. ఐనను ధ్యానాదులచే వీర్యవంతముగఁ జేయఁబడిన మనశ్శక్తిని మానవుఁ డితరుల మేలుకొఱ కుపయోగింపవలయును. అట్లుచేయక స్వప్రయోజనపరుఁడై యాశక్తి నుపయోగించినచో వాఁడు రాక్షసుఁడనఁబడును. రావణాసురుఁ డెక్కుడు భక్తిచేతను, ఘోర తపస్సుచేతను, గొప్పసిద్ధుల నందియు, వానిని స్వప్రయోజనపరుఁడై పరులకు హానిచేయుట కుపయోగించెనుగదా. అట్లు మనస్సు నిరోధించుటచేతను యోగముచేతను బొందిన గొప్పమనశ్శక్తిని స్వప్రయోజనమునకు వినియోగించువారే రాక్షస శబ్దవాచ్యు లగుచున్నారు.

తమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్ ।

అని భర్తృహరి చెప్పియుండఁగా హఠయోగాదులచే సాధించిన సంకల్పసిద్ధి గలిగి యధికమనశ్శక్తి గలిగి వానిని బరులకుఁ గీడు జేయుటయం దుపయోగించినచో నట్టివారికంటె ఘోరతరులగు రాక్షసులు లేరని వేఱుగఁ జెప్పవలయునా!

అట్లు గాక ధ్యానయోగాదులచే మనశ్శక్తిని వృద్ధిచేసికొని స్వప్రయోజనము నించుకైనఁ గోరక యెల్లపుడు భూతదయ

గల్గి పరులమేలు కొఱకుఁ బాటుపడువారు పుణ్యస్వరూపులగు ఋషులనఁబడఁ దగియుందురు.

"పరోపకారార్థ మిదం శరీర" మ్మను న్యాయమునఁ బరుల సుఖమే తన సుఖమనియును, పరులదుఃఖమే తన దుఃఖమనియు నెంచు మహానుభావుఁ డుత్తమయోగి యనఁబడుచున్నాఁడు. అట్టివాఁడు తేజోవంతుఁడై పరిపూర్ణుఁడై బ్రహ్మానందము నొందును.

> ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
> సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥
>
> (గీతా. అ ౬. శ్లో ౩౨.)

## మనోధర్మములు

మనోమయకోశమున వర్తించు నాత్మశక్తియే మనస్సనియు, నా మనోమయకోశము తేజస్తత్వస్థూలప్రకృతితోఁ జేయఁబడినదనియును ముందే చెప్పఁబడియె. భూలోకమున శబ్దముత్పత్తి కాఁగా నామధ్యమున నుండు వాయుచలనముచే నాశబ్దము శ్రోత్రేంద్రియమును జేరి వినఁబడురీతిని మనస్సున సంకల్పములు పొడముచోఁ మనోమయకోశము చలించి ఆచలనములు భువర్లోక సువర్లోకములద్వారా యితరుల మనోమయకోశములఁ బొందును. మనుష్యుని సంకల్పము లేవిధమైనవిగ నుండినఁ దత్సదృశములగు నితరులసంకల్పముల నివి యాకర్షించునని ముందు సూచింపఁబడియెఁ గదా! మనస్సున సంకల్పమెద్దియేని

పొడమ నది సూక్ష్మప్రకృతియం దొక రూపమును ధరించును. అనఁగా నాసంకల్పము సూక్ష్మలోకములయందుండు ప్రకృతియం దొకవిధమగు చలనమును గలుగఁ జేసి ఆప్రకృతిని రూపము ధరించునట్లు చేయును. కులాలుని చక్రము వేగముగఁ దిరుగుటచే దానిపైని మృత్తిక ఘటాదిరూపమును దాల్చురీతిని మనస్సంకల్పములు భువర్లోక సువర్లోక సూక్ష్మప్రకృతియందుం బ్రవేశించి యాప్రకృతిలో నొక్కింతభాగమును రూపమును ధరించునట్టుగాఁ జేయును. వివిధములగు సంకల్పములు వివిధ రూపములుగలిగి నానావిధవర్ణములతో నొప్పును. ఎక్కుడగు భక్తితోఁ గూడి చిత్తైకాగ్ర్యమున ధ్యానించునపుడు సూక్ష్మలోకమున దివ్యమగు నీలవర్ణముగలరూప ముత్పత్తియగును. మఱియు నాభక్తి నిష్కామమగుచో నారూపములు కమలములులోనగు పుష్పముల యాకారములను దాల్చును. ఏకాగ్రతస్థిరమగుచో భక్తుని మనోమయకోశమునుండి యూర్ధ్వభాగముగఁ దేజోవంతమై నీలమగు గోపురరూపము గోచరించును. అట్లే యితర విధములగు సంకల్పములు మనస్సునం బుట్టునపుడు తదనుగుణములగు వర్ణములతో నొప్పుచున్న వివిధరూపములు కన్పడు. యోగదృష్టితోఁ జూచునపు డవి కొన్ని నక్షత్రములవలెను, ఆలయములవలెను, మఱికొన్ని తీక్ష్ణములగు శస్త్రముల వలెను గన్పడును. సంకల్పములు మనస్సున విస్పష్టముగ లేనియెడల నుత్పత్తియగురూపము చెదఱిపోవు మేఘశకలముల వలె అంచులు స్పష్టము కాకయుం

డును. ఇవియును సంకల్పస్వభావము ననుసరించిన వర్ణములు గలిగియుండును. [72, 73 వ పుటలు చూడుడు.]

ఈ రూపములు సూక్ష్మలోకముల వర్తించు దేవతలలో సంకల్పానుసారముగ నొక్కొక్కరి నాకర్షించుకొని, స్వతంత్రముగ నాలోకమునఁ గొంతకాలము సంచరించుచుండును. ఈ రూపములకును, వాని నుత్పత్తిని జేయు మానవులకును దృఢమగు సంబంధము గలిగియుండును. ఈ రూపములు సమాన మనోభావములు గలవారిచే నాకర్షింపఁబడును. క్రోధసంకల్ప మొకరియం దంకురింప రక్తవర్ణమగు రూప మొకటి జన్మించి సూక్ష్మలోకమున నొక పిశాచమువలె సంచరించుచుఁ గ్రోధ మనస్కులగు నితరులచే నాకర్షింపఁబడును. ఆ రూపము వారి మనోమయకోశమునంటి దానియందలి క్రోధభావములను వృద్ధిచేయును. ఇట్లే యొకరియందుఁ గామసంకల్పములు పుట్టనవి తత్సదృశరూపములను గలుగఁజేసికొని నైజముగఁ గాముకులగుజనుల సూక్ష్మశరీరముల నంటి వాని నెక్కుడుగఁ జలింపఁజేసి వారి కామగుణము నభివృద్ధిచేయును. ఇట్లొక్కొక్కరి మనోభావములు ఇతరుల మనస్సులం బ్రవేశించి, అవి మంచిసంకల్పములుగ నుండిన, వారిని మంచి వారలనుగాఁ జేయుగుణముగలిగి, దుష్టములైనచో వారల దుష్టులనుగాఁ జేయుచుండును. వెలుపలినుండివచ్చు సంకల్పరూపమున కనుగుణములగు మనోవృత్తులలో నొకటియైన నొకనియందు లేనిచో నారూపము వాని నంటఁజాలక మరలిపోవును.

కామసంకల్పములచే జనించు రూపములు కేవలనిష్కాముఁ
డగు వానియందుఁ బ్రవేశింపఁజాలవు. అటులనే నిష్కామ
ములును సర్వభూతహితములును నగు సంకల్పములు కేవల
స్వప్రయోజనపరుఁడగు కాముకునందుఁ జొరఁజాలవు. ఏగుణ
మేని యల్పముగ నైన మనంబున నుండినచోఁ దదనుగుణము
లగు రూపము లాగుణములను బలపఱుపఁ జాలియుండును.
కావున సామాన్యజనులలో నొకరి మనోవృత్తు లితరులమనం
బులం బ్రవేశించి వారలను మంచివారినిగఁ గాని, చెడ్డవారినిగఁ
గాని చేయ సమర్థములగును. ఇట్లొకరి సంకల్పము లితరుల
మనస్సులలోఁ బ్రవేశించి బీజరూపముగ నుండు గుణముల
దృఢతరములుగఁ జేయుటచే నామనస్సులయందు సహితము
సదృశములగు సంకల్పములు పొడమఁగా సూక్ష్మలోకమున
మఱికొన్ని సంకల్పరూపము లుత్పత్తియై క్రమక్రమమున
నితరులం బొంది విస్తారముగ వ్యాపించుచుండును. కామియగు
నొకఁడు విషయసుఖములను గుఱించి పలుమాఱు చింతించు
చుండ వానిమనస్సునుండి కామోద్రేకకరములగు సంకల్ప
రూపములు వెలువడి యదృశ్యములుగ సూక్ష్మలోకమున
విచ్చలవిడిఁ దిరుగుచుండును. ఆరూపములు కాముకులగు నిత
రుల మనస్సులలో సులభముగఁ బ్రవేశించి వారియం దంతకు
ముం దల్పముగనుండిన కామమును వృద్ధియగునట్లుచేసి వారి
మనస్సులందుఁ గామ సంకల్పములఁ గలుగఁజేయును. ఆ
సంకల్పములచే మఱియు నట్టి సంకల్పరూపములు పెక్కు

లుత్పత్తియై యనేకులను గాముకులుగఁ జేయును. కావున నొకనిదోషములు వానిని జెఱుపుటతో నిలువక వానివెంట ననేకులను జెఱుచును. అనేకులను జెఱిచిన దోషముగూడ వానింబొందును. ఇతరుల యందల్పముగనైనఁ గామము లేనిచో మొదటివాని కామసంకల్పరూపములు వీరలయందుఁ బ్రవేశింపఁ జాలియుండవుకదా! అల్పముగ నుండు దుర్గుణముల వృద్ధిచేసిన దోషము మొదటివానిని జెందుచుండ వాని దుస్సంకల్పరూపముల నాకర్షించుకొనుట యితరునందున్న దుస్సంకల్పమువలననే కదా! ఇట్లందఱును దాము చెడుటకుఁ దామే ముఖ్యకారణభూతులును, దమవలె దుస్సంకల్పములు గల యితరులు సహకారులుగను నగుదురు.

అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవశత్రువత్ ।

(గీత. ౬. ౬.)

ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః ।

(గీత. ౬. ౫.)

అజ్ఞాని దనకుఁదానే శత్రువువలె వర్తించును. తనకుఁ దానే బంధువు, తనకుఁదానే శత్రువు, ఇతరులుకారని తాత్పర్యము. అటులనే పరోపకారబుద్ధి, భూతదయ లోనగు నిర్వ్యాజ ప్రేమాస్పదసంకల్పము లొకరియం దుత్పత్తికాఁగా దదను గుణములగు రూపములు సూక్ష్మలోకమున నుత్పత్తియయి మంచివారలగు నితరుల మనస్సులయందుఁ బ్రవేశించి వారి యం దల్పముగనుండు పరోపకారబుద్ధి, భూతదయ లోనగు

వానిని వృద్ధిచేసి వారి మనస్సులందు నట్టి సంకల్పములఁ బుట్టించును. ఆసంకల్పము లన్నియు సూక్ష్మలోకమున మూర్తీభవించి యనేకులలోని సత్సంకల్పములను బలపఱచును. మనస్సు చంచలస్వభావమగుటంబట్టి యెడతెగక పనిచేయుచుండును గాన జీవుల మనస్సులనుండి సత్సంకల్పములు గాని దుస్సంకల్పములు గాని నిరంతరము బయలువెడలుచునే యుండును. వీనివలనఁ బ్రతిమనుష్యుఁడును లోకమున కపారక్షేమమునుగాని యెన్నరాని కీడునుగాని కలుగఁజేయుచునే యుండును. దానంజేసి ప్రతిమానవుఁడును తన మనస్సును విచ్చలవిడిగ విడువక స్వాధీనము చేసికొనుట యెంత యావశ్యకమో చూడుఁడు. అట్లుచేసికొనినచోఁ దన మనస్సునందు యోగ్యము లగు సంకల్పములను మాత్రము పుట్టించుటయే గాక యితరుల దుస్సంకల్పరూపములం బ్రవేశింపనీయకుండును. వాని మనస్సు శుద్ధమగును. వాఁడు నిరంతరము శుద్ధ సంకల్పముల సంకల్పించుటచే నితరులకుఁ బెక్కువిధమ్ముల మేలుచేయఁ గలుగును. మనుష్యుల మనస్సులం బొడము సంకల్పములు దృఢములుగ నుండినచో వానినుండి యుత్పత్తియగు సంకల్ప రూపములు సైతము అంచులు చెక్కినట్లు స్పష్టములుగను, దృఢములుగను నుండును. మఱియు నాసంకల్పములను బూనికతో దీర్ఘకాలము నిలిపినయెడల నారూపములకు నెక్కుడు కాలము స్థితి గలిగి శక్తియధికమై మేలుకీడులఁ జేయఁజాలి యుండును. అట్లు లేక సంకల్పము లదృఢములుగనుండినను,

అల్పకాలనిశ్చితములుగనుండినను వానినుండి యుత్పత్తియగు రూపములు సహితము మనకలై యదృఢములుగనుండి యల్ప శక్తి గలవియగును. మనకిష్టులగు నెవరికైన నెద్దియే నొక్క మేలు చేయఁదలఁచినయెడల నావిషయము నేకాగ్రముగను దృఢముగను సంకల్పించిన నామేలు తప్పక కలుగును. ఇం దును మనస్సు నిరోధముచేతను, ధ్యానాదులచేతను, వీర్య వంతముగఁ జేయఁబడిననే సంకల్పించిన ఫలము తప్పక సిద్ధిం చును. కావున మనుష్యుఁడు మనస్సును జక్కఁగ లోఁబఱచు కొని మనశ్శక్తిని ధ్యానము మొదలగువానిచే వృద్ధిచేసిన లోకులకుఁ గోరిన మేలును జేయఁగలుగును. మనస్సు నేకా గ్రముగఁజేసి చేయఁదలఁచిన మేలునుగుఱించి దృఢముగను, స్పష్టముగను సంకల్పించిన నాసంకల్పము రూపమును ధరించి యుద్దేశించిన మనుష్యుని యొద్దకుం బోయి యామేలును ఘటిం పఁజేయును. గొప్పవియును, విశేషద్రవ్యసాధ్యములును నగు ధర్మకార్యములను జేయఁబూనుకొనిన లోకోపకారులు పలు మఱు నిఱుపేదలయియుండియుఁ దాము చేయఁబూనినకా ర్యము లెవ్విధముగనైన నెఱవేఱవలయునని దృఢముగ సం కల్పింపఁగా నా సంకల్పములు సూక్ష్మలోకముల రూపమును ధరించి యదృశ్యములుగ ధర్మబుద్ధి గల పురుషుల మనస్సులఁ జొచ్చి యెవ్విధముననో యాకార్యములకుఁ దోడ్పడవలయు ననుబుద్ధి వారలయందుఁ బుట్టించి యాకార్యములకుఁ గావలసిన ద్రవ్యసహాయము గలుగునట్లు చేయును.

మఱియును యోగ్యులగు పురుషులు ఆయురారోగ్యైశ్వర్యములుగాని, పుత్త్రప్రాప్తిగాని కలుగునట్లాశీర్వదించినచో నయ్యవి తప్పక సిద్ధించునని గ్రంథములయందుఁ గనఁబడుటయు ననుభవమున నుండుటయు నెఱుంగుదుము కదా! ఇదియును సమాహితమైన మనశ్శక్తిఫలమే గాని వేఱు కాదు. మన దేశములో సమస్తకార్యములయందు యోగ్యులగు మహాజనుల యాశీర్వచనము లపేక్షించుటకుఁ గారణమిదియ. వేలకొలఁది యోగ్యులగు బ్రాహ్మణులు ఏక వాక్యముగ మనఃపూర్తిగ నాశీర్వదించినఁ బూర్వకాలమున నట్టి యాశీర్వచనములు ఫలించుచుండెను. ఇప్పుడన్ననో ఆశీర్వదించు వారు స్వప్రయోజనపరులును, మనస్స్థైర్యముగాని, మనఃపారిశుద్ధ్యముగాని లేనివారు నగుటంబట్టి యాయాశీర్వచనములు చక్కఁగ ఫలింపఁజాలకుండుట యాశ్చర్యము గాదు. మఱియు భక్తులగు వారలు భగవద్ధ్యానానంతరమునను, గ్రంథకాలక్షేపాదుల పిదపను, లోకముయొక్క మేలు నుద్దేశించి స్వస్తివాక్యములు చెప్పునట్టి సంప్రదాయము కలదు కదా! ధ్యానముచేతఁగాని, గ్రంథకాలక్షేపముచేఁ గాని మనస్సు పరిశుద్ధమై దివ్యతేజస్సు నాకర్షించుకొని వీర్యవంతమై యుండఁగా నాసమయముల సంకల్పించిన తలంపులన్నియు సిద్ధించును. కావునఁ బురాణకథనానంతరమును, సంధ్యావందనాదుల తుదను "లోకాస్సమస్తాస్సుఖినో భవంతు" అని యాశీర్వదించుచుండుటచే లోకములకు మేలు తప్పక సమకూరును. మఱి

యును బూర్వాచార ప్రకారము దేశమునందలి భక్తులందఱును ప్రతిదినము బ్రాహ్మముహూర్తమున మేల్కాంచి శుచిర్భూతులై యేకాగ్రచిత్తమున భగవంతుని ధ్యానించి పరిశుద్ధమగు మనస్సుతో సర్వభూత హితమును గోరి యేక కాలమున క్రింద నుదహరించిన రీతిని స్వస్తివాక్యములు పలుకుచుండిరి.

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతామ్
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్
లోకాస్సమస్తా స్సుఖినో భవంతు ॥
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥
అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః ।
అధనాస్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్ ॥

ఇ ట్లేక కాలమున నిష్కాములై పరిశుద్ధ మానసులైన భక్తులందఱు వచింప వారియందఱసంకల్పశక్తి యేకమై లోకమునకుం దపారమగు మేలుచేయును. సకాలమున వర్షములు కురియుటయు, సస్యములు ఫలించుటయు, జనక్షోభకరములగునట్టి యీతిబాధలు లేకుండుటయు నీ మొదలగు మేలులు లోకమునకుంగలుగును. ఆధునికుల కట్టి యనుష్ఠానమునందు శ్రద్ధనశించియు, జనులు కేవలస్వప్రయోజనపరులగుటచే ధర్మమునకు హానియు నధర్మమునకు వృద్ధియుఁ గలిగి, పాపఫలములగు ననావృష్టియు, జనక్షయకరములగు వ్యాధులును బలుమాఱు సంభవించుట కాస్పదమైనది. ఇప్పుడైనను జనులు

ధర్మమునం దాసక్తికలిగి యన్యోన్యద్వేషభావముల వదలి, పరోపకార పరాయణులై, నిష్కాములయి పైనిజెప్పినరీతిని సకలజనుల మేలుకొఱకు ధ్యానించినచో భక్తజన సముదాయసంకల్పముల బలముచే లోకమునందలి సర్వానర్థములు నశించి లోకమునకు మేలుకలుగనే కలుగు ననుటకు సందియ మావంతయు లేదు.

ఇతరుల మేలుకొఱకు మనశ్శక్తి నుపయోగించుటయందు మఱియొక గొప్పరహస్యము గ్రహింపఁదగియున్నయది. దుర్మార్గమునం బ్రవర్తించుచు, సన్మార్గమును బోధించినను విననిచ్ఛయింపక తిరస్కరించు వారలకు వాక్కులచేఁ జేయఁబడు నుపదేశము పథ్యముకాకపోవుటయే గాక విపరీతమగును గదా! మఱియు బాలురకును, మూర్ఖులకును వాఙ్మాత్రముననుపదేశించుట యంత యుపయోగముగ నుండదు. అట్టివారలకు నిజముగ మేలుచేయవలె నన్న నొకయుపాయము కలదు. ఒక పురుషుఁడు ప్రతిదినమునను నిదురించు కాలమున వానినుద్దేశించి వానిరూపమును స్పష్టముగ మనస్సున నిరూపించి నీ యెదుటనుండునట్లు కల్పించుకొని వానిదుష్ప్రవర్తనము వలని కీడులనుగుఱించియు, నాదుష్ప్రవర్తనమును వదలి సన్మార్గమున వర్తించినఁ గలుగుమేలులను గూర్చియు దృఢము నేకాగ్రము నగు మనస్సుతోఁ గొంతకాలము మానసముగ బోధించుచుండిన నాపురుషుని దుష్ప్రవర్తనము క్రమక్రమముగ మాఱును. ఆపురుషుఁడు జాగ్రదవస్థయందు మనోవ్యా

పారము గలిగి విషయములయందు విహరించుచుండుటంబట్టి వానిమనస్సు ఇతరుల సంకల్పములను జొరనీయదు. కావున నాతఁడు నిద్రించుకాల మిక్కార్యమునకు సరియైన కాలము. అట్టికాలమున నాజీవుఁడు జాగ్రదవస్థను వదలియుండుటచే నితరుల సంకల్పములకు లోనగు. ఇట్లు కొంతకాలము ప్రతి దినము నాతని నుద్దేశించి చేయు నుపదేశ మాతని మనస్సునం బ్రవేశించి క్రమక్రమమునఁ దాఁబోవు మార్గము హానిని గలుగఁజేయునదియనియుఁ గావున నది విడువఁదగినదనియు నిట్టి తలంపులు జాగ్రదవస్థయందు మనస్సునఁ దమంతట తాము స్ఫురించును. ఇతరుల హితవచనముల నలక్ష్యము చేయు వారికిని, ఆమాటల మేలు తెలియనివారికిని వాక్కులచేఁగాని గ్రంథములచే గాని సన్మార్గమును బోధించుట దుర్లభమై యుండ నీయుపాయమున వారలను సులభముగఁ ద్రోవకుఁ దేవచ్చును. వారలట్లు సద్గతికివచ్చి తమంతట తామే మంచి మార్గము నవలంబించువా రని మెన్నఁబడుదురు.

ఇందొక విషయము బాగుగ గమనించవలయును. మనము తలచినట్లు వారు చేయవలయునని, మనశ్శక్తితో వారి నిర్బంధ పెట్టరాదు. అట్లుచేసినచో వారాయొక్క దుష్కార్యమును విడువవచ్చునుగాని, వారి దుర్గుణము పోయినదని చెప్పుటకు వీలులేదు. అది వానిని మరియొక దుష్కార్యమునం బ్రవర్తింపఁ జేయును. నిర్బంధ మెంతమాత్రము చేయరాదు. మంచి మాటలతో సావధానముగ మంచిచెడ్డలను సాధక

బాధకములను వానికి బోధించి వానిమనస్సునకే సరియయిన తోవ తెలియునట్లు చేయవలయును.

ఇట్లనేకవిధములగు గొప్పకార్యముల సాధించుటకు మనస్సు ముఖ్యోపకరణముగ నున్నయది. మనస్సుచేత సదా లోకమునకు మేలుచేయఁదగు సంకల్పరూపముల నుత్పత్తిచేసి వాని మూలమున ననేకులగు మానవులకు మేలుచేయవచ్చును. అటులనే దుస్సంకల్పములచేతఁ దదనుగుణములును, పిశాచ తుల్యములునగు రూపముల నుత్పత్తిచేసి వానిమూలమున ననేకులకు హానిచేయవచ్చును. మనస్సు సత్ప్రవర్తనమువలన లోకమునకు మహోపకారమును, దుష్ప్రవర్తనమువలన మహాపకారమును జేయఁగలిగియున్నయది. మనస్సు ఇతరులకు మేలుకీడులఁ జేయంజాలియుండఁ దనకును బంధమోక్షములకుఁగూడ ముఖ్యసాధనమనియును ముందే సూచింపఁబడియెఁ గదా! అట్టి మనస్సును జక్కఁగ నియమించి మంచిమార్గమునఁ బ్రవర్తింపఁజేసినవారు కాలక్రమమున నుత్కృష్టమగు పదమును జెంది లోకరక్షకులు కాఁజాలుదురు. యథార్థముగ నింద్రియములకు రాజుగానుండఁదగిన మనస్సు సామాన్యముగ మానవులయందు నింద్రియములకు లోఁబడి వర్తించుచున్నది కదా! అట్లు ఇంద్రియములకు లోఁబడి యింద్రియములు పోవు మార్గమునం బోయి జీవుని విషయసుఖములయం దాసక్తిగలవానిగఁ జేయుట యనునది ప్రభువు సేవకులకు లోఁబడి వర్తించు రీతియే కదా! అట్లుగాక జీవుఁడు మనశ్శక్తిని

దృఢముగఁ జూపి యింద్రియములను వశములుగఁ జేసికొనిన ట్లాయెనా యుక్తాయుక్తవివేకము క్రమముగ వృద్ధియై మనస్సు విషయాసక్తముగాక యీశ్వరాసక్తమగును. అపుడు జీవుఁడు బంధములచే విడువఁబడి జననమరణ రూపమగు సంసారము నుండి ముక్తుఁడగును. కాఁబట్టి యెల్లవారును నీయుత్తమోత్తమ సాధనమగు మనస్సును జక్కఁగ శాసించి వీర్యవంతముగను, నిష్కల్మషముగను జేసి తాము తరించి యితరులకు సదా మహోపకారపరులగుదురుగాక.

---

## ఎనిమిదవ యధ్యాయము

### మరణము-మరణానంతరస్థితి

లోకమునందు సామాన్యముగ మరణమును గూర్చి విశేష ముగ భయపడుట కలదు కదా! మరణశబ్దము నుచ్చరించిన మాత్రముననే పీడకలుగుననియును, ఆ శబ్దమే యవాచ్యమని యు నెన్నఁబడుచున్నది. ఐనను జ్ఞానులగువారలు మరణమును గుఱించి యించుకయైనను భయపడక యుండుటయే గాక మరణకాలమునందుఁ బూర్ణశాంతమును దెచ్చుకొని మనస్సు నందెట్టివికారమును జెందక భగవద్ధ్యాన పరులై బ్రహ్మానంద భరితులై సంతోషమున శరీరమును వదలిపోవువారని గ్రంథ ములయం దుపపాదింపఁబడి యుండుటయే గాక లోకములో ననేకుల కనుభవ వేద్యముగ నున్నయది. కావుననే " మంచి వారిని మరణమునఁ జూడవలయు " నను నీలోకోక్తి ప్రసిద్ధమై యున్నయది.

మఱియును జీవుఁడు శరీరమును వదలుసమయమున నెట్టి భావమును గలిగి యుండునో దాని కనుగుణమగు జన్మము ముందు రాఁబోవునని శ్రీ గీతాశాస్త్రమునందు భగవంతుఁ డుపదేశించియున్నాఁడు.

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥

(గీత. ౮. అ., శ్లో. ౬.)

తా. మనుష్యుఁ డేయే విషయమును స్మరించుచుఁ గడపట శరీరమును వదలునో ఆయాభావమునే నిరంతర తద్భావాసక్తివలనఁ బొందునని తాత్పర్యము. ఈమృత్యువువిషయమై యథార్థమును జక్కఁగ నెఱింగిన మానవుల కావిషయమై భయమును దుఃఖమును, మనోవ్యథయును నశించుటయే గాక మరణకాలమున మనస్సును నిర్వికారముగ నుంచుకొనుటచే సద్గతినొందుటకు సాధ్యమగును.

మరణమనఁగా జీవుఁడు స్థూలశరీరమును విడుచిపోవుటయే. స్థూలశరీరమును విడిచిన మాత్రమున జీవుఁడు లేకపోవుట లేదు. స్థూలశరీరమును మాత్రము వదలినపు డంతకంటె సూక్ష్మమును, చిరకాలముండఁదగినదియు నగు సూక్ష్మశరీరమును ధరించి యూర్ధ్వలోకమున నుండును. శరీరము నశించునదియనియు జీవుఁడు నాశరహితుఁడనియును గ్రంథములయందు నొక్కి చెప్పఁబడియున్నది. నశించునది శరీరముగాని జీవుఁడు కాఁడు. జీవుఁడు నిత్యుఁడు. నిర్వికారుఁడు. ఆదియం దల్పజ్ఞానము కలిగియుండి జ్ఞానము నభివృద్ధి చేసికొనుటకై యాయాలోకములఁ దదనుగుణములగు శరీరములను ధరించును. ఒక్కొక్కశరీరముచేఁ బొందదగు జ్ఞానమంతయు రాఁగా నాశరీరమువలని ప్రయోజనము తుదముట్టుటచే దానిని వదలి

జీవుఁడు మఱియొక శరీరమును గాలక్రమమునఁ బొంది జ్ఞానము నభివృద్ధిఁ జేసికొనుచునుండును. మానవులు తాము ధరించు వస్త్రములు జీర్ణములు కాఁగా వానిని ద్యజించి క్రొత్తవియగు నితరవస్త్రముల గ్రహించురీతిని జీవుఁడు జీర్ణములై నిష్ప్రయోజకములగు శరీరముల వదలి నూతనములును జ్ఞానసాధనములు నగు నితర శరీరముల ధరించును.

> వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
> తథా శరీరాణి విహాయ జీర్ణా న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥
> (గీత. ౨. అ., శ్లో. ౨౨.)

జీర్ణవస్త్రములను ద్యజించుట మానవులకు దుఃఖకారణము కాదుకదా! అట్లు ప్రయోజనహీనమగు శరీరమును వదలుచో జ్ఞానులగువారు మనోవ్యథను జెందరు. మానవుఁడు కార్యార్థమై యొక్క దేశమునఁ గాని, యొక గ్రామమునఁగాని, యొక కాలమునగాని నివసించి యాకార్యము పరిసమాప్తికాఁగా నాయాస్థలములను వదలి దేశాంతరము నొందురీతిని జీవుఁడు నొక్కొక్క దేశమున నొక్కొక్క కాలమున నొక్కొక్క జాతియందు దేహధారియై జన్మించి యాయా జన్మమువలనఁ బొందఁదగు జ్ఞానమునంతను బొందినపిదప నాశరీరమును వదలి దేహాంతరమును గూర్చి పోవును. అట్లు పోవుట మిక్కిలి యావశ్యకమని చెప్పవలయునా! మరణమనునది లేకయే యుండిన జ్ఞానాభివృద్ధి కవకాశము తక్కువగ నుండును. లోకమున నొక బీదగృహస్థువు తన యోగ్యతానుసారముగ నల్పమగు నొక

గుడిసెను నిర్మించుకొని తనకుఁ గుటుంబవృద్ధియు, సంపద్వృద్ధి యుఁ గానుకాను కాపురమునకుఁ జాలని మొదటికుటీరమును విఱుగఁగొట్టి విస్తీర్ణమును సుఖప్రదమును నగు క్రొత్తగృహ మును నిర్మించుకొనును గదా! అట్లే జీవుఁడు యోగ్యతాను సారముగ నొక శరీరమును బొంది యాశరీరమున సాధింపఁ దగునంతటి జ్ఞానమునుసాధించి పిదప నెక్కువ జ్ఞానమున కవ కాశమీయని యా దేహమును వదలి దానికంటెఁ బరిశుద్ధమును నుత్కృష్టమును, పాటవము కలదియు నగు వేఱొకశరీరమును ధరించకపోయిన వృద్ధి కవకాశమే లేదు. కావున నొకశరీరము వలని ప్రయోజనము తీరినతోడనే పరమ దయానిధియగు నీశ్వరుఁడు ఆశరీరమును విలయము నొందించి యెక్కువ జ్ఞాన మునకు సాధకమగు దేహాంతరము నొనఁగూర్చును. ఆకారణముననే జ్ఞానప్రదాతయగు మహేశ్వరుఁడు లయకర్తయని పిలువంబడుచున్నను యథార్థమున నుద్ధారకుఁడే యగు. ఇట్లు జన్మజన్మమున జ్ఞానము నభివృద్ధిచేసికొనుచుఁ గాలక్రమమున జీవుఁడు పరిపూర్ణజ్ఞాని యగువఱకు నిర్బంధముగ శరీరముల నొకదానివెంట నొకటిగ ధరించుచుండవలయును. కావున మరణమున నొకశరీరము పోయి యద్దానికంటె శ్రేష్ఠమగు మఱియొక శరీరము వచ్చుటంజేసి చావు సంతోష కారణమే కాని దుఃఖహేతువు కాదు. కేవల దుష్టప్రవర్తనముగల జీవునకుంగూడ స్థూలశరీరవియోగము మేలొనర్చును. వాఁ డాశరీర వియోగానంతరము భువర్లోకమునందలి యాతనాను

భవముచే జ్ఞానమును సంపాదించి రెండవజన్మమెత్తునుగాన మరణ మట్టివానికి శుభప్రదమే. కావున జీవుని యుత్క్రమణ కాలమునఁ బ్రక్కనెనుండువారలు జీవుని సుఖోత్క్రాంతి నుద్దేశించి జీవునకు సుఖముగ నూర్ధ్వలోకప్రాప్తి గలుగవల యునని భగవంతుని ధ్యానించుచుండవలయునేగాని మృతి నొందువాని మనస్సు గలవిలపాటొందునట్లు దుఃఖపడరాదు. ప్రతిజీవునకు నుత్క్రమణ సమయమున జన్మప్రభృతి మరణ కాలమువఱకుఁ దాను జేసిన సమస్తకర్మములును నేకకాలిక ముగఁ జిత్రింపఁబడునట్లు మనోగోచరమగు. పోయినజన్మ మందుఁ దాను జేసిన సమస్తధర్మాధర్మ కర్మములవలనఁ గలిగిన శుభాశుభ వాసనలు మరణకాలమున స్ఫుటముగఁ గనఁబడి యీ జన్మమున స్వభావములగును. అనఁగా నీజన్మమునఁ జేసిన కర్మములవాసనలు మరణకాలమున యథార్థమూర్తులతోడఁ బ్రత్యక్షమై రాబోవుజన్మమునకు మూలముగ నేర్పడును. ఈవిషయము శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు గీతా భాష్యమునందు సూచించియున్నారు.

> జన్మాంతరకృతో ధర్మాధర్మాదిసంస్కారో మరణకాలే
> అభివ్యక్తస్స్వభావ ఉచ్యతే ॥
>
> (గీత. ౧౭. ౨. శం. భా.)

> యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
> తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥
>
> (గీత. ౮. ౬.)

ఇదియే యంత్యప్రత్యయమని వేదాంతశాస్త్రమున వాడఁబడుచున్నయది. అంత్యకాలమున మనస్సునస్ఫురించు భావము జన్మాదినుండి స్మరణరూపముగ నభ్యసింపఁబడిన భావమేయగుఁగాని వేఱుభావ మాకాలమున స్ఫురించుట కవకాశములేదు. కావుననే

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర ।

(గీత. ౮. ౭.)

అంతకాలేచ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

(గీత. ౮. ౫.)

అని చెప్పియున్నారు.

తా. అంత్యకాలమునందు నన్నుమాత్రమే స్మరించుచు దేహమును వదలి యెవఁడు ప్రయాణముచేయునో యట్టి జీవుఁడు నన్నే పొందుచున్నాఁడు. సందేహములేదు. అట్లే మఱి యేయేభావములతో జీవుఁడు శరీరమునుండి వెడలునో యాభావమునే పొందును. అట్టి యంత్యప్రత్యయము జన్మాదినుండి యభ్యసింపఁబడిన మనోవృత్తుల ననుసరించియే యుండును. కావున సర్వకాల సర్వావస్థలయందును భగవంతుని స్మరించుచున్నవాఁడు సదా తద్భావముగలవాఁడయి యంత్యకాలమునసైత మాభగవంతుని స్మరణమే గలిగి భగవంతుని జెందును. ఉత్క్రమణకాలమున రాఁబోవు జన్మగతిని నిర్ణయించునట్టి ముఖ్యమగు వ్యాపారమున జీవుని మనస్సు లయించియుండును. ఆకాలమునఁ జుట్టుప్రక్కలనుండువారు రోదన

ధ్వనులచేతను దుఃఖవార్తలచేతను ఆజీవుని మనస్సుఁ జలింపఁ జేయుట బహుదోషకరము. అట్టిసమయమున నాత్మబంధువులు మనస్సులను స్తిమితములుగఁ జేసికొని జీవుని పురోవృద్ధి కొఱకు ధ్యానించుచు, భగవన్నామసంకీర్తనముచేయుచుండిననే బంధువు లనఁబడఁదగియుందురు.

జీవాత్మ భూలోకమున వర్తించుటకు స్థూలశరీరమును, దానియందంతట వ్యాపించి ప్రాణమున కునికిపట్టయిన స్థూలశరీర ప్రతిబింబమైయుండు ఛాయాశరీర మనఁదగు ప్రాణమయకోశమును, ఊర్ధ్వములగు భువర్లోక స్వర్లోకముల యందు వర్తించుటకుఁ దదనుగుణములగు శరీరములను ధరించునని ముందే యుపపాదింపఁబడియెఁ గదా! ఈలోకములన్నియు భగవంతుని సృష్టియందుఁ జేరినవియే; ఇవి బ్రహ్మాండమునందంతర్భాగములే యగుటంజేసి జీవుఁడు ఒకలోకమునుండి మఱియొక లోకమును బొందుచో నాబ్రహ్మాండమునందే వేఱువేఱు భాగముల వర్తించువాఁడు గాని నశించువాఁడు కాఁడు. సామాన్యముగ లోకమున మానవుఁడు మృతినొందె నన జీవుఁడు స్థూలశరీరమునువదలి సూక్ష్మశరీరమున వర్తించుచున్న వాఁడని యర్థము. జీవుని యుపాధులన్నింటిలోఁ గనిష్ఠమును, అల్పకాలికమును నగునది యీ స్థూలశరీరము. ఇది ప్రయోజనహీన మైనపుడు జీవుఁడు తనవగు ప్రాణములను, ఇంద్రియములను, మనస్సును, స్థూలశరీరమునుండి విడిపించుకొని భూలోకవ్యాయామమునుండి

 

విరమించుకొనినవాఁడయి వానితోడ సూక్ష్మలోకమున వర్తించువాఁడు.

జీవుఁడు బహుకాలము స్థూలశరీరమునం దభిమానమున వర్తించి యుండుటంబట్టి దానిపై నభిమానము దృఢమై దానికిని దనకును గల సంబంధము వదలిపోయినను, దానిని విడిచిపోనొల్లక దానికి సమీపమునందే పైఁజెప్పిన ఛాయారూపముతోఁ దిరుగుచుండును. ఆ కారణముననే జీవుఁడు ప్రేతరూపమునఁ మృతినొందిన స్థలమును, శరీరసంస్కారములు జరిగిన స్థలమును ఆశ్రయించుకొని కొంతకాల ముండుననియును, బలుమాఱు ఆస్థలములలోఁ గొందఱి కన్నులకు గోచరమగుననియును లోకరూఢిగ నున్నది. మఱియు స్థూలశరీరమును వదలినమాత్రమున రాగద్వేషములుగాని, యితర మనోవృత్తులు గాని జీవుని విడువవు ; కావున, జీవుఁడు తాను ప్రేమించువారలకుఁ గనఁబడవలయు నను నిచ్ఛచేతను, తన మనస్సునందలి కోరికలను గొన్నింటిని దెలుపవలయు నను నాశచేతను, కొన్ని సమయముల నాస్థలములయందుఁ గనఁబడుటకును, అభిప్రాయములఁ దెలుపుటకును వృథాప్రయత్నములు చేయును ; కాని భూలోకసంబంధమైన స్థూలావయవములు లేమిం జేసి స్థూలశరీరధారు లగువారలకుఁ దెలియునట్లు మాటలాడుటకు శక్తిలేక యుండును. తాను భూలోకమును విడిచిపోయినను వారల కెద్దియో యొకవిధమునఁ దనయిష్టము తెలుకపడునట్లు చేయఁగోరి యసంగతములగు శబ్దములు చేయుటయుఁ

గలదు. బ్రతికియున్నవారలకుఁ గనఁబడవలయు ననుకోరిక కొందఱియం దెక్కువగ నుండుటచే బహువిధప్రయత్నపూర్వకముగ రూపమెత్తి దృగ్గోచరమగుటయుం గలదు. ఇట్లు కనఁబడునది జీవుని కామమయశరీరము. అపుడు జీవాత్మ సూక్ష్మశరీరమును దాల్చి వర్తించుచుండును. అట్లు దృగ్గోచరమైనను అట్టిదర్శనములు భయహేతువులుగ నెంచరాదు. తెలుచుగ శరీరమును వదలిపోయిన జీవుఁడు దేహధారులుగ నుండు నిష్టులగు వారలయందుఁ గల మమకారముచేత వారలసమీపమునఁ దిరుగుచు, వారలకుఁ గనఁబడి తనమనోభీష్టములను దెలుపఁ జూచుటయేగాని వేఱుగాదు. అట్టిరూపములఁ బిశాచములనియు, భయహేతువులనియు, హానిచేయునవి యనియు నెంచుట పొరబాటు. చూచువారలు మనస్స్థైర్యము గలిగి యారూప మదృశ్యమగునట్లు దృఢముగ సంకల్పించిన నయ్యది యదృశ్యమగును. పలుమాఱు అట్టిదర్శనములచేఁ గీడు పొందుదురని యెంచి భయపడుటచేతనే కీడుగలుగును గాని తెఱచుగ గతించినవారలకు నట్టి హానిచేయుట కిష్టముగాని శక్తిగాని యుండదు. ఐనను గొందఱు ఈర్ష్యాక్రోధములతో నిండి మృతినొందినచోఁ దమక్రోధమును జూపు నుద్దేశమున భయంకరరూపమును ధరించి తమ కనిష్టులగు వారలకుఁ గనఁబడుట కలదు; కాని అప్పుడితరులు స్థిరచిత్తులయి నిర్భయులై యుండినచో నెట్టికీడును బొందఁజాలరు. అదృశ్యమగునట్లు దృఢముగ సంకల్పించినచో వార లదృశ్యులై పోవుదురు.

స్థూలశరీరము ఎంతవేగముగ నశించునో యంతవేగముగ దాని ననుసరించి ఛాయాశరీరము సహితము నశించును. కావు ననే శవములను భూస్థాపనము చేయుటకంటె దహించుట యుక్తమని శాస్త్రములయందు విధింపఁబడియున్నది. స్థూల శరీరము (అనఁగా శవము) భస్మముకాఁగా ఛాయాశరీరము కూడఁ దనంతన యణురూపముగ వీడిపోయి రెండును బంచ భూతములలోఁ గలిసిపోవును. ఉత్క్రమణ కాలిక క్రియలును, దహనకాలమునందుఁ జేయు కార్యములును, తదనంతరము చేయు నుత్తరక్రియలును జీవుని స్థూలశరీరమునుండి సులభ ముగ వెడలించుటకును, ఛాయారూపమును సులభముగ నశిం పఁజేయుటకును, జీవుని భూలోకవాసనలను వదలించి యా తనాశరీరమునందలి బాధల నుపశమింపఁజేసి వానినుండి జీవుని వెడలించుటకును, ఊర్ధ్వలోకప్రాప్తి సుసాధ్యమగునట్లుచేయు టకును సహకారులుగ విధింపఁబడినవి. ఉత్తరకాలికక్రియలు చేయువారీకర్మములవలని ప్రయోజనముల నెఱింగి దాఁటి పోయిన జీవుని దృఢముగ నుద్దేశించి యాజీవున కూర్ధ్వగతి సులభముగఁ గలుగుఁగాక యను నతిదృఢసంకల్పముతో నాకర్మములను జేసిన నాక్రియలు సఫలములగు. అట్లు సార్థక ములగు క్రియలుచేసిన పుత్త్రుఁడే పుత్త్రుఁ డనఁదగు. "పుత్త్రి మంతే చ కర్మణి" యనియును, పున్నామ నరకమునుండి తరిం పఁజేయువాఁడే పుత్త్రుఁడనియును జెప్పుట మరణకాలమునను తదనంతర మూర్ధ్వలోకప్రాప్తి కనుకూలముగను ఈకర్మముల

శ్రద్ధతోఁ జేయుటవలని ప్రయోజనమును సూచించుటయే కదా! అట్లు శాంత మనస్సుతోడను, జేయుక్రియలు సార్థకములై గతించినవారలకు సుఖప్రాప్తికరములు కావలయు నను నుద్దేశముతోడను క్రియలుచేయక, దుఃఖవ్యాకులితమనస్సులతోఁ జేయుపరలోకక్రియ లుద్దేశించినఫలముల నీయఁజాలవు. అట్టి క్రియలుచేసినను ప్రయోజనము లేనివగు.

మరణ మనగా స్థూలశరీరమునకును ఛాయా శరీరమునకును సంబంధమును గలుగఁ జేసియుండు తంతువు తెగుట యని చెప్పఁబడెను గదా! (68వ-పుట చూడుఁడు.) అటు పిమ్మట త్వరలోనే జీవుఁడు ఛాయాశరీరమును సైతము వదలి భువర్లోకమున నుండును. అపుడు జీవుడు కామమయ శరీరమున నుండును. ఐనను ఆకామమయశరీరము జీవితకాలమున నుండినరీతిన నుండదు. అందలిప్రకృతి స్థూల సూక్ష్మతారతమ్యము ననుసరించి యేడుపొరలుగ నేర్పడి, యాతనాశరీరమను పేరఁ బరగును. (76వ-పుట.)

జీవిత కాలములో పామరులు రాగద్వేషములకు లోనై కోరికలను, క్రోధాదులను స్వేచ్ఛగ పెంచుచు, వానిలో కొన్నియయినను ఈడేర్చుకొనఁజాలక, యారాగద్వేషములతో నిండియే మరణమును జెందుదురు. స్థూలశరీరము మాత్రము నశించెనుగాని రాగద్వేషము లన్నియును పూర్వమువలెనే దృఢముగ నిండియున్నవి. యాతనాశరీరములో నీకోరికలు బహిర్గతములై యుద్రేకించగా వాని నీడేర్చుకొన సాధన

మగు స్థూలశరీరము లేమింజేసి వాని ననుభవింపఁజాలక జీవుఁడు పరితపించుచుండును. ఇందుకుఁ గొన్ని దృష్టాంతముల నిట ననువదింతుము. భూలోకమున జీవించియుండుకాలమున స్త్రీలోలుఁడుగా నుండి ఆయాశలతో మృతిబొందినచో శరీర పతనానంతరము ఆకోరిక బహిర్గతమగును. సూక్ష్మలోకముల యందు సంకల్పములును, కోరికలును రూపములఁ దాల్చునని ముందే వచింపఁబడియెఁగదా! (95వ-పుట). పైఁ జెప్పినట్లు జీవునకుఁ గామ ముద్రేకముకాఁగా కామ హేతువగురూపము మనస్సున స్ఫురించును. అది యాలోకమున రూపమును ధరించి వానికి దృగ్గోచరమగు. ఆరూపమును జూచి తనకోరిక నీడేర్చుకొన యత్నించునుగాని స్థూలశరీరము లేకుండుటంబట్టి యనుభవించుటకు సాధ్యముకాక యెక్కుడుగఁ బరితపించును. పరితాపము హెచ్చుచుండుకొలఁదిని ఆరూపము దృఢతర ముకాఁగా తదనుగుణముగ నాసందర్శనము వలని పరితాపము వృద్ధియై కొంతకాలమున కాకోరిక దుఃఖమూలము కదా యను జ్ఞానము జీవునకు స్ఫురించును. మఱియు జిహ్వాచా పల్యము కలిగియుండినయెడల మిక్కిలి మక్కువగల పదార్థ ముల నీయాతనా శరీరధారియగు జీవుఁడు పలుమాఱు చింతింప నాపదార్థములు రూపవంతములై యెదుటఁగనఁబడి వాని యందలి చాపల్యమును వృద్ధిచేయ వాని భక్షించు నుపాయ ములేక రోగియగువాఁడు అపథ్యములగు మృష్టాన్నములఁ జూచి తినఁగోరి దుఃఖించునట్లు మఱిమఱి పరితపించును. అట్లే

తనలోనుండిన యొక్కొక్క కోరికయు నాసూక్ష్మశరీరమున బహిర్గతమై రూపముఁదాల్చి పరితపింపఁజేయును. ఇట్లు బహు కాలము ఫలింపని కోరికలవలన దుఃఖించి దుఃఖించి కోరికలకు లోఁబడుట తుదకు దుఃఖకారణమను జ్ఞానమును ధృఢపఱుచుకొని రాఁబోవుజన్మమున నీజ్ఞానము వాసనారూపముగఁ గలిగి జన్మించును. కనుక మరణానంతరము నరకదుఃఖమనునది జీవుని యజ్ఞానమును బోఁగొట్టి యజ్ఞానకృతకార్యముల యందలి దోషములను జూపించి జ్ఞానమును బోధించుటకు దయానిధియగు భగవంతుఁడు విధించెను. కాని పాపుల నెవ్విధముననైన బాధించి తనయాగ్రహమును వెళ్ళఁబుచ్చుటకు విధించలేదు. తప్పుత్రోవలంబోవు బాలుని దయచేఁ దండ్రి శిక్షించి జ్ఞానమును బోధించి యభివృద్ధికిం దెచ్చులాగునఁ బరమదయాస్వరూపుఁడును, జగదేకపితయునగు సర్వేశ్వరుఁడు తనబిడ్డలగు మానవులకు మొట్టమొదటఁ గర్తవ్యాకర్తవ్యములను, బుణ్యాపాపములను, మంచి చెడుగులను నిరూపించు ధర్మములను దమప్రతినిధులగు మన్వాదులమూలమున బోధించి, యాధర్మమార్గమున నడువని జీవులకు తత్ఫలముగ నీలోకమునఁ గలుగు దుఃఖములవలనను, నరకమునఁగలుగు పరితాపములవలనను దాము పోవుమార్గము దూష్యమను జ్ఞానమును బోధించును.

ఈయర్థమునే శ్రీభగవద్గీతాశాస్త్రమున సంక్షేపముగ రెండుశ్లోకములలో భగవంతుండు బోధించియున్నారు.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామః క్రోధః తథా లోభః తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥
(గీత. ౧౬-౨౧.)

నరకమునకు మూడుద్వారములు: కామము, క్రోధము, లోభము. కావున నీ మూడును విడువవలయును.

శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం సయుక్తః ససుఖీ నరః ॥ (గీత. ౫-౨౩.)

జీవించియుండు కాలములోనే అనగా స్థూలశరీరము నశించుటకు పూర్వమే, కామక్రోధములవలన గలుగు ఉద్రేకమును ఎవడు అణచుకొనగలుగునో వాడే యోగి. వాడే సుఖి.

ఇట్టి జ్ఞానమును బొందుట నరకదుఃఖమువలని ప్రయోజనము. పరజన్మమునఁ బూర్వకర్మము ననుసరించి విషయవాసనలు బలముగ నుండియు నరకబాధనుండి పొందిన జ్ఞానము జీవునకు సహాయమై వాని నశుభవాసనలనుండి తొలఁగించి యుక్తాయుక్తవివేకమును వృద్ధిచేయును. అట్టి వాని నింద్రియములు విషయాసక్తుని జేయుచుండఁగా నది కీడని యాజ్ఞానము తనలోనుండి హెచ్చరిక చేయుచుండును.

చదువరుల మనంబులయం దొకసంశయము పుట్టవచ్చును. కామక్రోధలోభములవలనఁ మరణానంతరము ఊర్ధ్వలోకమున జీవునకు తాపము గలుగునుగదా? మరుజన్మమున భూలోకమున సైతము పూర్వకర్మఫలములగు దుఃఖములు గలు

గుట ఏల, యని జిజ్ఞాస పుట్టవచ్చును. కర్మలెట్లు మనోవాక్కా యికములని మూడు తెరంగులో అట్లె వానిఫలములుసైతము భిన్నములు. ఇంద్రియ కార్యములగు విషయేచ్ఛలు, వాని నుండి యుత్పత్తియగు కామక్రోధలోభములు, సూక్ష్మశరీర మునందు బుట్టువికారములు. అవి సూక్ష్మశరీరమునందుండి స్థిరములై పైన సూచించిన విధమున మరణానంతరము యాతనలుగ జీవున కనుభవమునకువచ్చును. కామముగాని క్రోధముగాని లోభముగాని అంతఃకరణమున పుట్టి యింతటితో నిలిచిపోయినయెడల, వానిఫలము జీవునకు ఊర్ధ్వలోకయాతనానుభవముతో సమాప్తముకావచ్చును. సాధారణముగ కామక్రోధములు కేవల మానసికవృత్తులుగ నిల్చుట అరుదు. లోపల కామక్రోధములు పుట్టగనే అవి కార్యరూపముగ వెలువడును. అట్టికార్యములు భూలోకమున నితరులకు సుఖమునో దుఃఖమునో పుట్టించును. కావున స్థూలశరీరముతో చేయుకార్యములు పరులకు సుఖదాయకములుగనుండిన, వానిఫలము తరువాతి జన్మములయందు సుఖరూపముగను, అవి యితరులకు దుఃఖమూలములైనయెడల, వానిఫలము దుఃఖరూపముగను పరిణమించును. ఈరహస్యమును తెలిసికొనిన వారు కర్మగతిని చక్కగ తెలిసికొని తదనుగుణముగ ప్రవర్తనమును సవరించుకొనజాలుదురు.

పైఁ జెప్పినరీతిగా భువర్లోకమునఁ గొంతకాలముండి తనయందలి రాగద్వేషములును, కామక్రోధములును, ఆశాపాశ

ములును గ్రమక్రమమున నశింప, భువర్లోకమునందలి యూర్ధ్వ భాగమను బితృలోకమును జేరి కేవలవిషయాసక్తికి సంబంధిం చిన పారలౌకిక సుఖముల ననుభవించగ నాలోక సంబంధమగు కామమయశరీరము అనఁగా యాతనాశరీరము నశించును. ఆ పిదప నంతకంటె సూక్ష్మమగు మనోమయశరీరమునుదాల్చి తేజోమయమగు స్వర్గలోకమునఁ గేవలవిషయా సక్తికి సం బంధించని పారలౌకిక సుఖము లనుభవించుచు, భూలోకము నందు వాడుకచేసిన శ్రద్ధాభక్తులు నిర్వ్యాజప్రేమాదులు శా స్త్రవిచారముచేఁ గలిగిన జిజ్ఞాసయు నిట్టి యితర పారమార్థిక సంకల్పములు వెంటనంటిరాఁగా నాలోకమున జీవున కవి యన్నియు మూర్తిమంతములై ప్రత్యక్షములుకాఁగా వాని ననుభవించుచు వానివలనఁ గలుగు సారభూతమగు జ్ఞానమును గ్రహించుచు జీవుఁడు సుఖానుభవమును జెందును. భూలోక మునఁ జేసియుండిన సత్సంకల్పముల నన్నింటి నిట్లు మాన సికానుభవమునకుఁదెచ్చుకొని యాయావాసనలను దృఢ పఱచుకొనును. ఎవ్వఁడేనియు జీవితకాలమునఁ బరోపకార బుద్ధి గలిగి పరులకు నానావిధములుగ సహాయము చేయుఁబూని యుండినయెడల నాసత్పురుషుఁడు స్వర్గమున నట్లే పరోకార తత్పరుఁడై యుండి యనేకులు బీదలు తన్నావరించియుండి వార లకుఁ బెక్కువిధముల సహాయముచేసి యానందించు నట్లు మానసికానంద మందును. మఱియు నొక్కఁడు జీవితకాలము నందు నెద్దియేని యొక శాస్త్ర వ్యాసంగముఁ జేయుచుఁ

గాలము గడిపెనేని యతఁడు స్వర్గమున నాశాస్త్రము నే యెక్కుడుగ నభ్యసించుచుఁ దనకుఁ గల సందేహాదుల మన నము చేతను స్వర్గవాసులైన శాస్త్రజ్ఞుల యుపదేశాదుల చేతను దొలఁగించుకొని యాశాస్త్రజ్ఞానము విశేషముగ నభి వృద్ధిచేసికొని సుఖానుభవమును బొందుచుండును. భూలోక మున నెవ్విధమగు వ్యాసంగము నెంతపరిపూర్ణముగఁ జేసి యుండునో యంతవిశేషముగ స్వర్గలోకమునఁ దత్సంబంధ మగు జ్ఞానము నభివృద్ధిచేసికొని యనంతరజన్మమున నాశాస్త్ర జ్ఞానమున కనుకూలమగు దృఢవాసనలతోడఁ బుట్టును. లోక మున జనులలోఁ గొందఱొక్కశాస్త్రమునందు బాల్యము నుండి ప్రవీణులుగ నుండియు నితరశాస్త్రములయందు బుద్ధి యించుకంతయుఁ బ్రసరింపకుండ నుండుట యనుభవవేద్యము. ఒకొక్కరు అతిబాల్యమునుండియు సంగీతశాస్త్రప్రవీణు లుగ నుండ మఱికొందఱు అధికప్రయత్నముతో సహిత మా శాస్త్రమును గ్రహింపఁజాలక యున్నవారు. అట్లే కొందఱు గణితశాస్త్రమునందును, మఱికొందఱు వ్యాకరణాది శాస్త్ర ములలో నొకొక్కదానియందు బాల్యమునుండి ప్రవీణతఁ జూపుచుందురు. ఆబుద్ధికుశలత యితర విషయములయందుఁ గనఁబడకయుండు. వారలందఱు పూర్వజన్మముల నాయా శాస్త్రముల నధికముగ నభ్యసించి స్వర్గమునఁ దత్సంబంధ మగు వాసనల దృఢపఱచుకొని వానితోడ జన్మించియున్న వారని తెలియఁదగు.

ఇట్లు జీవుఁడు మనుష్యలోకమున జనన మొందుచుఁ బూర్వ కర్మానుసారముగ సుఖదఃఖముల ననుభవించుచు, నవీనకర్మ ములఁ జేయుచు శరీరపతనానంతరము నరకసంబంధములగు దుఃఖములను, ఆపిదప స్వర్గసుఖములను అనుభవించుచుఁ గ్రమక్రమమున జ్ఞానశక్తుల వృద్ధిచేసికొనుచున్నవాఁడు.

నరకమునం దనుభవించు దుఃఖమును, స్వర్గమున ననుభ వించుసుఖమును బురుషార్థసాధనమగు జ్ఞానము వృద్ధియగుట కొఱకు నియమింపఁబడినవిగాని కేవల సుఖదుఃఖములనిచ్చుట కొఱకుఁగాదని మరల మరల నొక్కి చెప్పఁదగు విషయము. బాలుఁడు పాఠశాలలో విద్యాభ్యాసముచేయుకాలమున బా లుని జ్ఞానాభివృద్ధినుద్దేశించి యుపాధ్యాయులు శిష్యుని నొక ప్పుడు దండించును. మఱియొకప్పుడు శిష్యున కుత్సాహము గలుగఁ జేయు బహుమతుల నిచ్చును. కాలానుసార ముగ దండనయు బహుమతులును జ్ఞానము నభివృద్ధిచేయు సాధనములు గాని వేఱు స్వతంత్రప్రయోజన మెద్దియును గలవిగావు.

పాఠశాలకుం బోవు బాలుఁడు విద్యాభివృద్ధికొఱకుఁ బోవు నుగాని బహుమతులను బొందుటకుంగాని దండన మనుభవిం చుటకుంగాని కాదు. ఆలాగే నరకమున దుఃఖమును, స్వర్గము నందు సౌఖ్యములును బురుషార్థసాధనమగు జ్ఞానమును సంపా దించుటకు సాధనములుగాని వేఱుకావు. కావున జీవునకు భూ లోకమును, నరకమును, స్వర్గము నను నీమూఁడులోకములు

జ్ఞానస్థానమగు పాఠశాలగ నున్నయవి. పరమదయానిధియగు జగదీశ్వరుఁడు శిశుప్రాయులగు మానవుల యజ్ఞానము నివర్తింపఁజేసి పరిపూర్ణ జ్ఞానులుగఁ జేయుటకు ఒకప్పుడు నరక భాధను, ఒకప్పుడు స్వర్గసుఖము నొసంగి జీవులను దరింపఁ జేయుచున్నవాఁడు. ఎల్లయెడలను సుఖదుఃఖములు గలుగుచో వానినుండి గ్రహింపఁదగు జ్ఞానము నూహించుకొని దాని నభ్యసింపనిచో నాసుఖదుఃఖానుభవము నిష్ప్రయోజన మగుచున్నయది. దానినుండి పొందఁదగుజ్ఞానము పూర్ణముగ నొందువఱకు నాసుఖదుఃఖముల మాటి మాటికి ననుభవించియే తీరవలెను. ఆజ్ఞానమును బరిపూర్ణముగఁబొందిన నాపైనట్టి యనుభవ మనావశ్యకమే యగు.

ఈరీతిని భూలోకమునఁ జేసిన వివిధకర్మముల నుండియు, త్రిలోకములందలి నానావిధానుభవములనుండియు సారభూతమగు జ్ఞానశక్తులను గ్రహించి తత్సంబంధములగు శుభవాసనల దృఢపఱచుకొనును. కాఁపువాఁడు కొంతకాలము భూమియందు పాటుపడి వ్యవసాయముచేసి భూమినుండి ఫలమును గ్రహించి యిల్లుచేరి యాఫలమును సావధానముగ ననుభవించి సుఖించు లాగున జీవుఁడు కొంతకాలము భూలోకమునఁ గర్మములను జేసి యాపిదప నూర్ధ్వలోకముల నాకర్మములను సావధానముగ మననముచేయుచు, తత్ఫలభూతములగు సుఖదుఃఖముల ననుభవించుచు, దాని సారభూతమగు జ్ఞానశక్తులను గ్రహించుచున్నవాఁడు.

ఇట్లు భూలోకమునఁ జేసిన పుణ్యకర్మములను బట్టి బహుకాలము స్వర్గలోకముననుండి యాపుణ్యము క్షీణింపఁగా నా స్వర్గలోకమందలి మనోమయశరీరము సహితము నశించును. అపుడు జీవుఁడు విజ్ఞానమయకోశ ముపాధిగ మహర్లోకమున గొంతకాలముండి, యనేక జన్మముల కర్మఫలములు బీజరూపములుగ నా విజ్ఞానమయకోశమున నుండుటచే నవి యంకురింప సకాలమగుటంజేసి బహిర్ముఖుఁ డగుచున్నవాఁడు. కర్మానుసారమగు శుభాశుభ వాసనలఁ గలిగియుండు నవీనమగు మనోమయకోశమును సువర్లోక ప్రకృతితోడను, పిదప కామమయమగు సూక్ష్మశరీరము భువర్లోక ప్రకృతితోడను ఆకాలమునకు దేవతల సహాయముచే నిర్మింపఁబడును. మఱియును జీవుని కర్మానుభవమున కనుకూలములగు దేశకాలముల ననుగుణమగు కుటుంబమున స్థూలతనువును దాల్చును. కర్మఫల ప్రదాతలగు కర్మదేవతలు జీవుని యుత్తరజన్మమును బ్రారబ్ధానుభవమునకు ననుకూలమగు దేశము, కాలము, జాతి, కుటుంబము మొదలగువానిని విధించి జననమొందింపఁ జేయుదురు. ఇట్లు విధింపఁబడిన దేశకాలాదులయందు జననమొంది పూర్వకర్మానుసారమగు వాసనలం గలిగి ప్రవర్తించుచుండును. ఇట్లు జన్మజన్మమునఁ గర్మములను జేయుచుఁ గర్మఫలముల ననుభవించుచుఁ గర్మానుభవము వలని జ్ఞానము వృద్ధికానుకాను ముందటి యశుభవాసనలకు లోఁబడక యధికప్రయత్నముతో నా

యశుభవాసనలను దొలఁగించుకొనుచు శుభవాసనల దృఢ పఱచుకొనుచు సకాలమున జ్ఞానవృద్ధుఁడై దేహేంద్రియమనో మలంబులఁ దుదముట్ట నశింపఁజేసి సదా ధ్యానయోగపరుడై పూర్ణుఁడై పరమేశ్వరాజ్ఞానుసారము భూతసేవచేయుచు పరమ పురుషార్థమును జెందుచున్నాఁడు.

అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ।

(గీత. ౬-౪౫.)

తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేరతాః ॥

(గీత. ౧౨-౪.)

## తొమ్మిదవ యధ్యాయము

### దేహబీజములు, భూతసూక్ష్మములు

జీవుడు యీశ్వరాంశమనియును, ఈశ్వరునియందు లీనమై యనుపాదకతత్త్వమున నుండుననియును, పాంచభౌతిక మగు ప్రపంచమున నభివ్యక్తమగుట కొక్కొక్క తత్త్వమునుండి యొక్కొక్క యణువును స్వీకరించుకొని దాని నాయాలోకమునందుపాధిగ నొనరించుకొనుచున్నాఁడనియును, ఆయణువులే జీవునకు రాఁబోవుకాలమునఁ గలుగఁబోవు శరీరములకు బీజములగు చున్నవనియును బూర్వాధ్యాయమున సూచింపఁబడియె. ఈవిషయ మిట నించుక విస్తరింపఁబడును.

మొట్టమొదట జగదీశ్వరుఁడు సృష్ట్యున్ముఖుఁడై "బహుస్యాం ప్రజాయేయ" అని సంకల్పించఁగా తదంశము లగు జీవులును బహిర్ముఖము లై కాలక్రమమునఁ బాంచభౌతిక మగుప్రపంచమున నభివ్యక్తములై ఆకాశతత్త్వమున నొక భూతసూక్ష్మమును, వాయుతత్త్వమునందొక యణువును, తేజస్తత్త్వమునుండి యొకయణువును స్వీకరించుకొని, యభివ్యక్తమగుజీవాత్మలు అగుచున్నారు. ఈయణు సముదాయమే జీవున కుపాధియై ముక్తిపర్యంతము జీవునినంటి

యుండును. ఇదియే అనాదియగు అవిద్యయై జీవునియంటి యుండును. మఱియు నిటులే పృథీవీతత్త్వమునుండి యొకయణువును, అప్తత్త్వమునుండి యొకయణువును, తేజస్తత్త్వ స్థూల భాగమునుండి యొకభూతసూక్ష్మమును గైకొనుచు నన్నమయ కామమయ మనోమయ శరీరములకు బీజములుగఁ జేసికొనుచున్నాఁడు. ఈయణువులే జన్మజన్మమునను జీవుని నంటియుండి జీవుని శుభాశుభ వాసనల కునికిపట్టులై సమస్తశరీరములకు బీజరూపములై యుండును. కావుననే యివి వేదాంతగ్రంథములయందు దేహబీజములగు భూతసూక్ష్మములని నిరూపింపఁబడియున్నయవి. ఈవిషయము శ్రీశంకరభగవత్పాదుల వారి ముండకోపనిషద్భాష్యమునకు శ్రీమదానందజ్ఞానులవారు టీకయందు విపులముగ వ్రాసియున్నవారు.

(ముండకోపనిషత్. 3. ౨-౭.)

"మాయామయ మహాభూతానామంశావష్టబ్ధైర్ వావిద్యామయభూత సూక్ష్మైః ప్రాతిస్వికైరదృష్టసహకృతైః ప్రాతిస్వికాః ప్రాణాదయ ఆరభ్యంతే" అని.

ఈయణువులు ముక్తిపర్యంతము వాయుతత్త్వప్రకృతి వికారమును, జ్యోతిర్మయము నగు నొక సూత్రముతో జీవాత్మకు గట్టఁబడియుండు నని దివ్యదృష్టిచేఁ జూచు మహాత్ములు చెప్పుచున్నారు. జీవుఁడు శరీరధారియైనపు డీయణువునుండి ఆయాయణు మార్గముగా తదనురూపములై జ్యోతిర్మయము లైన చిన్నసూత్రము లనేకములు బయలువెడలి యాయాశరీర

ములను జ్యోతిర్మయమైన వలలవలె గట్టిగాఁ జుట్టిఁయుండును. కనుక జీవితకాలమందు జీవుని యన్నమయ ప్రాణమయకోశ ములఁజుట్టి పృథివి యను మార్గముగ నొక్కఁజ్యోతిర్మయమగు వలయును, భువర్లోకమందు కామమయ సంబంధమగు శరీర మును జుట్టి మఱియొక వలయును, సువర్లోకమందలి మనో మయ సంబధమగు శరీరమును జుట్టి మూఁడవవలయు నుండును. స్థూలదేహ సంబంధమగు వల హృదయమునుండి బయలు వెడలి "ఆపాదతలమస్తకము" వ్యాపించియుండును. ఈ విషయ ముపనిషత్తులయందును జెప్పఁబడినదియే.

పద్మకోశ ప్రతీకాశగ్ హృదయంచాప్యధోముఖం ।

* * * * *

తస్య మధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః ॥
సోఽగ్రభుగ్విభజన్ తిష్ఠన్నాహారమజరః కవిః ।
తిర్యగూర్ధ్వమధశ్శాయీ రశ్మయస్తస్య సంతతాః ॥
సంతాపయతిస్వందేహ మాపాదతలమస్తకః ।
నీలతోయద మధ్యస్థా విద్యుల్లేఖేవభాస్వరా ।
నీవారశూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా ॥
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః ॥

(తైత్తిరీయారణ్యక నారాయణము)

ఈస్థూలదేహసంబంధ మగు సూత్రము బంగారువర్ణమై కారుమేఘము మధ్యమున వెలుఁగు మెఱుపుఁదీఁగెవలెఁ బ్రకా శించునదియై, నీవార ధాన్యపుముల్లువలె నతిసూక్ష్మమై శరీర మునందంతట వ్యాపించి యాహారమును జక్కఁగ విభజించి

శరీరమును దపింపఁజేయు చున్నయది. శరీరమునఁ గన్పడు నుష్ణమునకు నిదియే మూలమగుచున్నది. ఈసూత్రము జీవిత కాలమందు హృదయమునుండి పైభాగమునకు, అధోభాగము నకును, ప్రక్కలకును, ప్రసరించుచున్నది ; మరణకాలమందు దేహమును వదలి దేహబీజమగు నణువునుమాత్రము కైకొని దానిని గట్టిగఁ జుట్టియుండును. అంత శరీరముష్ణహీనము కాఁగా మృతినొందిన దనఁబడును. ఇటులే యూర్ధ్వలోకము నందు యాతనా శరీరముతోడ భువర్లోకానుభవము పూర్ణము కాఁగా పూర్వమువలె నాదేహసంబంధమగు వల యాశరీర మును వదలి యాసూత్రము న_త్తత్వ సంబంధమగు నణువును మాత్రము చుట్టుకొనియుండ యాతనాశరీరము సైతము జీర్ణమైనశించును. ఈతీరుననే స్వర్లోకానుభవము తుదముట్ట నాలోకశరీరము నావరించియుండిన యీవల ఆశరీరమునుగూడ వదలి యా దేహబీజమగు నణువును మాత్రము చుట్టి యా సూత్రము పైఁజెప్పఁబడిన యణువులుమూడింటితోడ విజ్ఞాన మయకోశమునందుఁ జేరును. అంతటస్వర్లోకసంబంధమగు మనోమయశరీరము సహితము నశించును. జీవుఁ డీరీతిని కారణశరీరము (విజ్ఞానమయకోశము) ను జేరి ముందుజన్మమున కున్ముఖుఁడయియుండునపుడు రాఁబోవు జన్మమునఁ బొందఁ దగు స్థూలసూక్ష్మశరీరములకు బీజములగునణువులు గలవాఁ డగుటచేఁ బూర్వకర్మానుసారముగ శరీరములఁ గాలక్రమ మున మరలఁ బొందఁ గలుగును.

మానవులు ప్రతిజన్మమునందును వివిధములగు కర్మములఁ జేయుచున్నవారు కదా! అట్టి కర్మముల కనుగుణమగు వాసనలంగలిగి జీవుఁడు జన్మాంతరము నొందుచున్నవాఁడు. ఆయా జన్మములయందలి స్థూలసూక్ష్మశరీరములు ఆయాజన్మాంతమున నశించుచుండఁగా పైనుదహరింపఁబడిన వాసనలు వానియణువుల మూలమున జీవుని నంటియుండు. స్థూలశరీరముతోఁ జేయఁబడు సమస్తకర్మములును దానికిఁ గలుగు సకలానుభవములును, పృథివీతత్త్వసంబంధమగు నణువు నొకవిధముగ మార్చి, దానియందొకవిధమైన చలనము గలుగును. ఆ యనుభవములు మరల మరలఁ గలుగను గలుగను దదనుగుణమగు చలనము దానియందుఁ బుట్టుటచే నారీతిని జలించుస్వభావము దృఢమగుచున్నది. ఇట్లు జీవితకాలమంతయు స్థూలశరీరముచేఁ జేయఁబడుకార్యము లన్నియు, అనుభవింపఁబడు సుఖదుఃఖములన్నియు నాయణువునందుఁ జలనముఁ గలుగఁజేసి దదనుగుణమగు స్వభావమును గలుగఁజేయుచున్నవి. మరణకాలమున స్థూలశరీరము నశింప నీయణువుమాత్రము జీవుని నంటియుండు. భూలోకమునఁ బ్రవర్తింపనశక్తుఁడై జీవుఁడు యాతనాశరీరమున నూర్ధ్వలోకమున వర్తించుచుండును. ఆ కాలమున నీయణువు ఎవ్విధమగుకార్యము లేక నిద్రించునట్లుండును. భువర్లోక స్వర్లోకానుభవము లగు పాపపుణ్యములు క్షీణింప జీవుఁడు మరలి భూలోకమున జన్మించుటకు రాఁగా నీయణువునందుఁ బూర్వకర్మానుసారమగు చలనము మరలఁ

ప్రారంభింప నాకర్మ మభివ్యక్తమగుటకుఁ దగిన ప్రకృతిసము దాయము భూలోకమునుండి యాకర్షింపఁబడి స్థూలశరీర ముత్పత్తియగుచున్నది. కావున జీవుని శుభాశుభ వాసన లన్నియు నీయణువునం దిమిడియుండి యనంతరజన్మమునం దభివ్యక్తమై స్వభావమగుచున్నవి. శాస్త్రములయందు కర్మ మనునది అపూర్వరూపముగ నిలిచియుండునని చెప్పియుండుట యీయర్థమునే సూచించుచున్నది.

శ్రీగీతాశాస్త్రమున మూఁడవ యధ్యాయమున,

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి,
ప్రకృతిం యాంతి భూతాని । (గీత. 3. 33.)

అను శ్లోకములందలి ప్రకృతిశబ్దమును, ౧౭వ అధ్యాయమున,

త్రివిధా·భవతి శ్రద్ధా దేహినాం సాస్వభావజా ।
(గీత. ౧౭. ౨.)
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥
(గీత. ౧౮. ౪౧.)

లోనగు వాక్యములయందలి స్వభావశబ్దము నీయర్థమునే బోధించుచున్నది.

శంకరభాష్యము

ప్రకృతిర్నామ—పూర్వకృత ధర్మాధర్మాది (జ్ఞానేచ్ఛాది—ఆనంద గిరి) సంస్కారో వర్తమాన జన్మాదావభివ్యక్తః సా ప్రకృతిః, "జన్మాంతరకృతో ధర్మాది సంస్కారో మరణకాలేఽభివ్యక్తః స్వభావ ఉచ్యతే"॥
(గీత. ౧౭. ౨.)

జన్మాంతరకృత సంస్కారః ప్రాణినాం వర్తమానజన్మని స్వకార్యాభిముఖత్వేనాభివ్యక్త స్స్వభావః ॥ అని.

(గీత. ౧౮. ౪౧.)

ఒకజన్మమునం దేవిద్యయందుఁగాని పరిశ్రమము ఎక్కుడుగఁ జేయఁజేయ ఆకాలమునం దంతట నీయణువు దానికనుగుణముగ జలించుచునేయుండును. అభ్యాసబలముచే మఱియెప్పుడైన నావిద్య నభ్యసింపఁ బూర్వాభ్యాస బలమున నావిద్య యతిసులభముగ నలవడును. జన్మము మాఱి వేఱొక శరీరమువచ్చినను భూతసూక్ష్మము జన్మజన్మమునకు శాశ్వతముగ నిలుచుటంజేసి పూర్వాభ్యాసవాసనాబలముచే నావిద్య యాజీవునకు సులభసాధ్యమగును. ఈరీతిని వివిధములగు ననుభవములు, కర్మములు నీభూతసూక్ష్మమునందు స్థిరముగ నిలిచి యనేక జన్మములకుం గారణము లగుచుండును. ఐనను జీవుఁడు సుఖదుఃఖానుభవముచే జ్ఞానముకలవాఁడై యైహిక విషయములయందు వైరాగ్యము నభివృద్ధిచేసికొనఁ గ్రమక్రమమున విషయవిముఖములగు వాసన లుత్పత్తియై వృద్ధియగును. పూర్వపు విషయవాసనలు కాలక్రమమున క్షీణించును. ఈవిధమున వాసనాక్షయము కానుకాను జన్మరాహిత్యమునకు హేతువగును.

మఱియు నిట్లు పురుషుఁడు కామక్రోధాదులకు లోఁబడి నప్పుడెల్లను సూక్ష్మశరీరమునందుఁ జలనమును గలుగఁజేయు నని ముందే వ్రాయఁబడియె. కావుననే, మనుష్యునందుఁ గామ

క్రోధాదులు, ఈర్ష్యాసూయలులోనగు నవి యుద్రేకమగుచో నాసూక్ష్మశరీరభాగమునఁ దదనుగుణములగు మార్పులు చలనవికారములుగఁ గలుగ నాచలనము సూక్ష్మశరీర బీజ మగు భూతసూక్ష్మమును సోఁకి స్వభావమై యాగుణమును మరల మరల నంకురింపఁజేయును. కావున నవకాశము గలిగి నప్పుడెల్ల నట్టిగుణములు పూర్వమునకంటె నెక్కుడుగ నుద్రేకమై యాదుస్స్వభావము వృద్ధియగునట్లు చేయును. ఇది యిట్లుండఁగా స్థూలశరీరపతనానంతరము నరకమునఁగలుగు దుఃఖానుభవము సైతము ఆయణువునందుఁ జేరియుండును. కాలక్రమమున భువర్లోకమందలి శరీరమునశింపఁగా భూర్భు వర్లోక భూతసూక్ష్మములతో స్వర్లోక సంబంధమగు మనో మయ శరీరముతోడను, స్వర్గలోకమును జేరును. అచ్చట పూర్వాధ్యాయమునందు సూచింపఁబడియుండురీతిని సుఖాను భవము ననుభవించుట ద్వారా ఆలోకజ్ఞానమును బొందును. ఆయనుభవములన్నియు నాశరీరబీజమగు భూతసూక్ష్మమునం దుఁ జలనము గలుగఁజేయుటచే నది ఆయామనోవృత్తులను, సంకల్పమును మరల మరల బుట్టించుస్వభావముగలది యగును. స్వర్గానుభవము తుదముట్ట నాశరీరముసైతము జీర్ణమై నశిం చును. ఆస్థితియందు జీవుఁడు విజ్ఞానమయకోశమునుండి పృథి వ్యప్తేజోతత్త్వముల సంబంధమగు దేహబీజములం గలిగి రాఁ బోవు జన్మమున కున్ముఖుఁడైయుండును. మరల క్రమమున స్వర్లోక దేహబీజము కాలపరిపాకముచే స్వభావానుసార

ముగఁ జలింప స్వర్లోకప్రకృతిని గొంతయాకర్షించుకొని రాఁబోవుజన్మమున మనోవృత్తుల కనికిపట్టగు స్వర్లోకశరీరమును గల్పించును. ఆమీఁద అప్తత్త్వదేహబీజ మటులే చలించి భువర్లోకప్రకృతి నాకర్షించుకొనఁగా భువర్లోకశరీర ముత్పత్తి యగును. ఆతీరుననే పృథివీతత్త్వ భూతసూక్ష్మము సైతము ప్రారబ్ధకర్మానుసారముగ కర్మఫలముల విధించు దేవతలచే నిర్దేశింపఁబడిన దేశమునందును, కుటుంబమునందును, తల్లిదండ్రులయందును బ్రవేశించి రాఁబోవు స్థూలశరీరమునకు బీజమగుచున్నది. జీవుని స్వర్గానుభవము పరిపూర్ణముకాఁగా జీవుఁడు పైని సూచింపఁబడినరీతిని పునర్జన్మమునకు వచ్చు మార్గము పంచాగ్నివిద్యయని యుపనిషత్తులు వర్ణించుచున్నవి. అందు జీవుఁడు ద్యులోకము, పర్జన్యలోకము, పృథివీలోకమున నోషధులు, ఆపైఁ దండ్రిదేహము, కడపట రేతోరూపమున మాతృగర్భమును వరుసగఁ బ్రవేశించి శరీరమును ధరించు నని నిరూపింపఁబడియున్నది.

> తస్మాదగ్నిస్సమిధో యస్య సూర్యస్సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యామ్ । పుమాన్ రేతస్సించతి యోషితాయాం బహ్వీః ప్రజాః పురుషాత్సంప్రసూతాః ॥
>
> (ముండకోపనిషత్తు. ౨. ౧. ౫.)

మఱియు,

> అసౌ వావ లోకో గౌతమాగ్నిస్తస్యాదిత్య ఏవ సమిద్రశ్మయో ధూమోఽహరర్చి శ్చన్ద్రమా అఙ్గారానక్షత్రాణి విస్ఫులింగాః ॥ ౧ ॥

తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాశ్శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేస్సోమోరాజా సమ్భవతి ॥ ౪ ॥

పర్జన్యో వావ గౌతమాగ్నిస్తస్య . . . . . . . . విస్ఫులింగాః ॥౧॥
తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవాస్సోమగ్ం రాజానం జుహ్వతి తస్యా ఆహుతే ర్వర్షగ్ం సమ్భవతి ॥ ౫ ॥

పృథివీ వావగౌతమాగ్ని . . . . . . . . . విస్ఫులింగాః ॥ ౧ ॥
తస్మిన్నేతస్మిన్నగ్నౌ దేవావర్షం జుహ్వతి తస్యా ఆహుతేరన్నగ్ం సమ్భవతి ॥ ౬ ॥

పురుషో వావగౌతమాగ్నిస్తస్య . . . . . . . విస్ఫులింగాః ॥౧॥
తస్మి న్నేతస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుతేరేతస్సమ్భవతి ॥ ౭ ॥

యోషావావ గౌతమాగ్ని . . . . . . . . . విస్ఫులింగాః ॥ ౧ ॥
తస్మిన్నేతస్మిన్నగ్నౌదేవా రేతో జుహ్వతి తస్యా ఆహుతేర్గర్భస్సమ్భవతి ॥ ౮ ॥

(ఛాన్దోగ్యోపనిషత్తు, పంచమప్రపాఠకము, ౪. ౫, ౬, ౭, ౮ ఖండములు.)

ఇందు శ్రద్ధాశబ్దముచేఁ బూర్వవాసనాయుక్తమగు సువర్లోక దేహబీజమగు భూతసూక్ష్మము బోధింపఁబడుచున్నది. కాలపరిపాకమున జీవుఁడు జన్మమున కభిముఖుఁడు కాఁగా ఈ సువర్లోక బీజమునందుఁ బైఁజెప్పినరీతిని జలనము కలుగ సువర్లోక ప్రకృతినుండి కొంతభాగము నాకర్షించుకొని దేవతల సహాయముచే నాసువర్లోకశరీరమును గల్పించుకొనును. ఇదియే రాఁబోఁవు జన్మమున మనోమయ కోశమున నొకభాగ

మగును. ఇదియే "దేవాశ్శ్రద్ధాం జుహ్వతి" అను వాక్యము యొక్క యర్థమని తత్త్వవేత్తలు వచించుచున్నారు. ఈక్రొత్త స్వర్లోకశరీరమే "సోమోరాజా" యనఁబడునది. పిదప భువర్లోక దేహబీజమునందుఁ జలనము కలుగఁ బూర్వమువలె నాలోక ప్రకృతిసముదాయమున నొకకొంత యాకర్షించుకొని దేవతల సహాయముచేఁ గ్రొత్తశరీర మొకదాని (కామమయ శరీరము) నేర్పఱచుకొనును. ఈరెండుభాగములు కలిసి మనోమయ కోశమగు. ఈతీరుననే పృథివీతత్త్వసంబంధమగు స్థూలదేహబీజము వర్షబిందుమార్గమున భూమియందుఁ బడి యోషధులయందుఁ బ్రవేశించి కర్మదేవతల సహాయమున భవిష్యజ్జన్మహేతువగు పితృదేహమున నాహారముగఁ బ్రవేశించి రేతోరూపమునఁ దల్లి గర్భమునఁజేరి పిండ ముత్పత్తి యగుచున్నది. అచ్చట నాపృథ్వీభూతసూక్ష్మము పైసూచింపఁబడినరీతిని బూర్వసంస్కారము ననుసరించి చలింప దానికనుగుణమగు ప్రకృతి సముదాయము ఆకర్షింపఁబడి దేవతా సహాయమునఁ గ్రొత్త శరీరము వృద్ధియగుచున్నది. తరువాత శిశువు క్రమముగ జన్మింపఁ గొంతకాలమగు వఱకు జీవాత్మ సాక్షిమాత్రుఁడుగ నుండి శరీరస్థితికి వలయు తనశక్తిని మాత్రము నిచ్చుచుండును. జీవాత్మ సామాన్యముగ నేడేండ్లు గడచినవెనుకనే శరీరములందు యథార్థముగఁ బ్రవేశించి వానినుపాధులుగ గ్రహించును. అట్లు గ్రహించుటయే జీవునకు వాస్తవముగ ద్వితీయ జన్మము. ఆకాల ముపనయనమునకు

ముఖ్యకాలము. ఆపిదప నే బాలుఁడు విద్యాభ్యాసమునకు సహిత మర్హుఁడు.

జీవుఁడు వాని యుపాధులతోఁ జేయు సమస్తకర్మములు రాఁబోవు జన్మములయందుఁ దన స్వభావమునకు హేతువు లగుచున్నవి. కావున నెల్లవారును దమతమస్వభావములను నిష్పక్షపాతముగఁ బరిశీలించుకొని యశుభవాసన లించుక యైననుండినచో వాని నధికప్రయత్నమున నశింపఁజేసి శుభ వాసనల వృద్ధిచేసికొనుటకుఁ బాటుపడవలయును. అట్లుచేసి దుస్స్వభావమును వదలించుకొని సత్స్వభావమును వృద్ధిచేసి కొనుచుఁ గ్రమమున నెల్లవారు నుత్తమమగు పురుషార్థమును సాధించుకొందురుగాక.

---

## పదియవ యధ్యాయము

### కర్మము

కర్మమనఁగా జేయఁబడునది. మానవుఁడు మనస్సుచేతను, వాగాదీంద్రియములచేతను, శరీరముచేతను జేయునదియంతయుఁ గర్మమనఁబడును. అట్టికర్మము లన్నియుఁ దదనుగుణములగు ఫలముల నిచ్చుచుండు. కావునఁ జేయఁబడు కార్యముతో దానిఫలమునయితము కర్మమనియే పిలువఁబడుచున్నది. యథార్థమునఁ జూడఁ జేయఁబడు కార్యమును, దానిఫలమును ఒక్కటిగనే భావింపఁదగును.

లోకమున భూమియందు విత్తనము నాఁటినచో నద్దానినుండి వృక్షముత్పత్తియై సకాలమునఁ బుష్పములు ఫలములు గలుగ నాఫలములనుండి మరల బీజములు గలిగి యందొక్కొక్కటియుఁ దిరిగి వృక్షములకును ఫలములకును హేతువు లగుచున్నవి. ఎవ్విధమైనబీజము నాఁటిన నవ్విధమగు వృక్షములు, ఫలములును నుత్పత్తియగు. ముష్టివిత్తనము నాఁటి మధురములగు మామిడిపండ్లు కావలయునన్న దొరకునా? కర్మమన నిట్టిదియే. కాఁబట్టి మానవుఁ డెట్టి ఫలముల నపేక్షించునో అట్టి ఫలముల నీఁగలుగు కర్మములను జేయ

వలయు. చేయఁబడు కర్మములు ఫలములనీయ నాఫలములు క్రొత్తకర్మములకు హేతువులగుచుండును. ఇట్లు కర్మములును ఫలములును, మరలఁ గర్మములును ఫలములును, అన్యోన్య సంబంధముగలవియై యుండును. ఈసంబంధము కార్యకారణ రూపమైనది. కారణములేకయే కార్యము గలుగ నేరదు.

అకారణం కథం కార్యం సంసారేఽత్ర భవిష్యతి ।

(దేవీభాగ.)

న హి కారణంవినా కార్యస్యోత్పత్తిః ।

(అని ప్రాచీనసూక్తి.)

మానవులు అనుభవించుసుఖదుఃఖములన్నిఁటికి హేతు భూతములుగఁ గారణములుండియే తీరవలెనుగదా! కారణములగు పూర్వకర్మముల నెఱుఁగక ప్రస్తుతపు సుఖదుఃఖానుభవములు విధికృతములనియు, దైవికములనియును, దామస్వతంత్రులనియును మానవులు విధిని దూఱుదురు. అట్లుదూఱుట యజ్ఞానముగాని వేఱుగాదు. ప్రపంచమంతయును గారణము లేక కార్యము గలుగనేర దను న్యాయమునకు లోఁబడియే యున్నది. కావునఁగారణములను గలుగఁజేసిన తరువాత వాని ఫలముల ననుభవింపక తీరకపోయినను కారణములను గలుగఁ జేయుటయందు మానవులు స్వతంత్రులు. ఈవిషయమున మానవులకుంగల స్వాతంత్ర్యపారతంత్ర్యముల కొక్కదృష్టాంతము చెప్పనగు. ప్రపంచమంతయు భగవదాజ్ఞకు లోఁబడియున్న దనుటకు సందియమే లేదు. అగ్నిని స్పృశించిన హస్తము

కాలును అనునది భగవదాజ్ఞ యై యుండ నెవఁడుగాని నిప్పును దాఁకవలయు నను నిర్బంధము ఇంచుక యైనను లేదు. నిప్పును దాఁకుటకుఁగాని, తాఁకక యుండుటకుంగాని స్వతంత్రుఁడై యుండ స్పృశించిన పిదప దానిఫలమును అనుభవింపక తీరదు. ఆలాగుననే శ్రుతి స్మృతులయందుఁ గొన్ని కార్యములు విధింపఁబడియు, మఱికొన్ని నిషేధింపఁ బడియు నున్నవికదా! శ్రుతి స్మృతులు భగవదాజ్ఞను సూచించునవికదా!

> శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య వర్తతే ।
> ఆజ్ఞాచ్ఛేదీమమద్వేష్య స్సమేవధ్యతమోమతః ॥

(శ్రీమహాభారతము.)

ఇందు నిషేధింపఁబడిన కార్యములు చేయఁబడినచో దుఃఖ హేతువులగుటచే నిషిద్ధములును, సుఖదాయకము లగు కార్యములు కర్తవ్యములుగ విధింపఁబడినవియు నగు. అజ్ఞుఁడగు శిశువునకు నిప్పును దాఁకఁగూడదని తండ్రి నిషేధించియుండ నట్టి యాజ్ఞోల్లంఘనముచే శిశువు బాధపడుట తాఁజేసిన కార్యమునకుఁ గలిగిన ఫలముగాని తండ్రి యాగ్రహమువలనఁ గలిగిన బాధకాదుకదా! ఆలాగే శ్రుతిస్మృతి నిషిద్ధములగు కార్యముల నజ్ఞానముచేఁ జేసినను నిప్పును స్పృశించిన శిశువు వలెఁ దదనుగుణమగు ఫలము ననుభవించువాఁడేగాని వేఱు గాదు. మానవులీన్యాయమును దెలిసికొనునంతవఱకుఁ గర్తవ్యాకర్తవ్యముల నెఱుఁగక ప్రకృతిబద్ధులయి వర్తింతురు. ఈన్యాయమును దెలిసికొనిన పిదప కోరుఫలముల నీఁజాలు

కర్మములను మాత్రముచేయుచు ననిష్టములగు ఫలముల నీఁదగు కర్మముల విడుచుచుందురు. లోకమున మానవు లందఱు సదా సుఖమునే కోరువారు గావున నెట్టి కార్యములు తుదకు సుఖప్రదములగుటచేఁ గర్తవ్యములో, ఎట్టికార్యములు విడువఁదగినవో తెలిసికొనుట యావశ్యకము.

ఎట్టి కర్మమునైనను జేయుటయందు మూఁడవస్థలుండును. మొట్టమొదట విషయేచ్ఛ కలుగఁగా దాని నీడేర్చుకొను విధమును మనస్సున సంకల్పించి యనంతరము కర్మమును బాహ్యముగఁ జేయును. కావుననే బృహదారణ్యక శ్రుతి (౪-౪-౫) యందు

> " కామమయ ఏవాయం పురుష ఇతి. స యథా కామో భవతి తత్క్ర-తుర్భవతి. యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే. యత్కర్మకురుతే తదభి సంపద్యతే "

అని చెప్పఁబడినది.

తా. ఈపురుషుఁడు కామస్వరూపుఁడు. కామానుగుణ ముగ సంకల్పించువాఁడు. సంకల్పానుసారముగఁ గర్మమును జేయుచున్నాఁడు. కర్మానుసారముగ ఫలము నందుచున్నాఁడు.

ఈ రీతిఁ గామము, క్రతువు లేక సంకల్పము, క్రియ యని కర్మము మూఁడవస్థలు కలదగును. ఇందు ౧. కామము. ఇచ్ఛామాత్రమనోవ్యాపారము. మానసిక కర్మము. ౨. సం కల్పము, విషయేచ్ఛ స్ఫుటమై దానిని గ్రియాదులచే నెఱ వేర్చువిధమును బన్ని క్రియను జేయఁబూనుట. ఇదియే వాచిక

కర్మము. వాక్కనునది సర్వేంద్రియములను సూచించును. కామసంకల్పములు వ్యక్తములు కాఁగా వాక్కుతో వచించునట్లు సర్వేంద్రియములతోను బనిచేయుట యింద్రియకర్మమని చెప్పఁబడును. 3. క్రియ, బాహ్యమగుకర్మము, అనఁగా బయటచేయుపని, కాయికకర్మము. ఇది మూఁడవది. ఇట్లు మనస్సుచేతను, ఇంద్రియములచేతను, స్థూలమగుకాయముచేతను జేయఁబడు వ్యాపారములన్నియును మనోవాక్కాయకర్మములని చెప్పఁబడు. వీనియందొక్కొక్కటియుఁ దదనుగుణమగు ఫలము నీయఁజాలియుండును. మానవుఁడు వాచిక కాయికకర్మములవలెఁ గేవలమనోవృత్తులచే నితరులకు మేలు కీడులు చేయఁగలిగియుండునని పూర్వాధ్యాయమున విస్తరించి వ్రాయఁబడి యున్నది. అట్లు ఇతరులకు మేలుకీడులు కలుగఁ జేయుటచే వారితోఁ గర్మానుబంధమును గల్పించుకొనుచుండును. వాని ననుసరించియే పురుషుఁడు సుఖదుఃఖముల ననుభవించుచుండు.

జీవుఁ డీశ్వరాంశమగుటచే సచ్చిదానంద స్వరూపుఁడు. ఈశ్వరునివగు నిచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు జీవునియందునుఁ బ్రతిబింబించియే యున్నయవి. ఇవి భూరాద్యధోలోకముల యందుఁ గామములు, సంకల్పములు, క్రియలు అనుమూఁడు దశలుగఁ గన్పడుచున్నయవి. కావున మానసిక, వాచిక, కాయికములగు కర్మములు జీవాత్మయొక్క మూఁడులక్షణముల ననుసరించియుండు.

ఈమూఁడు కర్మములు ఎట్టి యెట్టిసందర్భముల నే యేఫల ముల నీఁజాలునోయని యెఱుఁగవలయు నన్న ముఖ్యముగ మూఁడున్యాయముల నెఱుంగవలయును.

౧. పురుషుఁడెయ్యే కామములకు లోఁబడునో యాయా కామవిషయములకు బద్ధుఁడై యవి యుండు ప్రదేశముల కాకర్షింపఁబడును.

తదేవసక్తస్సహకర్మణైతి లింగం మనోయత్ర నిషిక్తమస్య ।
(బృహదారణ్యకము.)

అనఁగా, మనస్సు ఏవిషయమునందు మగ్నమగుచుండునో ఆవిషయమును గూర్చి కర్మానుసారముగ జీవుఁడు పోవు చున్నాఁడు.

కామముగల జీవునకును, ఆయావిషయములకును దృఢ మగు ననుబంధము కలుగుచున్నది. ఆవిషయములు కర్మఫల రూపములుగ ననుభవించుట విధియై యవి యుండుచోటికి విధివశముగ నీడువఁబడుచున్నవాఁడు. ఇట్లు కామము బంధ మగుచున్నయది.

కామాన్ యః కామయతే మన్యమానః స కామభిర్జాయతే తత్ర తత్ర ।
(ముండకోపనిషత్. ౩-౨-౨౦.)

ఏయేకామములను మనసా చింతించి కోరునో, ఆయాకోరి కలతో ఆయాకామ్యవిషయములుండుచోట్ల, అనగా ఆకోరిన విషయములతో చుట్టఁబడినవాఁడై పుట్టును.

అయుక్తః కామకారేణ ఫలేసక్తో నిబధ్యతే ।

(గీత. ౫-౧౨.)

ఇంద్రియమనస్సులను స్వాధీనముగ చేసికొననివాడు కామముచేత ప్రేరేపింపఁబడి, ఫలాపేక్షగలవాఁడై బద్ధుఁడగును. ఆఫలము సుఖదాయకమైనను దుఃఖదాయకమైనను అనుభవింపక తీరదు. మానవుఁడు సార్వకాలిక సుఖమునే కోరుచున్నను అజ్ఞానముచేతఁ దాత్కాలికమగు నల్పసుఖమును గోరి పర్యవసానమున రాఁబోవుదుఃఖమును గమనింపమిచేఁ గాలక్రమమున నాయల్పసుఖము తుదముట్ట దాని ననుసరించి యుండుదుఃఖమును బొందుచున్నవాఁడు. కర్మఫలము సుఖరూపముగనుండిన నాకర్మము పుణ్యకర్మమనియు, దుఃఖరూపఫలమునిచ్చుకర్మము దుష్కర్మమనియు సామాన్యముగ నెఱుంగఁ బడుచున్నయది. ఈన్యాయమును జక్కఁగఁ దెలిసికొని, మానవుఁడు తనయందుఁబొడమ కామములను జక్కఁగఁ బరిశీలించి శాశ్వతసుఖదాయకములగు విషయములనే కోరుచు ననిత్యములగు కామముల వర్జింపఁదగు. వాఁడు కోరినవిషయములు పరజన్మములయందు దమంతటతాము ప్రాప్తించుచుండును.

౨. మనస్సు కల్పనాశక్తి కలది. మనుష్యుఁ డెట్టి సంకల్పములను భావించుచుండునో ఆవిధముగ నగుచుండును. "యద్భావం తద్భవతి" ఎట్టిసంకల్పముల నిహజన్మమునఁ గలిగియుండునో పరజన్మమున నవి జీవునకుఁ గలుగును.

అథ ఖలు క్రతుమయః పురుషః యథాక్రతు రస్మిఁల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి ।

(3. ౧౪. ౧. ఛాందోగ్యము.)

తా. పురుషుఁడు క్రతుమయుఁడు—సంకల్పరూపుఁడు. ఇహాజన్మమున నెట్టిసంకల్పములు గలవాఁడగునో శరీరపత నానంతర మట్టి స్వభావముగలవాఁడగును.

ఈశ్వరునియందు జ్ఞానశక్తివలె జీవునియందు మనస్సు క్రియాశక్తి ప్రతిబింబమగును. బ్రహ్మ తపస్సు చేసి ప్రపంచ ములసృజించిన రీతిని జీవుఁడు తన సంకల్పములచేతఁ దన్నుఁ జుట్టియుండు సందర్భములను గల్పన చేయుచున్న వాఁడు. జీవుఁడు తనమనస్సున నెట్టి గుణములను మననము చేయునో అట్టిగుణములుగలవాఁ డగు. కావున మనుష్యుని స్వభావము సంకల్పములచేఁ గల్పింపఁబడినది. పలుమాఱు సత్యము, భూతదయ, శాంతము లోనగు సద్గుణములను మననము చేయఁ గాలక్రమమున సత్స్వభావము కలవాఁ డగును. అటులనే యీర్ష్యాసూయలు, పరాపకారము మొదలగు దుర్గుణములను మననముచేయఁ గ్రమక్రమమున దుస్స్వభావము కలవా డగును. దీనిని దెలిసికొనిన మానవుఁడు తన స్వభావమును గోరినట్లు మార్చుకొనుటకు శక్తిగలవాఁడగును. ఎట్టిగుణము లను దనస్వభావమునందు దృఢపఱచుకొన నిచ్ఛయించునో అట్టి గుణములను మనమున నెల్లప్పుడు మననముచేయ నా గుణములు జీవునిస్వభావముగ దృఢపడును. అటులే తనయం

దలి దుర్గుణములను విడువవలయు నను సంకల్పము దృఢముగఁ జేయ నాదుర్గుణములు సైతము కాలక్రమమున వదలిపోవును. జీవుఁడు పరిశుద్ధములును, యోగ్యములును నగు విషయములను, గుణములను, గార్యములను బలుమాఱు చింతించి సత్స్వభావమును వృద్ధిచేసిన మరలమరల నట్టి సంకల్పములనే సులువుగఁ జేయుచు రాఁబోవు జన్మములయందుఁ గూడ నట్టి శుభవాసనలు దృఢముగఁ గలవాఁడగును. అటులే హేయములును, వర్జ్యములు నగు నీచగుణములను మననము చేయఁ దదనుగుణములగు నశుభవాసనలతోటి ముందు జన్మించును. ఈశుభాశుభవాసనలే పూర్వకర్మమని యెన్నఁబడును.

3. మఱియు జీవుఁడుచేయుక్రియల ననుసరించి బాహ్యములగుసందర్భాసందర్భములు కలుగుచున్నవి. జీవుఁడుచేయు కార్యము లితరుల సుఖదుఃఖములకు హేతువులగును గాన నితరులకు సుఖము గలుగఁజేయుచుండిన మానవుఁడు పరజన్మమునందును సుఖము ననుభవించు సందర్భములు గల్గి పుట్టును. అట్లుకాక లోకులకు బాధనుగలుగఁజేయువాఁడు దుఃఖమును బొందు సందర్భములుగలిగి పుట్టును.

> యథా యథా కర్మగుణం ఫలార్థీ
> కరోత్యయం కర్మ ఫలేనివిష్టః।
> తథా తథా యం గుణసంప్రయుక్త
> శ్శుభాశుభం కర్మఫలం భునక్తి॥ (శాంతిపర్వము.)

తా. ఫలమునుగోరి జీవుఁడెట్టియెట్టి కార్యముల నొనరించునో రాఁబోవుజన్మమున నట్టిశుభాశుభరూపకర్మఫలముల నను భవించును.

నా బీజాజ్జాయతే కించిన్నాకృత్వా సుఖమేధతే ।
సుకృతై ర్విందతే సౌఖ్యం ప్రాప్య దేహక్షయం నరః ॥
(శాంతిపర్వము.)

తా. విత్తనములుచల్లక చెట్లు మొలవనియట్లు తానేమి యుఁజేయక యేసౌఖ్యమును బొందఁడు. సత్కార్యములచే దేహాంతమునందు సౌఖ్యము కల్గును.

ఈన్యాయములను దెలిసికొనిన జీవుఁడు మంచిచెడ్డలను జక్కఁగ విమర్శించి నడుచుకొనుచు రాఁబోవుజన్మముల యందుఁ గోరినట్లనుకూల ప్రతికూలములను గల్పించుకొనఁ జాలియుండును. అనఁగా సత్సంకల్పములచేత మంచిస్వభావ మును, దుస్సంకల్పములచేత దుష్టస్వభావమును జీవుఁడు కల్పించుకొనినరీతినే సత్కార్యములచేత ననుకూల సందర్భ ములను, దుష్కార్యములచేతఁ బ్రతికూల సందర్భములను గల్పించుకొనును.

లోకమునందనేకులు బాల్యమునుండి నైజముగ మంచిగుణ ములు గలిగి యుండుటను, మఱికొందఱు దుర్గుణములు గల వారుగనుండుటను జూచుచున్నాముకదా! అట్టి సుగుణదుర్గుణ ములు పూర్వజన్మముల యందు వారుచేసిన మానసికములగు కర్మముల ఫలములని యెన్నఁదగి యుండును. మఱియుఁ

గొందఱుజీవులు యోగ్యతయుండినను లేకుండినను, నిరంతర సుఖము ననుభవించుటయును, మఱికొందఱెంత ప్రవీణులుగ నుండినను విఫలమనోరథు లగుటయును గన్నులారఁ గాంచు చున్నాము. ఇద్దియును బూర్వజన్మములయందలి కాయికమగు కర్మఫలమేయని యెఱుంగదగు.

ఇట్టీ మూఁడున్యాయములును జీవుని యిచ్ఛాజ్ఞాన క్రియా శక్తుల ననుసరించునవి. ఈమూఁడుశక్తులును జీవునకుఁ బ్రతి జన్మమునందును కోరికలుగను, సంకల్పములుగను, బాహ్య కార్యములుగను గన్పడుచుండును. పైసూచింపఁబడిన మొదటి న్యాయము ననుసరించి కోరికలవలనఁ గోరునట్టి జీవునకు, కోరఁబడు పదార్థమునకును దృఢమగు ననుబంధము కలుగు చున్నది. అటులనే సంకల్పమువలన జీవునిస్వభావము నిరూ పింపఁబడుచున్నది. కాయికములగు కార్యముల ననుసరించి బాహ్యములగు ననుకూల ప్రతికూలనిమిత్తము లేర్పడుచున్నవి. ఇట్లు మూఁడువిధములగు కర్మములఫలములు జీవుని నను సరించియేయుండును.

జీవుఁడు ఎల్లప్పుడును క్రొత్తదియగు కర్మమును జేయుచుఁ బూర్వకర్మఫలము ననుభవించుచునే యున్నవాఁడు. పూర్వపు రాగద్వేష వాసనలతోడ జన్మింపక తీరదు. పూర్వపుసంకల్ప ములచేతఁ గల్పింపఁబడిన స్వభావమునకు సామాన్యముగ లోఁబడి వర్తించుచుండును. పూర్వపుఁ గార్యముల వలని ఋణానుబంధరూపములగు ననుకూల ప్రతికూలముల నిర్బంధ

ములకు లోనై యుండక తీరదు. ఐనను జీవాత్మ యీశ్వరాంశ మగుటచే స్వతంత్రుఁడుగ నున్నవాఁడు. పూర్వమేరీతి నిచ్ఛ యించెనో, సంకల్పించెనో, బాహ్యములగు కార్యముల యందుఁ బ్రవర్తించెనో ఆలాగుననే వేఱువిధముగ నిచ్ఛ యించుటకును, సంకల్పించుటకును, కర్మములను జేయుటకును స్వతంత్రుఁడై యుండును. పూర్వపుఁ గర్మబంధములకు లోనై వర్తించుచుండినను తన స్వతంత్రమును గొంతవఱ కుపయో గించుటచే నాపూర్వపుబంధములఁ గ్రమక్రమమున వదలించు కొనుటకు శక్తికలవాఁడయియుండు. పూర్వకర్మానుసారమైన దుర్వాసనలు, దుస్స్వభావములు దృఢముగనుండినను ఈజన్మ మునఁ బురుషప్రయత్నముచే నాస్వభావమునకు లోఁబడక మంచిమార్గమునఁ బ్రవర్తింపఁగలిగియుండును. జీవుఁడు పూర్వ జన్మాంతమున నరకానుభవముచే విషయవాంఛలకు విశేష ముగ లోఁబడుట బాధకరమను జ్ఞానముకలిగి వానిని వదల వలయు నను నిశ్చయమొక్కింతమైనను గలవాఁడయి యుం డును. కావునఁ దరువాతి జన్మమునఁ బూర్వ కర్మానుసార ములగు దుర్వాసనలు దృఢతరములయి యుండినను, తన కుండిన స్వల్పజ్ఞానముచే నైనను మంచిమార్గము నవలంబింప యత్నముచేయుచుఁ గ్రమక్రమమున నశుభవాసనలను నశిం పఁజేసికొనఁజాలును. కృషిచేయువాఁడు భూమిపై మొలచి యున్న బీజాంకురములలో మంచి మొలకలను వృద్ధిచేయు ప్ర యత్నములు చేయుచు, నితరములగు నంకురములను గ్రమ

ముగ నశింపఁజేయుటకుఁ దగినప్రయత్నములుచేసి తుదముట్ట
వాని నశింపఁజేయునట్లు జీవుఁడొక్కొక్క జన్మమునందును
దనశుభవాసనలఁ గ్రమక్రమముగ నభివృద్ధిచేసికొనుచు,
అశుభవాసనల సమూలముగ నశింపఁజేయవలయును. ఇదియే
విద్యాభ్యాసమువలని ముఖ్యప్రయోజనము. ఉపాధ్యాయులు
విద్యార్థిస్వభావమును గుర్తించి పరిశీలించి శుభవాసనలను
లాలనపాలనములచే వృద్ధిపఱచుచు, నశుభవాసనలుండిన
వానిని వృద్ధికానీయక పోగొట్టుచుండవలెను. అట్లు చేయుటచేఁ
బూర్వపుఁ గర్మబంధముల నతిక్రమించుటకు జీవునకు శక్తి
గలిగియుండును. "శ్రద్ధానుసారిణీ విద్యా బుద్ధిః కర్మాను
సారిణీ" అనులోకోక్తి యర్థమింతియ. ఇందలిపూర్వార్థమును
నిరాకరించి రెండవభాగమును మాత్రము పలుమరు ప్రమాణ
ముగఁ గైకొనుచుఁ దమతమ కార్యములయందుఁ దమకు
స్వతంత్రము లేదనిభావించుచున్నారు. ఇయ్యది పొరపాటు.
ప్రతిజీవుఁడును బూర్వ కర్మానుసారముగనే నడుచుకొనుట
విధియైనచో శాస్త్రములయందలి విధినిషేధములన్నియు
నిష్ప్రయోజనములగును గదా! శాస్త్రములయందుఁ గొన్ని
కార్యములు కర్తవ్యము లని విధింపఁబడి మఱికొన్ని నింద్య
ములని నిషేధింపబడియుండుటచే నింద్యకార్యములయందుఁ
బూర్వకర్మానుసారముగ బుద్ధి ప్రసరించుచుండినను అట్లు ప్ర
కృతి బద్ధులయి వర్తింపక శాస్త్రములఁ బరిశీలించి శాస్త్ర
చోదితములగు కార్యములయందే వర్తింపవలయునని గ్రహింప

వలయును గదా! లేనిచో శాస్త్రములవలని ప్రయోజనము లేదు. స్వభావము శాస్త్రమునకు విరుద్ధముగ నుండినపుడెల్ల దానిని మార్చి శాస్త్రానుసారముగ జీవుఁడు వర్తింపవలయును.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి ॥

(గీత. ౧౬-అధ్యా.)

తా. ఏపురుషుఁడు శాస్త్రనియమమును మీఱి (పూర్వకర్మ జనిత) యిచ్ఛానుసారము వర్తించునో వాఁడు ఫలసిద్ధి నొందఁడు. సుఖపడఁజాలఁడు. పరమగతి వానికి లభించదు. కావున నిదిచేయఁదగినదా, చేయఁదగనిదా యను సందియము గలిగినపుడు శాస్త్రమే ప్రమాణము. కాఁబట్టి యర్జునా! నీవు శాస్త్రములోఁ జెప్పియుండుదాని నెఱింగి కర్మము చేయఁదగి యుందువు.

ఈయర్థమే శ్రీమహాభారతమునందును విపులముగ నిరూపింపఁబడియున్నయది. పురుషప్రయత్నము లేకయే కార్యసిద్ధి కానేరదు. కావునఁ బురుషప్రయత్న మెక్కుడుగ నుండవలయు. కార్యసిద్ధి నొనఁగూర్చుటయందుఁ బురుషప్రయత్న మాఱుభాగము లనియును దైవిక మొక్క-భాగ మనియును పురాతనగ్రంథములయందు నిరూపింపఁబడినది.

షడ్భిర్మనుష్యయత్నైశ్చ సప్తమం దైవచింతనమ్ ।

కాపువాఁడు పొలమును దున్ని విత్తి కలుపుతీసి మఱియు ననేక విధముల ప్రయత్నముచేయనియెడల దైవికమగు కాల వర్షములు కురిసియు సస్యములను ఫలింపఁజేయజాలవుగదా! పురుష ప్రయత్నములేనిచో దైవసహాయము వలని ఫలమెట్లు సిద్ధించును?

మఱియు హితోపదేశమునందు నీయర్థమే యెక్కుడుగ సిద్ధాంతీకరింపఁబడియున్నది.

యథా హ్యేకేన చక్రేణ న రథస్య గతిర్భవేత్ ।
తథా పురుషకారేణ వినా దైవం న సిధ్యతి ॥
పూర్వజన్మకృతం కర్మ తద్దైవమితి కథ్యతే ।
తస్మాత్పురుషకారేణ యత్నం కుర్యా దతంద్రితః ॥
ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ
ర్దైవేన దేయ మితి కాపురుషా వదంతి ।
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్రదోషః ॥

తా. ఒక్కచక్రముతో బండి సాగదు. అట్లే పురుషప్రయత్నములేక దైవముచేతనే ఫలసిద్ధిగలుగదు. తొలిజన్మమునఁ జేసికొనిన కర్మమే దైవమని చెప్పఁబడును. కావునఁ బురుషయత్నమును పూనికతోఁ జేయవలయును.

పురుషప్రయత్నముచేయు పురుషునికి ఫలప్రాప్తిగలుగును. దైవముచే ఫలమియ్యఁబడుననుమాట అజ్ఞానులు చెప్పునది. దైవమును చంపి, యాత్మశక్తితోఁ బౌరుషముచేయుఁడు. యత్నము చక్కఁగఁ జేసియు ఫలించనిచో దోషములేదు.

శాస్త్రములును, శాస్త్రార్థములును దెల్పు నితరగ్రంథములును నీరీతి నుద్ఘోషింపుచుండ విధికృతము జరుగుచున్నదనియును, దానిని దాఁటుటకు మానవులకు శక్తి చాలదనియును, మానవులు ప్రవాహకాష్ఠములవలెను, గాలిచేఁదూలిపోవు తృణమువలె నున్నారనియు నెంచుట యెంతటి పొరపాటు? జీవుఁడు ధీరుఁడై యాత్మశక్తినివినియోగించి యత్యుత్తమమగు కార్యముల సాధింపవలయు. అట్లసాధ్యములని యెన్నఁబడిన ఘనకార్యముల సాధించిన మహాపురుషులయొక్కయు, మహాపతివ్రతలయొక్కయు, వృత్తాంతములు పూర్వగ్రంథములలో నిండి యున్నవికద! మార్కండేయుని యాయువు పదాఱు సంవత్సరములు మించదని పుట్టినప్పుడె విధినిర్దిష్టమై యుండినను స్వప్రయత్నము చేతనే పూర్ణాయువు నొందుటమాత్రమే గాక చిరాయువునుసైతము సంపాదించెనుగదా! మఱియును పతివ్రతాశిరోమణియగుసావిత్రి తనపూనికచేతను, ధైర్యముచేతను, యమునిచేఁజిక్కిన ప్రాణనాథుని ప్రాణములమరలించి దుస్తరమగు విధిలిఖితమును దరించునట్లు జేయలేదా!

కావున నుత్సాహముగలిగి పూనికతోడ నుద్యమించువారల కసాధ్యమెద్దియు నుండదు.

కర్మణేంద్రో భవేజ్జీవో బ్రహ్మపుత్రస్స్వకర్మణా ।
స్వకర్మణా హరేర్దాసో జన్మాదిరహితో భవేత్ ॥
స్వకర్మణా సర్వసిద్ధి మమరత్వం లభేద్ధ్రువమ్ ।
లభే త్స్వకర్మణా విష్ణో స్సాలోక్యాది చతుష్టయం ॥

సురత్వం చ మనుత్వం చ రాజేంద్రత్వం లభేన్నరః ।
కర్మణాచ శివత్వం చ గణేశత్వం తథైవ చ ॥
(శ్రీదేవీభాగవతము, ౯-స్కం., ౨౭-అధ్యా.)

మఱియు యోగవాసిష్ఠమునందు,

పౌరుషేణ ప్రయత్నేన సహసాంభోరుహాస్పదం ।
కశ్చిదేవ చిదుల్లాసో బ్రహ్మతా మధిగచ్ఛతి ॥
సారేణ పురుషార్థేన స్వేనైవ గరుడధ్వజః ।
కశ్చిదేవ పుమానేష పురుషోత్తమతాం గతః ॥
పౌరుషేణ ప్రయత్నేన లలనాకలితాకృతిః ।
శరీరీ కశ్చిదేవేహ గతశ్చంద్రార్ధచూడతామ్ ॥

తా. జీవుఁడు స్వకర్మవశమున నింద్రుఁడును, బ్రహ్మపుత్రుఁడును గావచ్చును, మఱియు హరిదాసుఁడునుఁ జన్మరహితుఁడును గావచ్చును. ఇంకను సకలసిద్ధులను బొందనగు. అమరత్వమును బొందఁజాలును. సాలోక్యాది చతుర్విధముక్తులను జెందఁగలుగును. దేవత్వమును, మనుత్వమును రాజేంద్రత్వము మొదలగువానినెల్లఁ బొందఁజాలియుండును. స్వకర్మబలముననే శివత్వమును, గణేశత్వమును బొందనగు. పురుషప్రయత్నముచేతనే యొకానొక జీవుఁడు బ్రహ్మత్వమును బొందును. అటులనే శుద్ధమగు పురుషకారముచేతనే విష్ణుత్వమును బొందును. పురుషప్రయత్నముచేతనే యొకానొకపురుషుఁడు శివత్వమునుబొందును.

కర్మవిషయమున నింకొకవిధమగు దురభిప్రాయముగూడఁ బలువురమనస్సులయందుఁ బొడముచుండును. ఎవ్వఁడేని దారి

ద్రవ్యముచేఁ గాని, రోగాదులచేతఁగాని బాధపడుచుండ వానిం జూచువారు వానిని దైవోపహతునిగ భావించి వానికి సహాయముచేసిన నది దైవోద్దేశ్యమునకు విరుద్ధమగుననియు నెంచుట గలదు. అట్లెంచుట యజ్ఞానము. కర్మఫలానుభవము ఎపుడారంభమైనదియు నెపుడు పరిపూర్ణమగునదియును నజ్ఞులగు మనుష్యులకు సమగ్రముగఁ దెలియసాధ్యము కాదు కదా; బాధితులబాధలను దొలఁగింప యత్నించుట మానవుల ధర్మమయియుండ నవకాశముగలిగినపు డట్టియత్నముచేయకయుండుట యధర్మము. బాధపడుచుండువారిని జూచినపుడు వారికి సాయముచేయుటకుఁ బ్రతిమానవుఁడును యత్నింపవలయును. బాధపడువాని కర్మము పరిపక్వము కానిచో నా సహాయము లభింపకపోయినను పోవచ్చును. సహాయమునొందుటకుఁ గర్మము పరిపక్వమయినదియు, కానిదియు సర్వజ్ఞులగుమహానీయులకును, దేవతలకును నెఱుంగనగుఁ గాని యితరుల కెఱుంగ నసాధ్యము. కావునఁ బ్రతిమానవుఁడును దుఃఖితులగువారిని జూచునపుడెల్లఁ దన ధర్మమును విడువక నడుపవలయును. అనుభవించువాని కర్మము పరిపూర్ణము కానిచో సహాయము చెందకుండఁ జేయుట కర్మదేవతల ధర్మము. దేవతలద్దానిని జేయఁజాలియుందురు.

ఇదియునుంగాక మఱియొకసందియ మీవిషయమునఁ బొడమొటయుం గలదు. ఒక్కొక్క జన్మమునందును జీవుఁడు చేయుకార్యములు గ్రహములచారము ననుసరించి యుండునని

యును, తమకు స్వతంత్రమేమియు లేదనియును, గ్రహములు కార్యములను జేయించువారనియును మనదేశమున విశేష ముగ వాడుక గలదు. ఇంచుకయేని యాలోచించి చూచినచో నీయభిప్రాయము తప్పని స్పష్టమగుచున్నది. జననకాలగ్రహ సంపత్తి జీవుని పూర్వపుఁగర్మఫలమును సూచించునదియేగాని గ్రహములు ఫలముల నిచ్చువారుగారు. సాధారణముగ జన్మపత్త్రిక వ్రాయునపు డాదియందువ్రాయఁబడు శ్లోకములీ యర్థమునే విస్పష్టముగఁదెలుపుచున్నయవి.

> శ్రుతాసతీ సాధుజనానురంజకా పిత్రంతరంగోత్పల చారుచంద్రికా।
> భావ్యర్థసంసూచనసచ్ఛకుంతికా విలిఖ్యతే సంప్రతి జన్మపత్త్రికా॥
> జననీ జన్మసౌఖ్యానాం వర్ధనీ కులసంపదామ్ ।
> పదవీ పూర్వపుణ్యానాం లిఖ్యతే జన్మపత్త్రికా ॥

"భావ్యర్థ సంసూచన సచ్ఛకుంతికా," "పదవీ పూర్వ పుణ్యానాం" అనుపదములవలనఁ బూర్వకర్మఫలములను గ్రహములు సూచించునవియేగాని ఫలముల నిచ్చునవి గావని స్పష్టమగుచున్నది. కావునఁ గొందఱు మానవులు అకృత్య ములం జేసి తమజాతకరీతిచే గ్రహము లట్టి కృత్యములను జేయించిరని చెప్పుట యశాస్త్రీయము. పూర్వకర్మానుసార మగు శుభాశుభవాసనలను, మనశ్శక్తులను, జాతకమువలనఁ దెలిసికొనఁదగుఁ గాని జీవుఁడా ఫలములఁ దన ప్రయత్న ముచే మార్పఁజాలఁడని చెప్పరాదు. జాతకమునుబట్టి జీవున కెద్దియేని యశుభవాసన లున్నట్లు తెలియవచ్చినచో వానిని

నశింపఁజేయు విద్యను బూనికతో నభ్యసించి యాదుష్టవాస
నల నశింపఁజేసికొనవలయు. ఇందుకు దృష్టాంతముగ నొక
పురాతన కథ గలదు. తొల్లి యొక రాజసంస్థానమునఁ నొక్క
జ్యోతిష్కుఁ డుండెను. అతనికిఁ బుత్త్రజననము కాఁగాఁ
దత్కాలమును బరికించి జాతకము వ్రాయుచుండఁగా శిశు
విరువది వత్సరముల ప్రాయము గలవాఁడైనపుడు చోరుఁడగు
నని తెలిసెను. దానికిం జింతించి యాచౌర్యవృత్తి పుత్త్రున
కలవాటు పడకయుండఁ దొలఁగింపవలయు నని యుద్దేశించి
దీర్ఘముగ యోచించి విద్యాభ్యాసమువలనఁగాని దానిని దొల
గింపరాదని నిర్ణయించి యదిమొదలు విద్య చెప్పుచున్నపు
డనేకనీతులను బోధించుటలోఁ జౌర్యవృత్తి నీచమనియుఁ
బాపహేతువనియు, నపకీర్తికరమనియు నిట్లనేకవిధముల లక్ష్య
లక్షణ పురస్సరముగ బోధించుచు నేయే పదార్థముల నప
హరించిన నేయేదోషములు రాఁగలవో, యెట్టి శిక్షలు గలుగఁ
గలవో వానినెల్ల నొక్కొ నొక్కొ చెప్పుచు వచ్చెను. ఆబాలుఁ
డాసంగతినే దృఢముగ నేర్చుకొని క్రమముగ విద్వాంసుఁ
డయ్యెను. కాని పూర్వకర్మవశమున నాకాలమురాఁగా దొంగి
లించవలయు నను బుద్ధి యుదయించెను. ఆరాత్రి యొరు
లెఱుఁగకుండ రాజమందిరమును జొచ్చి యచ్చటచ్చట వెదకి
ధనాగారమును ప్రవేశించి దానియందలి వస్తువుల నొక్కొ
టొక్కటి చూచుచురాగాఁ దనకుఁ దండ్రిబోధించిన విషయ
ములు జ్ఞప్తికివచ్చెను. రత్నాదు లపహరించుటవలనఁ గలుగు

పాపములు శిక్షలు తలంపునకు వచ్చినందున సదోషములని వానినెల్ల నపహరించుట మాని మరలి వచ్చుచు నొకమూల రాసిగాఁ బోసియున్న వరిపొట్టును జూచి దానియం దేమియుఁ దండ్రి దోషమును జెప్పియుండలేదు కావున దోషములేదని యపహరించి యింటికిం బోవుచుండెను. రాజగృహము వెడలుతఱిఁ గావలియున్న సేవకుఁ డాతనిం బట్టుకొని కట్టిపెట్టి యుదయమున రాజు సమ్ముఖమున నిలిపెను. రాజు తన యాస్థానపండితుని పుత్త్రుఁ డిట్టిపని చేసినందుల కాశ్చర్యపడి యేమి ఇది యని నడుగ నతఁడు నిజస్థితిని జెప్పెను. నిశ్చయ వార్త నెఱుఁగఁగోరి యాతని నొకచోట నునిచి తండ్రిని బిలుపించి రాత్రివృత్తాంతమును నెఱిఁగించెను. జ్యోతిష్కుఁడు జాతకదోషమును జెప్పుచు స్తేయదోషమునే విద్యాభ్యాసకాలమునఁ బలుమాఱు నొక్కి చెప్పితిననియు నతఁ డా విషయము నెఱిఁగియున్నవాఁడు గావున నావృత్తికిఁ బోఁడని నిశ్చయించితి ననియుం జెప్పెను. రాజు సత్యము నెఱింగి విప్రకుమారుని విడిచిపెట్టెను. దీనినుండి పూర్వకర్మానుగుణములను నశుభవాసనలను విద్యాభ్యాసమువలన విశేషముగ మార్చి కాలక్రమమునఁబూర్ణముగ నశింపఁజేసికొన సాధ్యమగునని స్పష్టమగుచున్నది కదా! ఉపాధ్యాయు లగు వారలు విద్యార్థి జాతకలక్షణముల నెఱింగియుండుట యెంత ప్రయోజనకారి యైనదియు, నెంత యావశ్యకమైనదియు నీ యితిహాసమునుండి స్పష్టమగుచున్నది. పాఠశాలలయం దుపాధ్యాయులు పైని

సూచించిన రీతిని విద్యార్థుల నొక్కొక్కరిని ప్రత్యేకముగఁ బరిశీలించి వారియందలి యశుభవాసనల నెఱింగి యాయశుభ వాసనలఁ దుదముట్ట నశింపఁజేయుటకును, శుభవాసనల బీజా వాపము సేయుటకును, బీజరూపముగ నుండు శుభవాసనల దిన దిన ప్రవర్ధమానములుగఁ జేయుటకును సదా యత్నింప వలయును. విద్యాభ్యాసమువలని ప్రయోజనము లౌకిక జ్ఞానము నభివృద్ధిచేయుటమాత్రమే గాదు. విద్యార్థిని సుశీలునిగఁ జేయుట ముఖ్యోద్దేశ్యము. పూర్వము గురుకులవాసము వలన నిది సమకూరుచుండెను. ఇప్పుడు పాఠశాలలయందుఁ బెక్కండ్రు బాలు రొక్కయుపాధ్యాయుని యొద్దఁ గొద్ది కాలము మాత్రము విద్యను గ్రహించుచుండుటచే నా ముఖ్య ప్రయోజన మంతగ సమకూరుట గానము.

అయినను విద్యార్థివసతిగృహముల నేర్పాటుచేసి పాఠశాలాధికారుల విచారణలో నుంచి, విద్యార్థులకు గురువుల సాంగత్యము, ఎల్లపుడు గలుగునట్లుచేయుట ద్వారా వారల ప్రవర్తనమును చక్కగ చేయదగు. ఈవిషయము ౧౧ వ అధ్యాయమున బ్రహ్మచర్యాశ్రమధర్మములక్రింద విస్తరింపఁ బడియున్నది.

కర్మములు ఫలమునిచ్చు శక్తినిబట్టి మూఁడు విధములుగ విభజింపఁబడియున్నవి. ప్రారబ్ధము, సంచితము, క్రియమాణము అని. ప్రారబ్ధమనఁ జక్కఁగ నారంభమయినది. అనఁగా ననుభవమునకు వచ్చిన పూర్వకర్మము. సంచితమన ననుభవ

మునకు రాక చేరియుండు ప్రాక్కర్మము. ఇది సాధారణముగ జీవుని స్వభావముగను, శుభాశుభవాసనలుగను, మనశ్శక్తిగను గన్పడుచున్నయది. క్రియామాణమనునది వర్తమాన కర్మము. అనఁగా నీజన్మమునందుఁ జేయఁబడుచుండునది.

అనేకజన్మసంజాతం ప్రాక్తనం సంచితం స్మృతమ్ ।
క్రియమాణంచ యత్కర్మ వర్తమానం తదుచ్యతే ॥
సంచితానాం పునర్మధ్యాత్సమాహృత్య కియత్కిల ।
దేహారంభేచ సమయే కాలః ప్రేరయతీవ తత్ ॥
ప్రారబ్ధం కర్మవిజ్ఞేయమ్ ।

(దేవీభాగవతము ౬ స్క., ౧౦. అధ్యా.)

సంచిత కర్మమన ననేకకోటి జన్మములయందుఁ జేసిన కర్మ ఫల మనుభవించగా మిగిలియుండు కర్మశేషము. ప్రారబ్ధమన్న నట్లు శేషించియుండు కర్మమునుండి యీజన్మమునందు ననుభవమునకు వచ్చుభాగము. గృహకర్త దీర్ఘకాలానుభవమునకుఁ దగినట్లు నేకరించిన పదార్థతుల్యము సంచితము. దానినుండి యప్పుడప్పు డుపయోగమునకొఱకు విభజించి తీసికొనఁబడు పదార్థమువంటిది ప్రారబ్ధము. అనేక జన్మములయందనేకులతో సంసర్గము కలిగి వారితోఁ గర్మానుబంధము లేర్పడి యుండును. అట్టి జీవులందఱు నేకకాలమునందు జన్మించుటయు, జన్మించినను భిన్న భిన్న ప్రదేశములయం దుండుటచే నొకరితో నొకరు కలియుట కవకాశముండుటయును దటస్థింపదు. ఇదిమొదలగు దేశకాల నిమిత్తములచే నొక్కొక్క

జన్మమున నేయేజీవులతోటి ఋణానుబంధములను దీర్చుకొనుటకు సాధ్యమగునో అట్టి జీవుల నొకచో జన్మించునట్లు చేయుట చేతను, లేక మఱియేవిధముననైనను వారలు గలియునట్లు చేయుటచేతను, కర్మశేషమునందుఁ గొంతభాగ మనుభవమునకు వచ్చితీరునట్లు కర్మఫలప్రదాతలగు దేవతలు నిరూపింతురని చెప్పియున్నాము కదా! అట్లొక్కొక్క జన్మమునందు ఫలానుభవమునకు వచ్చిన కర్మభాగము ప్రారబ్ధ మనఁబడును. అనఁగాఁ జక్కఁగా ఫలమునిచ్చుట కారంభమైనది. అనఁగా ఫలభూతమగు కర్మము. జీవునకుఁ గలుగు శరీరసౌష్ఠవము, మాతాపితలు, దేశకాలములు లోనగునవి యన్నియు నాప్రారబ్ధకర్మము ననుసరించియే కలుగును. వింటి నుండి విడువఁబడిన బాణమువలెఁ బ్రారబ్ధ మనుభవమునకు రాకతప్పదు. ప్రారబ్ధమునుమార్చుట కెవ్వరికిని సాధ్యము కాదు. తనఫలమును దానిచ్చియే తీరును. "ప్రారబ్ధకర్మణాం భోగా దేవక్షయః" అని. ఇదియుఁగూడఁ బ్రయత్నముచే మార్ప సాధ్యముకావచ్చును గాన ప్రారబ్ధఫలమును, పురుష ప్రయత్నఫలమును రెండును గలిసి ఫలరూపముగఁ బరిణమించును. ఒకకాలువని త్రవ్వి దానిని నిరాటంకముగాఁ బోనిచ్చినచో నది పోఁదగుస్థానమునకుఁ బోవకనిలువదు. అట్లుగాక దానికడ్డముగా మఱియొకకాలువని త్రవ్విన నారెండును నొకటితో నొకటి దగిలినచో మొదటికాలువ తాఁబోఁదగు స్థలమును బొందదు. రెండవకాలువ స్వేచ్ఛగాఁ దాను బోదగు

స్థలమునకుఁ బోదు. రెండును తమ మార్గములువిడిచి మఱియొక మూలగాఁబోవును. ఈరీతినిఁ బ్రారబ్ధము తనఫలము నియ్యక తీరకయుండినను, పురుషప్రయత్నముచే దాని మార్ప నసాధ్య మని యెంచక పురుషప్రయత్నము చేసినచోఁ బ్రయోజనము కలుగకపోఁజాలదు. ప్రయత్నములేనిచో దాని ఫలము తానే వచ్చును. కొన్ని ప్రారబ్ధములు మనకుఁదెలియకయే పైఁబడ వచ్చును. వానిని నిలుపఁబ్రయత్నముచేయను మన కవకాశమే కలుగదు. సంచితకర్మ మిట్లుగాదు. సంచితకర్మము ఫల స్వరూపముగఁ బరిణమించనిది. దానిని ప్రయత్నముచేత ననఁగా వర్తమానకర్మముచేత మార్పఁదగు. సంచిత కర్మమున స్వభావరూపముగఁ గన్పడఁదగినదంతయు నారూపముగఁ గన్పడుచున్నదనియు, వర్తమానజన్మమునందుఁ జేయుప్రయత్నముచే నాస్వభావమును మార్పఁదగుననియును నిరూపింపఁబడి యున్నయది కదా! ఇంతియగాక సంచితకర్మ ముత్తమమగు నాత్మజ్ఞానమువలన నశించును.

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

(గీత. ౪-౩౭)

తా. దీప్తాగ్ని కట్టెలను ఎట్లు భస్మముగఁజేయునో అట్లే యర్జునా! జ్ఞానపావకుఁడు సర్వకర్మములను భస్మముచేయును.

చేయఁబడు కర్మమంతయు ఫలమునీయక తీరదను సిద్ధాంత మొకటి యుండ జ్ఞానముచేత మాత్రము కర్మ మెట్లు నశించు

నని యడుగవచ్చును. సంచితకర్మము ఫలమున కున్ముఖము కాక యుండుటచే నింకను బీజరూపముగనున్న దనఁదగు. ఇంద్రియములచేతను, మనస్సుచేతను జేయఁబడు కర్మమంత యును జీవునకు స్వభావరూపముగనుండుటచే నెల్లప్పుడును మార్పఁదగియేయున్నయది. కాయికకర్మము మాత్రము ఇతర జీవులకు సుఖదుఃఖకారణమై యుండియుండుటంబట్టి యాయా జీవులు భూలోకమున జన్మించి యుండుకాల మాఋణాను బంధములఁ దీర్చుకొనుట కవకాశముల నిచ్చును. తనతోఁ గూడ జన్మించియుండు జీవుల ఋణములుమాత్రము ప్రారబ్ధ మునందుఁ జేరియుండుటచే నాజన్మమునఁ దీర్పఁబడును. ఇతర జీవులు భూలోకమున జన్మించియుండమిచే, వారల ఋణములు మాత్రము సామాన్యులగు జీవులకుఁ దీర్చుట కవకాశము గలుగదు. ఐనను సత్కర్మానుష్ఠానముచేతను, ధ్యానయోగా దులచేతను, భక్తిజ్ఞానములచేతను బక్వచిత్తుఁడైన యొకా నొకమహాపురుషునకుమాత్రము పూర్వజన్మజ్ఞానము గలుగ, నాతండాసంచితమును నశింపఁజేయగలుగు. పూర్వజన్మ ములం దేయేజీవులతో నేయేయనుబంధము లేయేరీతిని గలిగి నదియు, వాని దివ్యదృష్టికి గోచరమగును. కాన వాఁడే యే కర్మములచే నీయనుబంధములు గలిగినదియు, ఏరాగద్వేషము లీకర్మములకు బీజములైనదియు నెఱింగి యాయాబీజములను బ్రయత్నముచే నాశము చేసికొనవచ్చును. ద్వేషపూర్వక మగుననుబంధ మెవరితోనైనఁ గలిగియుండినయెడలఁ బ్రేమ

పూర్వకములగు సంకల్పములచే నాద్వేషబీజమును నశింపఁ జేయును. అజ్ఞానపూర్వకమగు ననుబంధము కల్పించికొని యుండినచోఁ దత్త్వజ్ఞానముచే నాకర్మబీజమును నశింపఁ జేయును. ఈరీతిఁ గర్మబీజముల నన్నింటిని నశింపఁజేసినట్టాయెనా దగ్ధబీజములవలె నాయాకర్మములు ఫలదాయకములు గాక నశించిపోవును. ఫలాభిముఖము కాకయుండు కర్మము మాత్ర మివ్విధమున జ్ఞానసహాయముచే నశింపఁజేయ సాధ్యముకాని ఫలాభిముఖమైయుండు ప్రారబ్ధకర్మమునుమాత్రము ఫలమీయకుండునట్లు చేయ సాధ్యముకాదు. ఒకదృష్టాంతముచే నీవిషయము స్పష్టమగుచున్నది. ఎవ్వఁడేని బుద్ధిపూర్వకముగ విషభక్షణముసేయ నిచ్ఛయించి విషమును సేకరించి యుంచెననుకొందము. ఆవిషము లోపలికిఁ దీసికొనక ముందు దానిని నశింపఁ జేసి దానిఫలము రాకుండ నిలుపవచ్చును గాని దానిని ద్రావినవెనుక దానిఫల మది యీయక తీరదు. అట్టిసమయమందు విఱుపుమందు నిచ్చి దానిఫలమును గొంత మాత్రము మార్పనగును. విషము దేహమంతయు వ్యాపించి మీఱిపోయినచోఁ బ్రతిక్రియ నిష్ప్రయోజనమగును. తీసి యుంచిన విషతుల్యము సంచితము. తీసికొన్న విషతుల్యము ప్రారబ్ధము. దానిఫలమేదోయది పుట్టింపకవిడువదు. దాని నొకప్పుడు ప్రయత్నముచేమార్పవచ్చును. మఱియొకప్పుడు మార్పనలవిగాకుండును. సంచితమును మాత్రము పురుషప్రయత్నముచే బొత్తుగా ఫలమీయకుండఁ జేసినను జేయవచ్చును.

జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మ జ్ఞానాన్న నశ్యతి ।
అదత్వా స్వఫలం లక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్ ॥
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ ।
న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యవేగేన నిర్భరమ్ ॥

తా. జ్ఞానము గలుగకముందు ప్రారంభించిన కర్మము జ్ఞానమువలన, గుఱిచూచి ప్రయోగించిన బాణమువలె, ఫలము నీయక నశించదు. తొలుత వ్యాఘ్రమనుకొని బాణప్రయోగము సేసి తరువాత గోవని దెలిసి నిలుపఁజూచిన నాబాణము లక్ష్యవేగముచే నాపరాక పోయి యాగోవును జంపును.

పైని వ్రాయఁబడినదంతయు నాయాజీవుని ప్రత్యేకకర్మమును గుఱించినది. ఇదిగాక జనసముదాయముచే ననుభవింపఁబడు కర్మము సంఘాతకర్మ మనఁబడుచున్నది. ఒకానొక సమయమున గొప్ప జలప్రవాహముచేతఁగాని, భూకంపముచేతఁగాని, లేక ధూమశకటము లోనగువానికి హానికలుగుటచేతఁగాని పెక్కు జను లేకకాలమున బాధనొందుటయు, నశించుటయును గని వినియున్నాము. అటులనే యొకానొకప్పుడు ప్రభుసందర్శనాది కాలములఁ బెక్కండ్రు జను లనేక మహోత్సవములఁ జూచుట మొదలగు సుఖములఁ జేరి యనుభవించుటయుఁ గలదు. ఈసుఖదుఃఖము లన్నియు సంఘాతకర్మ మనఁబడుచున్నవి. ఎప్పుడేనియుఁ బెక్కండ్రు జీవు లొక్కవిధమైన కర్మానుభవమునకుఁ బాత్రులు కావలసి నట్లుండినఁ గర్మఫల ప్రదాతలగు దేవతలు ఆజీవుల నందఱి నొక్కస్థలమునఁ జేరునట్లు సమకూర్చి యట్టి సుఖదుఃఖముల

ననుభవించునట్లు చేయుదురు. అట్టియనుభవమునకుఁ బాత్రుఁ డుకాని జీవుఁ డొక్కఁడా సముదాయమునం దుండినను, ఎద్దియో యొక కారణముచేత నాసంఘాతకర్మమునుండి దైవికముగాఁ దొలఁగింపఁ బడును. ఓడయందుఁ బ్రయాణముచేయు జనులలో నొకఁ డెచ్చటనేని దిగిపోయిన మఱునిముసమందే యాయోడ మునిఁగిపోవుటగలదు. అపుడు పూర్వక్షణమున దిగిపోయినవాఁడు ఈసంఘాతకర్మమునకుం బాత్రుఁడై యుండ లేదని యెన్నవలయును. అట్లే కొందఱు పొగబండిప్రయాణము నుద్దేశించి పయనమై దైవికముగ నేదియో యొక యసందర్భముచే నిలిచిపోయి, నాఁటిదిన మాపొగబండి కపాయము పోఁకి యాబండి నశించినయెడల నాపయనముచేయక నిలిచి పోయిన వారు సంఘాతకర్మమునకుం బాత్రులు గామిచేఁ గర్మదేవతలవలనఁ దొలఁగింపఁబడిరని యెన్నఁదగు. ఆలాగుననే మార్గమున నొకానొక స్థలమునఁ గొందఱు జను లాబండిలోఁ బ్రవేశించి సంఘాతకర్మ ఫలమగు మరణము నొంది యుండవచ్చును. ఇట్లే భూకంపముచే నొక్కస్థలమున వేల కొలఁది జనులు స్వల్పకాలముననే నశింపఁగా ముందుదినమున నెందఱో యా స్థలమును విడిచిపోయి యుండుటయు, మఱి కొంద ఱచ్చటికిఁ బూర్వక్షణముననే వచ్చియుండుటయుం జూడఁ గర్మఫలప్రదాతలగు దేవతలు కర్మానుసారముగఁ గొందఱిని దొలఁగించి కొందఱ నచ్చటకుం జేర్చియున్నవారని స్పష్టమగుచున్నది.

జీవుఁడు కర్మముల నెల్లప్పుడు చేయుచుండియుఁ గర్మబంధ ములనుండి యెట్లు విముక్తుఁడగు ననువిషయము విచారింపఁదగి యున్నయది. సామాన్యముగా నొక బ్రహ్మాండమునం దుండు వఱకు నీశ్వరుని యాజ్ఞనతిక్రమించుటకు బ్రహ్మాదులకు సైతము శక్యముగాదు. ఈశ్వరాజ్ఞకు లోఁబడియే వర్తింపవలయును. అంతమాత్రము జీవులకు పారతంత్ర్యమున్నట్లు చెప్పవలసియే యున్నది. ఆయాజ్ఞ నతిక్రమించక బ్రహ్మాండమునందు వర్తిం చుటలో జీవునకుం గల స్వాతంత్ర్యవిషయ మిదివఱకే విశదీ కరింపఁబడి యున్నది. సంచితప్రారబ్ధకర్మములు జీవునిచేఁ బూర్వము చేయఁబడిన మనోవాక్కాయ కర్మములేగాని నిర్బంధముగ జీవుని బంధించు భిన్నమగు విధికృతములు గావు. విధియనఁగా చట్టము. కర్మమునకుఁ దగినఫలము తప్పక కలుగుననునది యీకర్మవిధి. కావున విధిశబ్దముచేత జీవుని పురాకృత కర్మములే తెలుపఁ బడుచున్నవి గాని యితరము గాదు. కావుననే యోగవాసిష్ఠ మను వేదాంతగ్రంథమున సంచిత ప్రారబ్ధకర్మములు ప్రాక్తన పౌరుషేయము లని నిరూ పింపఁబడియున్నవి.

“కర్మణా బధ్యతే జంతుః” అను వాక్యము సామాన్యముగ లోకమున వాడుకలో నున్నదియేకదా! కర్మము చేయునంత కాలము కర్మబంధములనుండి విముక్తియే లేదా యనుసంది యము వాపుటకు శ్రీభగవద్గీతయందు

యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయం కర్మబన్ధనః ।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర ॥ (గీత. ౩-౯.)

అని యుపదేశింపఁ బడియున్నది. అనఁగా నీశ్వరార్పణ బుద్ధితో స్వప్రయోజనము నత్యల్పమైనను అపేక్షింపక కర్మమం దభిమానములేక చేయఁబడు కర్మము తప్ప తక్కినకర్మములు జీవులను బంధించుచుండును. కావున నీశ్వరార్పణ బుద్ధితో రాగద్వేషములు లేక కర్మము చేయవలయునని తాత్పర్యము.

ఏ ప్రయోజనము నుద్దేశించి జీవుఁడు కర్మమొనరించువాఁడో ఆప్రయోజనమును భగవంతుఁ డనుగ్రహించుచున్న వాఁడు.

"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" ఫలార్థుల కిష్టభోగములను, జిజ్ఞాసువులకు జ్ఞానమును, ముముక్షువులకు మోక్షము నను గ్రహించును. కావున జీవుఁడు ఫలాభిసంగ రహితముగఁ జేయు కర్మములు బంధరూపములు గావు. అట్లుచేయఁబడు కర్మములు యథార్థముగఁ గర్మము లనఁబడఁజాలవు. అట్టి వాఁడే కర్మమం దకర్మమును జూచువాఁడని యెన్నఁదగు. అతఁడే నిజమైన సన్న్యాసియు, యోగియు నని భగవంతుఁడు భోధించియున్నాఁడు.

కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ।
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

(గీత. ౪-౧౮.)

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
స సన్న్యాసీ చ యోగీ చ ననిరగ్నిర్నచాక్రియః ॥ (గీత. ౬-౧.)

ఇవ్విధమగు కర్మము జీవుని బంధింపదు. లోకసంగ్రహార్థము చేయఁబడునది. అట్టికర్మములు సంపూర్ణముగ కామవివర్జితములై యుండుటచే బంధరూపములు కాకపోవుటయే గాక బ్రహ్మప్రాప్తికరములుగూడ నగుచున్నవి.

యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది స్థితాః ।
అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥
(కఠోపనిషత్తు. ౨-౬-౧౪.)

ఎపుడైతే హృదయగతమగు కామము లన్నియు వదలిపోవునో అపుడు మర్త్యుడు అమృతత్వమును పొందును. ఇచ్చటనే (అనఁగా జీవించియుండగనే) బ్రహ్మమును పొందును. ఈయర్థమే శ్రుతులయందచ్చటచ్చట విశేషముగ నొక్కిచెప్పఁబడియున్నది. గీతాశాస్త్రమునందును బెక్కుమాఱులుదాహరింపఁబడియున్నది.

యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః ।
జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥
(గీత. ౪-౧౯.)

త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోపి నైవ కించిత్కరోతి సః ॥
(గీత. ౪-౨౦.)

శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ।
(గీత. ౪-౨౧.)

సమ స్సిద్ధావసిద్ధౌచ కృత్వాపి న నిబధ్యతే ॥
(గీత. ౪-౨౨.)

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥

(గీత. ౨౩.)

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

(గీత. ౨౪.)

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్త్రమివాంభసా ॥

(గీత. ౫-౧౦.)

ఇట్లు ఫలాపేక్ష లేక చేయఁబడుకర్మములు ఆదియందుఁ జిత్తశుద్ధిసాధనములై యాపిదప నాత్మజ్ఞానహేతువులై మోక్ష సాధనము లగుచున్నవి. చిత్తశుద్ధికాకపూర్వమే కర్మములను విడుచుట సైతము బంధకారణమే యగు. చిత్తశుద్ధిగలిగి కామమును సంపూర్ణముగ జయించి భగవంతుఁడు లోకాను గ్రహార్థము నిర్హేతుకకరుణతో లోకమునందు వర్తించురీతి లోకమునఁ బరమేశ్వరప్రీతికొఱకు స్వామిభృత్య న్యాయ మునఁ గర్మములను జేయుచు వర్తించుమహానుభావుఁడు బంధ విముక్తుఁడై పరమపురుషార్థమును జెందును. అట్టి మహాత్ముని గుఱించియే "అత్ర బ్రహ్మసమశ్నుతే" అని చెప్పఁదగు. అనఁగా నిక్కడనే (ఈశరీరమునందుండఁగానే) బ్రహ్మానం దము ననుభవించుచున్నవాఁడు. వీరలే జీవన్ముక్తులనఁబడు వారలు. అట్టిపదవిని బొందినపిదప నాయానందము ననుభ వించుచు నుండిన నుండఁగలరు. లేక బ్రహ్మాండమునందు

నీశ్వరుఁడు వర్తించునట్లు నిర్వ్యాజకరుణతో లోకోపకారము-
కొఱకుఁ గర్మమును జేయుచునుండఁగలరు.

న మే పార్థాస్తి కౌన్తేయ త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

(గీత. 3-౨౨)

అని భగవంతుఁడు తనదృష్టాంతముచే నర్జునుని గర్మమం-
దుత్సాహముగలవానినిగాఁ జేసెనుగదా!

ఈకాలమునందును స్వప్రయోజనపరులుగాక లోకోప-
కారముకొఱకుఁ బాటుపడఁ బెక్కండ్రు మహాత్ములు కావలసి-
యున్నవారు. కావున జిజ్ఞాసువులగు నెల్లవారును లోకహి-
తార్థము కర్మములజేయుచుఁ దాము పరిశుద్ధులై పరమపురు-
షార్థము జెందుటయేగాక యెల్లరకు నట్టిపదవి గలుగఁజేయు-
నంతవఱకు శ్రమపడి భగవదుద్దేశ్యమును సఫలము చేయు-
దురు గాక.

———

# పదియవ యధ్యాయము

## ధర్మము

ధర్మమన జీవుఁ డేకాలమునందుఁ గాని యుండుస్థితినుండి యంతకంటె నుత్కృష్టమగుస్థితికిఁ దేఁదగునుపాయము. లోక మునందలి భూతము లన్నియు ననేక తారతమ్యములు గలిగి యుండును. ధర్మము లోకమును ధరించుచున్నది. అనఁగా ధర్మానుష్ఠానముచేతనే లోకము సుఖతరముగ వృద్ధియగు చున్నయది.

> ధారణా ద్ధర్మ మి త్యాహు ర్ధర్మో ధారయతి ప్రజాః
> ప్రభవార్థాయ భూతానాం ధర్మప్రవచనం కృతమ్ ।
> య స్స్యా త్ప్రభవసంయుక్తః స ధర్మ ఇతి నిశ్చయః
> ధారణా ద్ధర్మ మి త్యాహుః ధర్మేణ విధృతాః ప్రజాః ।
> య స్స్యా ద్ధారణసంయుక్త స్స ధర్మ ఇతి నిశ్చయః ॥
>
> (శాంతిపర్వము.)

అను వచనము లీయర్థమునే స్పష్టపఱచుచున్నవి. సమస్త భూతములు వానివాని ధర్మములను జక్కఁగ ననుష్ఠించుచుం డుటచే లోకవ్యాపారము సమంజసముగ నెఱవేఱుచుండ నం దఱును బురుషార్థములఁ జెందఁజాలుదురు. లోకమునందలి జీవుల తారతమ్యముల కనుగుణముగ నిరూపింపఁబడినధర్మ

ములే వర్ణాశ్రమధర్మములని యెఱుంగఁబడుచున్నవి. పరికించి చూడ ధర్మమెల్లప్పుడును సుఖమునిచ్చునదియును, అధర్మము దుఃఖప్రదమును నగు. భరతఖండమున వర్ణాశ్రమధర్మములు ప్రత్యేకముగ నిరూపింపఁబడియుండినను, ఇతరదేశముల నట్లు లేమిచే నాదేశస్థులయం దిట్టితారతమ్యములు లేవని యెంచ రాదు. సనాతనధర్మశాస్త్రకర్తలు దృశ్యాదృశ్య ప్రపంచ తత్త్వములను జక్కఁగ నెఱింగినవా రగుటంబట్టి జీవుల నుత్తమస్థితికిఁ దేఁదగు నుపాయముల నిశ్చయముగఁ దెలిసి నిరూపించియున్నవారు. ఇతరదేశములయం దిట్టి ధర్మనిరూపణము పరిశీలించి చేసియుండమిచే జీవులు తమయోగ్యతకుఁ దగిన ధర్మమును బాగుగ నిశ్చయింపఁజాలక యనేక కష్టములఁ బడుచున్నవారు. ఐనను హిందూశాస్త్రములలో నిరూపింపఁబడిన ధర్మము లన్నియు మానవకోటి యందఱచే ననుష్ఠింపఁబడదగినవియే.

సామాన్యముగఁ బరిశీలించి చూచిన జీవులలోఁ గొంద ఱజ్ఞానమున మునిఁగి, జడత్వమునుబొంది, నిద్రాలస్యములే స్వభావముగఁ గలిగియున్నవారు. మఱికొందఱు ప్రతికార్యమునందు నతిప్రవృత్తి కలిగి, యుక్తాయుక్త వివేకజ్ఞానము విశేషముగ లేక స్వప్రయోజనపరులై కామక్రోధాదులకు లోఁబడివర్తించువారు. మఱికొందఱు జ్ఞానస్వరూపులై శమదమాది సద్గుణసంపన్నులై విజితమత్సరులై శాంతాత్ములై యున్నవారు. ఈతారతమ్యముల ననుసరించియే చాతుర్వర్ణ్య

విభాగము చేయఁబడియె. ఈవిభాగము సృష్ట్యాదినుండి యేర్పడినదేగాని మధ్యకాలమున మనుష్య మాత్రులచేఁ జేయఁబడినది కాదు. ఉత్తమపురుషార్థ సాధనముగ నేర్పడినదిగాని యైహిక ప్రయోజనము మాత్రము నుద్దేశించి చేయఁబడినది గాదు.

చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।

(గీత. ౪-౧౩.)

అని భగవంతుడు గీతోపనిషత్తునందు వక్కాణించియున్నవాఁడేకదా!

ఈమూఁడు తరగతుల జీవులు తమోగుణ ప్రధానులనియు, రజోగుణ ప్రధానులనియు, సత్త్వగుణ ప్రధానులనియు నెఱుంగఁబడుదురు. ఈ గుణవిభాగము లన్నిదేశములందుండు జీవులందఱకును సామాన్యమే కదా! ధర్మము లన్నియును మొట్టమొదటఁ దమోగుణ ప్రధానులుగనుండు జీవులయందలి తమస్సును అనఁగా జడత్వమును, నిద్రాలస్యములను దొలఁగించి రజోగుణ ప్రధానులుగఁ జేసి కడపట సత్త్వగుణ ప్రధానులుగ జేయుటకు సాధనములుగ నున్నయవి. ఆదియందు జీవులు కేవల పశుప్రాయులుగనుండి జ్ఞానహీనులై శరీరపోషణమునకు వలయు నిద్రాహారములను, గ్రామ్యక్రియయుం దప్ప నితర వ్యాపారములేవియు లేక జడస్వరూపులుగ నుందురు. పూర్వానుభవస్మృతిగాని రాఁబోవు కాలమును గుఱించిన చింతగాని వారియందేమాత్రమును గానము. అట్టి జడస్వరూపులను జ్ఞాన

వంతులుగఁ జేయవలసినచో మొట్టమొదట వారి తమస్సును పోఁగొట్టు నుపాయము లావశ్యకములు. కావుననే భగవంతుఁడు ప్రపంచమునందెల్లయెడలను సుఖకరములును, రుచికరములును, మనోహరములును, సుందరములును నగు పదార్థజాలముల నిండింపఁజేసియున్నాఁడు. రుచిర పదార్థానుభవమున సుఖించుచు నాసుఖస్మృతిచే నావస్తువుల నాశించుచు వానికై పాటుపడుదురు. పశుప్రాయులగు వారలకు తాత్కాలిక విషయానుభవము తప్ప వేఱుచింత యుండదు. వారికి విషయానుభవమువలనఁ బ్రపంచ జ్ఞానము వృద్ధి కాఁదగియుండును. ఆహారమునందుఁగాని, చేష్టలయందుఁగాని నియమములు లేవు. ఇష్టానుసారము వర్తించుటయే వారల ముఖ్యలక్షణము. అట్టివారలకు ధర్మాధర్మముల కట్టుబాట్ల నేర్పఱచుటకు సాధ్యమే కాదు. మంచిచెడుగులు వారల కిట్టి యనేకానుభవమువలనఁ గలుగవలసినదియేకాని వేఱువిధమునఁగానేరదు. ఐనను ఇష్టానుసారముగ వర్తించుచో కొన్నికార్యములు దుఃఖమును గలుగఁజేయుటచేతను, మఱికొన్ని సుఖకారణము లగుటచేతను, ఈ సుఖకరములగు కార్యములే చేయఁదగినవనియును, దుఃఖహేతువు లగు కార్యములు చేయరానివనియును, నెఱుంగుదురు గదా; అట్టి జ్ఞాన మంకురించుచు రాఁగా, పెద్దలగు వారు కొన్నికార్యములు ధర్మవిరుద్ధము లగుటచేఁ జేయరానివనియును, మఱికొన్ని ధర్మము ననుసరించియుండుటచే గర్తవ్యములనియును బోధింపఁ దమ యను

భవమునకును, పెద్దల యుపదేశమునకును, సమన్వయము చేసి కొని యా పెద్దల వాక్యమునందు విశ్వాసబుద్ధిగలవారగుదురు. జడులగువారికి యుక్తాయుక్తజ్ఞానము విశేషముగ లేకపోవుటచే నాప్తులగు పెద్దలవాక్యమునందు భక్తివిశ్వాసములును వారియందు గురుత్వబుద్ధియు గలిగి వారి యనుమతికి లోఁబడి యుండి వారలకు శుశ్రూషచేయుటయు ముఖ్య ధర్మములగు.

ఈధర్మములవలనఁ దమోగుణజాతములగు జడత్వమును, నిద్రాలస్య ప్రమాదములును క్రమముగ క్షీణింప విశేషముగఁ గార్యప్రవృత్తి గలవారలగుదురు. తమోగుణ ప్రధానులగు జీవులకు విధింపఁబడిన ధర్మములన్నియుఁ దమోనివృత్తిసాధనములుగ నుద్దేశింపఁబడినవి. తమోగుణము నివృత్తియగుటకు సేవకావృత్తి ముఖ్యసాధనము. ఆవృత్తియం దితరులకు లోఁబడియుండుట, ఇతరుల యిష్టానుసారము వర్తించుట, కాలము నతిక్రమించక విధింపఁబడిన కార్యముల నెఱవేర్చుటయు నీ మొదలగు ధర్మములచేతను, ఈకృత్యము లొనరించుటయందించుకయైనను లోపము గలిగినచో దానికి విధింపఁబడు దండనవిధులచేతను, పై కృత్యములను సకాలమున నేర్పుతోఁ జేయఁబడినపుడు గలుగు సన్మానములు, బహుమతులు మొదలగువాని చేతను, పూర్వపు నాలస్యము, సోమరితనము, మైమఱపు లోనగునవి క్రమక్రమమున నశించును. ఇట్లు సన్మానమునందలి ప్రీతిచేతను, దండమునందలి భీతిచేతను, దమోగుణము తగ్గి రజోగుణము వృద్ధియగుచుండును. ఇట్టిజీవులకు

నాచార వ్యవహారములయందును, ఆహారవిహారములయందును విధినిషేధములు శాస్త్రములలో విశేషముగఁ జెప్పఁబడి యుండలేదు. వీరే శూద్రజాతియందు జన్మించువారని స్మృతులయందు వక్కాణింపఁబడియున్నది. ధర్మశాస్త్రముల యందు వారలకు విధింపఁబడియుండు ధర్మములు పైనుదహరింపఁబడిన ప్రయోజనమును గలిగించునవియై యున్నవి.

పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ।
(గీత. ౧౮-అధ్యా.)

రెండవ తరగతి జీవులు రజోగుణ మెక్కువగాఁగలవారు. తమస్సంబంధములగు గుణములనుఁ గ్రమక్రమమున జయించిన జీవుఁడు పూర్వముకంటె నించుక యుత్తమజన్మమున కర్హుఁడగుచున్నాఁడు. అట్టిస్థితియందు జీవునకు ద్రవ్యమును సేకరించుటయం దుత్సాహము స్వాభావికముగ నుండు. జగమంతయు ధనమూలముగావునఁ గృషి, వాణిజ్యము, గోరక్షణము మొదలగు వృత్తులు ధనార్జనమునకే ముఖ్య సాధనములగుటచే నవి వారికి ముఖ్యకర్మములుగ విధింపఁబడియున్నవి. ద్రవ్యము సుఖసాధనమై యుండుటచే దానికొఱకు నెక్కుడగు ప్రయత్నములు చేయుచు నార్జింపఁబడిన ద్రవ్యమునందు విశేషమోహము గలిగి సదా ద్రవ్యకాముఁడై వర్తించుచుండును. ధనమునందుఁ గామము, ధనార్జనమునందుఁ బ్రతికూలములు సంభవించినచోఁ గోపము మొదలగు గుణములు ఈ జీవునకు సహజములుగ నుండు. ఇతఁడు స్వాభావికముగ

ధనార్జనమే పరమార్థముగా గ్రహించి దానికై యితరుల సుఖ దుఃఖముల నించుకయేని విచారింపక బహువిధప్రయత్నములు చేయుచుండును. అట్టి ప్రవర్తనమువలనఁ గేవల స్వప్రయోజనపరత్వము, ఇతరులతో విరోధము, మాత్సర్యము లోనగునవి యన్నియుఁ గొంతకాలము వృద్ధియగుచుండును. ఈరీతి ధనార్జనమువలని సుఖము గలిగినను, బహువిధములుగ నితరులకు దుఃఖహేతువులగు కార్యములు చేయుటచేఁ దనకును దత్ప్రతిఫలములగు కష్టములుకొన్ని సంభవింపక తీరవు. అట్టి సుఖదుఃఖానుభవములవలనఁ గొన్ని కార్యములు దుఃఖహేతువులనియును, మఱికొన్ని సుఖహేతువు లనియును గ్రమక్రమముగ నెఱుంగఁగలఁడు. కామక్రోధాదులవలనఁ గలుగు కీడులను దెలిసికొని వానిని జయించుటకు శాస్త్రమునందు సూచింపఁబడిన ధర్మము అనుసరింపఁదగిన దనియు ననుభవమువలన నెఱుంగును. ఈతరగతి జీవులకు నైజముగ నర్థకామములు ముఖ్యపురుషార్థములుగఁ దోఁచుచుండ వారు కుటుంబములందును, జనసంఘమునందును, అన్యోన్య సుఖప్రదముగనుండుటకుఁ గొన్నికట్టుబాటులకు లోఁబడి వర్తింప వలసియుండుటావశ్యకము. కావున ధర్మము మొదటి పురుషార్థముగ నేర్పడుచున్నది. జీవుఁడు తా నుత్తమస్థితిని బొందుచు నితర జీవులకు సుఖప్రదముగ నుండునట్లు ప్రవర్తించుటయే ధర్మమార్గము. అధర్మమువలన జీవుఁడు మునుపటికంటె నీచస్థితి నొందుటయేగాక యితరులకు హింసచేయును.

ఈజీవులకు ధనము సంపాదించుటయు, సుఖముల ననుభవించుటయుఁ, గోరికల నీడేర్చుకొనుటయు ముఖ్యధర్మములని చెప్పఁబడియెను, గాని యీ ధనార్జనమునందును, సుఖానుభవమునందును, ధర్మము ననుసరించి కొన్ని విధినిషేధములు ఆవశ్యకములగుచున్నయవి. ద్రవ్యమును సేకరించుటయందితరులకునష్టమును గలుగఁజేయకుండవలయును. సుఖముల ననుభవించుటయందును, ఇతరులసుఖములకుఁ బ్రతిబంధము లేకుండునట్లు నడచుకొనవలయును. ఇట్టి నిబంధనల ననుసరించుటచేఁ గ్రమక్రమమున జీవుఁడు కేవల స్వప్రయోజనపరత్వమును వదలి యితరుల సౌఖ్యమునుగూడ గమనించి ధర్మమార్గమున నడువవలయునని తెలియునట్టి స్థితికివచ్చును. పిదపఁ గాలక్రమమునఁ బరోపకారబుద్ధి వృద్ధియై "పరోపకారార్థ మిదంశరీర"మ్మను న్యాయము ననుసరించును.

ఈరీతి నాజీవుఁడు కేవల అర్థకామములకు లోఁబడకయుండునటుల ధర్మము మొదటి పురుషార్థముగ నిరూపింపఁ బడియున్నది. ధనము నార్జించుటయందు ధర్మమునుదప్పక ఆర్జింపవలయును. సుఖము లనుభవించుటయందును ధర్మమార్గమును మీఱక యుండవలయును.

ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ । (గీత. ౭-౧౧.)

ఈస్థితియందుండు జీవులకు ధర్మవిరుద్ధముకాని కామము మిక్కిలి యావశ్యక మగుటచే నది తన స్వరూపమేయని భగవంతుఁడు గీతాశాస్త్రమునందు వక్కాణించి యున్నాఁడు.

కాఁబట్టి ధనార్జనమునందును, కామోపభోగమునందును జీవు లిష్టానుసారము వర్తింపక యుండుటకు ధర్మము నతిక్రమింపక యుండవలయు నను నిర్బంధము మొట్టమొదటిది. మఱియును ఆర్జితద్రవ్యమునందుఁ గొంతభాగమైనను బరోపకారమునకు వినియోగించుట యీజీవులకు ముఖ్యధర్మము. ద్రవ్య మార్జిత పఱచుట ముఖ్యవ్యాపారముగ నుండునపు డార్జితవిత్తము తనకు మాత్రమే యుపయోగింపవలయు ననుట యంత మంచిది గాదు. అతిజాగరూకతతో ధనమును భద్రపఱచుట, వ్యయ మొనరించుటయం దిష్టము లేకయుండుట యట్టిజీవులకు సహజ గుణములుగ నుండు. ఐనను అట్టివారికి పరోపకారము కొఱ కల్పముగ నైన ధనవ్యయము చేయఁబడినచో భగవంతుఁడు ప్రీతినొంది పెక్కుమడుంగులు ద్రవ్యమును బ్రతిఫలముగ నిచ్చుచుండును. దేశకాలపాత్రము లెఱింగి భగవదర్పణముగ దానము లొనగునవి చేసినచో నిహపరసుఖములు గలుగు నను ధర్మము లనుభవజ్ఞులును, తత్త్వవేత్తలు నగువారు శాస్త్ర ములయందుఁ బ్రతిపాదించి యుండుటచేఁ బరోపకారమున నెక్కుడాసక్తి కలుగును. ఈ రీతి గ్రమక్రమమునఁ బరోప కారబుద్ధి వృద్ధియగుచుండును. కాలక్రమమునఁ బరోపకార బుద్ధి వృద్ధి కానుకాను ధనమునం దభిమానము, మమత్వబుద్ధి వదలుచువచ్చును.

మఱియు శరీరసుఖమును గొంతవఱకు వదలినం గాని ధనార్జనమునందు నేర్పఱి కాఁ జాలఁడు. కాఁబట్టి దేహసుఖ

మునంతగాఁ గోరక కార్యనిర్వహణమందు జాగరూకతను, పూనికను అభ్యసించి పరిజనుల విషయమై యేయే మనుష్యులచే నెట్టిపను లెంతెంత యెప్పుడెప్పుడు చేయించవలయునో, హెచ్చుతక్కువలు లేక యెంతమాత్రము వారికి వేతన మీయవలయునో తెలిసి యప్రమత్తతో వర్తింపవలయును. ఇతరులతోఁ జేయు క్రయవిక్రయాదివ్యాపారమునందు న్యాయమును మీఱరాదు. ఆర్జించిన ద్రవ్యమును సద్వినియోగము చేయవలయు. ఈ మొదలయినవి యీజీవులయందు వృద్ధి కాఁదగిన లక్షణములు.

ఇట్టి జీవులు వైశ్యజాతియందు జన్మించువార లని హిందూమతగ్రంథములయందు నిరూపింపఁబడి యున్నది. ఏ దేశమునందైనను జీవులు రజోగుణప్రధానులయి ద్రవ్యమును సేకరించుటయే ముఖ్యవృత్తిగ నుండువారలు వైశ్యజాతివారని భావింపఁదగు. ధనము నార్జించి యార్జితముచేసి యుచితమగు మితవ్యయము చేయుటయు, పరోపకారముకొఱకును, దేశక్షేమముకొఱకును, విద్యాభివృద్ధికొఱకును, ఆర్జితద్రవ్యమును వినియోగించుటయు క్రమక్రమముగ ధనమునం దున్న మోహమును వదలి కొంత నిస్పృహత్వము నొందుటయే దీనికి ముఖ్యపురుషార్థము.

ఈజ్ఞానము కొంతవఱకు వృద్ధి కానుకాను జీవులు ఇంతకంటె నుత్కృష్టమగు జన్మము నొంద నర్హులగుచున్నారు. ద్రవ్యమునం దున్న మోహ మించుక క్రమక్రమమున వదలు

చుండినపుడు దేహాభిమానము వదలియుండదు గాన దేహము సహితము పరుల మేలుకొఱకు వినియోగము చేయఁదగినదను జ్ఞానము వృద్ధి కావలయును. అట్టి స్థితియందు జీవుఁడు క్షత్రియ జాతియందు జననమొందఁ దగియున్నవాఁడు. క్షత్రియులు ధనమునం దభిమానము కొంత తగ్గియు నెక్కుడుగఁ గీర్తికాములై ప్రజలఁ దమ యాజ్ఞావశవర్తులను జేయ నిష్టముగలవారగుదురు. ప్రజాపరిపాలనను చేయుచు ధర్మరక్షణమునఁ బ్రజల మేలును ఎల్లప్పుడు కోరుచుఁ దమమహిమ వృద్ధిగ నుండవలయు నను నభిలాష గలిగియుందురు. క్షత్రియులు శౌర్య ధైర్యౌదార్యములు లోనగు వానియందుఁ దానౌన్నత్యమున నుండఁ దలంతురు. ప్రజలను రక్షించుటయం దధికాభిమానము గలిగి వారలకించుక యేని యపాయము గలిగిన దానిని దొలఁగించుచు, ఒకప్పుడు వారికై ప్రాణత్యాగము చేయవలసి వచ్చినను వెనుదీయక వర్తింతురు. ఇందును గ్రమక్రమమున ధనమునం దభిమానము వదలినరీతినే శరీరమునం దభిమానముకూడ వదలించుకొనుట యీధర్మమువలని ముఖ్యప్రయోజనము. ఈస్థితియం దుండుజీవులు తమకుఁ గల యధికారగర్వముచేతఁ దమ యాజ్ఞకులోఁబడిన ప్రజలను క్షోభింపఁ జేయుచుఁ దమ సంపత్తునంతయు స్వప్రయోజనమునకే వినియోగించుచుఁ దమయున్నత ధర్మమును మఱచినను, బహువిధానుభవములచే నామార్గము అధర్మమని తెలిసికొని ప్రజాక్షేమము కొఱకే భగవంతునిచే సృజింపఁబడితిమని యెఱింగి

సర్వస్వము బరులకై యుపయోగముచేయుచుఁ గట్టకడపట దేహమునందలి యభిమానమును యుద్ధాదులయందు వదలుచు, నంతకంటె నెక్కుడగుజన్మము నొందుటకు నర్హులగుచున్నవారు.

ఆదియందు జీవుఁడు కేవలవిషయాసక్తుఁడుగనుండి యుక్తాయుక్తము లోకించుకయైన నెఱుంగకవర్తించి, వివిధానుభవములచే నల్పముగ జ్ఞానము నొంది, పిదప సేవకావృత్తియందుఁ దనకంటె నుత్తములగు జీవులకు శుశ్రూషచేయుచు వారి యాజ్ఞకు లోఁబడి వర్తించుచుఁ దమోగుణజాతములగు నిద్రాలస్యప్రమాదములను దరించి, స్వతంత్రవృత్తి కర్హుఁడై, రజోగుణవశవర్తియై, ధనార్జనమున కనుకూలమగు వృత్తులయందుఁ బ్రవర్తిల్లుచు నర్థమే పురుషార్థముగ భావించుచు, దానికై పాటుపడుచు, ద్రవ్యమునందు విశేషమగు నాశయు మోహమును గొంతదనుక కలిగియుండి కాలక్రమమున వివిధానుభవముల వలన నాయర్థమువలనఁగలుగు సౌఖ్యములు నశ్వరములను జ్ఞానము దృఢము కానుకాను క్రమక్రమమున ధనమునందలి మమకారాదుల వదలించుకొని, యంతకంటె నుత్తమమగు జన్మమున జన్మించి, ప్రజాపరిపాలనము మొదలగు ధర్మరక్షణ కార్యములలో వర్తించుచు శౌర్యధైర్యాదులు గలిగి తనమేలుకంటెఁ బ్రజారక్షణము నెక్కువగ భావించుచు, తన శౌర్యధైర్యములను, శరీరపాటవమును, శక్తిహీనులను గాపాడుకొఱకే యుపయోగించుచుఁ, దనయధీనమగు ద్రవ్యము ప్ర

జలమేలుపొంటె వినియోగించుచు, తనశరీరమును సహితము ప్రజారక్షణమునకై త్యజించుటకుత్సాహము గలవాఁడగుచుఁ, గ్రమక్రమమునఁ బూర్వము ద్రవ్యమునందలి యభిమానమును వదలినట్లే దేహాభిమానమునుగూడ వదలి, పూర్వజన్మంబు లన్నింటికంటె నుత్తమమును, సత్త్వగుణ ప్రధానము నగు జన్మమును బొందుటకు జీవుఁ డర్హు డగుచున్నవాఁడు.

యథార్థముగ ఇంతమట్టుకు పరిపక్వమయిన జీవుఁడు విషయసుఖములయం దాశయు, నైహికసుఖసాధనమగు ధనమునందభిమానమును, దేహాభిమానమును గొంతవఱకు జయించియే యుండును. ఇట్టి లక్షణములతోఁ గూడినజీవుఁడే యుత్తమజాతి జీవుఁడనిపించుకొనును. ఇట్టి పదవినొందిన జీవుఁ డితర జీవులకు జ్ఞానమును బోధించుటకు నర్హుఁడు. జీవుఁడు నిద్రాలస్యాదులవలని సుఖంబును, ధనార్జనమువలని మోదమును, దేహాభిమానమువలని సంతోషమును నస్థిరములని దెలిసి, స్థిరసుఖమెద్దియో యని వెదకుచు నది జ్ఞానసాధ్యమని తెలిసి, జ్ఞానార్జనమునం దత్యుత్సాహముగలవాఁడై యుండు. మొదట మొదట విద్యావంతుఁడ నను నభిమానముకొంత గలిగి యుండినను గ్రమక్రమమునఁ దనజ్ఞానమంతయుఁ బరుల మేలుకొఱకుపయోగించుటకు నేర్చుకొనును. బహుకాలము నానా విధములగు శాస్త్రములు మొదలగు నపరవిద్యల నేర్చి సకల విద్యాపారంగతుఁడై యావిద్యలన్నియు స్థిరసౌఖ్యమున కాధారమగు పరమార్థతత్త్వమును బూర్ణముగ బోధింపఁజాల

వని తెలిసి "సకలవిద్యా ప్రతిష్ఠ"యగు పరవిద్యయొకటి యుండవలయును గదా యని యెఱింగి, యాపరవిద్యను గురుముఖమున స్వీకరించుటకు యత్నించును. ఇపుడు జీవునకు వేదశాస్త్రములను జదువుటయు, నితరులకు వానిని జెప్పుటయు, లోకహితము నుద్దేశించి దేవయజ్ఞములు మొదలగువానిని జేయుటయు, ఇతరులచేఁ జేయించుటయు ముఖ్యములగు బాహ్యధర్మములు. మఱియు నింద్రియములను విషయాసక్తములను గాకయుండ నియమించుకొనుటయు, ఇంద్రియములతోఁ జేరి వానికి లోఁబడి వర్తింపకయుండునటుల మనస్సును మరల్చుకొనుటయు, ఇంద్రియములను దమకధిపతియగు మనస్సునకు లోఁబడి వర్తించునట్లు చేయుటయు నివి పట్టుదలతో నభ్యసింపఁదగిన యంతరంగధర్మములు.

ఇట్టి పదవింబొందిన జీవుఁడు జ్ఞానమును అభివృద్ధి చేసికొని భగవద్భక్తిని, క్షమ (అనఁగా నితరులయందున్న లోపముల నోర్చుస్వభావము)ను, సర్వభూతహితత్వమును ముఖ్యముగ ననుష్ఠింపవలెను. పూర్వజన్మములయందు విత్తము మొదలగు వానియం దభిమానమును, దేహాభిమానమును, కామ క్రోధములను కొంతవఱకు జయించియుండుటచే నిపుడు సర్వభూతహితుఁడగుట కర్హుడై యున్నవాఁడు. కామక్రోధములను సంపూర్ణముగ జయింపఁ బ్రయత్నముచేయవలయును. ఎల్లప్పుడును శరీరమును, ఇంద్రియములను, మనస్సును స్వాధీనముచేసికొనుచు విషయ విముఖుఁడగుచుండవలయును. వేగిరపడి

యేకార్యమునైనఁ జేయరాదు. సదా శాంతిస్వరూపుఁడుగను, శుద్ధుఁడుగను నుండఁదగు. ఉత్తమజ్ఞానమును బురుషార్థసాధనముగ భావించుచు నద్దానికంటె శ్రేష్ఠమగు విత్తము వేఱొకటి లేదను మనోనిశ్చయము గలిగియుండవలయును.

శమోదమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్॥ (గీత.౧౮-౪౨.)

నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తమ్
యథైకతా సమతా సత్యతా చ
శీలం స్థితి ర్దండనిధాన మార్జవమ్
తత స్తపశ్చోపరమః క్రియాభ్యః ॥ (పురాణవాక్యము.)

తా. ఏకత్వము, సమత్వము, సూనృతోక్తి, సదాచారము, స్థిరత్వము, మొదలగు వానితోసమానమగు ద్రవ్యము బ్రాహ్మణునకు వేఱొండు లేనే లేదు.

ఈలక్షణములతోఁగూడిన జీవుఁ డుత్తమజాతి జీవుఁ డనిపించుకొనును. ఏ దేశమునందు జన్మించినను ఇట్టిలక్షణములు గల జీవులే యగ్రజాతి జీవులని యెన్నఁదగుదురు. ఈలక్షణములు ఆర్యసంఘమునందలి బ్రాహ్మణులయందు స్వాభావికముగ నుండవలయును. ఇవి లేకపోయిన యెడల వాని నభివృద్ధి చేసికొనుటకు వలయు ప్రయత్నము చేయవలయు. అట్లుకానిచో బ్రాహ్మణజాతియందు జన్మించినను బ్రాహ్మణుఁడని యెన్నఁబడుట కర్హుఁడు కాఁడని స్మృతులయందును, పురాణములయందును దృఢముగఁ జెప్పఁబడియున్నయది.

ధర్మములనునవి జీవుని నుత్తమస్థితికిం దెచ్చుటకుఁ దత్త్వవేత్తలగు మహర్షులచే విధింపఁబడిన మార్గములు. జీవుని పూర్వజన్మ సంస్కారమును దెలిసి గుణకర్మ విభాగములు చేసి ఆర్యసంఘమునఁ దొలుతఁ జాతుర్వర్ణ్య విభాగముచేయఁబడిన దని భగవద్గీతయం దుదాహరింపఁబడియున్నది. పూర్వకాలమున మానవులు శాస్త్రములయందు విశ్వాసము గలిగి శాస్త్ర విధులగు స్వధర్మముల నుల్లంఘింపక యనుష్ఠించుచుండుటం బట్టి సామాన్యముగ జీవునియంతరంగస్వభావము ననుసరించియే బాహ్యమగు జన్మము లభించుచుండెను. అనఁగాఁ దమోగుణ ప్రధానులుగనుండు జీవులు శూద్రజాతియందును, రజోగుణ ప్రధానులుగ నుండుజీవులు వైశ్య క్షత్రియ జాతుల యందును, సత్త్వగుణ ప్రధానులుగ నుండు జీవులుమాత్రము బ్రాహ్మణవర్ణమునందును జన్మించుచుండిరి. వారియందుఁ గామము హెచ్చనుహెచ్చను వారు స్వప్రయోజనపరులై ధర్మము నతిక్రమించుటచే వర్ణసంకరము కలుగసాగెను.

జీవుఁడు తాఁబుట్టిన వర్ణమునకు విధించిన బాహ్యధర్మముల ననుష్ఠింపక పోవుట వర్ణసంకరమని సామాన్యముగాఁ జెప్పుచున్నను, జక్కఁగ విచారించినచో జీవుఁడు తన స్వభావమునకు సరిపోని వర్ణమునందుఁ బుట్టుటయే వర్ణసంకర మని యెఱుంగవలయును. కామములకు లోనై శాస్త్రవిహితము లగు ధర్మముల నతిక్రమించి విచ్చలవిడిగ వర్తించుటచే ననేకవర్ణములవారితో నానావిధములగు ఋణానుబంధములు

కల్పించుకొనుటచే నీసంకరము ప్రాప్తించుచున్నది. ఐనను కర్మాధిదేవతలు ముందు సూచించినరీతి నేయేకాలమున నే యేధర్మముల ననుష్ఠించుట యేయేజీవులకు నిశ్శ్రేయఃకారణ మగునో వానిని జక్కఁగఁజూచి వారి కనురూపమైన వర్ణముల యందు వారిని బుట్టునట్లు చేయుచున్నారు. కావున స్థూల ముగాఁ గనఁబడు బాహ్య సంకరమును మాత్రము పాటించి శాస్త్రసమ్మతముగను, యుక్తియుక్తముగను జేయఁబడిన వర్ణ విభాగమును బొత్తిగా ననాదరణచేయుట సమంజసముగాదు.

ఇక్కాలమున నీదేశమున నాయావర్ణములయందు జన్మించి యుండు జీవులు వర్ణధర్మములఁ జక్కఁగ ననుష్ఠింపకుండుట చేత వర్ణవిభాగమునం దాదరణము తగ్గెననియును, ఈవిభా గము యుక్తియుక్తమనియు నెఱింగి దానివలని ప్రయోజన ముల నుపలక్షించి యెల్లవారలు తమతమ వర్ణధర్మములను సాధ్యమగునంత శ్రద్ధతో ననుష్ఠించుచు, స్మృతికర్తలగు మహాత్ముల యుద్దేశముల నెఱవేర్చి వర్ణవిభాగము నిర్దుష్టముగ నుండునటులఁ జేయుటకు మహాప్రయత్నము చేయవలయును.

పైనుదహరింపఁబడిన ధర్మములన్నియుఁ బరిశీలించి చూడ ముఖ్య విషయ మొక్కటి గానవచ్చుచున్నది. ఒక్కొక్క వర్ణమునకును ధర్మములు విధింపఁబడియున్నవి. అనఁగా నొక్కొక్కవర్ణమువారును జేయవలయు కర్మములును, వారి యం దుండవలసిన గుణవిశేషములును విధింపఁబడియున్నవి గాని యాజాతివారికింగల యధికారమును గుఱించి యించుక

మైనను శాస్త్రములయందుఁ జెప్పఁబడియుండలేదు. ఒక్కొక జాతివారును వారి వారికి విధింపఁబడిన కార్యముల నించుక యేని లోపములేకుండఁ జేయుచు, నిషేధింపఁబడిన పనులను బొత్తిగవదలుచు, వారివారి యందుండఁదగిన యంతరంగ లక్షణముల నభివృద్ధి చేసికొనుటకు యత్నించుచుండిరి గావున దేశమునందలి ప్రజలందఱును సమరసభావముగలిగి శరీర మునం దంగములువలె జనసముదాయమునకు క్షేమము నొనఁ గూర్చుచుండిరి. శరీరమందలి యంగము లన్నియు నన్యో న్యానుకూల్యము గలిగి శరీరసౌఖ్యముకొఱకుఁ బాటుపడుచుండి ననే శరీరమునకును, ఒక్కొక యంగమునకును క్షేమముగలు గును గాని యొక్కొక్క యంగము ఇత రాంగముల కొఱకుఁ బాటుపడఁదలంపనిచో సమష్టిశరీరమునకు క్షేమము లేకపోవు టయేగాక యొక్కొక్కయంగమును గృశించి నశించును గదా! అట్లే జనసముదాయము శరీరమునకును, జనులు ఆ శరీరమందలి యవయవములకును బోల్పఁదగినవారు. జనులం దఱు వారివారి యోగ్యతానుసారముగఁ దమతమధర్మముల నెఱింగి చక్కఁగ నాచరింప సమష్టిరూపమగు జనసముదాయ మునకు సేమము గలుగుటయేగాక జనులకు సహితము సుఖం బొనఁగూడును. అట్లు అన్నివర్ణములవారును దమతమధర్మ ములఁ జక్కఁగ నాచరించుచు, నితరులయందలి దోషదర్శన పరులుగాకుండునంతకు హిందూదేశమున జనసంఘము అన మాన సుఖము ననుభవించుచుండెను. అట్లుగాక నొక్కొక్క

రను తమతమ ధర్మములం దశ్రద్ధచేసి, బరులనుమాత్రము వారిధర్మముల నాచరించునట్లుచేసి దానినుండి తమకు రాఁదగు లాభమును మాత్రము కోర నారంభించుటచే నిప్పటి దుర వస్థగల్గెను. ఈరీతి సర్వజనులును తమతమ ధర్మములను వదలి పరస్పర స్పర్ధలతోఁ జెడిపోయిరి. జనసముదాయమునకును దదంగములగు జీవులకును క్షేమము క్రమక్రమమునఁ దగ్గిపో యెను. శరీరమునందలి యవయవము లొక్కొక్కటియు శరీర పోషణమునకుఁ బాటుపడుటలోఁ దమతమకార్యముల నేమ అకచేయుచుండవలయునేగాని తమవృత్తులం దుత్తమమధ్యమ నీచములనుభావములఁ జర్చింపరాదు. అట్లే చాతుర్వర్ణ్యవి భాగమునందును ఒక్కొక్కజాతివారును వారివారి ధర్మము లను బరిపాలించుటకు బహువిధముల యత్నింపవలయునుగాని, కొందఱుత్తము లనియు, మఱికొంద ఱధము లనియు భావిం చుటగాని, కొందఱుమాత్రము పూజ్యులనియు, తక్కినవారు వారిని బూజించుచుండవలయుననియును ఎంచుట శాస్త్ర సమ్మతముగాదు. ఎవరికిఁగాని తమధర్మములను లోపములే కుండ నాచరించుటచేఁ బూజ్యతయున్నది గాని జన్మమున మాత్రము పూజ్యత నొందఁజాలరు. శమదమాదిగుణసం పన్నుఁడై లోకోపకారపరాయణుఁడై సత్కర్మనిరతుఁడై యుండు బ్రాహ్మణుఁడును, స్వప్రయోజనము నించుకయేని గోరక ప్రాణమునం దభిమానము సైతము విడిచి, ప్రజారక్షణ తత్పరుఁడైయుండు భూపాలుఁడును, ధర్మము నతిక్రమించక

యర్థము నార్జించుచుఁ గుటుంబమునందుఁ గోశాధిపతివలె జన సముదాయమంతయు నొక్కకుటుంబముగ భావించి యా కుటుంబమునందుఁ దాను గోశాధిపతినని యెంచి నిష్పక్షపాతముగ యోగ్యత ననుసరించి పాత్రత నెఱింగి యెల్లర క్షేమము కొఱకు ధనమును వ్యయించుచుండు వైశ్యుఁడును, జాగరూకుఁడై ప్రమాద మొకించుకేని లేక తనకు విధింపఁబడిన కార్యములన్నింటిని యథావిధి నెఱవేర్చుచుండు శూద్రుఁడును బూజింపఁబడదగుదురు గాని యోగ్యత లేకయున్నను జన్మమున మాత్ర ముత్తమజాతివార మనియు, పూజ్యులమనియు నెన్ను వారందఱు పూజ్యులు కాఁజాలరు.

> యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః ।
> యశ్చ విప్రోఽనధీయాన స్త్రయస్తే నామధారకాః ॥
> యోఽనధీత్య ద్విజో వేద మన్యత్ర కురుతే శ్రమమ్ ।
> స జీవన్నేవ శూద్రత్వ మాశు గచ్ఛతి సాన్వయః ॥ (మనుస్మృతి.)

యథోక్త గుణసంపన్నుఁడుగాని బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడుకాఁడు, గ్రానితోఁ జేయఁబడిన యేనుగు ఏనుగుకాదు. చర్మ నిర్మితమగు జింక జింక కాదు. ఇవియన్నియు నామము మాత్రములే. అధ్యయనము చేయని బ్రాహ్మణుఁడు యథార్థముగ బ్రాహ్మణశబ్దవాచ్యుఁడు కాఁడని మనుస్మృతియందు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. ఈయర్థము స్మృతులయందును బురాణములందును ఇతిహాసములందును వివరింపఁబడియున్నది.

శ్రీమహాభారతమున నరణ్యాపర్వమునందు యుధిష్ఠిరాజగర సంవాదమున నిట్లు వివరింపఁబడియున్నది.

సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా ।
దృశ్యంతే యత్ర నాగేంద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః ॥
శూద్రే తు యద్భవే ల్లక్ష్యం ద్విజే తచ్చ న విద్యతే ।
నైవ శూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః ॥
యత్రైత ల్లక్ష్యతే సర్ప వృత్తం స బ్రాహ్మణః స్మృతః ।
యత్ర నైతద్భవే త్సర్ప తం శూద్ర మితి నిర్దిశేత్ ॥

(మహాభారతము, వనపర్వము, ౮౩-అ., ౨౧-౨౫-౨౬.)

న యోని ర్నాపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః ।
కారణాని ద్విజ త్వస్య వృత్తమేవ చ కారణమ్ ॥

(మహాభారతము, వనపర్వము, ౩౧౩-అ., శ్లో. ౧౦౭.)

తా. సత్యము, దానము, ఓర్పు, శీలము, సౌమ్యభావము, తపస్సు, భూతదయ యివి యన్నియు నెవనియం దున్నవో అతఁడు బ్రాహ్మణుఁ డనఁ దగును. ఈ గుణసముదాయము శూద్రునియందు గోచర మయ్యేనేని యతఁడు శూద్రుఁడు కాఁడు. శూద్రాధికుఁ డనుట. ఇవియన్నియు బ్రాహ్మణుని యందు గోచరములు కావేని యతఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. శూద్రతుల్యుఁ డనిభావము..................పుట్టుకయు, సంస్కారములును, పాండిత్యము, గోత్రము నను నివి బ్రాహ్మణత్వమునకుఁ గారణములు కావు. సద్వృత్తియే ముఖ్యహేతు వని భారతవచనాభిప్రాయము.

మఱియు శ్రీవిష్ణుభాగవతమునందు,

యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభివ్యంజకం ।
యదన్యత్రాపి దృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్ ॥

(భాగవతము, ౭-౯-౩౫.)

తా. పురుషునకు జాతిసూచకముగ నేలక్షణములు చెప్పఁబడినవో యవి యితరునియందుఁ గూడఁ గనఁబడు నేని యతఁడాజాతివాఁడని విష్ణుభాగవతాభిప్రాయము.

ఇట్లగ్రజాతివారు పూజ్యుల మని యితరులనుండి సన్మానమును బలాత్కారముగఁ గోరుట ధర్మము గానట్లు, వారలయందు దోషారోపణము చేయుటయు నీర్ష్యాసూయలు గలిగి యుండుటయు నితరులకును ధర్మముగాదు. అన్ని జాతులవారును సోదరభావమును గలిగి పరస్పరమైత్రినభివృద్ధిచేసికొనుచుఁ దమతమ ధర్మముల లోపములు లేక జరుపుచుండినయెడల జనసముదాయమంతయు క్షేమమును బొందఁగలదు.

## ఆశ్రమధర్మములు

పైసూచించిన వర్ణవిభాగమున జీవునకు మనుష్యజన్మము ప్రాప్తించినది మొదలు ముక్తిప్రాప్తి పర్యంతము జీవునియాత్ర నాల్గుభాగములుగ విభజింపఁబడి యున్నది. మఱియును ప్రతి జన్మమునందును జీవితకాలము, అనఁగా, స్థూలశరీరముతో భూలోకమునందు వర్తించుకాలమంతయు, పై విభాగమున కనురూపముగనె నాల్గుభాగములుగ నేర్పడుచున్నది.

ఆదియం దేలాటినియమములకు లోఁబడక యిచ్ఛానుసారము వర్తించుచుఁ దలిదండ్రుల పోషణమునకుఁ బాత్రుఁడై శైశవము గడపి పిదప కొంతకాలము విద్యాస్వీకారము నేయుచు, గురుగృహమునందు నివసించుచు, గురువునాజ్ఞకు లోఁబడి వర్తించుచు, గురుశుశ్రూషచేయుచుఁ బూర్వమున శూద్రసమమగు జన్మమునందు జీవుఁ డుండినకాలమునఁ బొందిన జ్ఞానమును మరలఁ బ్రతిక్రొత్తజన్మమునందును దృఢపఱచుకొనుచుండును. ఇదియ ఆర్యధర్మములందు బ్రహ్మచర్యాశ్రమధర్మమని పిలువంబడుచు దేశాంతరములందు విద్యార్థిధర్మమనఁబడుచున్నది. గురుగృహమునందుఁగాని లేక దేశాంతరములయం దుండురీతిని బాఠశాలాధికారుల విచారణకు లోఁబడిన నివాసములయందుఁగాని విద్యార్థినివసించుచు, ఉపాధ్యాయుల యాజ్ఞకులోఁబడియుండి కాలనియమము తప్పక కాలోచితకార్యముల నెఱవేర్చుచు, సదా గురువుల సత్సాంగత్యమునఁ గలుగు మేలు నొందుచు నుండుటచేఁ గ్రీడాసక్తి, ప్రమాదము లోనగు బాలుని నైజగుణములను దరించి యుక్తవయస్కుఁడైనపుడు పారతంత్ర్యమునందుండి వదలి స్వతంత్రముగఁ గార్యనిర్వాహకము చేసికొనుటకు వలయు సుగుణసంపత్తిని బొందఁగలిగియుండును. ఇట్టియేర్పాటులు పశ్చిమదేశములయందుఁ జేయఁబడుచున్నవి. పూర్వకాలమున హిందూదేశమునందును గురుకులవాసముచే నీ ప్రయోజనము లెక్కుడుగ సిద్ధించుచుండెను. ఇక్కాలమున

గురుకులవాసము గానరాదు. బాలురు స్వగృహములయందు నివసించుచుఁ దలిదండ్రులయు బంధువులయుఁ బ్రేమాతిశయములకుఁ బాత్రులగుచు, నతిసుకుమారముగఁ బెంపఁబడుచు, లేక యితరగ్రామములయందు విక్రయాన్నభోక్తలయి, యింటియందలి నిబంధనలు సైతము లేక, పాఠశాలలకుఁ బోవు నల్ప కాలమునందుఁ దప్ప తక్కినకాలముల విచ్చల విడిగ వర్తించుచుఁ, గాలోచితకార్యములఁ జేయించి విచారించువారు లేక, యున్నవారు. కాఁబట్టి పూర్వులయం దున్నసుగుణసంపత్తి యిక్కాలపువారియందు లేకయున్నది. బాలునకు నడఁకువ, అలోలత, విద్యాసక్తి, సుఖేచ్ఛలేకయుండుట, పాటుపడుట, ఇవి ముఖ్యలక్షణములుగ నుండఁదగు. ఈలక్షణముల నభ్యసించి దృఢపఱచుకొనినచో స్వతంత్రముగఁ గార్యభారమునువహించుట కర్హుఁడగు. ఇవ్విధమున గురుకులవాసము చేసి సంసారభారమును వహించుటకు నర్హుఁ డైనచో, వివాహితుఁడై గృహస్థాశ్రమ ధర్మముల ననుష్ఠింపఁదగియుండు.

ఇవ్విషయమున ముఖ్యముగ గమనించఁదగిన విషయ మొకటియున్నది. పూర్వకాలమున నీయాశ్రమధర్మములు ఒకటివెనుక నొకటి వరుసగ ననుష్ఠింపఁ బడుచుండెనుగదా! బ్రహ్మచర్యము పూర్ణముగ జరిపి, విద్యాభ్యాసము గురుగృహమున సలిపి పూర్తి అయిన పిదప గురువునాజ్ఞవడసి, కొంత వరకు తీర్థయాత్రలమూలమున నానాదేశసంచారముచేసి, తద్ద్వారా తన జ్ఞానమును అభివృద్ధిచేసికొనిన యనంతరము

యుక్తవయస్కుఁడైన పురుషుడు వివాహితుఁడై గృహస్థ ధర్మానుష్ఠానమును ప్రారంభించుచుండెను. ఇపుడన్ననో బ్రహ్మ చర్యము నామమాత్రమైయున్నది. విద్యాభ్యాసము ప్రారం భించిన అల్పకాలములోపలనే వివాహము అననేమో అర్థ మైనను తెలిసికొనజాలని బాలునకును, అంతకంటె చిన్నది యగు కన్యకును వివాహము చేయఁబడుచున్నది. అదియును నామమాత్ర కన్యాదానముతో నిలువక, విద్యాభ్యాస కాల ములో, తరుచుగ గర్భాధానము సైతము జరుపుచున్నారు. శరీరమనశ్శక్తుల నంతయు విద్యాస్వీకారమున నుపయోగించు చుండవలసిన కాలములో, బాలుఁడు పూర్ణగృహస్థధర్మమునం బ్రవేశించి కుటుంబభారమువహించుటవలన శరీరపాటవమున కును, మనశ్శక్తికిని రెంటికిని కీడుకలుగును. విద్యాభ్యాసము నకు భంగముగలుగుటయేగాక పురుషులును, స్త్రీలును, పూర్ణ యౌవనమున నుండదగు వయస్సురాకపూర్వమే సంతానము కలవారగుటవలన బలహీనులై వార్ధిక్య దశయందుండు స్థితిని చెందుచున్నారు. పూర్వముకంటె నిపుడు జనులకు సరాసరి ఆయుర్దాయము తక్కువ అయి యున్నది. హైందవజనాంగ మున కిట్టిదురవస్థ వచ్చియుండుటకు సనాతనములగు ఆశ్రమ ధర్మములను ఉపేక్ష చేయుటయే కారణము. దేశాభిమాను లందరు, ఈవిషయమును బాగుగయోచించి, పూర్వమువలె బ్రహ్మచర్యధర్మమును చక్కఁగ రక్షించి, బాలురును బాలి కలును; యుక్తవయస్కులై పూర్ణయౌవనమును చెందినం

దాక గృహస్థధర్మమునం బ్రవేశించక యుండచేసినచో, శీఘ్ర కాలముననె యువకులును యువతులును శరీరపాటవమును, ఇంద్రియనిగ్రహము మనశ్శక్తియు గలిగి, వీర్యవంతులై, దృఢ గాత్రులగు సంతానము నుత్పత్తిచేయ గలుగుదురు. ఇది దేశాభివృద్ధికి మిక్కిలి అవశ్యము. ఇవ్విషయమున శ్రద్ధగొను వారు యథార్థముగ దేశసేవాతత్పరు లగుదురు.

గృహస్థునకుఁ గుటుంబమును భరించుట మొదటిధర్మమగు చున్నది. ఇందును అనుష్ఠింపఁబడు సర్వధర్మములును, చేయఁ బడు సర్వకర్మములును జీవులకు బరమార్థసాధనమగు జ్ఞాన మును వృద్ధిచేయు నుద్దేశము గలవియే. వివాహము కేవల మైహిక సుఖసాధనముగ నెంచరాదు.

ధనము నార్జించుటయు, ధర్మవిరుద్ధము కాకయుండ నైహిక సుఖముల ననుభవించుటయు, ఆర్జించిన ద్రవ్యమును కేవల స్వశరీరపోషణమునకు మాత్రముగాక క్రమక్రమమునఁ బరోప కారముకొఱకు వినియోగించుటయు, గృహస్థువున కభివృద్ధి కారణము లగుధర్మములు. మొదటమొదట తనకు సుఖమూ లకములగు దారసుతాదుల సుఖమును ఆత్మసుఖమువలె భా వించుటయు, క్రమక్రమమున బంధుమిత్రాదుల సుఖమును గోరుటయు నీమొదలగునవియు వానికి నైజమగు స్వప్రయో జనపరత్వమును వదలించి పరోపకారబుద్ధిని వృద్ధిచేయును. కాలము గడువనుగడువను గామసంకలితముగాని ప్రేమ యభి వృద్ధి యగు. గృహస్థధర్మమునందు స్వతంత్రముగ నార్జనము

చేయు సామర్థ్యము గలిగియుండుటచేత గృహస్థు డనేకులగు నితరజీవులకు నాధారమగుచున్నాఁడు. ధనార్జనచింత లేక విద్యాస్వీకారము చేయుచుండు బ్రహ్మచారికిని, సంసారతాపత్రయమునుండి విరమించుకొని లౌకికవ్యాపార విముఖుఁడై వైదికకృత్యములయందుఁగాని, లేక స్వప్రయోజనమును మాని లోకహితముకొఱకుచేయు లౌకిక కార్యములయందుఁగాని కాలము గడుపుచుండు వానప్రస్థునకును, సర్వసంగపరిత్యాగియై యైహికముగాని ఆముష్మికమునుగాని స్వప్రయోజనము నించుకయేని యభిలషింపక సదా లోకోపకారపరాయణుఁడై ధ్యానయోగపరుఁ డగుసన్న్యాసికిని గృహస్థువు ముఖ్యాధార మగుచున్నాఁడు. ఇట్లెల్లవారికిని సహాయము చేయుటచేత ధనమునం దభిమానము వదలును. తనకంటె నుత్తము లగునేకుల సాంగత్యము పలుమరు కలుగుచుండుటచే నహంకారము నశించి భక్తిజ్ఞానములు వృద్ధి యగు. చిన్నలగు విద్యార్థులు మొదలగువారలకు సహాయము చేయు నవకాశము గలుగుటచేత కరుణ వృద్ధియగు. ఇట్లు సర్వభావముల నిష్కామప్రేమ దినదిన ప్రవర్ధమాన మగుచుండు.

ఈగృహస్థధర్మమును జక్కఁగ ననుష్ఠించుటచే ధనము నార్జించుశక్తిగలవారియందు సామాన్యముగఁగన్పట్టు స్వప్రయోజనపరత్వము, అహంకారము, కామక్రోధలోభములు క్రమక్రమముగా మార్పునొంది పైన సూచింపఁబడిన భక్తిప్రేమానురాగములు కరుణ లోనగునట్టి సుగుణములు అభ్యు

దయ మొందుచుండును. కాఁబట్టి యీధర్మము జీవునకుఁ గాలక్రమమున నుత్తమపురుషార్థసాధన మగుచున్నదియే గాని మోక్షమార్గమునకుఁ బ్రతిబంధము కానేరదు. జీవుఁడు పరమ పురుషార్థమును సాధించుటకు వలయు నానావిధానుభవములు గృహస్థధర్మమునందే పొందఁ దగియున్నవి. ఆ యనుభవ ములును, వానినుండి పొందఁదగిన జ్ఞానమును గృహస్థువుగ నుండి పొందనిచో నాస్థితికన్న నుత్తమములగు వనస్థ యతి ధర్మముల ననుష్ఠించుట కర్హుఁడు కాఁజాలఁడు.

మొట్టమొదట గృహస్థువు కుటుంబభారమును వహించి యుండు వాఁడగుటచేఁ దనపోషణమునం దుండువారిసౌఖ్య మును నిత్యము సమకూర్చుటయే ప్రధానకార్యము గలవాఁ డగుటంబట్టి కుటుంబ సంరక్షణమునందు మనఃపూర్తిగ స్వ ప్రయోజనపరత్వము వదలక తీరదు. తాను బ్రేమించు దార సుతాదులను, తన గృహము నాశ్రయించి వచ్చు బంధు మిత్రాతిథులను సంతృప్తిపఱచనిచోఁ దాను బరిపూర్ణసౌఖ్యము నొందఁజాలఁడు. కాఁబట్టి కుటుంబియగువాఁడు తనకోరికను గొంత క్లృప్తపఱచుచు, నితరులకు సుఖమును గోరుచుండుటచే వానియందు నిష్కామ ప్రేమ యభివృద్ధియగుచుండు.

మఱియుఁ గుటుంబమున కంతకు నధిపతియై యుండుటచేతఁ దన్నాశ్రయించియుండు వారియందుఁ గరుణ వర్ధిల్లుట కాస్పద ముగలిగి క్రమక్రమమున బీదలయందును, శక్తిహీనులయం దును, మరి ఏవిధముననైన తనకంటె దక్కువగ నుండువారి

యందును, దయయు, అనుకంపయు వృద్ధియగు. మఱియు నితరుల యందలి లోపముల విషయమున సహనముగూడ వృద్ధియగుట కవకాశముగలుగు. ఇట్టిసుగుణములు కుటుంబిగనుండియే యభ్యసింపసాధ్యముకాని యితరాశ్రమములలోనుండి వీని నభ్యసింప నవకాశము చాలదు. ఇంతియగాదు. గృహపతి యగువాఁడు ఇంటియందుండు వారినందఱను, సేవకులను గూడఁ, బోషించుటమాత్రముగాక వారలను మంచిమార్గమున నడపుచు శిక్షించుచు వారల నందఱ నుత్తమగతిని బొందించుట యతని ధర్మము. ఇంటియందుఁ బలువురతో వసించియుండుటచే ననేకములగు నిర్బంధనల నోర్చుకొనవలసియుండును. ఏకాకియగు వాని కవి యుండవు. దినదిన మట్టి యిబ్బందులను సహించుకొనుచు మనస్సమాధానము నభ్యసించుటచే తితీక్షయు, నుపరతియు నలవాటు చేసికొనుటకు గొప్పయవకాశముగలుగు.

ఒకానొక సమయమున తొందరపడి తెంపుచేసి సన్న్యసించిన వానికి గృహవస్తువాహనాదులు ఒక్కటియైన లేమిం జేసి వానియందలి సంగమున కవకాశము లేకుండ వచ్చును. కాని యంతమాత్రమునఁ దాను నిజముగ విరాగినైతినని భ్రమించరాదు. ఏలయన నెప్పుడేని విషయస్పర్శము కలుగ వైరాగ్య భంగమైనను గాఁదగు. అట్లుగాక గృహస్థుపుగ నుండి ధనము నార్జించుచు, భోగ్యములుగలిగి యుండియు వానిపై నాసక్తి క్రమక్రమమున తగ్గించుకొనుచు నిస్సంగము

నభ్యసించుటచే నిజమగు వైరాగ్యము వృద్ధియగును. అట్టి వాఁడు "అంతస్త్యాగీ బహిస్సంగీ" యనిపించుకొనును. అటువంటి త్యాగము మోక్షసాధనమగునుగాని యంతస్సంగము గలిగి "బహిస్త్యాగి"యై నంతమాత్రమున పూర్ణుఁడుకాఁజాలఁడు. ఈకారణమునుబట్టి పరిపక్వముగాని జీవునకు సన్న్యసముకంటె గృహస్థ ధర్మమున నిష్కామమగు కర్మయోగ మభ్యసించుట నిజముగ మోక్షసాధనము.

గృహస్థ ధర్మానుష్ఠానమువలన వేఱొక ప్రయోజనము గూడఁ గన్పట్టుచున్నది. దినదినము గృహమును గూర్చి వచ్చుచుండు నతిథ్యభ్యాగతులను ప్రీతిపూర్వకముగ సత్కరించుటచేఁ గ్రమక్రమమున సంపూర్ణమగు నౌదార్యము వృద్ధియగుచున్నది. అతిథి భగవత్స్వరూపుఁడని శాస్త్రములయందు నిరూపింపఁబడియున్నది కదా! గృహమునకు వచ్చిన యభ్యాగతులకు గృహస్థుపు ఉదకము, ఆసనము, ఆదరముతోఁ గూడిన మృదు మధురోక్తులు, ఇంతమాత్రమైన సమర్పించవలయు నని స్మృతు లుద్ఘోషించుచున్నవి. కావున గృహస్థుపు అతిథ్యభ్యాగతులను సత్కరించుటకు ధనవంతుఁడుగా నుండుట సైతమనావశ్యకము. ప్రీతిపూర్వకమయిన సంభాషణము వలన వారు తృప్తులయినట్లు ఆదరణము లేని యన్నాది దానములచేఁ దృప్తులుకాఁజాలరు. "అన్నంబు జీర్ణమగు, ఆదరణంబు శాశ్వతంబు" అన విందుముకదా! ఇవ్విధమున నొక్కఁడు నిష్కామముగ సత్కరింపఁబడినచో, నాతఁడు మా

నవకోటికిఁ బ్రతినిధియగుటచే, మానవకోటి యంతయు సత్కరింపఁ బడినదని యెన్నఁదగు. ఇదియు భగవత్ప్రీతికరము. మఱియు నతిథ్యభ్యాగతులుమాత్రముగాక గృహస్థుని యింటి చుట్టుఁ దిరుగుచుండు కాక శునక బిడాలాదులు[1] సహితము ఆయింటినాశ్రయించి జీవించుచునేయున్నవి. ఆర్యధర్మము ప్రకారము ద్విజులగువారలు దినదినము చేయు బలిదానము శునక వాయసాదుల సంరక్షణము నుద్దేశించియే చేయఁబడుచున్నదగుట శాస్త్రములనుండి స్పష్టమగుచున్నది. ఇవ్విధముగ బీదలయందును, పరదేశీయులయందును, అల్పజంతువులయందును, ప్రీతియు, కరుణయు నభివృద్ధి యగుటయేగాక జీవుని నానావిధములగు ఋణములు సహితము తీఱుచున్నవి.

ఇక్కాలమున మనభరతఖండమున గృహస్థధర్మమువలని ముఖ్యప్రయోజనముల కొన్నింటిని మరచియున్నారు. కుటుంబమునందలి వారందరు అన్యోన్యప్రేమానుబంధములతో కట్టఁబడియుండదగునుగదా! పెద్దవారు చిన్నవారియందును, చిన్నవారు పెద్దవారియందును జూపదగుప్రేమ యెట్లుండవలెనో కొంచెము యోచింపదగు. భార్యయందు భర్తకును, బిడ్డలయందు తండ్రికిని ఉండదగుప్రేమ యెట్లుండవలయును? ప్రేమవలన ఉభయుల మనస్సులుకలిసి, ఒండొరులయెడ పూర్ణమగు నమ్మకము పుట్టవలయును. ఇపుడు తరుచుగ అట్లు కానరాదు. భర్త భార్యవిషయమునను, తండ్రి పుత్రులవిష

[1] పిల్లి.

యమునను అధికారమును సాగించుచు, భయమునుపుట్టించు చున్నారుగాని, నిష్కల్మషమగు ప్రేమరూపమగుభక్తిని కలిగించుటకానము. కుమారునికి తండ్రికంటె నాప్తుడు వేరొకరుండరుగదా! పిల్లవాడు తనకష్టదుఃఖములను తండ్రిమొద్ద మనసువిచ్చి చెప్పుకొనుటకు మారుగ, భయపడి, తండ్రిని చేరక, దుస్సాంగత్యమునకు పాలుపడుట సామాన్యముగ నున్నది. బాలురును యువకులునునగు పుత్రులమనోభావములను, వాంఛలను ప్రీతితోనూహించి, వారలకు దగు ప్రోత్సాహముచేసి యుక్తమగు బోధచేసి, దుస్సాంగత్యమునుండి ప్రీతితో మరలించి వారికివలయు సహాయముచేసి, సౌఖ్యము నొనగూర్పవలయును. అట్లుచేయక, చిన్నవారిని దూరముగనుంచి, భయముతో పెంచుటవలన అనేకానర్థములు కలుగుచున్నవి. బాలురయెడ పెద్దవారు నిష్కల్మషమగు ప్రేమచూపుచోట్ల బాలురకును పెద్దవారియందు పూర్ణముగ భక్తిరూపమగు ప్రేమ అభివృద్ధియయి, తమ మనోభావములను, వాంఛలను జంకులేక పెద్దవారికి తెలుపుకొందురు. అట్టివేళల నవి సదోషములుగ నుండినచో, పెద్దవారు దానిం జూపి తగినబోధచేసి మంచిమార్గమును చూపగలుగుదురు. ఇట్టి సంకోచములేని ప్రేమ అభివృద్ధిగావలెను. లేనిచో నిజముగ గృహస్థధర్మము పూర్వపు ఉన్నతస్థితికి రాజాలదు.

ఈ విషయము కర్మయోగాధ్యాయమున, విస్తరించి వ్రాయఁబడును.

ఈ రీతిని జీవుఁడు పూర్వము వైశ్య ధర్మమనుష్ఠించు కాలమునఁ బొందిన జ్ఞానమునంతయు నీజన్మమున గృహస్థాశ్రమమున మరలఁ బొందుచున్నాఁడు. జీవుని దీర్ఘ యాత్రయందు వైశ్యధర్మమెట్టిజ్ఞానమును వృద్ధిచేయఁదగునో, ఎట్టిసద్గుణముల నెట్లు కలుపం జాలునో, ఆజ్ఞానమును, ఆగుణములను బలపఱచుటయందు గృహస్థ ధర్మము సమర్థముగనున్నది.

ఈ ధర్మమునఁ బొందఁదగిన జ్ఞానమునంతయుం బొంది యైహిక సుఖములయందును, లౌకికకర్మములయందును గొంత వైరాగ్యము గలుగ నాసుఖములనుండియు, ఆకార్యముల నుండియు విరమించుకొనఁదగిన సమయము కావున నపుడు లౌకిక వ్యవహారములనుండి విరమించుకొని సంసారభారమును యుక్తవయస్కులగు సుతులయం దునిచి యహంకార మమకారములను విడనాడి జ్ఞానమునందుఁగాని వయస్సునందుఁగాని తనకంటెఁ జిన్నలగువారలకు బోధచేయుచు, వారలచే ధర్మంబుల ననుష్ఠింపఁజేయుచు, వారియందు యుక్తాయుక్త జ్ఞానము వృద్ధిచేయుచు, తాను భగవద్ధ్యానము మొదలగు సత్కార్యములయందుఁ గాలము గడపుచుఁ గ్రమక్రమమున సంసారమునుండి సంపూర్ణముగ విరమించుకొనుట కర్హుఁడగుచున్న వాఁడు. ఇదియ యార్య ధర్మమునందుఁ దృతీయాశ్రమమగు వనస్థధర్మము. ఇందు జీవుఁడు లౌకిక కార్యముల నెల్ల విడిచి వివాహకాలమున స్వీకరించిన యగ్నిహోత్రాదులతోడ భార్యయుఁ దానును పట్టణ గ్రామ వాసములను

వదలుకొని యడవులయందుఁ గాని, గిరిగుహాలయందుఁ గాని నివసింపననువగు నాశ్రమమును గల్పించుకొని వసించుచు, వైదికకర్మములను మాత్రము నడుపుచు, వన్యము లగు నాకల ములను, కందమూలములను, ఫలములను ఆహారములుగఁ బరిగ్రహించి కాలము గడుపుచుండఁ దగు. ఇక్కాలమున నీ ధర్మమాచరణమునఁ గన్పడదు. కాలానుసారముగ జను లెక్కుడుగ విషయాసక్తులై యంత్యకాలము వఱకు విషయేచ్ఛల యందే కాలము గడుపుట సాధారణముగ నున్నయది. పుత్రులకు సంసారభారమును వహింపఁజాలు వయస్సురాగా, లేక పౌత్రులుకలుగగ, మఱియు తనకు "వలీపలితములు" అనగా నరిసినవెండ్రుకలు చర్మమున ముడతలు లోనగు అపర వయస్సు చిహ్నములు కనుపడగానే గృహస్థువు వనస్థధర్మము నవలంబింప సమయమని మనుస్మృతి బోధించుచున్నది.

గృహస్థ స్తు యదా పశ్యేత్ వలీపలిత మాత్మనః ।
అపత్యస్య తథా పత్యమ్ తదారణ్యం సమాశ్రయేత్ ॥

(మనుస్మృతి. ౬-౨.)

ఈ ధర్మమును జక్కఁగ ననుష్ఠించుటయందు ముఖ్యమగు నుద్దేశమెద్దియనఁగా జాయాపతు లొక్కప్రదేశమున వసించు చుండియు, విషయసుఖముల నభిలషింపక గురుశిష్యన్యాయ మునను, సోదర సోదరీ న్యాయమునను బ్రవర్తించుచు, స్త్రీ పురుషులు విషయసాన్నిధ్యమున నుండియు భోగేచ్ఛ లేకయుం డుట నభ్యసించుటయే. ఈయభ్యాసము యథార్థ సన్న్యాస

మునకు జీవుని పక్వపరచుటకు మిక్కిలి యావశ్యకమని చెప్ప
నేల? ఈ ధర్మమున నరణ్యాగమనమే ముఖ్యాంశముకాదు.
విషయసాన్నిధ్యమున విషయేచ్ఛలేకుండుటయు, సంసారమున
నుండియుఁ దాపత్రయ రహితుఁడుగ నుండుటయు, భగవద్ధ్యా
నము చేయుచుఁ బరతత్త్వమును బోధించుగ్రంథములఁ బఠిం
చుచు, మనననిదిధ్యాసములు చేయుచుఁ గాలము గడుపుట
యే ముఖ్యాంశము. కావునఁ బరమార్థ చింతగల వారెల్లరు
నపరవయస్సు ప్రాప్తించగనే విషయేచ్ఛలను వదలుకొని
భగవద్ధ్యానాదుల నభ్యసించుటకు విశేషప్రయత్నము
చేయఁదగు.

క్రమక్రమముగ ద్రవ్యార్జనమునం దాశ వదలదగు. గృహ
మునందు యాజమాన్యము (ఆధిపత్యమును) వదలి యుక్త
వయస్కులగు పుత్రులయందుగాని యోగ్యులగు మరి యిత
రులయందుగాని సంసారభారమునునిలిపి గృహస్థువు వీనినుండి
విరమించుకొని నివృత్తిమార్గమున ప్రవర్తించుటకు యత్నింప
దగు. అట్టిస్థితియందు తాము సంసారతాపత్రయములనుండి
విముక్తులై, పారమార్థికవిషయములయందు మనస్సు వినియో
గించుచు, శ్రవణమనననిదిధ్యాసములయందును, భగవద్ధ్యాన
మునను కాలముగడపుట ద్వారా తాము పూర్ణులగుటకు
యత్నించుచు, లౌకికవ్యవహారములయందు తమకు ఇంచుక
యైన నాసక్తి లేకపోవుటబట్టి స్వార్థత్యాగులును, లోకసం
గ్రహ పరాయణులును, కేవల ధర్మకాములు నగుటచే లౌకిక

మగు తమ పూర్వానుభవజన్యమయిన జ్ఞానమును తమకంటె బిన్నలగు గృహస్థులకు బోధచేయుచు, వారలకు మార్గమును చూపుచు, పెక్కువిధముల లోకక్షేమముకొఱకు పాటుపడ వలయును. వానప్రస్థ ధర్మ మివ్విధమున, కాలానుసారముగ పైసూచించిన విధమున పునరుద్ధారణము చేసినచో భరతఖండ మెంతయు అభ్యుదయమును పొందును.

ఇది వర్ణధర్మములయందు క్షత్రియధర్మమును బోలినదై యున్నయది. పిదప జీవుఁడు సర్వసంగపరిత్యాగముచేసి సన్న్య సింప నర్హుఁడగుచున్నాఁడు.

అంతట వైరాగ్యము దృఢము కాఁగా సంసార సంస్పర్శ మించుకయైనను లేక సదా భగవద్ధ్యాన పరుఁడై యుండుట కవ కాశముగల వాఁడగును. ఐహికములగు విషయముల నొక్కటి నైనను గోరఁడు. ఐహికసుఖములందువలె స్వర్గసౌఖ్యముల యందుసహితము దృఢవైరాగ్యముగలిగి స్వర్గసుఖమునకంటె నుత్తమమగు ముక్తిపదమును గూర్చి బహుప్రయత్నమును జేయుచుండును. అపుడు భిన్నభావము సంపూర్ణముగ వద లుచు, సర్వభూతములయందు నాత్మస్వరూపమును జూచుచు, సర్వభూతములయందున్న యాత్మయు, తనయందుండు నాత్మ యు నొక్కటియేయని తెలిసికొని సదా ఆత్మతత్త్వమును బోధించుగ్రంథముల నాలోచించుచు, శ్రవణమనననిదిధ్యాస ముల నభ్యసించుచు, ప్రపంచమునందుఁ గన్పడు నానాత్వ మునం దేకత్వమును జూచుచుఁ గడపట " సర్వం ఖల్విదం

బ్రహ్మ" "నేహ నానాస్తి కించన" అను మొదలగు మహా వాక్యసారమును స్వానుభవమునఁ దెలిసికొనుచు, నాత్మావలోకన పరాయణుఁడై యుండు. అట్టివారియందు "అహ" మ్మను ప్రత్యయము లేశమైననుండదు. సర్వమునం దేకత్వమును జూచుచుండుటచేతను, భిన్నభావమించుకమైనను లేమిచేతను, అట్టివారు కర్మమార్గమున కతీతులైన వారనఁ దగియుందురు. అట్టివారికి శోకమోహములు సంపూర్ణముగ నశించినవియే.

యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మై వాభూ ద్విజానతః ।
తత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మనుపశ్యతః ॥

(ఈశావాశ్యము.)

తా. ఏపదవియం దేకత్వమునే చూచుజ్ఞానికి సకలభూతములు ఆత్మగనేయగునో అట్టి స్థితియందు మోహ శోకము లెట్లు కలుగును?

ఈస్థితినిబొందినజీవుఁడు సర్వత్ర ఏకత్వమును జూచువాఁడగుటంబట్టి జాతిభేదముల నతిక్రమించినవాఁ డనఁదగు. ఎవ్విధమగు ఫలాపేక్ష లేమిం జేసి యీపురుషునకుఁ గర్మము లెవ్వియును విధింపఁబడియుండలేదు. లోకసంగ్రహము నుద్దేశించి పరోపకారసాధకములగు కర్మములఁ జేయుచుండినను ఆకర్మములచే బద్ధుఁడుకాఁడు. నశ్వరమగు పదార్థమం దభిమానము నుంచుకొనఁడు. శరీరము ధర్మసాధనములలో మొదటిదగుటచే శరీరపోషణము మాత్రము భిక్షాన్నభోజనముచేఁ జేసి

కొనును. అందునుగూడ యదృచ్ఛాలాభ సంతుష్టుఁడై యుండఁదగు. ఈధర్మమును జక్కఁగ ననుష్ఠించువారే పరమార్థ సన్న్యాసులు. ఇదియ ఆర్యధర్మమునఁ దురీయాశ్రమమను యత్యాశ్రమము. ఇందు ఇంద్రియములను, మనస్సును జక్కఁగ నియమనము చేసికొనుటకు సర్వప్రయత్నములు చేయుటయే ముఖ్యలక్షణము.

ఈయాశ్రమమునందును యోగాభ్యాసాదులచేఁ బొందఁబడిన యాత్మజ్ఞానమునందలి తారతమ్యములను బట్టి యతులయందును తారతమ్యములు గ్రంథములయందు సూచింపఁబడియున్నవి. వీరు కుటీచక బహూదక హంస పరమహంసలను భేదముల నొప్పుచుండు వారు. వీరి పరిపక్వస్థితిననుసరించి ధర్మములు సహితము భిన్నభిన్నములుగ నుపనిషత్తులయందు విధింపఁబడియున్నవి. ఐనను అందఱును నివృత్తిమార్గమునే యనుసరించువారు. ఎల్లప్పుడు భగవద్ధ్యాన పరులై తపస్సంపన్నులై తపోధ్యానముల ఫలములను సహితము లోకమునకు మేలుచేయుటయందు వినియోగము చేయుచుందురు. యోగ్యులగు శిష్యులను వెదకుచు నట్టివారు దొరకిన వారల కాత్మజ్ఞానమును బోధించుచు భగవంతునివలె లోకమునందుండు సర్వభూతముల శ్రేయోవృద్ధిని గూర్చి లోకమునందు లోకసంగ్రహార్థము భగవంతుని ప్రతినిధులుగ వర్తించుచుందురు. వీరలే భగవంతుని జన్మకర్మములస్వరూపమును యథార్థముగ నెఱింగి జీవించియుండు కాలముననే ముక్తిసుఖము ననుభ

వించు జీవన్ముక్తులని పిలువఁబడువారు. ఇట్టివారి నుద్దేశించియే గీతాశాస్త్రమునందు

> జన్మకర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
> త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి పాండవ ॥
>
> (భ. గీ., ౪-౯.)

అని శ్రీకృష్ణుఁడు చెప్పియున్నాఁడు. ఇట్టిమహనీయులే జన్మరాహిత్యమున కర్హులగుచున్నవారు. యథార్థముగ వారు సర్వభూతసేవా తత్పరులు. దానియందే పూనికతో వర్తింతురు. కేవలమజ్ఞానదశయందు శూద్రుడు తన పుణ్యవృద్ధికై ఇతరులకు పరిచర్య చేయుననియును, అట్లే బ్రహ్మచారి తన యభివృద్ధినుద్దేశించి గురుశుశ్రూష చేయుననియును ముందు చెప్పఁబడెను. పరమార్థసంన్యాసి స్వార్థమును పూర్ణముగ త్యాగముచేసినవాడుగానను సర్వభూతాత్మ భూతుడై యుండుటఁ బట్టియు, తనకై కోరునది యొక్కటియు లేమిం జేసియు, సర్వభూతహితేరతుడై వర్తించువాఁడు, కాన యథార్థముగ లోకసేవకుడు. శూద్రధర్మమగు సేవ ఉత్తమసంన్యాసియందు పరిపూర్ణముగ శోభించును. శ్రీమద్భాగవతమున తృతీయ స్కంధమున శ్రీకపిలుడు దేవహూతికీ యర్థమును నొక్కి వక్కాణించియున్నాఁడు.

> అహం సర్వేషు భూతేషు భూతాత్మా వస్థితస్సదా ।
> త మవిజ్ఞాయ మాం మర్త్యః కురు తేర్చావిడంబనమ్ ॥

యో మాం సర్వేషు భూతేషు సంత మాత్మాన మీశ్వరం ।
హిత్వాఽర్చాం భజతే మౌఢ్యాత్ భస్మ న్యేవ జుహోతి సః ॥

(భాగవతము.)

అనిశము సర్వభూత హృదయాంబుజవర్తి యనం దనర్చు
నీశునను నవజ్ఞచేసి మనుజుండొగి మత్ప్రతిమార్చనావిడం
బనమున మూఢుఁడై యుచితభక్తిని నన్ను భజింపడేని న
మ్మనుజుడు భస్మకుండమున మానక వేల్చినయట్టివాఁడగుః ॥

(ఆ-భాగవతము.)

శివాయ లోకస్య భవాయ భూతయే
య ఉత్తమ శ్లోకపరాయణా నరాః ।
జీవంతి నాత్మార్థ మసౌ పరాశ్రయం ।
ముమోచ నిర్విద్య కుతః కళేబరమ్.

(శ్రీభాగవతము. ౧౮-౧౨.)

ఉత్తమ కీర్తులైన మనుజోత్తము లాత్మహితంబులెన్నదుః
చిత్తములందు గోరరు హసించియు లోకులకెల్ల నర్థ సం
పత్తియు భూతియుః సుఖము భద్రము గోరుదురన్యరక్షణా
త్యుత్తమ మైన మేను విభుడూరక యేల విరక్తిబోసెనో ॥

## ప్రవృత్తినివృత్తిమార్గములు

జీవుఁ డభ్యసించు ధర్మములలోఁ గొన్ని ప్రవృత్తిధర్మము లనియుఁ గొన్ని నివృత్తిధర్మములనియు ధర్మములు రెండువిధములు. మొదట జీవుఁడు వాంఛాప్రేరితుఁడై సర్వత్ర స్వప్రయోజనమును గోరుచు, నితరులలాభముకంటె తనలాభ మెక్కుడుగ భావించుచు, స్వప్రయోజనమునకై పాటుపడునుగదా!

ఇది యంతయుఁ బ్రవృత్తిమార్గమనఁదగు. మనుష్యజన్మము ప్రాప్తించినది మొదలనేకజన్మములందు వివిధ సుఖదుఃఖానుభవములుగలిగి వానినుండి పొందఁదగు జ్ఞానమభివృద్ధియై నిజమగు వైరాగ్యము దృఢమగు నంతవఱకును బ్రవృత్తిమార్గమ నెనె జీవుఁడు తిరుగుచుండును. ఐహికములగు సుఖముల నెక్కుడుగ వాంఛించి వానికొఱకు బహుప్రయత్నములుచేయును. ఆసుఖములు లభించినపుడు సంతోషించుచు వానియందే రమించును. వానియం దత్యంతానురాగము గలిగి వానివియోగము నించుకయైన నోర్వక దృఢములగు ననుబంధములచే వానికి బద్ధుఁడైయుండు. ఐనను కాలక్రమమున నందెద్దియేని నశింప విశేషముగ శోకముతోఁ దపించి దీనభావమును జెందు. ఈయనుభవము మాటిమాటికిఁ గలుగను దనకు నుత్తమ సుఖసాధనములని భ్రమించి ప్రేమించుచుండిన విషయము లన్నియు నంతములు గలవియగుటచే క్షణభంగురములని యును, నశ్వరములనియును జ్ఞానముకలిగి వైరాగ్య మించుక యంకురించును. కాలయాపనమున దుఃఖము క్షీణింప నావిషయముల యందుమరల మమకారము క్రమక్రమమున వృద్ధియై బీజమాత్రముగనున్న వైరాగ్యము మఱుఁగుపడిపోవును. ఇట్టి వైరాగ్యమే ఔత్సుక్యమాత్ర వైరాగ్యమని పిలువఁబడును. ఇట్టివియె పురాణవైరాగ్యము, శ్మశానవైరాగ్యము నని లోకమునఁ బ్రసిద్ధముగ నుండునవి. అనేకజన్మములం దిట్టి యనుభవములు మరల మరల గలుగను గలుగను వైరాగ్యము

మరల మరల నంకురించి ప్రతిపర్యాయము క్రమక్రమమున దృఢతరమగుచు, నైహికములగు సుఖములన్నియు దుఃఖ మూలములను జ్ఞానము దృఢతమమగును. అప్పుడుగలుగు వైరాగ్యము స్థిరమై తీవ్రమై మోక్షమార్గమునఁ బాటుపడుట కుత్సాహమును గలిగించునదియగు.

> యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
> ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ (గీత. ౫-౨౨.)

ఈవైరాగ్యము గలుగునంతకుమున్ను తలచుగ స్వప్రయోజనముకొఱకుఁ బాటుపడుటయు బాహ్యములగు విషయములను గ్రహించుటయు ననుభవించుటయు జీవుని ముఖ్యలక్షణములు. అట్లనుభవించుటచేతనే అప్పటికి జీవుఁడు వృద్ధికాఁదగు. అజ్ఞానదశయందు గడుచుజన్మములందును బిదప ప్రతిజన్మమున బాల్యయౌవనములందును బైసూచించినరీతిని బాహ్యవిషయముల గ్రహించి యనుభవించుట జీవుని యభివృద్ధికి హేతువగుచున్నది. వీనిముఖ్య ప్రయోజన మేమనఁగా భూలోకమునందలి సుఖదుఃఖములు జ్ఞానవృద్ధికి హేతువులనియు నందలి ప్రకృష్టసుఖములకంటె మిగులసారవంతములు శాశ్వతములు నగు సుఖము లున్నవనియును దెలిసి యథార్థవైరాగ్యము దృఢపడుటయే.

ఈజ్ఞానము గలుగునంతవఱకు ప్రవృత్తిమార్గము జీవునకభివృద్ధికారణము. విషయసుఖములను సంపూర్ణముగ ననుభవించి వానియందలి దోషములను జక్కఁగనెఱింగి తీవ్రవై

రాగ్యము వృద్ధియగునంతవఱకుఁ బ్రవృత్తిధర్మమును వదలక యుండవలయును. అంతకుఁ బూర్వమే ప్రవృత్తిధర్మమును విడుచుటచేఁ బరిపక్వముగాని కాయను పండవేయ ఫలింపక చెడిపోవురీతిని జీవున కధోగతి ప్రాప్తమగునుగాని యుత్తమ గతి కది సాధనము గానేరదు. ఇక్కాలమున హిందూదేశ మునఁ బలువురు యుక్తవయస్కులుగాకయు, పరిపక్వజ్ఞానులు గాకయు, నిజమగువైరాగ్యములేకయు సన్న్యసించుటచే నుత్తమమగు తురీయాశ్రమమునకు నపవాదము కలిగియున్నది. తీవ్రవైరాగ్యము కలుగకమున్నె సన్న్యసించుటచే యథార్థ ముగ యతిధర్మముల ననుష్ఠించుట యసాధ్యముకావున "కామిగాక మోక్షగామి గాడు" అను లోకోక్తి ప్రసిద్ధముగ నున్నయది. సన్న్యసించిన పిదప శరీరపోషణముకొఱకు నిత రుల నాశ్రయించియుండుట విధియైయుండఁ దన్నుపచరింపఁ దగు గృహస్థులు లోనగువారికిఁ బెక్కుమడుంగు లెక్కువ మేలుచేయు సామర్థ్యము గలిగియుండినఁగాని యాయాశ్రమ స్వీకారము సార్థకముకానేరదు. ఏలయనఁగా సదా భగవ ద్ధ్యానపరుఁడై సర్వభూతహితరతుఁడై సర్వభూతహితము కొఱకే భగవంతుని బ్రార్థించుచు నెల్లరకు జ్ఞానదాతయై మార్గదర్శియై యితరులకు మేలుచేయు సామర్థ్యముకలిగి యా సామర్థ్యమును జక్కఁగ వినియోగింపనిచో నితరులనుండి తాఁ గొను భిక్షాన్న కాపీనాదులు నూతనములగు ఋణానుబంధ హేతువులగుటచేఁ గర్మబంధములగుచున్నవి. కావున నిజమైన

వైరాగ్యము గలిగినపిదప ప్రవృత్తిమార్గమును వదలి నివృత్తి మార్గమున వర్తింపఁదగు.

నివృత్తిమార్గమున స్వప్రయోజనము నపేక్షింపక పరోప కారమును గోరుచు నితరులనుండి తానుగ్రహించు ప్రయోజన ములకంటె నితరులకు నెక్కుడగు మేలుచేయుట ముఖ్యలక్ష ణము. మొదట నితరులవలనఁ దానుబొందులాభముల మేలును, ప్రయోజనములను దెలిసికొని వానికి సమానముగ నైనఁ బ్రత్యుపకృతిచేయుట యావశ్యక మని నివృత్తిమార్గమునఁ బ్రవర్తించువాఁడు కొంచెమైనను లోపములేక న్యాయమును బరిపాలించుచుండును. జ్ఞానము వృద్ధి కానుకాను అజ్ఞానదశ యందును, బాల్యయౌవనములయందును నెక్కుడుగ నితరుల నుండి తాఁ బొందినమేలును ఈక్షించి తద్వారాగలిగిన ఋణా నుబంధములను దీర్చుకొనవలయు నని యెక్కుడుగఁ బరోప కారబుద్ధికలవాఁ డగు. అపు డితరులవలనఁ దనకుఁ గలిగిన మేలుకంటె నెక్కువగ నితరులకు మేలు చేయుచుఁ గాలక్రమ మున స్వప్రయోజనము నించుకేని గోరక పరుల కుపకృతి చేయుటయే ముఖ్యధర్మముగ నభ్యసించును. ఈరీతి నాది యందుఁ దాఁ జేసికొనిన ఋణములన్నియుఁ గొంచెముగూడ లోపములేక వృద్ధితోఁ గూడఁ దీర్చి తుదకు ఋణవిముక్తుఁ డగుటకుఁ బ్రయత్నించును.

ఈవిధమున మనుష్యజన్మము గలిగినది మొదలు ముక్తుఁడగు నంతవఱకు జీవుని కాలమంతయుఁ బూర్వభాగము ప్రవృత్తి

మార్గమనియు, రెండవభాగము నివృత్తిమార్గమనియు నెఱుంగఁదగు. పూర్వభాగమున నీశ్వరుని మాయాశక్తి జీవుని నవిద్యారూపమునఁ గప్పి ప్రకృతిబద్ధునిగఁ జేయుచుండును. రెండవభాగమున నామాయాశక్తియే విద్యాస్వరూపిణియై జీవునిసంసారమునుండి మరలించి యాత్మాభిముఖునిగఁ జేయు. ఈరీతి జీవునియాత్రయంతటను ఒక్కొక్కజన్మమునను ఒక్కొక్కయాశ్రమమునను బ్రవృత్తినివృత్తిమార్గములు రెండును జూపింపనగు.

ఎల్లవారును ఈధర్మస్వరూపమును జక్కఁగఁ దెలిసికొని తమతమధర్మములను జక్కఁగ ననుష్ఠించుచు, యథాశక్తిగ నితరులకుఁ బోధించుచుఁ దాము కృతార్థులగుటయె గాక యితరులను గృతార్థులను జేయుచు, సనాతనములగు నీధర్మములఁ బరిపాలించుట ద్వారా ఆదియందు నీ ధర్మములఁ బ్రతిపాదించిన మహర్షుల ఋణమును దీర్చుకొనినవారగుదురు గాక.

---

## పంౘెండవ యధ్యాయము

## మోక్షమార్గత్రయము

జీవుఁ డీశ్వరాంశమనియు, ఈశ్వరశక్తులన్నియు జీవుని యందు బీజరూపముగ నున్నవనియు, ఆ బీజరూపముగ నుండు శక్తులన్నియు సంపూర్ణముగ నభివ్యక్తమగుటకొఱకు జీవుఁడు పాంచభౌతికమగు ప్రపంచమునఁ బ్రవేశించి సంసారచక్రమునఁ బరిభ్రమించుచున్నాఁడనియును దాని ప్రయోజనము మోక్షముఁ బొందుటయే, అనగా పరిపూర్ణుఁడగుటయే యనియు, బూర్వాధ్యాయముల సూచింపఁబడియె. ఆదియం దీశ్వరాంశమగుజీవాత్మ క్రమక్రమమున స్థూలము, స్థూలతరము, స్థూలతమమునగు ప్రకృతియందుఁ బ్రవేశించి యనేకలోకములయందు నాయాలోకసంబంధమగు ప్రకృతిలో నొకకొంత భాగమును జేర్చుకొని దాని నుపాధులుగ నొనర్చుకొనుచు నన్నిటికంటె స్థూలమగు భూలోకమునఁ బ్రవేశించి కొంతకాల మచేతనము లగు మృత్పాషాణాదులయందును, మఱికొంతకాల మోషధి వనస్పతులయందును, పిదప జంగమములగు తిర్యగ్జంతువులయందును నివసించి యనేకవిధానుభవములఁ బొంది కట్టకడపట మనుష్యశరీరమును ధరించు

చున్నాఁడు. జీవాత్మ సచ్చిదానంద స్వరూపుఁడయ్యు మృత్పాషాణాదులయందు సత్తామాత్రముగ నావిర్భవించి యున్నవాఁడు. స్థూలమగు ప్రకృతియందుఁ బ్రకాశరహితముగ నుండుటవలన వీనియందాత్మ యున్నదా యనుసందియ మొందఁదగినంత యంతర్భూతుఁడై యున్నవాఁడు. ఈస్థితియందు యథార్థముగ జీవత్వ మున్నదా అని చెప్పుట కవకాశము చాలకయుండు. ఐనను గాలక్రమమున మృత్పాషాణాదుల నతిక్రమించి యోషధివనస్పతులయందుఁ బరిణమించు కాలమున వానియందు ద్రవసంచారముచే నవి ప్రాణభృత్తులనఁదగియున్నవి. తిర్యగ్జంతువులయం దుశ్శ్వాసనిశ్శ్వాసరూపమగు ప్రాణము కన్పడును. చిత్తమంతగాఁ గానరాదు. జంతువులయందును బ్రవృత్తిరూపక సంచారముచేతను, క్రోధహర్షాదులచేతను జిత్తము కొంచెము కనఁబడుచుండును. ఐనను మనుష్యశరీరధారియైనప్పుడే మనశ్శక్తి స్పష్టముగాఁ గనఁబడుచున్న యది. అపు డింద్రియములచేత బాహ్యప్రపంచమును దెలిసికొనుటకును, తెలిసికొన్న విషయములను వాక్కుతో వివరించుటకును గడచిన విషయముల స్మరించుటకును రాఁబోవు విషయముల నూహించుటకును సమర్థుఁడగు. ఈ మనశ్శక్తి యుదయించిన పిదపనే జీవాత్మ మనుష్యలోకమున నున్నవాఁడనియు, చేయుకర్మములయందు స్వాతంత్ర్యము గలిగియుండుటచే ఫలానుభవమునకు బద్ధుఁడై వివిధసుఖదుఃఖానుభవములచే జ్ఞానము నభివృద్ధి చేసికొని బీజరూపముగ

నున్న యాత్మశక్తులను గ్రమక్రమముగ నభివ్యక్తములుగఁ జేసి కొనుచున్నవాఁడనియు గ్రహించుటొప్పు. సంసారచక్రమునందుఁ దిరుగునంతకాలము జీవాత్మకుఁ గలుగు బహువిధ సుఖదుఃఖములును, మఱియు జీవుని యోగ్యతానుసారము విధింపఁబడియుండు విధినిషేధరూపములగు ధర్మములును, బీజరూపముగనుండు నాత్మశక్తుల నభివ్యక్తములుగఁ జేయుటకొఱకు నుద్దేశింపఁబడినవి.

మానవజన్మము ప్రాప్తించినది మొదలు ముక్తిసాన్నిధ్యమును బొందువఱకు జీవుఁ డనుష్ఠించు మార్గములలో ముఖ్యముగ మూఁడుమార్గములు గానంబడుచున్నవి. ఈమార్గములన్నియు గడపట జీవాత్మకుఁ బరమాత్మ సంయోగమును గావించుటకు సమర్థములయినవి. ఈ సంయోగమునకే యోగమనిపేరు. ఈయోగము నొనఁగూర్చుటకు సాధన మగుటంజేసి యీమార్గత్రయము యోగసాధనముగ నెన్నఁదగియున్నయది. ఆమార్గములు కర్మమార్గము, భక్తిమార్గము, జ్ఞానమార్గ మనునవి. ఒక్కొక్కమార్గము తుది నొక్కొక్కయోగము సిద్ధించుచున్నయది. కర్మమార్గము తుదిఁ బొందఁదగినది కర్మయోగము, భక్తిమార్గము కడపట నొందఁదగినది భక్తియోగము, జ్ఞానమార్గము కడపటఁ జెందఁదగినది జ్ఞానయోగము.

ఇట్లు మార్గములు మూఁడైయున్నను గమ్యస్థాన మొక్కటియే. ఏమార్గమున నడిచినను తుద నీశ్వరసాన్నిధ్యమును

జెందుటయే దానికి ఫలము. ఈమార్గములు మూడును సమ
ములే. వానిలో హెచ్చుతక్కువలు లేవు. ఆయాజీవుల స్వ
భావమును బట్టి ఆయామార్గము వారవలంబించి శ్రేయః
ప్రాప్తిని జెందుదురు. ఈమర్మము తెలియనివారు తమతమ
మార్గమే శ్రేష్ఠమనియు తక్కినవి దానికంటె తక్కువయనియు
భ్రమించి వృథావివాదములతో కాలహరణము చేయుదురు.
కర్మమార్గమునఁ బ్రవర్తించుకర్మి కట్టకడపటఁ గర్మయోగ
ముచే పరిపూర్ణుఁడుకాఁగా భక్తిజ్ఞానములు వానియం దభి
వ్యక్తములయి ప్రకాశించును. భక్తిమార్గమునఁ బ్రవర్తించు
భక్తునకు భక్తి హెచ్చను హెచ్చను బాహ్యములగు నైహిక
సుఖములయందుఁ బ్రీతితగ్గును. అట్టి భక్తుఁడు సర్వకర్మము
లను భగవంతునియం దర్పించి సదా భగవత్సాన్నిధ్యమును
గోరుచు సాయుజ్యము నొందును. అపుడు జ్ఞానము తనంతటఁ
దాను వానియందుఁ బ్రకాశించి భక్తిజ్ఞానములు రెండును బరి
పూర్ణములుకాఁగాఁ సర్వభూతహితము గోరి జనకాదులవలెఁ
గర్మములందుఁ బ్రవర్తించును. మఱియు జ్ఞానమార్గమునబోవు
జ్ఞాని విచారముచేత నిత్యానిత్యవివేకజ్ఞానము గలిగి క్రమక్రమ
మున నశ్వరములగు విషయముల నన్నింటియందు వైరాగ్యము
నభివృద్ధి చేసికొనుచు, నావిషయము లన్నింటి ననాత్మగా
నెఱింగి శరీరమును నింద్రియములను, మనోబుద్ధ్యహంకారము
లను వరుసగ ననాత్మగనెఱుంగుచుఁ గట్టకడపట నొక్కటి
యగు నాత్మస్వరూపమును దెలిసికొనియు నాత్మేతరపదార్థ

మొక్కటియు లేదని నిశ్చయించిన నాస్థితియందుత్తమోత్తమ మగు పరమభక్తియు నభివ్యక్తముకాక తీరదు. అట్టిజీవుఁడు లోకానుగ్రహ తత్పరుఁడై కర్మములందు సహితము ప్రవర్తించును. ఇట్లొక్కొక్కమార్గమును వేఱువేఱుగఁ గన్పడినను సమగ్రస్థితియందు మార్గములన్నియు నొకటియగుచున్నవి. కావున సంపూర్ణయోగి కర్మికంటెను, జ్ఞానికన్నను, భక్తుని కన్నను శ్రేష్ఠుఁడు.

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

(గీ. ౬-౪౬.)

---

## పదుమూఁడవ యధ్యాయము

### కర్మమార్గము

జీవునియందు బీజరూపముగనుండు నాత్మశక్తుల నభివ్యక్తములుగఁ జేయుటయే యీమార్గమువలని ప్రయోజనము. ప్రపంచమునందలి మతము లన్నింటియందును విధింపఁబడి యుండు బాహ్యములగు కర్మములన్నియు సామాన్యముగ లోకమునఁ జేయఁబడు లౌకికకార్యములన్నియు న్నాప్రయోజనమును లభింపఁజేయుటకు సాధనములుగ నుద్దేశింపఁబడినవియ. మొట్టమొదట జీవుఁడు తమోగుణమునకు లోఁబడియుండ నాతమోగుణమును బోఁగొట్టి రజోగుణ ప్రధానునిగఁ జేసి తుదకు సత్త్వగుణమునఁ బ్రతిష్ఠితునిగఁ జేయుటకు వివిధకర్మములను శాస్త్రములయందుఁ దత్త్వవేత్తలగు మహాత్ములు విధించియున్నవారని పూర్వాధ్యాయమున విస్తరింపఁబడి యున్నదికదా! అందు నెక్కుడగు నజ్ఞానమున మునిఁగి తమోగుణ ప్రధానులుగ నుండు జీవులు తమకంటె నుత్తములగు వారలకు లోఁబడి వర్తించుటయు, వారిని సేవించుటయుఁ దప్ప నితరములగుకర్మములు ఎవ్వియు విధింపఁబడి యుండలేదు. అంతకంటె శ్రేష్ఠులగు జీవులకు వివిధకర్మములు విధిం

పఁబడియే యున్నవి. జీవుని పరిపాకావస్థ ననుసరించి యంత కంటె నుత్కృష్టస్థితికిఁ దేఁదగు ధర్మముల ముందుఁ జర్చించి తిమి. ఇపుడు మతములయందు విధింపఁబడియుండు కర్మము లఁగూర్చి విచారింతుము.

విహితములగు కర్మములన్నియును, వర్ణాశ్రమధర్మము లన్నియును, శరీరధారణమునకు సాధనములగు వృత్తులన్ని యును బూర్వాధ్యాయమున సూచింపఁబడినరీతిని బీజరూప ములగు నాత్మశక్తుల నభివ్యక్తములుగఁ జేయుటకు జీవుని స్థూల సూక్ష్మశరీరముల మాలిన్యమును బోఁగొట్టి పరిశుద్ధముగఁ జేయ సమర్థములైనవి. నిత్యనైమిత్తికములగు యజ్ఞములు దానములు మొదలగునవి జీవుని పలువిధములగు ఋణముల నుండి విముక్తునిగఁజేయ సమర్థములయియున్నవి. వర్ణాశ్రమ ధర్మముల విషయము పూర్వాధ్యాయమున విస్తరింపఁబడి యున్నది. ఇఁకఁ బై సంస్కారములను గుఱించియు, యజ్ఞము లను గుఱించియు మాత్రము విచారింతుము.

జీవుని యుపాధులయందుండు మాలిన్యమును బోఁగొట్టి వానిం బరిశుద్ధములుగఁ జేయుటకొఱ కన్నిమతములవారలు ననేక సంస్కారములు విధించి యున్నవారుకదా! ఒక్కొక్క మతమునందు నొక్కొక్క పేరుచేఁ బరఁగుచున్నను మత సంబంధములగు క్రియలన్నియు నాయుద్దేశము నొనఁగూర్చు నవియే. ఈ సంస్కారములు జీవుని ప్రతిజన్మమునందును ఆది నుండి యంతమువఱకును గాలానుసారముగఁ జేయఁబడునట్లు

విధింపఁబడియున్నవి. వీని యన్నింటియందును గ్రహింపఁదగిన ముఖ్యాంశములు కొన్నిగలవు.

౧. జీవాత్మ యుపాధులుగలిగి యాయుపాధుల మూలమున భూరాదిలోకములతోడను, ఆలోకవాసులతోడను సంబంధము గలిగియున్నవాఁడు. ఒక్కొక యుపాధిమూలమున నొక్కొకలోకముతో సంబంధము గలిగి యాలోకమును స్పృశించుచుండు. ఒక్కొక్కయుపాధియు నొక్కొకలోక ప్రకృతితోఁ జేయఁబడి యాలోకానుభవమునకు సాధనమగుచుండును.

౨. లోకమునందలి సమస్త ప్రకృతి సముదాయము ఎల్లపుడు చలనము గలిగియేయుండును. ఇది ప్రకృతి శాస్త్రజ్ఞులు పరిశీలించి యొప్పియున్నారు. ఈరీతినే జీవుని శరీరములయందున్న ప్రకృతిసముదాయమును స్వాభావికముగఁ జలనము గలిగియేయుండును.

కావున నాశరీరముల ధరించిన చైతన్యమునందు వృత్తులు మారినపెల్ల నా యుపాధులయందును తదనుగుణముగ జలనము గలుగుచుండును. అట్లె బాహ్యస్పర్శలవలన నుపాధులయందు చలనము పుట్టునపెల్ల చైతన్యమునందును అనురూపములగు వృత్తు లుత్పత్తియగును. అనగా నొక్కొక్కలోకమునఁ గల యితర శరీరములు మొదలగు ప్రకృతిసముదాయముల సంస్పర్శవలన నాయాలోకములయందు నాజీవునికిఁగల శరీరములయందుఁ జలనము గలుగును. ఈచలనములచే నా

జీవుని యుపాధులయందుండిన ప్రకృతిసముదాయము కొంత వదలిపోయి యితర ప్రకృతి సముదాయము వానియందు చేరుట ద్వారా శరీరము లెల్లప్పుడును మాఱుచునే యుండును. ఆయాయుపాధుల కాయా లోకములనుండివచ్చు బాహ్యాస్పర్శములచేఁ గలుగు చలనమువలనే జీవునకు ఆయాలోకజ్ఞానముగలుగును. అట్లు జ్ఞాన మభివృద్ధి కానుకాను జీవుని జ్ఞానానుభవమువలన లోపలనుండి ప్రేరణము కలిగి వృత్తులు మారగా నాయాశరీరములయందును జలనము గలిగి చైతన్యవృత్తి బహిర్ముఖమగును. ఇట్లు జీవుఁ డెల్లప్పుడు చేయు కర్మములచేతను జీవుని యుపాధులయం దనవరతము చలనము గలిగి యది మాఱుచునేయుండును. జ్ఞానము వృద్ధికానుకాను ఈమార్పులు విశేషమగుచుండును.

౩. ఒక్కొక్క లోకసంబంధమగు శరీరమును జీవాత్మ క్రమక్రమముగఁ బరిశుద్ధముగను, జ్ఞానసాధనముగను జేసికొనుచుండు. జీవాత్మ సదా తన యుపాధులను లోఁబఱచుకొని తన యిష్టానుసారము చలించునట్లు చేయ యత్నించుచుండినను ఉపాధులు పూర్వకర్మవాసనాబలముచే లోఁబడక వేఱువిధముగఁ జలించుచుండు. కావున జీవుఁడు పురుషార్థసాధనమునకుఁ జేయు ప్రయత్నములు సఫలములు కాకపోవుటయుఁ గలదు. ఐన నెద్దియేని యుపాయమున నుపాధులను మంచిమార్గమునఁ జలింపఁజేయఁ గలిగెనేని జీవుఁ డొనరించు ప్రయత్నములు సఫలములగును.

ఉపాధులయందలి దుష్టచలనమును నిలిపి సద్వృత్తుల కనుకూలమగు వర్తనమును గలిగించుటయందు మంత్రములు మొదలగునవి మిక్కిలి సహకారములు. మంత్రముల నుచ్చరించుటచే జీవుని స్థూలసూక్ష్మ శరీరములు సౌమ్యముగఁ జలించి తమయందలి మాలిన్యమును గ్రమక్రమమునఁ బోఁగొట్టుకొనును. జీవుఁడు మంచిమార్గమునఁ బ్రవర్తించుటకుఁ బూనినపు డుపాధులు అనఁగా స్థూలసూక్ష్మ శరీరములు అట్టి సత్త్వవర్తనమునకుఁ బ్రతిబంధములుగ నుండినచోఁ దత్త్వవేత్తయగు గురువువలనఁ బొందఁబడిన మంత్రము నుచ్చరించుటచే నాయుపాధులయందలి స్వాభావిక చలనము నిలిచి యవి జీవునకు లోఁబడి యనుగుణముగఁ జలించు. కావున సంస్కారములన్నింటియందును మంత్రములు వినియోగింపఁ బడుచున్నవి. మఱియును గొన్నిముద్రలును, కొన్నిద్రవ్యములును ఉపయోగింపఁబడుచున్నవి. ఆమంత్రముల యుచ్చారణముచేతను, ఆముద్రల ప్రయోగముచేతను, నా పరిశుద్ధపదార్థముల నుపయోగించుటచేతను, జీవుని స్థూలసూక్ష్మశరీరములయందలి మాలిన్యము తుదముట్ట నశించి యా దేహములు పరిశుద్ధములగుచున్నవి.

మంత్రము లన నేమి? వాని నుచ్చరించుటచే శరీరమునందలి మాలిన్యము నశించు టెట్లు? లోకమున నొక్కొక్కశబ్దము నుచ్చరించుటచేఁ గలుగు ధ్వని సామాన్యముగ నదృశ్యప్రపంచమునను, పలుమాఱు స్థూలమగు దృశ్యప్రపంచమునను, ఒక్కొక్కరూపముగఁ బరిణమించును. నానావిధశబ్ద

ములు నానారూపముల నుత్పత్తిచేయుచుండ నందుఁ గొన్ని మంచిగుణములు గలవియు, మఱి కొన్ని చెడుగుణములు గల వియునైయుండు. ఇదిగాక యారూపము లొక్కొక్కటియు నొక వర్ణముకలదగు.

సూక్ష్మలోకము లన్నింటియందును ఆయాలోకవాసులగు దేవకోటులున్నవారు కదా! ఒక్కొక్క లోకమునందలి దేవతలును నానావిధవర్ణములు గలవారుగ నున్నవారు. కొందఱు దేవతలు రక్తవర్ణముగలవారని, కొంతమంది పీతవర్ణముగల వారని, మఱికొందఱు నీలవర్ణముగలవారని యిట్లనేకవిధముల వర్ణములుగలవారని గ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది.

ఉచ్చరింపఁబడు శబ్దమున కనురూపమగు శుక్లకృష్ణాది వర్ణములతో నొప్పురూపము సూక్ష్మ ప్రపంచమునఁ గలుగు నని ముందే యనువదింపఁబడియె. ఆరూపము తదనురూపమగు వర్ణముగల యొక దేవత నాకర్షించును. ఆదేవత యారూపమునందుఁ బ్రవేశించి యాశబ్దము నుచ్చరించు పురుషునితోడ సంబంధముగలదియగు.

సూక్ష్మదృష్టిగల తత్త్వవేత్తలు వివిధములగు శబ్దములఁ జక్కఁగ బరిశీలించి శబ్దముల సంయోగమువలనఁ గలుగు రూపములను, వానివర్ణములను, బరీక్షించి యుపాసకుని కనుకూలమగు వర్ణమును, రూపము నుత్పత్తిచేయగలిగి తదనురూపులగు దేవతల నాకర్షింపఁగలుగు శబ్దములను సంయోగముచేసి మంత్రములుగ నిరూపించియున్నవారు. కావున

సూక్ష్మలోకవాసియగు నొక్క దేవత కుపాధికాఁదగి తదను రూపములగు వర్ణరూపముల నుత్పత్తిచేయఁగలిగి తత్త్వవేత్తలగు మహార్షులచే సంయోగముచేయబడిన యక్షరసముదాయము మంత్రమనఁబడు. మంత్రము లితర శబ్దజాలములవలె నర్థమాత్రప్రయోజనము గలవిగావు. అక్షరముల లోపము లేక, వరుస తప్పక, విధింపఁబడిన స్వరము నతిక్రమింపక యుచ్చరింపఁబడవలయు. లేనిచో మంత్రాధిదేవత నాకర్షించు శక్తి లేక వాంఛితఫలము నీయఁజాలదు.

మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న తదర్థమాహ ।
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రు స్స్వరతోఽపరాధాత్ ॥

మంత్రముచ్చరింపఁబడినపుడెల్ల సూక్ష్మలోకమున రూపముత్పత్తియగుచుండును. ఆరూపమునుండి మేలుగలుగునా, లేక కీడుగలుగునా, అదిమంచిచేయు దేవత నాకర్షించునా, లేక హానికరములగు పిశాచముల నాకర్షించునా యను నివి మంత్రముల యందలి యక్షర పద స్వర క్రమముల ననుసరించును. మఱియు మంత్రము నుచ్చరించు వాని పారిశుద్ధ్యము, భక్తి, జ్ఞానము, చిత్తైకాగ్ర్యము వీని ననుసరించి యది యుద్దిష్ట ఫలము నిచ్చుటయందు వీర్యవంతమగును. కావుననే మంత్ర జపము చేయుటయందుఁ బారిశుద్ధ్యము, భక్తిజ్ఞానచిత్తైకాగ్ర్యములు లేనిచో మంత్రసిద్ధి కాఁజాలదు.

మంత్రముచ్చరించుచో సూక్ష్మశరీరమున సౌమ్యమైనచల నము గలిగియుండును. ఆమంత్రమును మరల మరల నుచ్చరిం చుటచే నాసౌమ్యచలనమెక్కుడై చిత్తైకాగ్ర్యమునకు సహ కారియగును. కావుననే మంత్రము నుచ్చరించువారలకును, శ్రద్ధతో వినువారలకును మనశ్శాంతి కలుగును.

మంత్రమునందుదహరింపఁబడిన దేవత నామోచ్చారణ మాత్రమున నాదేవత శరీరస్వభావానుగుణమగు చలన మా మంత్ర ముచ్చరించువారియొక్కయు, వినువారియొక్కయు నుపాధులయందుత్పత్తియగు. మంత్రమును పునశ్చరణము చేయుటవలన నాచలనము బలపడి స్థూలసూక్ష్మశరీరముల యందు సమరసభావ మభివృద్ధి చెందునట్లుచేయును. ఆదేవత తేజస్సు, శక్తియుఁ బునశ్చరణముచేయువారి శరీరములయం దుఁ బ్రవేశించి వానిని బరిశుద్ధములుగఁ జేయును.

ఇట్లు మంత్రపునశ్చరణము చేయుకాలమునఁ జేయువారి శరీరములు మంత్రాధిదేవత తేజస్సుతో నిండియుండుటచే భూతములవలని బాధ లాజీవుని సమీపింపఁజాలవు.

మంత్రము లుచ్చరించుటయందు మంత్రాధిదేవత యుపా ధులయందలి స్వాభావికచలనమునకు ననురూపమగుచల నము దాని నుచ్చరించువానిశరీరమునఁ గలుగుటచే నట్టి తీక్ష్ణ మగు చలనమును భరింపఁజాలని మలిన ప్రకృతి సముదా యము వాని శరీరమునందుండినచో నాశరీరము ఆచలనమును భరింపఁజాలక బాధపడును. ఒకానొకప్పుడుపాధి నశించినను

నశించును. కావున దుస్స్వభావము గలవారు తేజోభరితమగు గొప్పమంత్రము నుచ్చరించినను, వినినను, జపముచేయువారి సమీపమున నుండినను వారలకు విశేషబాధ కలుగును. అట్లుగాక సద్గుణప్రధానులయి వారియుపాధులయందుఁ బరిశుద్ధమగు ప్రకృతిసముదాయము విశేషముగనుండి యపరిశుద్ధప్రకృతిసముదాయ మల్పముగనుండినచో మంత్రోచ్చారణమువలనఁ బరిశుద్ధమగుభాగము తీవ్రమగు చలనమొంది, యపరిశుద్ధభాగమునందలి ప్రకృతిసముదాయమును గ్రమక్రమమున విడఁదీసి వెలుపలికిఁ ద్రోసివేయును. దానిస్థలమునఁ బరిశుద్ధాణువు లాకర్షింపఁబడి చేర్చుకొనఁబడును.

ఇట్లు పరిశుద్ధమంత్రములను మరలమరల నుచ్చరించుటవలనను, వినుటవలనను, స్థూలసూక్ష్మోపాధులు క్రమక్రమమునఁ బరిశుద్ధములగును. మఱియు దుస్స్వభావము లేకుండియు, జ్ఞానాభివృద్ధి తక్కువగాఁగల సామాన్యజీవుల యుపాధులు స్థూలమును మలినమునునగు ప్రకృతిసముదాయము నెక్కువగఁ గలిగియుండుటచే దుస్స్వభావముగలవారి యట్లు వీరును మంత్రముల నుచ్చరించినను, వినినను నవి భాధకరములగును.

ఇవిగాక ప్రపంచమునందలి పదార్థములన్నియు స్వాభావికమగు తేజస్సు గలిగియున్నవనియును, ఆ తేజోగుణము ననుసరించి సాత్త్వికరాజసతామసములని విభజింపఁబడియున్నవనియును పూర్వాధ్యాయములందు సూచింపఁబడెను. ఆయావస్తు

వుల నుపయోగించుటవలన వానిసంసర్గముగల యితరవస్తువుల తేజస్సుగూడ మాఱును. కావున సమస్త వైదికకర్మములయం దును ఉపాధులను బరిశుద్ధముచేయు శక్తిగలపదార్థముల నుప యోగింపవలసినట్లు తత్త్వవేత్తలగుమహాత్ములు విధించియున్న వారు. కనుక జీవుని యుపాధుల నన్నింటిని బరిశుద్ధము జేసి జీవునకు సద్గతిని గలుగఁజేయుటకు విధింపఁబడిన సంస్కా రము లన్నింటియందును, మంత్రములును, యంత్రములును, కొన్ని పరిశుద్ధపదార్థములును ఉపయోగించునట్లు సర్వమత గ్రంథములందును నిర్ణయింపఁబడియున్నది.

పైన సూచింపఁబడిన ముఖ్యాంశములను జక్కఁగ గ్రహిం చినచోఁ గర్మములు చేయుటయందుఁ బ్రతిపాదితములగు విధి నిషేధములు సార్థకము లగుచున్నవి. ఎట్టివారు మంత్రము లుచ్చరింపనర్హులో, ఎట్టివారనర్హులో, ఎట్టివారియెదుట నుచ్చ రింపనగునో, ఎట్టివారియెదుట నుచ్చరింపరాదో, ఏయేపదార్థ ములు హోమములకును, దానములకును యోగ్యములో యీమొదలగు విధినిషేధములన్నియు సప్రయోజనములుగఁ గన్పడు. ఈవిషయముల నెఱుంగనిచో నన్నిమతములయం దును విధింపఁబడిన నానావిధకర్మములు నిరర్థకములుగఁ దోఁచు. అన్నిమతములయందు విధింపఁబడిన సంస్కారము లన్నియు జీవుని యుపాధులయందున్న మాలిన్యమును దొలఁ గించి పరిశుద్ధములుగఁ జేసి జీవునియందు బీజరూపములుగ నుండు నాత్మశక్తులనన్నిటి నభివ్యక్తములుగఁ జేయుటకును,

ఆమార్గమునం గలుగు నంతరాయములను దొలఁగించుటకును
విధింపఁబడినవని తెలిపితిమి గదా!

మతసంబంధములగు క్రియలయం దన్నిటియందును, జల
ములు, ధ్యానములు, పుష్పములు లోనగు పదార్థము లుప
యోగింపఁ బడుచున్నవిక దా! మంత్రము లుచ్చరింపఁబడు
నపుడు కలుగు దివ్యమును, తేజోవంతమును నగు చలనము
ఉచ్చరించువానిశరీరమునందుఁ గలిగి యుపాధులనన్నింటిని
బరిశుద్ధముగఁ జేయును. మఱియును, మంత్రము లుచ్చరించు
కాలమున మంత్రశక్తియును, మంత్రాధిదేవత తేజస్సును జల
మునందుఁగాని మఱి యితరవస్తువునందుఁగాని ప్రవేశింప
వలయునని దృఢముగ సంకల్పించినచో నాశక్తి యాజలముల
యందుఁ బ్రవేశించి యాజలములను బరిశుద్ధ తేజస్సుగల
వానిగఁ జేయును. ఇంతియకాదు. క్రియలయందుఁ గొన్ని
యంత్రముల నుపయోగించుటకలదు. కొన్ని కొన్ని చక్రము
లును, వానియందుఁ గొన్నిబీజాక్షరములును, పంచదళాష్ట
దళపద్మములు మొదలగు యంత్రములును వ్రాయుటయు,
ముగ్గులువేయుటయు గలదుగదా! ఇవియన్నియు శక్తియుక్త
ములగుయంత్రములు. మంత్రములుచ్చరించుచు నట్టియంత్ర
ములను లిఖించినను, లిఖించినయంత్రమునందు మంత్రాధిదేవ
తను ఆవాహనముచేసినను, అనఁగా నాదేవతశక్తి యాయంత్ర
మున నిండి దాని దేజోవంతముగఁ జేయవలయునని చిత్తై
కాగ్ర్యముతో సంకల్పించినను, ఆయంత్రాధిదేవత సంబంధ

మగు దివ్యతేజస్సు ఆయంత్రమునం బ్రవేశించి, దానిని వీర్య వంతముగఁ జేసి యా యంత్రమును ధరించువారల శరీరమునం దపరిశుద్ధ చలనమును బోఁగొట్టి పరిశుద్ధతేజస్సును నించి ఆశరీరమునందలి మాలిన్యమును బోఁగొట్టి పరిశుద్ధముగఁ జేయును. రోగములుండిన నవి నివారణములగు. పిశాచములు లోనగు వాటిచే గలుగుబాధ లుండినచో నవి వదలిపోవును. ఉపాధులు పరిశుద్ధములు కానుకాను అంతఃకరణము పరి శుద్ధమై, శాంతమై, ఏకాగ్రమై ప్రకాశించును. అట్లే మంత్ర ములచేతను, యంత్రములు లేక ముద్రలచేతను, జలములు, తండులములు, పక్వాన్నము, ఫలములు లోనగువానిని అభి మంత్రించినచో నామంత్రముయొక్కయు మంత్రాధిదేవత యొక్కయు దివ్యతేజస్సు ఆపదార్థములయందుఁ బ్రవేశించి వానిఁబరిశుద్ధముగఁ జేయును. అవుడాజలముల నితర పదార్థ ములపైఁ బ్రోక్షించినను, ఇతరుల శరీరములపైఁ జల్లినను, వానియందలి దుష్టచలనము శమించి యాయుపాదులు పరిశుద్ధ ములగును. ఇట్లభిమంత్రింపఁబడిన పదార్థములను భక్షించినను, జలములఁ ద్రావినను బరిశుద్ధులగుదురు.

కావునఁ గ్రియలయం దన్నింటియందు జలముల నభిమం త్రించుటయు, నాజలముచేఁ బరిశుద్ధములగు పదార్థములను హోమము మొదలగు కార్యముల కుపయోగించుటయు, హుతముచేయఁగా మిగిలిన శేషమును దేవతాప్రసాదముగ భక్తులగువారు గ్రహించుటయు విధింపఁబడియున్నవి. గృ

హాస్థువగువాఁడు స్నానము సేయునపుడు జలముల నభిమంత్రించి యాజలములతో స్నానము సేయనగు. భగవంతుని ధ్యానముచేసి మంత్రములతో నభిమంత్రించిన జలములతోఁ బరిశుద్ధముగఁ జేయఁబడి, దేవునకు నివేదనము చేయఁబడిన యన్నాదులను భుజింపనగు. ఇట్లు సంస్కరింపఁబడిన యన్నము మేధ్యము (అనఁగా దేవతారాధనముచేఁ బరిశుద్ధమైనది) అనియును, అమృతమనియుఁ బిలువఁబడుచున్నది. అట్టి యమృతమును భుజించువారు సమస్తపాపనిర్ముక్తు లగుదురని యును, బ్రహ్మత్వమును సహితము నొందువారనియును శాస్త్రములయందు నిరూపింపఁబడియున్నది.

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ॥

(గీత. 3-13.)

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్ ॥

(గీత. 4-31.)

మఱియు సనాతనధర్మశాస్త్రమునందు సమస్తకార్యములకు నాదియందుఁగాని, యంత్యమందుఁగాని పుణ్యాహవాచనము సేయవలయునని విధింపఁబడియున్నది కదా! మంగళకరము లగు మంత్రములఁ బఠించి యామంత్రములచేఁ బవిత్రములగు జలములను, అక్షతలను గృహవస్తువాహనములపైఁ జల్లుట యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఇందును మంత్రములచేత స్థలశుద్ధియుఁ బదార్థశుద్ధియుఁ గర్తలు భోక్తలు శుద్ధులగుటయు నివియ ముఖ్యోద్దేశ్యములు. సామాన్యముగఁ గొందఱు

మాత్రము మంత్రములఁబఠింప నర్హులనియును, కొందఱ నర్హుల నియును జెప్పఁబడియుండుట కొందఱకు నప్రియమ్ముగ నున్న యది. ఐనను దానికిఁ గారణము ముందే సూచింపఁబడియె. పరంపరానుష్ఠితమగు నాహారనియమము, ఆచారనియమము గలిగి కొంచెము పరిశుద్ధములగు శరీరములు గలవారు మాత్రము మంత్రములఁ బఠించిన మేలుపొందుదురనియు, ఆహార వ్యవహార విహారనియమములకు లోఁబడక యిష్టాను సారముగ వర్తించువారలకు మంత్రపఠనము హానికరమే యనియు నెఱింగి యపారదయాసముద్రులగు మహాత్ములు వారలకు మంత్రపఠనము నిషేధించిరిగాని వేఱుకాదు. స్వ ప్రయోజనపరులై యట్లు చేసిరనుకొనఁదగదు. సదా పరోప కార తత్పరులై "ఆత్మవత్సర్వభూతాని" యను నియమము ననుసరించువారియందు స్వప్రయోజనపరత్వము నారోపించు టెట్లు? అనర్హులకు మంత్రపఠనమువలనఁ గలుగు కీడెఱింగి మంత్రపఠనము గూడదనిరి గాని యెవరికైనను సత్కార్య నిషేధము చేయవలయునని కాదు. మంత్రములకు మాఱుగ భగవంతుని నామమంత్రములను, పురాణవాక్యములను ఉప యోగించుచు సమస్తకార్యములు చేయవలయుననియే విధించి యున్నారు.

ప్రపంచమునందలి మతములన్నింటియందును గొన్ని సం స్కారములు విధింపఁబడియే యున్నవని ముందే సూచించి తిమి. ఐనఁ గొన్నిమతములయందు విస్తారముగ విధింపఁబడి

యున్నయవి. ఆర్యజనములకు ముఖ్యముగఁ గొన్ని సంస్కారములు నియమింపఁ బడియున్నవి. ముఖ్యముగా గర్భసంస్కారములు అనఁగా జీవుఁడు ప్రతిజన్మమునందును మాతృగర్భముననుండు కాలమునఁ జేయఁబడు సంస్కారములు వారియందు విస్తరింపఁబడి యాచరణమున నున్నవి గాని యితర మతములయం దంతగాఁ గానరావు.

హిందూమత గ్రంథములయందు సంస్కారములు పెక్కులు పేర్కొనఁబడియుండినను వానియందు ముఖ్యములయినవి యిందుదాహరింపఁబడుచున్నవి.

౧. గర్భాధానము.
౨. పుంసవనము.
౩. సీమంతోన్నయనము.
౪. జాతకర్మము.
౫. నామకరణము.
౬. అన్నప్రాశనము.
౭. చూడాకరణము.
౮. ఉపనయనము.
౯. సమావర్తనము.
౧౦. వివాహము.

ఇందు మొదటిమూఁడును గర్భపోషణ సంస్కారములు. మొదటిదగు గర్భాధానము జన్మించఁబోవు శిశువునకుఁ బ్రథమ సంస్కారము. స్త్రీపురుషులు కామమునకులోఁబడి యిష్టానుసారముగ భోగములలో విహరించుట వివాహము వలని యుద్దేశ్యముకాదు. గృహస్థువు సత్ప్రజాభివృద్ధికొఱకు దేవతలను బ్రార్థించుచుఁ దదర్థబోధకములగు మంత్రముల నుచ్చరించుచుఁ గాలనియమములు దృష్టపథ్వము మొదలగు

నిషిద్ధతిథులను విడిచి సుపుత్ర ప్రాప్తికై గర్భాధానము చేయుచున్నాఁడు. ఇక్కార్యము పరిశుద్ధమగు మనస్సుతో భగవంతుని ప్రతినిధివై ప్రజావృద్ధ్యర్థము మాత్రము చేయఁ బూనవలయును గాని విషయేచ్ఛతోఁ గ్రీడింపరాదు.

సర్వాత్మకో వాసుదేవః పురుష స్తు పురాతనః ।
ఇయం హి మూలప్రకృతి ర్లక్ష్మీ స్సర్వజగత్ప్రసూః ॥
పంచపంచాత్మతృప్త్యర్థం మైథునం క్రియతే తరామ్ ।
ఇయ మంబా జగద్ధాత్రీ పురుషో ఽహం సదాశివః ॥
పంచవింశతితత్త్వానాం ప్రీతయే మథ్యతే ఽధునా ।
ఇతి మంత్రానుభావస్యో న్మథనా క్రియతే యది ॥
తా వుభౌ పుణ్యకర్మాణౌ న దోషో విద్యతే తయోః ।
(బ్రహ్మాండపురాణము.)

జగత్సృష్టికిఁ బ్రకృతిపురుషులువలె స్త్రీపురుషులు సత్ప్ర జాభివృద్ధికొఱకుఁ జేరువారలు. ఇట్టి భావముతోఁగూడి మనో వికారములఁజెందక స్త్రీపురుషులు గూడినచో నుత్తమమగు జీవుఁడాకర్షింపఁబడి సత్ప్రజ యుత్పత్తియగుచున్నది. దీనినొక పరమధర్మముగా భావింపనగు.

ఇట్లు వర్తించు స్త్రీపురుషుల గర్భమునకువచ్చు శిశువునకు వలయు నన్నమయప్రాణమయ కోశములు పెరుగుచుండును కావున మూఁడవ మాసమున గర్భముననుండు పిండమును బరిశుద్ధముగఁ జేయుటకును, బుంస్త్వము గలుగఁ జేయుటకును బుంసవనమను సంస్కారము మంత్రములతో జరుపఁబడును. ఆపిదప నాలవమాసము గడువఁగా సీమంతోన్నయన మను

సంస్కారము సమంత్రకముగ జరుపఁబడు. గర్భము సంరక్షిం చునట్లును, పీడాపరిహారముకొఱకును, గర్భమునఁ బెరుగు చుండుశిశువునకుఁ బరిశుద్ధమగు తేజస్సు గలుగుటకును, అన్న మయప్రాణమయకోశములను నన్యోన్యసామరస్యము గలిగి పరిశుద్ధచలనము గలుగునటుల నీసంస్కార మొనరింపఁ బడును. ఇమ్మూఁడును గర్భపోషణ సంస్కారములు. శిశువు గర్భమున వర్ధిల్లుచుండఁగాఁ దల్లి సాత్త్వికాహారములను గొనుచు మంచిశీలముగలిగియుండవలయును. భయక్రోధము లకు నెడమీయక యుండునట్లామెను జక్కఁగ సంరక్షించవల యును. చుట్టుప్రక్కలనుండువారు పరుషవాక్యము లుచ్చరిం పక క్రూరసంకల్పములసంకల్పించక భయమును గలిగించు కార్యములు చేయక యుండవలయును. చుట్టుప్రక్కల నుండు వారు, ముఖ్యముగ నామెభర్త, బరిశుద్ధమనస్సు గలిగి యుండదఁగు. ఇట్లుండిన గర్భముననుండు శిశువు మంచియా రోగ్యమును, పరిశుద్ధతేజస్సును గలిగియుండును. ఈముఖ్య సంస్కారములు విడిచిన కారణమున నిక్కాలమునఁ బుట్టు శిశువులయం దారోగ్యలోపము, తేజోబలహీనతయుఁ గనఁ బడుచున్నయవి.

ఆవలి సంస్కారము జాతకర్మము. ఇది శిశువు భూపతనము కాఁగానే చేయఁబడునది. శిశువునకు దీర్ఘాయువు, సూక్ష్మ బుద్ధి, జ్ఞానము కలుగునటులఁ బ్రార్థించుచు మంత్రములఁ బఠిం చుచు, సువర్ణము దికత్తో దధిమధుఘృతములను గలిపి మధు

పర్కమము తండ్రి శిశువున కిచ్చును. జాతకర్మ హోమము సూతికాగృహమునకు దుష్టగణముల వలని బాధలఁ దొలఁగించి కాపాడును.

పదునొకండవదివసంబునఁ జేయఁబడు సంస్కారము నామకరణమనఁబడు. ఈమూడింటిలో జాతకర్మము సకాలమున జరుపఁబడుట లేదు. నామకరణమైనను విధ్యుక్తముగా నెల్లరు జరుపుట కానము. బంధువులు రాకపోవుట మొదలగు కారణములచేత సకాలమున నామకరణము చేయక కాలము గడుపుట గలదు. అట్లుకాలమున జరిపిన సంస్కారము మంచి ఫలము నీయఁజాలదు.

అయిదవమాసమునఁగాని యాపిదప వత్సరాంతము లోపలఁగాని యన్నప్రాశన మనునది జరుపఁదగు. ఇదియును సమంత్రకముగ జరుపఁబడవలయును. ప్రప్రథమమున నన్నము, ఓషధులరసము శిశువుభక్షించునట్లు చేయుచు నీయోషధులసారము శిశువునకు సదా మంగళకర మగుగాఁక యని దేవతలను మంత్రములతోఁ బ్రార్థించుచు, మధురాహారమును బెట్టవలయును. వత్సరాంతమునఁగాని, మూఁడవసంవత్సరమునఁగాని బ్రాహ్మణులకును, క్షత్రియుల కైదవసంవత్సరమునందును, వైశ్యులకు సప్తమసంవత్సరమందును, చూడాకరణముచేయుట వాడుక. అనఁగా శిఖయుంచవలయు. దీనితోడఁ గర్ణవేధనముచేయుటయు వాడుకగలదు. ఈసంస్కారమువలన శిశువు దేహము సదా సంరక్షింపఁబడుచున్నది.

మఱియును తలిదండ్రులనుండి వచ్చినపాపపుంజ మీసంస్కార
ములవలనఁ దొలఁగుచున్నది.

ఏవ మేవ శ్శమం యాతి బీజగర్భసముద్భవమ్ ।

(యాజ్ఞవల్క్యస్మృతి.)

జాతకర్మము మొదలు కర్ణవేధాంతముగల కర్మములు శైశ
వమునందు జరుపఁదగినవి. ఆపైసంస్కార ముపనయనసం
స్కారము, దీనితో శిశువునకుఁ గౌమారావస్థ యారంభ
మగు. అపుడు క్రీడాసక్తి వదలి విద్యాగ్రహణము చేయుటకు
యత్నించు. ఉపనయనమనఁగా గురువు సమీపమున చేరుట
యనియర్థము. దీనికి ప్రారంభము గురువునొద్ద గాయత్రీ
మంత్రోపదేశమును పొందుట, ఆపైన యనుష్ఠించదగిన ధర్మ
ముల సూచించు యజ్ఞసూత్రము (యజ్ఞఉపవీతము) మొద
లగు చిహ్నములను స్వీకరించుటతోఁగూడినసంస్కారము. ఇది
యే ద్విజత్వమునకుఁ గారణము. వేదవేత్తయగు నాచార్యునిచే
గాయత్రీమంత్రోపదేశమును బడయుటయే నిజమగు జన్మము.
ఈజన్మము జరామరణములులేనిజన్మము. అనఁగాఁ దల్లి
గర్భమునుండి గలిగినజన్మము జరామరణములకు లోఁబడు
నది. వేదవేత్తయగు నాచార్యునివలన గాయత్ర్యుపదేశము
వలనఁ బొందఁబడిన యీజన్మము నిజమైనదియు, జరామరణ
ముల కతీతమైనదియు నగు.

కామా న్మాతా పితా చైనం య దుత్పాదయతో మిథః ।
సంభూతిం తస్య తాం విద్యా ద్యద్యోనా వభిజాయతే ॥

ఆచార్య స్త్వస్య యాం జాతిం విధివ ద్వేదపారగః ।
ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యాసాఽ జరామరా ॥

(మనుస్మృతి)

[ఉపనయనమనఁగా నుత్తమోత్తమమగు గాయత్రి మంత్రోపదేశముద్వారా వటువు ఆచార్యుని సమీపమునకుఁ దేఁబడుటయని యర్థము.] ఉపనయనమున వటువునకు మంత్రముల నుచ్చరించుట కధికారముగలుగు. ఉపనయనమునకు ముందుఁ జేయఁబడు సంస్కారములయం దితరులు మంత్రోచ్చారణము చేసి బాలునిశరీరమును సంస్కరింతురు. ఉపనయనము మొదలు బాలుఁడు తానే మంత్రముల నుచ్చరించుటకును, వేదముల స్వేచ్ఛగాఁ బఠించుటకును అధికారము నొందుచున్నాఁడు. ఇదిమొదలు బాలుఁడు ఆచార్యునియధీనుఁడై విద్యాభ్యాసముచేయుచు కాలము గడుపవలయు. ఈస్థితియందు బాలుఁడు బ్రహ్మచారియనబడు. అనఁగా వేదములను బఠించుటయందే ప్రవర్తించువాఁడని యర్థము. బ్రహ్మచారి కౌపీనమును, మౌంజి, కృష్ణాజినము, జన్నిదము, దండము వీనిని ధరించవలయు. ఇవియొక్కొక్కటియు బ్రహ్మచారిధర్మములను బోధించునవియైయున్నవి. కౌపీనధారియగుటచేత నింద్రియవ్యాపారములయందు మనస్సుపోనీయకయుండఁదగుననియు, మౌంజిని తననడుముచుట్టు మూఁడుచుట్లుచుట్టుటచే వేదములయందలి సంహిత, బ్రాహ్మణము, ఉపనిషత్తులు వీనిఁ బఠించవలయు ననియును, కృష్ణాజినధారణముచే విషయ

వాంఛలను వదలి వైరాగ్యముగలిగియుండవలయుననియు బోధించుచున్న యవి. యజ్ఞోపవీతము తంతుత్రయరూపము (మూఁడు పోఁగులు) గనుండి యొకటిగ జుట్టఁబడియుండుట చేత బ్రహ్మాండమునందలి మూర్తిత్రయము, ఇచ్ఛాజ్ఞానక్రియలగు శక్తిత్రయము, సచ్చిదానందలక్షణములు, సత్త్వ రజస్తమస్సులను గుణత్రయము, మనోవాక్కాయికములగు కర్మత్రయము లోనగుత్రితయముల నన్నింటిని సూచించుచున్నయది. దండము వాగ్దండ మనోదండ కర్మదండములను త్రిదండములను సూచించును. అనఁగా మనోవాక్చేష్టలను మూఁడింటిని నియమనము చేసికొనవలయునని బోధించును.

ఈరీతిని గురుగృహమునందు విద్యాభ్యాసముచేయుచు సకల విద్యాపారగుఁడై గురుసాన్నిధ్యమునందు సద్గోష్ఠిచే సంస్కరింపఁబడి పరిశుద్ధుఁడై గురువునాజ్ఞనుబడసి ఆపైని సమావర్తనమను సంస్కారమును బొంద నర్హుఁడగుచున్నాఁడు. అపుడు గురువునకు దక్షిణను కృతజ్ఞతాసూచకముగ నొసంగి తదనుజ్ఞవడసి స్నాతకుఁడగుచున్నాఁడు. ఆమీఁది సంస్కారము వివాహము.

వివాహమైనది మొదలు గృహస్థుపై, వైదిక కర్మముల నొనర్చుట కధికారియై, ఆకర్మముల వలన ఋణత్రయమును బాపుకొనుచున్నాఁడు. వివాహ సంస్కారమును, గృహస్థువు చేయు సమస్తకర్మములును జీవుని బరిశుద్ధునిజేయుటకు సమర్థములైయున్నవి. వివాహము జీవునకుఁ గర్భాధికారమును

గలిగించుచుఁ బరిశుద్ధునిగఁజేయు వైదికసంస్కారముగాని భోగార్థమును వేడుకకొఱకును జేయఁబడునదికాదు. అది మొదలు భార్యాభర్తలు గృహాధిపతులై వియోగమునొందక గృహస్థధర్మమును జరుపుచు గురుశిష్యన్యాయమున నన్యో న్యానురాగముగలవారై అన్యోన్య సహకారులై పరిశుద్ధులై పరిపూర్ణులగుటకువిధింపఁబడినది వివాహము. మఱియు గృహ మునందు జాయాపతులు సదయహృదయులై గృహము నాశ్రయించియుండు నెల్లభూతములకు సుఖప్రదాతలగుచు, ధర్మమును బరిపాలించుచు నుత్తములగు పుత్త్రపుత్త్రికలను గని వారలను సన్మార్గమున శిక్షించి పెద్దవారలఁజేసి సంప్ర దాయమును దప్పకయుండునటుల ధర్మమునుబ్రవర్తింపఁజేయ వలయును. భార్యాభర్తలు ఇరువురును జ్ఞానముగలిగి ధర్మజ్ఞులై ధర్మము నించుకయైన నతిక్రమించకయుండుటచే నట్టివారి గర్భ మున నుత్తములగుజీవులు జననమొందుదురు. అట్లుగాక స్త్రీ పురుషులు కేవలకాముకులై, ఇంద్రియారాములై, ధర్మము నతిక్రమించి వర్తించుచుండినచో సత్సంతానము గలుగఁ జాలదు. క్రమక్రమమున నావంశమున నజ్ఞులగుజీవులు జన్మిం చుటవలన నధర్మము వృద్ధియగుటకుం గారణమగు. బ్రాహ్మ ణులు విద్యావిహీనులు జ్ఞానహీనులు నగుటయు క్షత్రియులు తేజోహీనులును బలహీనులును సాహసవర్జితులునగుటయు, వైశ్యశూద్రులు తమ తమవ్యాపారములయందు నేర్పఱులు కాకపోవుటయు వివాహసంస్కారమువలని యుత్తమప్రయో

జనము గమనించక పోవుటవలననే కలిగినవని దృఢముగఁ జెప్పనగు. ఎల్లవారును వివాహము ధర్మసాధనముగ నెఱింగి గృహస్థధర్మమును యథాశాస్త్రముగ జరిపినచోఁ దాము కృతార్థులగుటయకాక జ్ఞానవంతులును, తేజోవంతులును, ప్రాగల్భ్యము గలవారును, సూక్ష్మబుద్ధులును నగు జీవులకుఁ దగిన శరీరముల నుత్పత్తిచేయఁదగి తమ దేశమునకును, లోకమునకును, విశేషముగ మేలుగలుగఁ జేయఁదగినవారగుదురు.

ఆపైసంస్కారములలో ముఖ్యమైనది మరణానంతరక్రియ. ఆక్రియలు జీవుని శరీరమునుండి సుఖముగ వెడలించుటకును, సుకరముగ ప్రేతత్వము దొలగించి పితృలోకగతునిఁ జేయుటకును గాలక్రమమునఁ బితృలోకమునుండి స్వర్గలోకప్రాప్తునిఁ జేయుటకును సమర్థములయినవి. ఈవిషయము ప్రాగుక్తమే కాఁబట్టి యిచ్చట సంక్షేపముగ వ్రాయఁబడియె.

ఇట్లు సనాతనధర్మశాస్త్రమున గర్భోత్పత్తి మొదలామరణము నానావిధసంస్కారములచే జీవుఁడు ప్రతిజన్మమునఁ బరిశుద్ధుఁడగునట్లు విధింపఁబడియున్నది. ఈసంస్కారములన్నియు నుపాధులను బరిశుద్ధముచేయుట ద్వారా జీవుని కృతార్థుని జేయఁదగియున్నవి.

## యజ్ఞములు

ప్రపంచమునందుఁగల చేతనరాశియంతయు నైదుగణములుగ భాగింపఁదగు. ఎట్లనిన, దేవతలనియు, ఋషులనియు,

బిత్ృ దేవతలనియు, మనుష్యులనియు, నితర భూతకోటియనియు నైదు గణములుగ నున్నయవి. జీవుఁడు పాంచభౌతికమగు ప్రపంచమున బ్రవేశించి యనేక కోటిజన్మములనెత్తి మానవ జన్మమునుబొంది సంసారచక్రమునందుఁ బరిభ్రమించు కాల మంతయు నీయైదు గణములకు నానావిధములైన ఋణములకు లోనై యున్నవాఁడు. ప్రతిజన్మమునందును దనకుఁగలుగు స్థూలశరీరమునకుఁ గారణభూతులగు తల్లిదండ్రులు మొదలగు పెద్దలకును, మనుష్యజన్మము రాకపూర్వమును వచ్చిన వెనుకను బహుకాలము తనస్థూల సూక్ష్మోపాధులను నిర్మించుచు వాని నభివృద్ధిచేయుచునుండు సోమసదులు నగ్నిష్వాత్తులు బర్హిషదులు హవిర్భుక్కులులోనగు పితృదేవతలకును ఋణ స్థుఁడైయున్నవాఁడు. మఱియుఁ బ్రపంచస్థితిని బహువిధము లుగ వృద్ధిచేసి ప్రజాసౌఖ్యము కొఱకుఁ బాటుపడిన పూర్వు లందఱును గృతజ్ఞతకుఁ బాత్రులగుచున్నవారు. అనఁగా లోక మున వాసయోగ్యములుకాని యరణ్యక్షేత్రములను జక్క చేసి పట్టణగ్రామములనిర్మించి వాసయోగ్యములుగఁ జేసిన వారును, బాటసారుల యుపయోగముకొఱకు రాజమార్గము లను నిర్మించి గమనసౌకర్యమును గల్గించినవారును, గ్రామ ములందును రాజమార్గములచెంతను జనోపయోగముకొఱకు వాపీతటాకములను సత్రములను నేర్పఱచిన పుణ్యాత్ములును, పాంథుల యలజడినిదీర్చి విశ్రాంతిసుఖమునొసఁగ రాజమార్గ ముల ప్రక్కన ఛాయావృక్షపఙ్త్కులనునాటి యభివృద్ధిచేసిన

సత్పురుషులును, ధూమశకట తంత్రీవార్తాయంత్రముల నిర్మించి యుపకారమునొనర్చిన మహనీయులును, పాఠశాలలు వైద్య శాలలు దేవాలయములు మొదలగువానిని నిర్మించి ప్రజలకు శాశ్వతమగు మేలుచేసినవారును, నానావిధములగు శిల్పవిద్య లను గల్పించి యభివృద్ధినొందించి తమ వెనుకటివారలకుఁ బరంపరగా విచిత్రకార్యరచనా చమత్కృతిని గలుగఁజేసిన మహోపకారులును, కృషి వాణిజ్యముల యభివృద్ధికొఱకుఁ బాటుపడినవారును, వేయేల తమ వెనుకటివారలకు సర్వవిధ ముల నైహికసుఖముల నొసంగుటకుఁ బాటుపడినవారునునగు నందఱకును బ్రతిమానవుఁడును ఋణస్థుఁడై యున్నవాఁడు. ఇది పితృఋణ మనఁబడుచున్నది.

లోకములను బరిపాలించుచుఁ గాలానుగుణముగ వృష్టి, తుషారము (మంచు), గాలి, వేఁడిమి నిచ్చి సస్యములను, ఓషధివనస్పతులను రక్షించి వృద్ధిచేయుచు, లోకులకుఁ గర్మా నుసారముగ ఫలములనిచ్చుచు, నానావిధముల జనులకు మేలు చేయు నదృశ్యములగు దేవగణములకును మానవులు ఋణము తీర్పవలసినవారగుచున్నవారు. ఇది దేవఋణము.

మఱియు నాదినుండి పామరుల నుద్ధరించుటకు స్మృతులు, ధర్మశాస్త్రములు, పురాణములు లోనగుశాస్త్రగ్రంథముల నపారకరుణచే రచించి బోధించి సంప్రదాయమును పరంపరగ ప్రవర్తింపఁజేసినమహర్షులును, కాలక్రమమున నాయుత్తమ జ్ఞానము నశింపకయుండునట్లు గాపాడి లోకుల కుపదేశించుచుఁ

గాలవశమున నంతరించినధర్మములను బునరుద్ధారణముచేయుచుఁ గాలానుసారముగను బ్రజల యోగ్యతానుసారముగను సనాతనధర్మములను బోధకములగునటుల నవీనమార్గముల వివరించి గ్రంథముల రచించి లోకమునందలి ప్రజలకెల్లరకు జ్ఞానదాతలగు మహనీయులకును మనము ఋణస్థుల మగుచున్నారము. ఇది ఋషిఋణము.

ఇవిమూఁడును ఋణత్రయమని శ్రుతులయందు నిరూపింపఁబడియున్నది. ఈఋణత్రయమును బాపుకొనుట ప్రతిమానవునకు ప్రథమకర్తవ్యమని శ్రుతి బోధించుచున్నయది.

ఇవికాక యేకాలమునందుఁగాని మానవుల కన్యోన్యసహాయములేక సుఖ మెంతమాత్రము సిద్ధింపదు. కావున నొక్కొక్కఁడును మానవకోటికి నప్పుదీర్పవలసినవాఁడే యగుచున్నాఁడు. ఇది మనుష్యఋణము.

ఇంతియగాదు. బహువిధములగు పశుపక్ష్యాదులు సహితము మానవులకు సుఖము నొనఁగూర్చుచున్నవి. గోవులు మొదలగు జంతువులు దధిక్షీరఘృతంబుల నొసంగుటచేతను, వృషభములు అశ్వములు లోనగునవి ప్రయాణములందును, కృషియందును సహాకారములుగ నుండుటచేతను, హేయములగు ననేకజంతువులు సహితము భూమియందలి మురికిని దొలఁగించుటచేతను, మత్స్యములు మొదలగునవి బహువిధముల జలములను బరిశుద్ధముచేయుటచేతను, పక్షులు వృక్షములయందలి ఫలములనుదిని బీజములను బహుప్రదేశముల

వెదజల్లుటవలన వృక్షోత్పత్తిని జేయుటచేతను, మధురస్వనములచేతను నివియన్నియు మనుష్యుల ఋణగ్రస్తులనుగఁ జేయుచున్నవియే. ఇది భూతఋణము.

ఇట్లు ప్రతిమానవునకును అయిదువిధములగు ఋణములు సంసారమునుండి తరించి సన్న్యాసియగువఱకును వెంటనంటియే వచ్చును. ఈ ఋణవిముక్తికొఱకు నైదువిధములగు యజ్ఞములు విధింపఁబడియున్నయవి. ఇవియే పంచమహాయజ్ఞములని యెఱుంగఁబడుచున్నయవి. ఇవి నిత్యకృత్యములు, అనఁగాఁ బ్రతిదినమును జేయఁదగినవి. ౧ బ్రహ్మయజ్ఞములేక వేదయజ్ఞము. ౨ దేవయజ్ఞము. ౩ పితృయజ్ఞము. ౪ మనుష్యయజ్ఞము. ౫ భూతయజ్ఞము.

ఋషయః పితరో దేవా భూతా న్యతిథయ స్తథా ।
ఆశాసతే కుటుంబిభ్య స్తేభ్యః కార్యం విజానతా ॥
స్వాధ్యాయే నార్చయేత ర్షీ న్హోమై ర్దేవా న్యథావిధి ।
పితౄం శ్రాద్ధేన నౄనన్నై ర్భూతాని బలికర్మణా ॥

(మనుస్మృతి.)

తా. మునులు, పితృదేవతలు, దేవతలు, భూతములు, అతిథులు గృహస్థులకొఱ .కాశీర్వాచనములను జేయుచుందురు. అనఁగా మేలుకోరుచుందురనుట. జ్ఞానియగువాఁడు వారిఋణమును తీర్చుకొనవలయు. ఎట్లనఁగా వేదపఠనముచేత ఋషులను, హోమములచే దేవతలను, శ్రాద్ధము లొనరించుట

చేతఁ బితరులను, అన్నదానమున మనుష్యులను, బలిదానం బున భూతంబులను దృప్తిచేయవలయు నని తాత్పర్యము.

## బ్రహ్మయజ్ఞము

"స్వాధ్యాయేనార్చయేతర్షీన్"; "అధ్యాపనం బ్రహ్మ యజ్ఞః," అనుస్మృతివాక్యములవలన బ్రహ్మయజ్ఞ మనఁగా వేదశాస్త్రములను విధ్యుక్తముగాఁ బఠించుటయు, నితరుల కుపదేశించుటయు నని స్పష్టమగుచున్నయది. సనాతనములగు వేదములవలని మహోపకారమును వివరింపవలసినదిలేదు కదా!

మహనీయు లగుఋషులును పామరజనోద్ధారణార్థము స్మృతులను ధర్మశాస్త్రములను బరతత్త్వబోధకము లగు సూత్రములను భాష్యములను నేర్పఱచి జనులకు మహోప కారమును జేసియున్నారు. వారికి మనము ప్రత్యుపకృతిగాఁ జేయునది యొక్కటియును లేదు. కల్పాంతముదాఁక జనుల యోగక్షేమములఁ గోరుటయేకాని వారికి స్వార్థ మొక్కటి యును లేదు. వారు ప్రతిపాదించిన జ్ఞానము నశింపకుండునట్లు తామభ్యసించుటయు, నభ్యసించిన దానిని ఇతరులకు బోధిం చుటవినా వారిఋణమును దీర్చుమార్గము వేఱుగలేదు. కా వున గురువు శిష్యుల కనుజ్ఞయిచ్చి పంపునప్పుడు సంప్రదాయ ప్రవచనమున నప్రమత్తుఁడై యుండునట్టు లాజ్ఞాపించిపంపుట యాదినుండి సంప్రదాయముగ నేర్పడియున్నది.

స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ ॥

(తైత్తిరీయోపనిషత్. ౧-౧౧-౧.)

ఎల్లవారును దాము వేదములను, వేదరహస్యములను బోధించు వేదాంతగ్రంథములను బఠించుటయు, వానియందు బోధింపఁబడియుండు విషయముల నభ్యసించుటయు, నాధర్మముల నితరులకు బోధించి ధర్మముల ననుష్ఠించునట్లు చేయుటయు, వీనిరూపముగ సనాతనములగు ధర్మములఁ గాపాడుటయు నీమొదలగునవియే జ్ఞానదాతలగు మహర్షుల ఋణమును దీర్చుకొనుమార్గములు. దినదినము మధ్యాహ్నకాలమున నాలుగైదు వేదమంత్రములఁ బఠించి యుదకములవిడిచిన మాత్రమున బ్రహ్మయజ్ఞము పూర్తియాయె ననుకొనఁగూడదు. మఱియు బ్రహ్మయజ్ఞమన అధ్యయనము, అధ్యాపనము అని నపుడు కేవలము సంహితలుమాత్రము పఠించుటచాలదు. వేదరహస్యము లగువేదాంతార్థ ప్రతిపాదకములగు నుపనిషత్తులును, భాష్యములును, సూత్రములును మొదలగు గ్రంథములంగూడ గ్రహింపవలయు నని ప్రాజ్ఞు లగు వారి యభిప్రాయము. ఈరీతిని జ్ఞానమునుబోధించు గ్రంథములఁ జదువుటవలనను, జదివినవిషయముల నభ్యసించుటవలనను, ఇతరులకు బోధించుటవలనను, జనుల జ్ఞానవృద్ధికొఱకు బాటుపడిన మహర్షులఋణమును దీర్చికొనఁజాలును గాని వేఱువిధముల గాదు. ఇదియ బ్రహ్మయజ్ఞము. దీనికంగముగఁ జేయఁబడునవి దేవర్షి పితృతర్పణములు.

## పితృయజ్ఞము

"పితృయజ్ఞస్తు తర్పణమ్" "పితౄన్ శ్రాద్ధేన చార్చయేత్"; "ప్రజయా పితౄన్" అనువాక్యములచే పితృఋణముతీర్చికొను మార్గములు విధింపఁబడియున్నయవి. పితృదేవతలు ఆదినుండి ప్రజావృద్ధికొఱకును, ప్రజాక్షేమముకొఱకును, పాటుపడి ధర్మముల నడిపి లోకము నభివృద్ధిచేసినవారలు. ప్రతిమానవుఁడును మానవకోటిసౌఖ్యముకొఱకు పాటుబడుచు, ధర్మకార్యములఁజేయుచు, తాను ప్రారంభించిన ధర్మకార్యముల నెఱవేర్చుటకును, కొనసాగించుటకును, అభివృద్ధి చేయుటకును దగిన సత్ప్రజ నుత్పత్తిచేయుచుఁ బితరులఋణములఁతీర్చుకొనవలయును. దీనికై వివాహముచేసికొనుటయు, భార్యాభర్తలు యథావిధి గృహస్థధర్మము నడుపుచు, భక్తిజ్ఞానముల నభ్యసించుచు, ధర్మస్వరూపులగుచు, ఉత్తములగు జీవులఁ దమగర్భమున జన్మించుటకుఁ దగినమార్గమున నడచుచు వర్తించవలెను. తమపూర్వు లారంభించిన సత్కార్యమును శ్రద్ధతోడ కొనసాగించి వారల మనోభీష్టములఁదీర్చుచు, వారల మరణానంతరమునందును వారలఁ దృప్తులంజేయుచు రావలెను. అట్లు వారలకు మరణానంతరక్రియలు సలిపి ఊర్ధ్వలోకయాత్రకుఁదగిన యుత్తరక్రియలుచేసి సుఖముగఁ బితృలోకప్రాప్తియు,తదనంతరము క్రమమున స్వర్గలోకప్రాప్తియుఁ గలుగునటుల శ్రాద్ధక్రియలు జరుపవలెను. నిత్యమును బితరుల నుద్దేశించి వారలకుఁబరలోకసుఖప్రాప్తి సాధనముగఁ దర్పణ

ములను, నైమిత్తికములగు మాసికాబ్దికములగు శ్రాద్ధములఁ జేయు సత్ప్రజను గనుచు రావలయు. ఈరీతిఁగాని పితృ ఋణము తీరదు.

## దేవయజ్ఞము

దేవఋణము—"హోమైర్దేవాన్యథావిధి" హోమ ములవలన దేవతల నర్చింపవలయును. గృహస్థధర్మము ప్రారంభించినది మొదలు జీవుఁడు వైదికకర్మముల నొనర్చుట కర్హుఁడగు. వివాహకాలమున స్వీకరించిన యగ్నులను గృహమున వ్రేల్చుచు గృహమేధియగుచున్నాఁడు. నిత్యమును సర్వదేవతలకుం బ్రతినిధియగు నగ్ని దేవునియందు హోమము సలిపి దేవతలం దృప్తులుగఁ జేయు. అగ్నియందు వ్రేల్పఁబడిన హోమద్రవ్యము తప్తమై సూక్ష్మరూపముగమాఱి యదృశ్యులగు దేవకోట్ల కాహారమగుచున్నయది. కావుననే యగ్నికి దేవముఖుఁడనియును, దేవతలకు బర్హిర్ముఖులనియును నామములు గలవు. హోమముచేయఁబడిన ద్రవ్యముచేత దేవతలు దృప్తులయి సకాలమున వర్షము మంచు మొదలగు వానినిచ్చి సస్యములు మొదలగువానిని వృద్ధిచేయుదురు. దేవతల యనుగ్రహముచేఁగాని సకాలమున వలయునంతవర్షములు మొదలగునవి గలుగవు. వారియనుగ్రహము లేనిచోఁ గొన్ని కాలముల నతివృష్టియు, మఱికొన్ని కాలముల ననావృష్టియు, కొన్ని వేళల నతిక్రూరములగు తాపములు, కొన్ని వేళల వలయు

నంత సూర్యరశ్మి లేకపోవుటయు, నొకకొన్ని సమయముల ఝంఝూమారుతము వీచుటయు, మఱొకకాలమున గాలిలేక పోవుటయు నీమొదలగునట్టి యీతిబాధలు కలుగుచుండును. ఇక్కాలమున దేవతాప్రీతికరములగు హోమములు యజ్ఞములు విధ్యుక్తప్రకారమునఁ జేయుటయరుదగుటంబట్టియే లోకమున నానావిధములగు క్షోభలు గానవచ్చుచున్నవి. దేవతలం దృప్తులంజేయు కార్యములచేఁ బ్రజాక్షేమమును, ప్రజాభివృద్ధియును గలుగునని భగవంతుఁడు గీతాశాస్త్రము నందు బోధించియున్నాఁడు.

> సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః ।
> అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్ ॥
> దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః ।
> పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ ॥
> ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।
> తైర్దత్తానప్రదాయైభ్యో యోభుఙ్క్తే స్తేన ఏవ సః ॥
>
> (భగవద్గీత. ౩-౧౦, ౧౨.)

"ప్రజలను సృజించుకాలమున వారితోడ యజ్ఞములను గూడసృజించి యీయజ్ఞములవలన మీరు వృద్ధినొందుదురు గాకయని బ్రహ్మదేవుఁ డాదియందే పలికెను. దేవతలు యజ్ఞములచేఁ దృప్తులయి మిమ్ముఁ దృప్తిఁజేయుదురు. పరస్పరము తృప్తులయి పరమశ్రేయమును బొందుదురుగాక! దేవతలు యజ్ఞములచేఁ దృప్తులై యిష్టభోగముల నిచ్చెదరు. వారల వలనఁ బొందినభోగములలో నొకభాగము నాదేవతలకు

నర్పింపక సర్వమును భుజించువాఁడు దొంగతో సమానుఁడు" అని తాత్పర్యము.

కావున దేవతానుకూల్యములేక లోకమున సస్యములు మొదలగునవి యభివృద్ధినొందజాలవు. దేవతలు సకలభోగములు నిచ్చువారలు గావున నిత్యనైమిత్తికములగు యజ్ఞములను జేయుటచే దేవతల ఋణమును దీర్పవలయును.

గృహస్థువు దినదినమునఁ జేయు నౌపాసనము, వైశ్వదేవములోనగు హోమములు నిత్యకర్మములుగ విధింపఁబడినవి. ఇవి కామ్యకర్మములు కావు. ఇవిగాక మఱికొన్ని యజ్ఞములు, జ్యోతిష్టోమము లోనగునవి శ్రౌతయజ్ఞములని యెఱుంగఁబడుచున్నవి. వానిని గుఱించి ముందు విస్తరింపఁబడును.

ఇవియునుంగాక శ్రీభగవద్గీతాశాస్త్రమున నాల్గవయధ్యాయమున శ్రీకృష్ణుఁడు పెక్కుయజ్ఞములను సూచించియున్నాఁడు. అందుఁ బ్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, నియతాహారము, స్వాధ్యాయము, జ్ఞానయజ్ఞము, ద్రవ్యయజ్ఞము తపస్సు మొదలగునవి యన్నియుఁ జెప్పఁబడియున్నవి.

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణోముఖే ॥

(గీత. ౪-౩౨.)

సర్వే ప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥

(గీత. ౪-౩౦.)

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః ॥

(గీత. ౩-౧౩.)

ఇవియన్నియు శ్రుతిచోదితములైన యజ్ఞములేయనియును, ఈయజ్ఞములం జేయుటచేత సమస్తపాపములనుండి విడువఁబడుదురనియు నొక్కి చెప్పియున్నారు. వీని యన్నింటిలో జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమనియును బోధించియున్నారు. తక్కిన యజ్ఞములన్నియు నల్పఫలముల నిచ్చునవియేగాని శాశ్వతమగు పరమపురుషార్థము నిచ్చునవిగావు. ఇవ్విషయము ముండకోపనిషత్తునందు స్పష్టముగ నిరూపింపఁబడియున్నది. అందనేక క్రతువులను సూచించి వాని ఫలములను జూపి, యాపిదప నాఫలములన్నియు నల్పములేయని వివరింపఁబడియున్నది.

> ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా ।
> అష్టాదశోక్తమవరం యేషుకర్మ ॥ (ముండకము.)

> శ్రేయాన్ ద్రవ్యమయా ద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప ।
> సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥
> (గీత. ౪-33.)

ఈయజ్ఞములవలనఁ గలుగుఫలములు దృఢములుగాని తెప్పకొయ్యలతో సమానములు. అల్పఫలముల నిచ్చునవి. ద్రవ్యసాధ్యములగు యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠము. కర్మములన్నియును జ్ఞానమునందు పరిసమాప్తిచెందును. జ్ఞానయజ్ఞము సంసారసముద్రమును దరించుటకు దృఢమైన నావతో సమానము. ఇట్లు మూఁడువిధములగు యజ్ఞములను జేయుటవలన దేవర్షి పితృఋణములు దీరును.

## మనుష్యయజ్ఞము

ప్రతిమానవుఁడును మానవకోటికి ఋణస్థుఁడై యున్న వాఁడని ముందే సూచించితిమి. మానవులందఱును అన్యోన్య సహాయములేక లోకమున జీవించుటయే యసాధ్యమైయుండ సుఖముగనుండుట యసాధ్యమని చెప్పవలయునా? ఇంతియ కాదు. మానవులును సమస్తభూతములును జగదేకపితయగు నీశ్వరునుండియే వెలువడిరనియు నాయీశ్వరుని విరాడ్రూప మునందలి యవయవము లన్యోన్యసహకారులై వర్తించు నటుల మానవులెల్ల ఇతరుల సుఖముకొఱకుఁ బాటుపడి పరస్పరఋణములఁ దీర్చుకొనవలయుననియు యోగదృష్టిగల మహర్షులు విధించియున్నారు "నృయజ్ఞోఽతిథిపూజనమ్" "న్యానన్నైరర్చయేత్" అనువాక్యములు మానవకోటికిం గల ఋణముఁదీర్చుకొనమార్గముల విధించుచున్నయవి. మనుష్యయజ్ఞమన నతిథిపూజనము. అతిథియన భోజనసమయ మున నన్నార్థియై వచ్చిన మనుష్యుఁడు.

> ఇష్టో వా యది వా ద్వేష్యో మూర్ఖః పండిత ఏవ వా ।
> సంప్రాప్తో వైశ్వదేవాంతే సోఽతిథి స్స్వర్గసంక్రమః ॥

తా. మిత్రుఁడుగాని శత్రువుగాని మూర్ఖుఁడుగాని విద్వాం సుఁడుగాని వైశ్వదేవము కడపట వచ్చినవాఁడు స్వర్గసుఖము నీజాలును అని అన్నార్థులయి వచ్చు బీదలనందఱిని సోదరు లుగ భావించి వారి కన్నదానము చేయుఁదగు. దూరదేశము

నుండి మార్గము నడిచి శ్రమచెంది భోజనసమయమునకు వచ్చి చేరుమనుష్యుఁడు ముఖ్యముగఁ బూజ్యుఁడు. అట్టివాఁడే యతిథియని యెఱుంగఁదగు. ముందువచ్చినవాఁడు గాదు.

దూరాధ్వోపగతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితమ్ ।
అతిథిం తం విజానీయా న్నాతిథిః పూర్వమాగతః ॥

అట్టి పురుషుఁడుగాని, స్త్రీగాని ప్రత్యక్షపరమేశ్వరస్వరూపముగ భావింపఁదగును. అట్టిమనుష్యుని కులగోత్రములు సయితము విచారింపనక్కఱలేదు.

న పృచ్ఛే ద్గోత్రచరణే న స్వాధ్యాయం శ్రుతం తథా ।
హృదయే కల్పయే దేవం సర్వదేవమయో హి సః ॥

"అన్నస్య క్షుధితం పాత్రమ్" అను పురాణోక్తి యెల్లరకుఁ దెలిసినదియే. తెలియఁదగినదియే. అట్లు ఇల్లు జేరిన యతిథిని ముందు పూజించి, ఉదకములిచ్చి, యాసనమునఁ గూర్చుండఁబెట్టి, ఆదరముతోడ మృదుమధురోక్తులఁ గుశల మడిగి, అన్నోదకములనిచ్చి తృప్తునిం జేసి పనుపఁదగు. ఇట్లొకరినిబూజించిన మానవకోటిని బూజించి తృప్తి జెందించి నట్లయగు. అన్నోదకము లీయవలయు నన్నఁగా వచ్చినవాని కావశ్యకములగు నవియన్నియు నీయఁదగినవని గ్రాహ్యము. అనఁగా నన్నోదకములు మాత్ర మిచ్చినం జాలుననుకొనరాదు. వస్త్రహీనుఁడై యుండిన యథాశక్తిగ వస్త్రదానముచేయఁదగు.

ఒకవేళ రోగార్తుఁడై యుండినచో నౌషధమునిచ్చి యుపచరించి పంపఁదగును. కేవల మావశ్యకము లనఁదగు వాంఛలన్నియుఁ దీర్చి పంపఁదగునని యర్థము.

ఇట్లతిథిసత్కారము పంచమహాయజ్ఞములలో నొక్కటిగఁ జెప్పఁబడి యుండుటయేగాక అన్నిటిలో శ్రేష్ఠమనిగూడ నెన్నఁబడుచున్నది.

> స్వాధ్యాయే నాగ్నిహోత్రేణ యజ్ఞేన తపసా తథా ।
> న చా ప్నోతి గృహీ లోకాన్ యథా త్వతిథిపూజనాత్ ॥

ఇందు వర్ణభేదములుగాని, ఆశ్రమభేదములుగాని చూడనవసరము లేకపోవుటయేగాక నిజముగ ఆఁకలిగొని దూరాధ్వగుఁడై వచ్చినవాఁడు అంత్యజుఁడైనను, పంచమహాపాతకులలోనొకఁడైననుగూడ నాదరింపఁదగినవాఁడని స్మృతులయందు దృఢముగ జెప్పఁబడియున్నది.

> పాపో వా యది చండాలో విప్రఘ్నః పితృఘాతుకః ।
> వైశ్వదేవే తు సంప్రాప్తే సోఽతిథి స్స్వర్గసంక్రమః ॥

ఇవ్విధమగు నతిథిపూజనము సోమయాగము మొదలగు వానితో సమానమనియు, నిక్కాలమునఁ దఱచుగ యోగ్యత చాలని ఋత్విక్కులు మొదలగు వారిని గొని విధిహీనముగను, మంత్రహీనముగను జాలినంత యన్నదానము లేకయు విధ్యుక్త దక్షిణల నీయకయుఁ జేయఁబడు యజ్ఞములకంటెను, పంచమహాయజ్ఞములు, వానిలో ముఖ్యముగ నతిథిపూజయే,

శ్రేష్ఠమనియును స్మృతులయందు స్పష్టముగఁ బ్రకటింపఁబడి యున్నది.

> యత్ఫలం సోమయాగేన ప్రాప్నోతి ధనవాన్ ద్విజః ।
> సమ్యక్పంచమహాయజ్ఞైర్దరిద్ర స్తద వాప్నుయాత్ ॥

ఈసందర్భమున నొక్క విషయము ముఖ్యముగ యోచింపఁదగియున్నది. దూరమునుండి వచ్చి యన్నార్థియగువాఁడు పూజ్యుఁడగు నతిథియని స్మృతులయందు నిరూపింపఁబడి యున్నది. ముందుగ నాహ్వానము చేయఁబడిన సత్పురుషుఁడు నయితము పూజ్యుఁడగు. అట్లుగాక

> నైకగ్రామీణ మతిథిం సంగృహ్ణీత కదాచన ।
> అనిత్యమాగతో యస్మా త్తస్మా దతిథిరుచ్యతే ॥

ముందు పిలువఁబడకయు, దూరమునుండి మార్గవశమున రాకయు, గ్రామమునందేయుండియు, దార్ఢ్యము గలిగియుండియు నుదరపోషణమునకైనను బనిచేయనొల్లక వృథాకాలయాపనముచేయుచు, గర్వ్యములగువృత్తులం గాలముఁగడపుచు సోమరులై భోజనసమయమునకుఁ జక్కఁగవచ్చి యతిథిపూజన మపేక్షింప నట్టివారు పూజ్యులని వారినిఁ బూజించినచో, జను లనేకులు స్వధర్మచ్యుతినొంది భూభారహేతువులగుదురు. మఱియు యుక్తాయుక్తవిచారణము లేక దానములు సేయుటచేత నీదేశమునఁ బలువురు గృహస్థులుగనుండియుఁ దమకుటుంబపోషణమునకైనను బాటుపడరు. కాలక్రమమున నిట్లు పెక్కండ్రు బ్రాహ్మణు లధ్యయనాధ్యాపనాదికర్మములను

విడిచి శమదమాదిసుగుణసంపత్తియుఁ బరోపకారబుద్ధియు లేక గృహస్థవృత్తినిమాని భిక్షాటనము సలుపుదురు. దానం జేసియే యిప్పుడును బ్రాహ్మణవృత్తియన భిక్షాటనమని యనేకులచే నెన్నఁబడుచున్నది.

బ్రాహ్మణులు శాస్త్రీయమగు తమవృత్తులను వదలి యాచించుచుండుటయు, మఱికొందఱు క్షత్రియులమనిపించుకొనుచు వందిమాగధులవలె నితరుల స్తుతిచేయుటయే తప్ప వేఱువృత్తిలేక కుటుంబపోషణముకొఱ కితరుల నాశ్రయించి యుండుటయు, వైశ్యశూద్రప్రముఖులగువా రనేకులు బిచ్చమెత్తుటయే వృత్తిగనెన్నుటయు నీమొదలగు నధర్మ వ్యాపారములు కారణములుగా నీదేశము దురవస్థకువచ్చెను. ఈవిషయమును దేశాభిమానులందఱును జక్కఁగఁ బరిశీలించి యన్నాది సమస్తదానములయందు యుక్తాయుక్త వివేచనము చేయందగు. అట్టివివేచనము లేనిదానమున సోమరితనము వర్ధిల్లును. కావున వారలయందుండు తమోగుణమును బోఁగొట్టి యుద్యోగవంతులుగఁ జేయుట వారికి నుత్తమమగు లాభముచేయుటయేగాని వేఱుగాదు. అట్టివారికి యుక్తమగు సాయముచేయుచు, నుదరపోషణసామర్థ్యముగూడ లేని యంగహీనులు రోగపీడితులు, అనాథలు లోనగువారికి వలయు సహాయముచేయుచు, దయార్ద్రహృదయులై, దేశాభిమానులై, పరోపకారతత్పరులై, మనుష్య యజ్ఞమును జగ్గఁగ జరుపవలయును.

## భూతయజ్ఞము

"భూతాని బలికర్మణా" "బలిర్భూతౌ" అనువాక్యములు భూతముల ఋణము తీర్చుకొను మార్గములఁ జూపుచున్న యవి. పశుపక్ష్యాదులుసహితము మానవకోటికుపయుక్తములుగ నున్నవనియును, సర్వభూతములు నాత్మస్వరూపములే యనియు, నాత్మేతరపదార్థమొక్కటియుఁ గానరాదనియును బెక్కుమాఱులు నిరూపింపఁబడియెఁ గదా! అట్టిసర్వభూతములతో నైక్యభావమును దృఢముగ మానవులకుఁ గల్గించి భూతతృప్తిచేయుటకొఱకు బలిప్రదానమును సర్వజ్ఞులగు మహర్షులు విధించియున్నారు. పక్వమయిన యన్నమును ఇంటిచుట్టును నలుదిక్కుల నుంచవలయును. దీనివలన నింటిచుట్టును దిరుగుచుండు హీనజాతిజనులకును, శునక, వాయస, క్రిమి, కీటకాది సమస్తభూతములకు నుపయుక్తమగును.

శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్ ।
వాయసానాం క్రిమీణాం చ శనకైర్నిర్వపేద్భువి ॥

(మనుస్మృతి.)

కుక్కలు, చండాలురు, శ్వపచులు (కుక్కమాంసమును భక్షించు పరమహీనజాతులు), పూర్వపాపములవలనఁ బెద్ద రోగముతో బాధపడుజనులు, వాయసములు, పురుగులు మొదలగు వానికొఱకు అన్నమును భూమిపై మెల్లఁగనుంచవలయును. అనఁగా శ్రద్ధతోడను, భక్తితోడను, పరిశుద్ధ

స్థలమున నుంచవలయును గాని భూమిపై విసరివేసి యన్నము మంటిలోఁగలిసి చెడిపోవునట్లు వేయఁగూడదు. ఇక్కార్యము సయుతము భక్తిశ్రద్ధలతోడ భగవంతునకు నివేదనము చేయు రీతిని జేయవలయునని విధించుచు శాస్త్రములు సర్వభూతములందును ఈశ్వరసాన్నిధ్యమును బోధించుచున్నయవి.

మనుష్యయజ్ఞమగు నతిథిపూజనము దీని యనంతరము చేయఁదగినది.

ఇట్లు మనుష్యులు తమఋణములం దీర్చుకొనుటకు నైదు మహాయజ్ఞములు విధింపఁబడి యున్నయవి. ఇవియన్నియు నిత్యకర్మములు. అనఁగాఁ బ్రతిదినమును గృహస్థువగు పురుషుఁడు చేయవలసిన కర్మములు. ఇందెద్ది లోపించినను పాపహేతువని దృఢముగఁ జెప్పఁబడి యున్నది. ఈయజ్ఞములను జరిపిన పిదప మిగిలిన యన్నము యజ్ఞశిష్టామృత మనియు మేధ్యమనియు నెఱుంగఁబడు. అన్న మిట్లు పరిశుద్ధముగానిచో నమేధ్యమని యెఱుంగఁబడును. ఈయాహారము తామసాహారమనంబడు.

ఉచ్ఛిష్ట మపి చా మేధ్యం భోజనం తామసప్రియమ్ ॥

(గీత. ౧౭ అ. ౧౦ శ్లో.)

అదృశ్యులై సంసారచక్రమును ద్రిప్పుచు నెల్లవిధముల నీశ్వరాజ్ఞాప్రవర్తకు లగు దేవకోటులకును, మానవకోటికిని, తిర్యగ్జంతువులగు పశుపక్ష్యాదులకును మఱియుఁ గ్రిమికీటకాదులగు సమస్తభూతములకుం గల యైక్యభావము నిర్విధముగఁ

దత్త్వదర్శులగు మహర్షులు వెల్లడిగ బోధించియున్నారు. ఈ పరస్పరసంబంధమును దెలిసికొని సమానజనములం దన్యోన్యభావమును, ఉత్తములగు దేవతాదులయందు భక్తియు, హీనులయందు దయయుఁ గలిగి ఋణములం దీర్చియెల్లవారును గృతార్థులుగాఁదగు.

సకలజనులును వర్ణాశ్రమవిభాగమునకు లోఁబడినవారయినను, కానివారైనను నీధర్మముల మనసునకుం దెచ్చుకొనఁదగు. ఈ కర్మములు హిందూదేశమున ద్విజులగువారికి మాత్రమే విధింపఁబడియుండ నెల్లవా రెట్లు లీకర్మముల నెఱవేర్చు వారను సందియ మక్కఱ లేదు. ద్విజులగువారలు బహుకాల పరంపరానుష్ఠితములగు నాహారవిహారనియమములకు లోఁబడి కొంతవఱకుఁ బరిశుద్ధములగు నుపాధులం గలిగి యుండువా రగుటంబట్టి స్వతంత్రముగ మంత్రములం బఠించుటకును, వినుటకును, దగియున్నవా రని విధింపఁబడియున్నను ద్విజులు గానివారుకూడ వేదమంత్రములు లేక 'నమ' యను మంత్రమున నిక్కార్యము లన్నియుఁ జేయుట యావశ్యకమని విధింపఁబడియె యున్నయది.

> శూద్రస్య సన్నతి శ్శౌచం సేవా స్వామి న్యమాయయా ।
> అమంత్రయజ్ఞో హ్య స్తేయం సత్యం గోవిప్రరక్షణమ్ ॥
> (భాగవతము.)

> నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్ సహాపయేత్ ॥
> (విష్ణుపురాణము.)

భూతముల కొండొంటికిం గల ఋణముల నంగీకరించి ఋణములం దీర్చుకొనుటయు, సర్వభూతములయందు భ్రాతృభావము గలిగి వానికి హితముఁ గోరుటయు, యథాశక్తి భూతహితము చేయుటయు, ఎవ్వరినిఁగాని ద్వేషింపకుండుటయు ముఖ్యాంశములు. ఇవియే యజ్ఞములు. ఇవిలేనిచోట సమంత్రకముగఁ జేయుకర్మములు సహితము అల్పప్రయోజకములు. జన్మమాత్రమున ద్విజులుగనుండియు, ఆహారాదినియమముల ననుష్ఠింపనివారలు మంత్రములతోడ నొనర్చుట కనర్హులేయని యెన్నఁదగు. నియమములఁ బూర్ణముగ ననుష్ఠింపక పూర్వపు సద్బ్రాహ్మణులవలెఁ గొన్నిమంత్రములఁ బఠించుటచేతను, గొన్నికర్మములు చేయుటచేతను అనేక లిక్కాలపు బ్రాహ్మణులు రోగపీడితులును దేజోహీనులును నగుటకుఁ గారణమైయున్నది.

మహర్షులు సూక్ష్మలోకములను జూచినవారు గనుక ఆలోకములందును సూక్ష్మశరీరములయందును మంత్రపఠనమువలనఁ గలుగు ఫలముల నెఱింగినవా రగుటంబట్టియు నపారకరుణచే మంత్రముల నుపయోగింప నర్హులెవరో యనర్హులెవరో యని విధించిరికాని వేఱుకారణముల నట్లు విధించిరనియెంచి వారియందు దోషము నారోపింపరాదు. మహాత్ములు 'మంత్రద్రష్టారః' అనఁగా మంత్రములను జూచువా రని పిలువఁబడుటకుఁ గారణమిదియ. మంత్రోచ్చారణముచేఁ గలుగు ఫలములును, అనరు లుచ్చరించుటచేఁ గలుగు కీడును బూర్వము

విస్తరింపఁబడినదియే. దయాసముద్రులగునట్టి మహాత్ముల యందు దోషారోపణము చేయక యీ జన్మమున మనస్సును, ఇంద్రియములను, కాయమును నియమించికొని రాఁగల జన్మ ములయందుఁ బరిశుద్ధములగు నుపాధులను బొంద యత్నింప వలయు.

బ్రహ్మాండమున జన్మించినమాత్రముననఁ బై నిరూపింపఁ బడినరీతిని బ్రతిమానవుఁడును సకలభూతములకు ఋణస్థుఁడై యుండఁగా వాఁ డుదరపోషణముకొఱకు జేయుకర్మముల యందు ఇతర భూతములకుఁ గొన్నింటికైనను హానిచేయక తీరదు. గృహసమ్మార్జనమునందును, గృహోపకరణములు కడుగుటయందును, శాకములు మొదలగువానిని గత్తిపీఁటతో ఖండించుటయందును, బ్రాయ్యియం దింధనములు మంట చేయుటయందును, వడ్లు మొదలగుధాన్యముల దంచుటయం దును మఱియు ననేకకార్యములయందు ననేకభూతములకు హింసచేయకతీరదు. ఇట్టి పాపము సర్వజనుల నంటియే యుం డును. ఇవి ముఖ్యముగఁ బంచసూనము లని హిందూధర్మ శాస్త్రములయందుఁ బిలువఁబడుచున్నవి.

ఖండినీ పేషిణీ చుల్లీ మార్జనీ చైవ కుంభినీ ।
పంచసూనా గృహస్థస్య నతై స్స్వర్గో విధీయతే ॥

ఈపంచసూనముల పరిహారముకొఱకు వైశ్వదేవమను పేరం బరఁగు హోమము గృహస్థులకు విధింపఁబడి యున్నది. ఈ హోమమువలన సర్వభూతములఁ బోషించి యభివృద్ధి

చేయు దేవతలు తృప్తులగుదురు. వారు తృప్తులగుటచేత వారిచేఁ బోషింపఁబడు భూతముల కభివృద్ధికలుగును. ఇట్లు అల్పహింసలును బరిహరింపఁబడు.

ఇదియును గృహస్థునకు విధింపఁబడిన నిత్యకర్మములలో నొకటి.

## గృహస్థునిత్యకృత్యములు

దినదినమున గృహస్థు డాచరింపఁదగు దినచర్య యెట్టిదో చూతము.

బ్రాహ్మముహూర్తమున మేల్కాంచి ప్రాతఃకాల క్రియలం దీర్చుకొని స్నానం బొనరించి సూర్యోదయమునకు ముందే సంధ్యావందన మొనరించి భగవంతుని ధ్యానము చేయవలెను. వెనుక ప్రాతఃకాలమునఁ జేయఁదగు నగ్నిహోత్రమును సలిపి దేవతలను గురువులను బూజించి కొంతకాలము వేదములను వేదాంగములను బఠించవలెను. పిదప కుటుంబపోషణమునకు వలయు ద్రవ్యమునార్జించుటకుం బోవలయును. తలిదండ్రులు, ఉపాధ్యాయులు, ఆచార్యులు మొదలగువారికిని, దారసుతులకును, గృహమున కేతెంచు బంధుమిత్రులకును, అతిథ్యభ్యాగతులకును, నిరాధారులు రోగపీడితులునయి స్వోదరపోషణసామర్థ్యములేని బీదలకును మఱియు గృహమునాశ్రయించుకొని తిరుగుచుండు జంతువులకును శరీరసంరక్షణమునకు వలయునంత మాత్రము సంపాదించి గృహమునకు మరలి వచ్చి మాధ్యాహ్నిక క్రియలం దీర్చవలయును. మధ్యాం

దిన సంధ్యావందనమును వైశ్వదేవమును జేసి దేవర్షి పితృ గణములను దృప్తియగునట్లుచేసి యాసమయమునకు వచ్చిన యభ్యాగతులం బూజించి యన్న మిడి తృప్తులంజేసి భూత బలియు నొసంగి పిదప దాను భుజింపవలయు. వెనుక కొంత తడవు పురాణేతిహాసములను ధర్మశాస్త్రములను బఠించి స్వ తంత్రముగఁ జదువుకొనఁజాలని వారలకు వానియర్థములను బోధించి యనంతరము దేవతాగృహములనుగాని సత్పురుషుల గోష్ఠినిగాని సందర్శించి మిత్రులతోడఁ గొంతతడవు ప్రొద్దు పుచ్చుకొని సాయంసంధ్యాకాలము నతిక్రమింపక యిల్లుసేరి సాయంసంధ్యావందనాగ్ని హోత్రముల నొనరించి భుజించి విశ్రమింపఁదగు.

> భుక్త్వా తు సుఖ మాస్థాయ త దన్నం పరిణామయేత్ ।
> ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణి చా భ్యసేత్ ॥
> వృథా వివాదవాక్యాని పరివాదం చ వర్జయేత్ ।
> నాఽసచ్ఛాస్త్ర వినోదేన సన్మార్గార్థవిరోధినా
> . . . . . . . . . . .
> అహశ్శేషం సమానీతశిష్టైరిష్టై శ్చ బంధుభిః ॥

ఇట్లు దినమంతయును సత్కర్మముల నొనరించుటయందును, శరీరపోషణమునకు వలయు కృత్యమునందును గడపవలయును గాని దూష్యసంభాషణమునందుఁ గాని దూష్యవృత్తులయం దుఁ గాని దుష్టజనుల సాంగత్యమునఁ గాని కాలక్షేపము చేయరాదు.

ఇక్కాలమునకుఁ దగినరీతిని పైసూచింపఁబడిన మార్గము నల్పముగ మార్చుకొని దినచర్యను జరుపఁదగు. బ్రాహ్మ ముహూర్తమున మేల్కాంచి సూర్యోదయమునకు మున్ను సంధ్యావందనము, భగవద్ధ్యానము వారివారి యాచారప్ర కారము చేయఁదగు. పిదప గొంతసేపు సద్గ్రంథములఁ జదివి యితరులకు బోధించుటయందు గడుపఁదగు. అనంతరము గృహకృత్యములయందుఁ గొంతకాలముగడపి మాధ్యాహ్నిక క్రియలను జరిపి భుజించి రాజకీయకార్యములు మొదలగు నుద్యమములకుఁ బోనవకాశమున్నది. కార్యాలయములనుండి మరలి సాయంకాలకృత్యములం దీర్చికొని కొంతకాలము సద్గ్రంథములఁ బఠించి సద్గోష్ఠియందుఁ గాలము గడపి గృహ కృత్యములం దీర్చి భుజించి యల్పకాలమైనను భగవంతుని మనస్సున నిలిపి ధ్యానించి నిదురింపఁదగు.

> శయ్యా మధిష్ఠాయ రాత్రిసూక్తం జపిత్వా విష్ణుం నమస్కృత్య ఇష్టదేవతాస్మరణం కృత్వా సమాధి మాస్థాయ అన్యాన్ శైవవైది కాన్ మంత్రాన్ సావిత్రీం చ జపిత్వా స్వపేత్ ॥
>
> నమస్కృత్వాఽవ్యయం విష్ణుం సమాధిస్థ స్స్వపేన్నిశి ॥
>
> (విష్ణుపురాణము.)

ఈరీతిని గృహస్థుపు దనకుం గల కార్యములన్నియు ననఁగా స్వకార్యములు, స్వామికార్యములు, పారమార్థిక కార్యములు, దేశము మేలుకొఱకుఁ జేయఁదగు కార్యములు లోనగువానిని ముందుగ నిశ్చయించుకొని కాలనియమములు నేర్పఱచి యే

యేకార్యమున కెంతెంతకాలము వలయునో యదియు నిశ్చ యించి దినచర్యకు ముందుగఁ బదకము నేర్పఱచి యాపద కము ననుసరించి కాలము నతిక్రమింపక యుండ వృథాకాల క్షేపము సేయక కార్యములన్నింటిని జాగరూకుఁడై నెఱ వేర్చుచు దినమును గడుపనగునే కాని ప్రవాహకాష్ఠమువలెను, గాలికి గొట్టుకొనిపోవు తృణముభంగిని బ్రారబ్ధబద్ధుఁడై వర్తింపరాదు. ధీరుఁడై పురుషప్రయత్నమున సందర్భముల నన్నింటి మార్చుకొనునట్లు ఆత్మశక్తిని వినియోగింపవలయు.

పైఁజెప్పిన వన్నియు నిత్యకర్మములని ముందే యనువదిం పఁబడియె. ఇవిగాక పాకయజ్ఞములని కొన్నియు, శ్రౌత యజ్ఞములని కొన్నియు శాస్త్రములయందుఁ బేర్కొనఁబడి యున్నవి. పాకయజ్ఞములయందు ముఖ్యములు పితృశ్రాద్ధ ములు. ఇవి గతించిన పితరులను బూజించుటకుఁ జేయుకర్మ ములు. ఇందు మరణానంతరము ప్రేతలోకమున నుండుజీవు నుద్దేశించి యా జీవున కూర్ధ్వలోకప్రాప్తి సులభముగఁ గలు గుటకొఱకుఁ జేయఁబడు కర్మములంగూర్చి పూర్వాధ్యాయ మునసే వ్రాయఁబడినది. ఇవి యేకోద్దిష్టశ్రాద్ధములని యెఱుం గఁబడుచున్నవి. ఈశ్రాద్ధములయందుఁ బ్రేతయొక్కఁడే పూజింపఁబడుచున్నాఁడు. వీనియం దావాహనముగాని హో మముగాని లేదు. విశ్వేదేవతలఁ బూజించుట లేదు. సపిండీ కరణముతో ముగియును. సపిండీకరణకాలమునఁ బ్రేతలోక మును దరించి జీవుఁడు పితరుల లోకమును జెందును. సాధారణ

ముగ మూఁడుతరములు గడచుకాలము జీవుఁడు పితృలోక ముననుండును. కావున జీవుఁడు పితృలోకమునొందు సమయము నాల్గవపితరుఁడు స్వర్గలోకముచెందుకాలము కావున నాల్గవ పురుషునకు స్వర్గపాథేయము నిచ్చి స్వర్గమునకుఁ బంపఁ బడును. అది మొదలు పితృశ్రాద్ధములయం దాహ్వానము చేయఁబడఁడు. శ్రాద్ధములయందు మువ్వురు పితరులనఁగా మూఁడుతరములవారుమాత్ర మాహ్వానము చేయఁబడుదురు. ఇవియును రెండువిధములుగ నున్నయవి. ఆభ్యుదయికశ్రాద్ధములని, సాధారణపితృశ్రాద్ధములని. ఆభ్యుదయికశ్రాద్ధములనఁగాఁ బుత్త్రునియొక్కయుఁ బుత్త్రికయొక్కయు వివాహ కాలములయందును, ఉపనయనకాలమందును జాతకర్మ నామకరణ కార్యములయందు నాహ్వానముచేయఁబడు నాందీముఖ పితరులనుద్దేశించి చేయఁబడు కార్యములు. నాందీముఖులనఁగా సంతోషముతోఁగూడిన ముఖముగలవారు. వీరు పితృలోకమును దాఁటి స్వర్గలోకమునుబొందిన పితరులు. అనఁగా మూఁడుతరములకు ముందుగాఁబోయిన పితరులు. వీరు స్వర్గలోకప్రాప్తులయినవారు కావున శ్రాద్ధక్రియలచే వీరలకుఁ బ్రయోజనమంతగాఁ గానరాదు. వీరలు శుభకార్యములయం దాహ్వానముచేయఁబడి తమ సంతతివారల కభ్యుదయము ననఁగా నైహికమగువృద్ధి ననుగ్రహింతురు.

పితృశ్రాద్ధములయందు సన్నిహితు లగు మూఁడు తరముల పితరులు మాత్రము పూజింపఁబడుదురు. సామాన్యముగ

మూఁడుతరములవారు పితృలోకమున నుండి భూలోకమున నుండు తమసంతతివారినుండి శ్రాద్ధరూపమగు సహాయమును దృప్తిని గోరుచుందురు. అట్టి పితరులనుద్దేశించి జేయఁబడు నిత్యనైమిత్తికశ్రాద్ధములు వారలం దృప్తులంజేయు. ఈశ్రాద్ధములయందుఁ బితరుల నావాహనముచేయుటయుఁ బక్వాన్నము నగ్నియందు హోమము చేయుటయు, విశ్వేదేవుల నాహ్వానముచేసి పూజించుటయు, బ్రాహ్మణులకు భోజనం బిడుటయు ముఖ్యభాగములు. ఇం దాహ్వానముచేయంబడు బ్రాహ్మణులు విజ్ఞులుగను, సుశీలురుగ నుండవలయును.

యథేరిణే బీజ ముప్త్వా న వప్తా లభతే ఫలమ్ ।
తథాఽనృచే హవి ర్దత్త్వా న దాతా లభతే ఫలమ్ ॥
నశ్యంతి హవ్యకవ్యాని నరాణా మవిజానతామ్ ।
భస్మభూతేషు విప్రేషు మోహా ద్దత్తాని దాతృభిః ॥

తా. ఊషరక్షేత్రమున విత్తనము వేయువాఁడు ఫలము నేలాగు పొందఁజాలఁడో యట్లనృచుఁ డనఁగా వేదాధ్యయనముచేసియుండని బ్రాహ్మణునకు దత్తము చేయఁబడిన హవ్యకవ్యములు ఫలమునీయఁజాలవు. అజ్ఞానులు మోహముచే బూడిదెతో సమాను లగువిప్రులకు దత్తముచేయు హవ్యకవ్యములు నశించును.

బ్రాహ్మణులు వేదాధ్యయనముచేత శుద్ధులయి యగ్నిసమానులుగ నుండవలయును. అగ్నియందు వ్రేల్వఁబడిన హోమద్రవ్యము లాయగ్నియందుఁ దప్తములై సూక్ష్మ

రూపములుగ మాఱి దేవతలను జెందులాగున విజ్ఞాని యగు విప్రునియందు దత్తము చేయఁబడిన హవ్యకవ్యములు పితృదేవతలను జెంది వారలను దృప్తులుగఁజేయు. అట్లుగాక బూడిదియందుఁ జేయఁబడిన హోమ మెట్లు దేవతలను జెందఁజాలదో యటులనే బూడిదెవంటి విప్రులకు ననఁగా వేదము నుజదువని బ్రాహ్మణులకు దత్తమగుహవ్యకవ్యములు పితరులను జెందఁజాలవు. చేసిన కర్మము ఫలముల నీఁజాలక నశించు.

> బ్రాహ్మణో హ్య నధీయాన స్తృణాగ్ని రివ నశ్యతి ।
> తస్మై హవ్యం న దాతవ్యం న హి భస్మని హూయతే ॥

అధ్యయనము చేయని బ్రాహ్మణుఁడు గడ్డినిప్పువలె శీఘ్రముగఁ జల్లారిపోవును. ఎవ్వరుగాని బూడిదిలో హోమము చేయరు గదా! అటులనే యనధీతుఁ డగు బ్రాహ్మణునకు హవ్యకవ్యములు దత్తముచేయరాదు. శ్రాద్ధములయందు యోగ్యులును, జ్ఞానవంతులు నగు విప్రులు భుజించి తృప్తులు కాఁగా వారలు పితరులకు శాశ్వత బ్రహ్మలోకనివాస సిద్ధి గలుగున ట్లాశీర్వచనములుచేయఁ బితరులు మేలు పొందుదురు. బ్రాహ్మణభోజనము వలని ముఖ్యోద్దేశ్య మిదియ. ఈఫలము పూర్ణముగఁ గలుగవలయునన్న బ్రాహ్మణులు పరిశుద్ధులుగను, జ్ఞానవంతులుగను, బండితులుగను, నుండవలయును.

అక్రోధనైః శౌచపరైః సతతం బ్రహ్మవాదిభిః ।
భవితవ్యం భవద్భిశ్చ మయా చ శ్రాద్ధకర్మణి ॥

క్రోధములేనివారును, సదాపరిశుద్ధులును, సర్వదా బ్రహ్మ విచారము చేయువారును నగు మీవలన, నాచేఁ జేయబడు శ్రాద్ధకర్మ సార్థమగుగాక. అని శ్రాద్ధమునందు ఆమంత్రితు లగు బ్రాహ్మణులనుగూర్చి కర్తయగువాఁడు చెప్పుచున్నాఁడు గదా. అట్లుగాక యజ్ఞుల నామంత్రితులను జేసిన నాశ్రాద్ధము సార్థకముగ నుండజాలదు.

ఈశ్రాద్ధములన్నియు భూలోకమును విడిచి ప్రేతలోకము నఁగాని పితృలోకమునం గాని యుండు జీవుల కాయాలోక సంబంధములగు శరీరములను బరిశుద్ధిచేసి సంస్కరించుట కుద్దే శింపఁబడినవి. తక్కినసంస్కారము లన్నింటి యందువలె వీని యందును మంత్రములును, ద్రవ్యములును బ్రయోగింపఁ బడు చున్నయవి.

శ్రౌత యజ్ఞములు సంహితము హావిర్యజ్ఞము లనియును, సోమయజ్ఞము లనియును రెండువిధములుగఁ బదునాలుగు యజ్ఞము లున్నయవి. వీనియన్నింటి యందును, మంత్రములు విశేషముగ నుపయోగింపఁబడుచు నెయ్యి క్షీరములు పక్వాన్న ములు పిష్టములు మొదలగునవియును హోమము చేయఁ బడుచున్నవి. ఇవియన్నియు నగ్నియందు దహింపఁబడి దేవ తల కాహారమగుచున్నవి. దేవతలు తృప్తులై యజమానునకు నైహికాముష్మికసుఖముల నిత్తురు.

ఈరీతిని విధింపఁబడిన కర్మము లన్నియు జీవుని సంస్కరించి వివిధమాలిన్యములను దొలఁగించుటకును, వానిఋణములను దీర్చుటకును సమర్థములు.

మొట్టమొదట బ్రహ్మాండమునందలి బ్రహ్మాదిస్తంభ పర్యంత సమస్తభూతములు నొకటితో నొకటి యవిచ్ఛిన్నము లగు ననుబంధములచేఁ గట్టఁబడి యున్నవనియు, నన్యోన్య సహాయము లేనిది యొక్కటియును జీవింపఁజాలదనియు బోధించుచు మనుష్యుని జీవితకాల మామూలాగ్రము యజ్ఞములతో నిండియుండునట్లు విధింపఁబడియున్నది. భగవంతుఁడు యజ్ఞస్వరూపుఁడనియును, నామరూపముల కతీతుఁ డగు బ్రహ్మము ప్రకృతితోఁ జేరి నామరూపాత్మక మగు ప్రపంచ రూపముగఁ బరిణమించుటలో గొప్పయజ్ఞ మొనరించెనని యును శ్రుతులు ఘోషించుచున్నయవి. పురుషసూక్తము నందు వర్ణింపఁబడియుండు యజ్ఞమంతయు నిదియే.

యజ్ఞముచేఁ బ్రపంచముత్పత్తియై యజ్ఞముచే రక్షింపఁ బడుచున్నది. ఒకవిధమగుజీవము మఱియొకవిధమగు జీవము నకు జీవనమగుచుండుట లోకమునఁ జూచుచున్నాముగదా! "జీవో జీవస్య జీవనమ్". ఇట్లు భూతములన్నియుఁ బరస్పరా శ్రయానుబంధములచేఁ గట్టఁబడి ప్రతిభూతము నితరభూతముల యభివృద్ధికొఱకు వినియోగపడుచున్నది. పాషాణాదులు, మృత్తు, మట్టియందలి వివిధపదార్థములు, తరుగుల్మలతాదుల కుపయోగించును. ఇవి నానావిధములగు పశుపక్ష్యాదులకును,

మఱియు నివి కొంతమంది మానవులకును నాహారములగు చున్నవి. ఇవి యన్నియు మనఃపూర్తిగాఁ దమ్ముదా మితరుల యభివృద్ధికొఱ కర్పణముచేసికొనుట లేదు. వానియన్నింటి యందుఁ జిత్తమంకురించియే యుండలేదుకదా! స్వభావముగ నొకజీవ మింకొకజీవమును హరించుటచే జీవించుచున్నయది. అజ్ఞానావస్థయందు మనుష్యుఁడుసహితము ప్రకృతిస్వభావము ననుసరించి యితర జీవములను దనజీవమున కుపయోగించు కొనుచున్నవాఁడు. మనస్సు వికసింపను వికసింపను జ్ఞాన మభి వృద్ధి కాను కాను మనుష్యునిధర్మము మాఱుదగియున్నది. ప్రకృతిసంబంధములగు శరీరము లన్నియు నితరభూతముల హరించుటచే నభివృద్ధియగుచుండ శరీరియనఁగా జీవుఁ డితర భూతములకొఱకుఁ దనశరీరము నుపయోగించినంగాని యభి వృద్ధికాజాలఁడు. "పరోపకారార్థ మిదం శరీర" మ్మను నార్యోక్తి యీయర్థమునేకదా ప్రతిపాదించుచున్నయది.

పైవివరింపఁబడిన కర్మములు, యజ్ఞములు, అన్నియు నీ యుపాధులస్వభావమును గ్రమక్రమమునమార్చి జీవుఁడు క్రమముగ నివృత్తిమార్గమునం బ్రవేశించుటకు సాధనము లగునట్లు విధింపఁబడియున్నవి.

## జీవహింస

లోకేవ్యవాయామిషమద్యసేవా నిత్యాస్తు జంతోర్నహి తత్ర చోదనా।
వ్యవస్థితిస్తాసు వివాహయజ్ఞ సురాగ్రహైరాసునివృత్తిరిష్టా॥

స్త్రీపురుషులయం దన్యోన్యభోగేచ్ఛయు, మాంసాహార మునం దిచ్ఛయు, మద్యమునందిచ్ఛయు నివి జంతువులకు స్వభావజన్యములు. వీనివిషయమున శాస్త్రచోదన మనావశ్యకము. శాస్త్రములయం దీవిషయకమగు విధులన్నియు వివాహము జ్యోతిష్టోమాది క్రతువులమూలమునఁ గ్రమక్రమమున నీయిచ్ఛలనుండి జీవుని విరమింపఁ జేయుటకొఱకుఁ జేయఁబడిన నిబంధనలు గాని యెల్లరు విషయేచ్ఛలకు లోఁబడి విషయములయందు రమింపవలయునని కాదు. విధి నిబంధనలు లేక స్త్రీపురుషు లిష్టానుసారము కామవశులై రమింపకుండునట్లు వివాహనిబంధనము విధింపఁబడినది. దీనిచే నొక్కపురుషునకును ఒక్కస్త్రీకిని మాత్రము సంబంధము గలుగు. వీరిద్దఱకును స్వేచ్ఛావిహారములు లేకుండునట్లు కాలనిబంధనముల విధించి విషయభోగములనుండి మనస్సులఁ గొంతమట్టుకు మరలింప నేర్పుటకై శాస్త్రములు ప్రవర్తించినవికాని ప్రతియొకండును వివాహితుఁడు గావలయునని కాదు. అటులనే మాంసాహారమునందలి యిచ్ఛ యెల్లవారలకు సహజముగ నుండ నిచ్ఛగలిగినపు డెల్ల జీవహింస చేయక యుండునట్లు దేవపితృకార్యములయందు మాత్రమామిషాహారమును వినియోగించి తత్ప్రసాదరూపముగ మితముగ యజమానులద్దానిఁ గొనవచ్చు నని శాస్త్రములయందు విధింపఁబడి యున్నదిగాని దేవతలకుఁ బితరులకు నామిషాహారము దత్తము చేయనిచో వారలు తృప్తులుగారని కాని, కర్మలోపమగునని

కాని చెప్పుట కాదు. జనులు మాంసేచ్ఛ గలిగి యిష్టాను సారముగ నాహారముకొఱకుఁగాని వినోదమునకైగాని, జీవ ముల హింసించుచుండఁ గొన్ని కార్యములయందుమాత్రము జీవముల హింసింపఁదగు నని నియమించి యట్టిహింసతోఁ గూడిన కర్మములను జేయుటయందును గష్టసాధ్యము లగు గొన్ని నియమముల ననుల్లంఘ్యములుగ విధించి జీవహింస నుండి మానవులను గ్రమక్రమముగఁ దొలఁగించుటకై శాస్త్ర ములు ప్రవర్తించియున్నవి కాని యిక్కాలమునఁ బట్టణముల యందు నిరాక్షేపముగ వేలకొలఁది దినదినము హింసించి భక్షించుఁ నోరులేనిజంతురాశి లెక్కకు మఱియు గొన్నిం టిని జేర్పఁగాదు. శాస్త్రవిహితము లగుకర్మములయందు విధింపఁబడిన విధినిషేధము లన్నియు జీవుని సహజవాంఛ లన్నిటిని గ్రమక్రమమున జయించి విరాగమును వృద్ధిచేయు నవికాని విషయ వాంఛల వృద్ధిచేయునవికావు. మఱియు నీరీతి మద్యమునందలి యిచ్ఛయుఁ గ్రమముగ విడుచునట్లు విధ్యుక్తముగఁ జేయఁబడు సౌత్రామణియను యాగమునందు దప్పఁ దక్కిన సమయముల మత్తును గలుగఁజేయు వస్తు వులను గ్రహింపరాదని కట్టుబాట్లు చేయఁబడినవి. అట్టి కార్యములయందు వచించు మంత్రము మొదలగువానిచేతను, వానిచే నాహ్వానము చేయఁబడు దేవతల దివ్యతేజస్సు చేతను, వానియందుపయోగింపఁబడు వస్తువులు పరిశుద్ధములై తమసహజ దుర్గుణమును గొంతపోఁగొట్టుకొనియుండును.

క్రమక్రమమున జ్ఞాన మభివృద్ధికాను కాను జిత్తశుద్ధి కాఁగా హింసారూప యజ్ఞములు గూడఁ ద్యజింపఁబడును. శాస్త్ర కర్తల యుద్దేశ మిట్లుండ శాస్త్రనిబంధనలను బూర్ణ ముగ గ్రహింపకయు ననుష్ఠింపకయు విషయేచ్ఛలు గలిగి కర్మమార్గముల నుండు వారికి విషయభోగములు శాస్త్ర ములచే విధింపఁబడి యున్నవనుట పొరబాటు. మొట్టమొదట కర్మములవలన భూతకోటులకుంగలయన్యోన్య సంబంధ మును సూచించి యన్యోన్య సహకారిత్వమును విధించుచు నొకొక్కరును దనకుంగల భోగ్యవిషయములను బరోప కారముకొఱ కుపయోగించునట్లు శాస్త్రములు బోధించు చున్నవి.

యజ్ఞకర్మములయందు జీవుఁడు తనకుఁగల వస్తువుల నొకొక్కటియుఁ గొంత యితరభూతముల యుపయోగము కొఱకు దత్తము చేయ నేర్చుకొనుచు నీమూలమునఁ దాను ఇతరభూతములనుండి పొందిన మేలునకుఁ బ్రత్యుపకృతి చేయు చున్నవాఁడు. ఇకర్మములయం దెద్దియేని నల్పముగనైనను జీవుఁ డర్పింపఁగాఁ బెక్కుమడుంగులు ప్రతిఫలము కాలాంతర మున రాఁగోరుటచే సద్యఃఫలమును వదలుకొని నిబ్బరము గలిగి రాఁబోవుఁ ఫలముల నిరీక్షించుచుండుట నేర్చుకొనును. ఆరీతిని వచ్చిన ఫలములన్నియు నశించునవియే కావున నశ్వర ములను జ్ఞానము కాలక్రమమునఁ బొందును. పిదప దేవతాను గ్రహముచే నిహలోకమున గలుగు ప్రతిఫలములఁ గోరక

దీర్ఘకాల మనుభవింపఁదగిన పరలోకసుఖములను గోరి యజ్ఞములు చేయును.

"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" యని శ్రుతి విధించుచున్నదికదా! పరలోకసుఖములనునవి యదృశ్యములును మరణానంతరము పొందఁదగినవియునై యుండుటచే వానిం గోరి ప్రకృతోపయోగములగు వస్తువులను త్యాగము చేయఁగలుగుట యైహికసుఖములను గోరుటకంటె నుత్తమమగుస్థితి. ఈరీతిని స్వర్గకాముఁడై బహువిధములగు యజ్ఞముల నొనరించి చిరకాల మిహలోకమునను, పరలోకమునను సుఖానుభవము నొందుచు భగవంతుఁడు తనశక్తిని దనబిడ్డలతో సమానులగు భూతకోటులయభివృద్ధికొఱ కుపయోగించుచుండఁ బ్రతిమానవుఁడును దనకంటె శ్రేష్ఠు లగు దేవకోటులకొఱకుఁ దనభోగ్యపదార్థములను త్యాగము చేయుట ధర్మ మనుజ్ఞానమును గ్రమమునఁ బొందును. మఱియు బహుకాలానుభవముచే స్వర్గసుఖములు సహిత మంతము నొందఁగా "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" యను న్యాయానుసారముగ స్వర్గమునుండి మరలి మర్త్యలోకమును బొందును. జన్మజన్మమున నిట్లు భూలోకసుఖముల నూర్ధ్వలోకసుఖముల ననుభవింపఁ దుదకు భూలోకసుఖములవలెనే స్వర్గలోకసుఖములు సయితము శాశ్వతములుగావను జ్ఞాన మంకురించి దృఢమగును. స్వర్గలోకసుఖముకంటె నుత్తమమగు సుఖము నన్వేషించుచుఁ గడపట ఫలాపేక్ష యుండినంతవఱకు నిహపరలోకసుఖము

లగు ఫలానుభవములు తప్పవనియు నవి నశ్వరములనియు దానంజేసి యాభోగము లన్నియు దుఃఖయోను లనియు జ్ఞానము వృద్ధికాఁగా జీవుఁడు కర్మత్యాగము చేయఁజూచును గాని యప్పుడును శాంతిరూప మగుసుఖమును గనఁజాలఁడు. కర్మములను వదలుకొని తూష్ణీంభావము ననుసరించి యున్నను విషయభోగముల యందలి యిచ్ఛమాత్రము అరణ్యావాసము నందు సయితము వెంటనంటియే వచ్చుటంజూచి పరిపాకావస్థయందుఁ గేవలకర్మత్యాగమునఁ బొంద నసాధ్య మగు సుఖము కామముల విడుచుటవలన బొందనగునను జ్ఞానము కలుగును.

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥

(గీత.)

కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః ।
ఏవం త్వయి నాన్య థేతోఽస్తి న కర్మలిప్యతే నరే ॥

(ఈశావాస్యోపనిషత్తు.)

కర్మములను విడుచుటచే శాంతిరూప మగు సుఖముఁ బొందఁజాలఁడు. కేవలసన్న్యాసముచేత మానవుఁడు సిద్ధిని బొందజాలఁడు. ఐతే జీవితేచ్ఛయనఁగా దేహాభిమానముండు నంతవఱకు నూఱుసంవత్సరములైనను గర్మములను జేయుచునే గడుపవలయును. కర్మములచే బద్ధుఁడుగాక యుండుట కిదియే మార్గము. వేఱుమార్గము లేదు.

కామముల విడుచుటయే యుత్తమమును, నాశరహితమును నగుసుఖకారణమని యెఱింగి ఫలాభిసంధి రహితముగ సంసారచక్రమును ద్రిప్పుటకొఱకే స్వధర్మము నాచరింపవలయు ననియుఁ దెలిసికొనును. మొదట నైహికఫలకాంక్షతోను, బిదపఁ గొంతకాలము స్వర్గకాముఁడయ్యును సకలభూతహిత ములగుకార్యములను జేయుచుఁ గడపట ఫలకాంక్ష యించుకయేనియు లేకయే లోకహితము నుద్దేశించి ప్రపంచచక్ర మునుద్రిప్పుటయే ముఖ్యోద్దేశ్యముగ స్వధర్మమును జేయును.

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యాద్విద్వాం స్త థాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥
(గీత. ౩-౨౫.)

విద్వాంసులుగాని మనుష్యులు కర్మలయం దాసక్తులై యెట్లు కర్మముల శ్రద్ధతో నాచరింతురో అట్లే విద్వాంసుఁడు ఫలాసక్తిలేక లోకసంగ్రహార్థము కర్మముల నాచరించు నని తాత్పర్యము.

స్వధర్మము లగుకార్యములను జేయునుగాని ఫలముల విషయమగు విచారమున కించుకయైనను లోఁబడఁడు.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మాకర్మఫలహేతుర్భూ ర్మా తే సంగోఽస్త్వకర్మణి ॥
(గీత. ౨-౪౭.)

తా. కర్మముచేయుటయే నీ యధికారముగాని కర్మఫలముల విషయ మగుచింత నీదికాదు. కర్మఫలములను గోరఁ

గూడదు. అయినను కర్మముచేయక యుండవలయు ననుకోరిక యుఁ గూడదు.

ఇట్లు ఫలములను గోరకయే ప్రపంచమందలి సకలభూత ముల మేలును బ్రపంచాభివృద్ధిని గోరుచుఁ గర్మములను జేయు చుండును.

పూర్వకర్మానుసారముగఁ బ్రాప్తించిన జన్మమునఁ జేయఁ దగుకర్మము లన్నియుఁ జక్కఁగ నెఱవేర్చిన నాఋణవిముక్తి యగునుగాని కర్మములను విడిచి పాఱిపోవుటచే నైష్కర్మ్య సిద్ధిగలుగదు. కర్మములను జేయుచు మనోనిగ్రహము చేయ వలయును గాని కర్మముల విడువరాదు. కాలము పరిపక్వము కాగాఁ గర్మములు తమంతట వదలిపోవును. బంధములు వీడి పోవలయును గాని వానిని త్రెంపివేయరాదు. కర్మములను జేయుచు స్వప్రయోజనము నెంతమాత్రమును గోరక లోకము మేలునే కోరుచుండఁదగు. కడపటఁ దాను స్వధర్మమును విడువక విహితకర్మములను లోకసంగ్రహార్థము చేయుచున్నాఁ డనను నహంకారమునుగూడ మాని కర్మమునందుఁగాని ఫల మునందుఁగాని యభిమానమును సహితము విడిచి భగవంతుని సేవకునిభంగి నీశ్వరుని ప్రతినిధిగ భావించుకొని లోకమునకు మేలుకొఱకై ప్రవర్తించుచుండును.

తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగ స్సమాచర ॥ (గీత. 3-౯.)

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ॥

(గీత. ౫-౧౦.)

విద్యావంతుఁ డైనచో నావిద్యను దనకుఁ బూజ్యతకొఱ కుపయోగింపక యజ్ఞులగువారలను గడతేర్చుట కుపయోగించును. ప్రభుత్వాధికారము గలిగియుండినచో నాయధికారమును ప్రజలయభివృద్ధికొఱకే యుపయోగించునుగాని యజ్ఞానులవలె స్వకార్యధురంధరుఁడై తనభోగము కొఱకు వినియోగింపఁడు. ఎల్లప్పుడు ప్రజలయభివృద్ధిని సుఖమును వెదకుచుఁ బ్రజలయుపయోగముకొఱకుఁ గ్రొత్తక్రొత్తవగు కార్యములను జేయుచుఁ దండ్రి బిడ్డలకొఱకుఁ బాటుపడులాగునఁ బాటుపడును. ద్రవ్యార్జనముచేయువాఁడుగ నుండినవాఁడు ధనము నార్జించుచు, నాద్రవ్యముతో మానవకోటి యను గొప్ప కుటుంబమునకుఁ జెల్లునదిగ నెంచుచుఁ దాను త్రైలోక్యకుటుంబియగు భగవంతునిచే నియమింపఁబడిన కోశాధిపతిగ భావించుచు జగత్కుటుంబయోగక్షేమముకొఱకు ద్రవ్యమును వినియోగించుచుఁ గ్రొత్తక్రొత్తధర్మకార్యములను బన్నుచుఁ గొనసాగించుచుఁ దనయొద్దనుండుద్రవ్యమును, దనశరీరపాటవమును, మనశ్శక్తిని, బరోపకారముకొఱ కుపయోగించుచుండును. మఱియు నేయేపదవియందుండినను, జక్రవర్తిగ నుండినను, సేవకుఁడుగ నుండినను, దనధర్మమును భగవత్కైంకర్యముగ భావించుచు లోకోపకారకమగు నేకార్యమునుగాని హేయముగ నెంచక యెల్లకార్యములను బరిపూర్ణముగ నెఱవేర్చును. అన్నికార్యములను సకలభూతముల మేలుకొఱకుఁ జేయుచు నొక్కొక్కకార్యము భగవంతుని పాదములయం

దర్పింపఁబడు నొక్క-పుష్పముగ నెంచి భగవంతుని నర్చించు చుండు.

స్వకర్మణా తమ భ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥

(గీత. ౧౮-౪౬.)

స్వకర్మము లనుపుష్పములతో నాభగవంతుని నర్చించు మానవుఁడు సిద్ధిననఁగా పరిపూర్ణత్వమును బొందుచున్నాఁడు.

తాను ప్రజలమేలుకొఱకు సత్కా-ర్యములను జేయుచున్న వాఁ డనియును, బ్రజలు తనకుఁ గృతజ్ఞులు గావలయుననియుఁ గొంచెము కోరిక మొదటగలుగునుగాని కాలక్రమమున నా కోరికయు విడిచి యీశ్వరప్రీతి నొకదానినే కోరుచుఁ గార్యములగు కర్మములను జేయును. ఇట్లుచేయ సర్వకర్మములును యజ్ఞస్వరూపుఁడగు జగదీశ్వరునిం జెందును. అట్లు యజ్ఞార్థము చేయఁబడు కర్మములు బంధరూపములుగాక మోక్షసాధనము లగు.

యజ్ఞార్థాత్క-ర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః ॥

(గీత. 3-౯.)

స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్ ।
సాధనం ప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్ ॥

అపుడు జీవుఁ డేయేకార్యములను జేయుచుండినను నీశ్వర తాదాత్మ్యము గలవాఁడై యుండును.

రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥ (గీత. ౨-౬౪.)

ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వా స్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ।
(గీత. ౨-౭౨.)

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥
(గీత. ౧౮-౬౫-౬౬.)

ఎల్లప్పుడు నన్నే చింతించుచు నాకు భక్తుఁడవై నాకర్పణములుగఁ గర్మములను జేయుచు, నన్ను నమస్కరింపుము. నిస్సందేహముగ నన్నే చెందుదువని దృఢముగ నమ్ముము. అన్నిధర్మములను విడిచి నన్నే శరణుపొందుము. సమస్తములగు పుణ్యపాపములనుండి తొలఁగించి మోక్షము నిచ్చువాఁడను. విచారపడకుము. అని శ్రీకృష్ణభగవాను లభయదానమిచ్చి యెల్లవారికిఁ గడతేర్పఁజాలుమార్గమును బోధించియున్నవారుకదా! అట్టిస్థితిని జెంది యేయేకార్యము చేయుచున్నను నీశ్వరుఁడే తన చేతఁ జేయించుచున్నవాఁడనియును ఈశ్వరునకు శరీరమాత్రుఁడుగ దాను నడుచుచున్నవాఁడనియును దృఢముగ భావించుచుఁ గర్మముల వర్తించుచుండును. ఇదియే కర్మయోగము.

సిద్ధ్యసిద్ధ్యోః స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥
(గీత. ౨-౪౮.)

ఈశ్వరునిచేఁ బ్రేరితుఁడై కార్యములను జేయుచుఁ జేసిన కార్యము జయించినను జయింపక పోయినను లెక్కింపక యీశ్వరుని కర్పణము చేయుచుండును. ఇదియే నిజమగు యోగము.

ఈస్థితికిం దెచ్చుటకు సాధనముగ నుండినమార్గము కర్మ మార్గము. మొట్టమొదట నైహికఫలములనుగోరి స్వప్రయోజనపరుఁడై కర్మములనుజేసి పిదప స్వర్గసుఖములకొఱకుఁ బాటుపడి యావల ఋణవిముక్తినే యుద్దేశించి కర్మములను జేసి తదనంతరము లోకహితముపొంటె స్వధర్మము ననుష్ఠించి కడపట నీశ్వరార్పణబుద్ధితోఁ గర్మములఁ జేయుచు నెల్లయెడల నెల్లవేళల నెల్లకార్యములయందు నీశ్వరసాన్నిధ్యమును గల్పించుకొని యీశ్వరతాదాత్మ్యమును బొంది యీశ్వరసముఁడై వర్తించుచుఁ బరమయోగి యగుచున్నవాఁడు. ఇట్టివాఁడెల్ల కాలముల నీశ్వరసన్నిధానంబున నున్నవాఁడు కావున నుత్తమమగుభక్తియు నుత్తమజ్ఞానమును దమంతటతాము వాని యందుఁ బ్రకాశించును.

తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి ॥

(గీత. ౪-౩౮.)

ఇట్లు యోగముచేత సిద్ధులయినవారి హృదయములయందు నాత్మజ్ఞానము తనంతన యభివృద్ధియై ప్రకాశించును. ఇట్లు కర్మ భక్తిజ్ఞానములు మూఁడు నీయోగియందుఁ బూర్ణముగఁ

ప్రకాశించును. ఈయోగి కర్మికంటెను, భక్తుని కన్నను, జ్ఞాని కంటెను నధికుఁ డని భగవంతుఁడు వచించియున్నాఁడు.

> తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
> కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భ వార్జున ॥
>
> (గీత. ౬-౪౬.)

ఈయోగము కర్మమార్గము తుదను జెందఁదగియుండుటచేఁ గర్మయోగమనఁబడుచున్నది. ఇదియే నిజమగు యోగము. ఇట్టి యోగమును బొందినవాఁడే నిజమగు యోగి. ఇట్టి మహా పురుషుఁడు శరీరధారియైయుండియు ముక్తుఁడే. వీరలే జీవన్ముక్తు లని పిలువఁబడు మహానుభావులు. అట్టిమహాత్ముల యనుగ్రహ మునకుం బాత్రులు కాఁగోరు వారెల్లరును వారిచే ననుష్ఠింపఁ బడి వారలచే లోకోపకారార్థము శాస్త్రములయందుఁ బ్రతి పాదింపఁబడిన యీమార్గము నవలంబించి నిష్కాములై లోక హితార్థము సత్కర్మములను జేయుచుఁ దమజన్మములను సార్థకములుగఁ జేసికొందురు గాక.

---

## పదునాల్గవ యధ్యాయము

### జ్ఞానమార్గము

పూర్వాధ్యాయమునఁ జెప్పిన కర్మమార్గము ప్రపంచమందలి జను లనేకులచే ననుష్ఠింపఁబడుటకు సుకరమై యనేకులచే ననుష్ఠింపఁబడుచున్నయది. ఈయధ్యాయమున జ్ఞానయోగముంగూర్చియు, దత్సాధనమగు జ్ఞానమార్గముంగూర్చియు విచారింపఁబడును. ఇది కొద్దిమందిచే ననుష్ఠేయము గాని యెల్ల వారికి సాధ్యముగాదు. ఈమార్గము ననుసరింపఁదగినవాని లక్షణములు మొట్టమొదటనుండియే తెలియఁ దగు. వాఁడు ఆదినుండియు జ్ఞానమునం దిష్టము గలిగి జ్ఞానవృద్ధికొఱకే పాటుపడుచుండు. ఆ జ్ఞానమునైనను నిష్కామముగనే యభ్యసించును గాని యర్థాంతరమును ద్దేశించి యభ్యసింపఁడు. అనఁగా నర్థకాముఁడగువాఁడు తదార్జనమునకు సహకారియగుజ్ఞానమును బహుప్రయత్నముచే గ్రహించు. బాహ్యములగువిషయసుఖములం గోరువాఁడు తనమనశ్శక్తియును, జ్ఞానమును, ఆవిషయసుఖములను బొందుటకు సహకారములుగ నుపయోగించును. ఇక్కాలమున బహువిధములగు ప్రకృతిశాస్త్రము లభివృద్ధి కానుగాను వానినన్నింటి నైహికములగు సుఖముల నభివృద్ధి

చేసికొనుటకే యుపయోగించుచున్నారుకదా! అట్లుగాక క్రొత్తక్రొత్తజ్ఞానమును సంపాదించుటయే యుద్దేశ్యముగలిగి యా జ్ఞానమును సాధించుటయే పరమసుఖముగనెంచుచు శరీరసౌఖ్యమునుగాని, ద్రవ్యలాభమునుగాని యించుకయైనను గోరక సర్వకాల సర్వావస్థలయందును గ్రొత్తక్రొత్తవగు విషయములఁ బరీక్షింపఁ బ్రయత్నించువాఁడు జ్ఞానమార్గమున కర్హుఁడని తెలియఁదగు. ఎద్దియేని యొకయుద్యమము గలిగి నచోఁ దద్విషయకజ్ఞానము పూర్ణముగ సాధించుదాఁకఁ దృప్తుఁడుగాక తనశక్తినంతయు నావిషయముననే వినియోగించుచునుండు. ఎవ్వఁడే నొకనూతనశాస్త్రమును గల్పించి యభివృద్ధి చేయవలయు నన్నఁ దద్విషయకమగు బహువిధ ప్రయత్నములఁ జేయుచు, బహువిధములగు క్రొత్తక్రొత్త యేర్పాటులు చేయుచుఁ గ్రొత్తక్రొత్తనేర్పు చూపుచు నానా ప్రయత్నములచే నాయాసందర్భముల నెఱింగి జ్ఞానమును వృద్ధి చేసికొనును. నిద్రాహారముల సహితము గోరక పనిచేయు చుండును గదా! కృషిశాస్త్రము, వైద్యశాస్త్రము, ఖగోళ శాస్త్రము నీమొదలగుశాస్త్రముల మొట్టమొదటనిర్మించి యభివృద్ధిచేసినవారల యోర్పును, నేర్పును, శ్రద్ధయు నెంతటి విగ నుండవలయునో యూహింపఁదగు. నక్షత్రములను బ్రతి రాత్రిని గమనించి వానిగతులను వీక్షించుచు నేండ్లకొలఁది పాటుపడినఁగాని యొక్కగ్రహసంచారము నైనను దప్పలేక తెలియ సాధ్యమా! ఎన్నిసంవత్సరములు నిద్రాభంగముతో

గ్రహనక్షత్రగతులను బరిశీలించి జ్యోతిర్గణిత శాస్త్రమును బూర్వులు నిర్మించిరో యని మనకూహింపనైనను సాధ్యమా! అంత శ్రమపడి సాధించిన జ్ఞానముచే వారలకు లాభము వేఱొక్కడాని నాశాస్త్ర మీఁగలిగెనా! ప్రతిఫలము నిసుమంతయు నపేక్షింపక జీవితకాలమంతయు నాజ్ఞానమును సాధించుటయందే గడపినమహాత్ములు జ్ఞానమునందే సకలపురుషార్థములను జూచుచుండిరి గాన యర్థకామముల నించుకయైనను గోరియుందురా! అట్టివారలు పూర్వకర్మపరిపాకము వలన విషయవాంఛలను దరించి యెప్పుడు స్వాభావికముగ విషయేచ్ఛలులేక జ్ఞానమునందే రమించుచుందురు. అట్టివారలయోర్పును, బూనికయు గౌరవార్హము లనందగినవి. సదానూతనము లగువస్తువులను శోధించుటయు, నూతనధర్మములం గనుఁగొనుటయు వారి కభీష్టముగాని వేఱుకోరికల నెఱుఁగరు. క్రొత్తక్రొత్త విషయములు మనోగోచరములు కాఁగానత్యానందభరితు లగుదురు. క్రొత్తజ్ఞానమును సాధించుటకు వారిమన స్సుత్సహించును. అట్టివార లింద్రియములను మనస్సును జయించినవార లనియును, బుద్ధిసూక్ష్మత గలవారలనియును జెప్ప నక్కఱ లేదు. అట్టివారలయందు సామాన్యజనులయందువలె రాగద్వేషము లుండు నని యెంచుట కవకాశము లేదు. జ్ఞానమే లక్ష్యముగ భావించుచు జ్ఞానార్థము తమదగు సర్వస్వమును వినియోగింతురు. అట్టివారలే యీ జ్ఞానమార్గమున నభివృద్ధికాఁ దగుదురు గాని యింద్రియనిగ్ర

హము లేక ద్రవ్యకాములై స్వప్రయోజనపరులై సదా లాభా లాభముల లెక్కించుచుండు వారలు జ్ఞానమార్గమునకుఁ దగరు. అట్టి వారలు మొదటమొదట బాహ్యప్రపంచము నందుఁ బొందఁ దగు జ్ఞానము లోపములేక గ్రహించుటకుఁ బాటుపడుదురు. వ్యక్తమగునొక్కొక్కవస్తువును బరిశీలించి ప్రకృతిగుణములను శోధించి వస్తుధర్మముల నెఱుంగుదురు. ఒక్కొక్కవిధ మగుజ్ఞానమును బొంది మఱియొకవిషయమును బరిశీలించుచు నెంతటికి జ్ఞానమునఁ దృప్తులుగాక సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమములును, మహత్తులు, మహత్తరము లును నగు వస్తుసముదాయము నెడతెగక శోధించుచు, జ్ఞానము నభివృద్ధి చేసికొందురు. ఇట్లు భూలోకమున గ్రహింపఁ దగినజ్ఞాన మామూలాగ్రముగ గ్రహించినను, స్థూలములగు నింద్రియములచే గ్రహింపఁ దగువిషయ మొక్కటియు లేక పోయినను సూక్ష్మము లగులోకములదృష్టి యభివ్యక్తము కాఁగా నాయాలోకముల విషయ మగుజ్ఞానము సాధింతురు. ఇంతకును జ్ఞానేచ్ఛయొక్కటి తప్ప వేఱుకారణము లేదు. ఇట్లు వ్యక్తప్రపంచమంతయుఁ బరిశీలింతురుగాని యీపరిశీలనము నకుఁ బారము కానరాదు. బ్రహ్మాండమునంతయు శోధించి నను దృశ్యాదృశ్యము లగు లోకము లన్నియు నెఱిఁగినను మఱియు ననేకకోటిబ్రహ్మాండములు లెక్కకు మీఱియున్నవి. బ్రహ్మాండమునంటి బ్రహ్మాండమును బరిశీలించినను దుద ముట్టదు. మహాదేవుఁ డొకానొక కాలమున జ్యోతిర్మయమగు

నొక్క స్తంభముగఁ జూపట్ట బ్రహ్మయు విష్ణువు నాజ్యోతి స్స్వరూపమగు స్తంభమునకు నగ్రమును మూలమును గనుఁ గొనఁ దలఁచిరి. చతుర్ముఖుఁ డగ్రమును కనుఁగొనుట కూర్ధ్వ ముగ వేయిసంవత్సరములకాలము పోయినను గడపటిభాగ మును జూడఁజాలక మరలెను. మూలమును గనుఁగొన నథో భాగమును వేయిసంవత్సరములుపోయి వెదకినను మూలమును గనఁజాలక విష్ణువు మరలెనను పురాణగాథనువినరా!

## I. వివేకము

ఇట్లు బాహ్యముగ వెదకుటచే సర్వేశ్వరుని సృష్టికిఁ దుద యు మొదలును గన సాధ్యముగాక కడపట నంతర్ముఖుఁడు కాఁగాఁ బరమదయానిధియు సకలలోక గురువును నగు జగ దీశ్వరుఁ డాతని యంతఃకరణమునందలి యజ్ఞానమును గొం చెము తొలఁగింప

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ॥

(గీత. ౭-౭.)

న తదస్తి వినా య త్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥

(గీత. ౧౦-౩౯.)

కస్మిన్ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి ॥

(ముండకోపనిషత్, ౧-౧-౩.)

ఈశ్వరునికంటె (నాత్మకంటె) భిన్నమగు తత్త్వమొక్కటి యులేదనియు, ననంతములగు భిన్నరూపములుగఁ బ్రకాశించు

నవి యన్నియు నాత్మయేయనియుఁ బ్రకృతిసంబంధములగు నుపాధులయం దొక్కటియగునాత్మ భిన్నభిన్నములుగఁ గన్పడుచున్నదనియు జ్ఞానమంకురించును. ఆత్మయొక్కటి యెఱుంగఁబడిన సర్వము విదితమగుననియు, నాత్మ నెఱుంగక వెలుపలినుండి యుపాధుల నెంతకాలము శోధించినను మూలమగుతత్త్వము నెఱుంగ శక్యము గాదనియును దెలిసికొనును. గొప్పవృక్షమును జేరి మూలమును గనుఁగొనక యొక్కొక్కయాఁకును, రెమ్మను, బువ్వును వేలువేలుగ శోధించుచుండిన నొక దానికి మఱియొకదానికిం గల సంబంధము గానరాక యెన్నింటిని శోధించిచూచినను మఱియుఁ గొన్ని మిగిలియుండునట్లు మూలమును వేద్యమును నగునాత్మ నెఱుంగక యనాత్మస్వరూపము లగునుపాధుల నెన్నింటిని బరిశీలించినను నెన్నిటి జ్ఞానమును బొందినను జ్ఞానము పూర్ణము కాదను నెఱుక కలుగును. అపుడు దేని నొక్కదాని నెఱుంగుటచే సర్వము విజ్ఞాతమగునో యాయాత్మతత్త్వము నెఱుంగుటకు బహుప్రయత్నములు చేయును. అపుడు ప్రపంచమున వ్యక్తమైయుండు పదార్థములన్నియుఁ, బుట్టుటయుఁ బెఱుగుటయు, శుష్కించుటయు, వృద్ధినొందుటయు, బహువిధము లగుమార్పుల నొందుటయు, నశించుటయు నీమొదలగు వికారములను జెందుననియుఁ గావున నవియన్నియు ననిత్యము లనియు, నిట్టిమార్పులలో మాఱక యుండునదియు నిత్యమును నగునది యాత్మ యొక్కటి యనియు జ్ఞానమల్పముగ నైనను దోఁచిన

నిత్యానిత్యవస్తు వివేకజ్ఞానము గలుగును. అపుడు ప్రతిరూప మందు నంతర్భూతమగు నాత్మస్వరూపమునే చూచుటకు యత్నించుచు, నాత్మతత్త్వమును గానని యితరమగు జ్ఞాన మంతయు నజ్ఞానమని యెఱుంగును. బాహ్యములగు వస్తువుల విషయమగు జ్ఞానమంతయుఁ, బ్రకృతిశాస్త్రము లన్నియు, దృశ్యములు నదృశ్యములు నగు లోకముల జ్ఞానమంత యుఁగూడ నజ్ఞానమేయనియు, నీజ్ఞానమంతయు నఁనగాఁ జతుష్షష్టి కళలును, జతుర్వేదములును, వేదాంగము లన్నియు "నపరవిద్య" యనియు, నక్షరుఁడును, నిర్వికారుఁడును, నంతర్యామియు, సర్వభూతముల కాధారభూతుఁడు నగు నాత్మయొక్క తత్త్వజ్ఞానమే "పరవిద్య" యనియుఁ దెలిసి కొనును.

## II. వైరాగ్యము

ఈరీతిని బ్రపంచమునం దెల్లయెడల నాత్మవస్తువును జూచుచు నాత్మయొక్కటియే నిత్యమను వివేకము నభ్యసించుచు రాఁగా ననిత్యమగు ననాత్మయందు విరాగమును, నిత్యమగు నాత్మయందుఁ బ్రీతియును నా విరాగముచే నిత్యానిత్యవస్తు వివేకమును, వృద్ధియగును. ఇట్లు నిత్యానిత్యవస్తువివేకముచే విరాగమును, విరాగముచే నిత్యానిత్యవస్తువివేకమును గ్రమ క్రమముగ వృద్ధియగుచు రెండును దృఢమగును. అట్టివాఁడు నాశనమునకుఁ బాల్పడునవి యన్నియు విడువఁదగినవనియు,

నాశరహితమైనదియొక్కటియే పొందఁ దగినదనియును దెలిసి యైహికములగు సుఖములన్నియు క్షణభంగురము లనియు, నైహికములువలెనే యాముష్మికములు, అనఁగాఁ బరలోక సుఖములును, అంతవంతములై యుండుటంబట్టి దుఃఖదాయకములై కోరఁదగినవిగావనియు నెఱింగి రాగద్వేషములను జయించును. ఆదినుండి యప్రియములును, దుఃఖహేతువులునగు విషయములయందు ద్వేషమును, సుఖకరములగువిషయముల యందుఁ బ్రీతియు, జీవునకు సహజముగ నుండినను, వివేకము దృఢముకానుకాను సుఖదుఃఖములు నొక్కరూపుగఁ జూచుచు నొకదానిని ద్వేషించుటయు, మఱియొకదానిని బ్రేమించుటయు రెండు నజ్ఞానజాతములని రెంటిని జయించుటకు యత్నించును. ఈవైరాగ్య మైహికాముష్మికములగు భోగముల రెండింటియందును గన్పడును. ఐహిక సుఖములయందు రాగ మెట్లాత్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకమో యారీతినే స్వర్గ సుఖమునందలియిచ్ఛయు నాత్మజ్ఞానమునకుఁ బ్రతిబంధకమనియుఁ ద్యాజ్యమనియు నిశ్చయజ్ఞానము కలుగును. వివేక వైరాగ్యములు క్రమక్రమముగ వృద్ధికానుకాను జీవుఁడు ఆత్మజ్ఞానమును బొందుమార్గమును గనుఁగొని యాజ్ఞానము పూర్ణముగ సాధించుటకు షడ్గుణసంపత్తి యావశ్యకమనియు నది లేక యాజ్ఞానము సాధ్యముగాదనియు నెఱుంగును. ఈసంపత్తి శమాదిషడ్గుణసంపత్తియని సముదాయముగఁ జెప్పఁ బడుచున్నయది.

## III. శమాదిషడ్గుణసంపత్తి

(౧) శమమనఁగా నంతరింద్రియ నిగ్రహము. (౨) దమము అనఁగా బాహ్యేంద్రియ నిగ్రహము. (3) ఉపరతి-అనఁగా కర్మములనుండి నివృత్తియు మిగుల గొప్పతాలిమియుఁ నని జెప్పఁదగు. (౪) తితీక్ష-అనఁగా దృఢమగు నోర్పు (౫) శ్రద్ధ-అనఁగా శాస్త్రమునందును, ఆచార్యోక్తియందును దృఢవిశ్వాసము (౬) సమాధానము-అనఁగా సమచిత్తత్వము. ఈయాఱును షట్సంపత్తియని యెఱుఁగఁబడు.

ఇందు శమము మొదటిది. అంతరింద్రియమగు మనస్సును స్వాధీనము చేసికొనుట. మనస్సు జీవున కుండుసాధనములలో నుత్తమమగునది. "కిమి తరచ్చేత స్సమం సాధనమ్". మనస్సు బంధమోక్షముల రెండింటికిని గారణము.

> మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
> బంధాయ విషయాసక్తమ్ ముక్త్యై నిర్విషయం మనః ॥
>
> (అమృతబిందూపనిషత్)

మనస్సు ఇంద్రియములతోఁగూడి విషయములయందు రమించుచుండిన బంధహేతువగు. ఆమనస్సు విషయముల నుండి విముఖమై యింద్రియములకు లోఁబడక యింద్రియములకు రాజై వానిని లోఁబఱచుకొని యాత్మవశ్యమై వర్తించునపుడు మోక్షహేతు వగుచున్నది. కావున మొట్టమొదట మనస్సు స్వాధీనముచేసికొనఁబడినఁ దక్కిన యింద్రియములన్నియు సులభముగ లోఁబడును.

యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా ।
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః ॥

(కఠోపనిషత్).

ఎవఁడు జ్ఞానవంతుఁడై మనస్సును స్వాధీనమునం దుంచుకొనునో అట్టివాని యింద్రియములు, చక్కఁగా శిక్షితములైనగుఱ్ఱములు సారథికిఁ లోబడియుండునట్లు స్వాధీనములుగ నుండును.

మనం బింద్రియములతోఁ జేరనిచో నింద్రియములు స్వతంత్రవ్యాపారమున కశక్తములని యెల్లవారి కనుభవవేద్యముగ నేయున్నయది. మనము మనస్సు నొకవిషయమున నేకాగ్రముగ నునిచినపు డితర విషయములు గోచరములు గావు. ఎవ్వఁడైనను విచిత్రమగు నొకవస్తువు నత్యాశ్చర్యముతోఁ జూచుచుండు కాలమున నెవ్వరుగాని పిలిచిన నాశబ్దమును వినఁజాలఁడు. స్పృశించినను గనుఁగొనఁడు. ఏవిషయమున నైనను మనస్సు లయించియుండునపుడు మైమఱచియున్న వాఁడనుట ప్రసిద్ధము. దీనిచే మనస్సొక విషయమున లయించి మునిగియున్నదనియు నాసమయమున నితరేంద్రియములన్నియు నిర్వ్యాపారములై యున్నవనియుఁ దెలియవచ్చుచున్నది. కావున మనస్సు స్వాధీనమై వర్తించుచోఁ దక్కిన యింద్రియము లన్నియు సులభముగ జయించుటకు సాధ్యములు. కావున "శమము" మొదట నభ్యసింపఁదగినది. మనస్సు నిగ్రహింపఁబడినచో బాహ్యేంద్రియములన్నియు

సులభముగ లోఁబడును గనుక రెండవది దమము. మూఁడవది యుపరతి. ఉపరతి యనఁగా నుపరమించుట, విడుచుట, సన్న్యాసము నగు. విధ్యుక్తముగా విహితకర్మములను త్యజించుటయని వేదాంతులు చెప్పుచున్నారు. సన్న్యాసమునకు లింగములు, అనఁగా బహిరంగములగు చిహ్నములు, అంత ముఖ్యములుగావు. కృతార్థత నిచ్చుశక్తి కేవలబాహ్యకర్మములందు లేదని దృఢముగఁ దెలిసి వానియందు రాగమును బూర్ణముగవిడిచిన నంతస్సన్న్యాసము తప్పక సిద్ధించును. అట్టి విరాగము గలుగుటకు మనోదార్ఢ్యమే సారభూతమనియు దేశకాలనిమిత్తములనుబట్టి యితరులనుష్ఠించు కాయికకర్మములం దెంతభేదములుండినను వానిఁ బాటింపఁ దగదనియును నిశ్చయము గలుగవలయును. సారము నొక్కదానినే చూచుచు బాహ్యధర్మములం దెన్నిభిన్నమార్గములున్నను గమనించక మనోభావముల మాత్రము లెక్కించుచు నందఱియందును సమబుద్ధి గలిగి యాదరించవలయును. సారహీనులందును సారముగలిగించు మార్గములను వెదుకవలయునుగాని బాహ్యవ్యాపారములను మార్పవలయునని యంతపూనుకొనరాదు. ఎల్లెడలఁ బరమాత్మ యంతర్యామిగ నున్నవాఁడనియు, లోకవ్యవహార మనేకవిధములుగఁ బరిణమించు ననియు, దానిచే నాయావిధముల ననుసరించియే వేర్వేఱుగ నాయావారికిఁ దరణోపాయము గలుగవలయుఁగాని యందఱకు నొక్కమార్గమే చాలదనియు వెల్లడిగఁ దెలియవలయును. కావున

మతభేదము లాచారభేదములు మొదలగు భేదము లన్నియును గర్మానుసారము లగు రుచిభేదములను బట్టి కలిగినవికాని సార భూతములు గావని నిశ్చయించి వారివారిమార్గముల వారి వారిని బోనిచ్చి సారమందే దృష్టియుంచి యందఱియందు నన్ని మార్గములందును సమబుద్ధిగలిగి వానియందు సహనమును గలిగి వారివారిని వారివారిమార్గములందే త్రిప్పి యుద్ధరించ వలయు నను ననుకంపయుఁ[1] గలుగవలయును. ఇట్టి సహనము గలవాఁడు కర్మములను జేసినను విడిచినను బాహ్యాలంబనము లను గమనించక సారభూతమగు తత్త్వమునందే మనస్సును ద్రిప్పును. వాఁడే నిజమగు సన్న్యాసిగావున నిట్టి సహన ముప రతియని తత్త్వజ్ఞులు చెప్పుచున్నారు.

నాల్గవది తితీక్ష-తితీక్షయన ద్వంద్వసహనము. సర్వదుఃఖ ములను సహించుట. వైరాగ్యము గలిగినచో సుఖములయందు రాగ మెట్లు వదలునో అటులనే దుఃఖములయందు ద్వేషము గూడ వదలును. ప్రాప్తించు సుఖదుఃఖము లన్నియుఁ బూర్వ శుభాశుభకర్మముల ననుసరించియే వచ్చునుగాని యెవ్వారికిఁ గాని తాఁజేసికొనని సుఖముగాని దుఃఖముగాని సంభవింప దనియు, నివియన్నియు వివేకవృద్ధికిసహాకారములనియు దృఢ ముగ నెఱుంగును. కావున దుఃఖములెన్ని ప్రాప్తించినను

[1] అనుకంపము అనగా ఇతరుల మనోభావముల గుర్తెరింగి వానికనుకూల ముగ భావించుట. కంపమనగా చలనము. ఇచ్చట భావమని అర్థము. అను కంపమన ఆభావమున కనుగుణమైన భావము.

దత్కాలమున నెంత దుర్భరములుగఁ గనుపించినను, నవి యన్నియును బూర్వకర్మానుసారముగనే వచ్చినవనియును, దుష్కర్మములు దుఃఖానుభవముచేతఁ బరిసమాప్తి నొందుననియు నిట్టి దుఃఖములచేఁ దప్తుఁడై పుటముపెట్టిన బంగారమువలెఁ దానును బరిశుద్ధుఁడై ప్రకాశింపఁ గలఁడనియు నెఱింగి దుఃఖములురానురాను గర్మశేషమునశించును గదా యని యార్తినే మఱియుఁ గోరుచు నీ తితీక్షయనుగుణము నభ్యసించును. దుఃఖములును, గష్టములును రాకయే యీ సుగుణ మలవడుట దుస్సాధ్యము కానఁ బరమదయానిధియగు భగవంతుఁడు తనబిడ్డల నిశ్రేయస్సాధనములుగ దుఃఖజాలములను గర్మానుసారముగఁ గూర్చుచున్నాఁడు.

ఐదవది శ్రద్ధ—అనఁగా శాస్త్రములును, ఆచార్యులు చెప్పువాక్యములును బరమపురుషార్థ సాధనములని దృఢముగ విశ్వసించి యనుష్ఠించుచుఁ దానింకను దత్త్వమును జక్కఁగాఁ దెలియఁజాలకయున్నను దా ననుష్ఠించు మార్గమునందుఁబూర్ణముగ నమ్మకము గలిగియుండుట.

శాస్త్ర ఆచార్యోక్తులయందెట్లు విశ్వాసముండవలెనో అట్లే తనయందుండు ఆత్మశక్తియందును గట్టినమ్మక ముండవలెను. తాను కేవల శక్తిహీనుఁడనను భావముండినను, శాస్త్రాచార్యోక్తులయందు విశ్వాసము లేకుండినను పూనికతో నీ యోగమార్గము నభ్యసించుట కుత్సాహము గలుగదు. కావున నీశ్రద్ధ నభ్యసింపవలయును.

ఆఱవది సమాధానము—అనఁగా నిష్టానిష్టము లొనఁ గూడినపుడు మనస్సు నిర్వికారముగనుండుట. సామాన్యముగ జనులకుఁ బ్రియము ప్రాప్తించినపుడు హర్షమును అప్రియ మొనఁగూడినపుడు విషాదమును దుఃఖమును గలుగుట సహ జము. అట్టివారు రాగద్వేషములకు లోనై యుండువారు. రాగద్వేషములను జయించిన పిదప ఇష్టప్రాప్తియైనను, అనిష్ట ప్రాప్తియైనను వికారముచెందని మనస్సు గలిగియుండవలయు. కావున 'పరమగురుచరణసన్నిధి' అనుగ్రంథమున దీనిని 'ఏకాగ్రత'యని వర్ణింపఁబడియున్నది.

ఈయాఱుగుణములను గొంతవైన నభ్యసింపవలయును. ఈగుణములను వరుసఁగా నొకదానివెనుక మఱియొక్కటి యభ్యసింపఁదగు ననుటగాదు. వీనినన్నింటి నొకకాలముననే కొంచెము కొంచెముగ నభ్యసించి దృఢముగఁ జేసికొన వచ్చును. ఇవియన్నియుఁ బూర్ణముగ సాధించిన మోక్షమును సాధించినట్లే యెన్నఁదగు. కొంత యభ్యసించిన జ్ఞానోప దేశమున కధికారియగు. ఆపిదపఁ గాలక్రమమున నన్నియుఁ బరిపూర్ణములగును.

## IV. ముముక్షుత్వము

నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫలభోగవైరాగ్య ము, శమదమాది షట్సంపత్తియు నను నీసాధనత్రయము గాక నాల్గవది ముముక్షుత్వము. అది సంసారబంధములనుండి

విముక్తుఁడు గావలయు నని తీవ్రమగు నిచ్ఛ. తీవ్రమగు ముముక్షుత్వము లేక పైమూఁడింటినైనఁ బూనికతో నభ్యసించుట కుత్సాహము గలుగదుగదా!

ఇందుకొక దృష్టాంతమగు నితిహాసముగలదు. పూర్వ మొక శిష్యుఁ డొకతత్త్వవేత్తయగు గురువునొద్దకుం బోయి ముక్తిమార్గము నుపదేశింపుమని వేఁడెను. శిష్యుని మనోదార్ఢ్యమును బూనికను బరీక్షింప నాగురువు కాలముగడుపుచు రాఁగాఁ బలుమాఱు శిష్యుఁ డాదేశికుని బ్రార్థించుచు వచ్చెను. ఒక్కపర్యాయము దృఢమనస్సుతో శిష్యుఁడు గురువును బ్రార్థించెను. అతఁడాశిష్యునకు రాఁబోవు పర్వకాలమును దెలిపి యానాఁడు సాగరసంగమమునకు రమ్మని యాజ్ఞాపించెను. అట్లే యచ్చటి కాసమయమున కతఁడువచ్చెను. దేశికుఁ డాతని మొలబంటి నీటిలోనికిం దీసికొనిపోయి నీటిలోముంచి పైకి లేవకయుండఁ బట్టియుంచెను. నిశ్శ్వాసవాయువు బిగిసియుండ నతఁడు లోలోనఁ గొట్టుకొనుచుండఁగాఁ బ్రాణమున కపాయమువచ్చుదాఁక ముంచి విడిచిపెట్టెను. శిష్యుఁడు పైకి లేచి యాయాసము పోఁగొట్టుకొని స్తిమితమనస్కుఁడు కాఁగా శిష్యునితో గురువు నీటిలో మునిఁగియున్నప్పుడు నీకేమి కోరికయుండెనో చెప్పుమనియడుగ నాకూపిరి తిరుగుటకుఁ గొంచెము గాలియున్న నీసమయమున బ్రదుకఁగలనను కోరిక తప్ప వేఱెద్దియు లేదని విన్నవించెను. అప్పుడు గురువు శిష్యునితో నీటిలోనున్నప్పుడెంత దృఢమగు బ్రదుకుకోరిక గల్గెనో

యంత దృఢముగ మోక్షాసక్తి గలిగెనేని నేనప్పుడుపదేశించెదను. పొమ్మని పంపెను. కాఁబట్టి తీవ్రమగు మోక్షాసక్తి గలిగియుండవలయునని తెలియఁ దగు.

ఈసాధనము, 'పరమగురుచరణసన్నిధి' యందు ప్రేమ అని వర్ణింపఁబడియున్నది. యథార్థమగు ముముక్షుత్వమున కదియే అర్థము. మోక్షమనగా బంధములనుండి విముక్తికదా! ఆబంధములెవ్వి? జీవుఁడు, శరీరములతో తాదాత్మ్యము చెంది, శరీరము, ఇంద్రియములు, మనస్సులోనగు కరణములే తానను భ్రాంతికి లోనై, తాను, పరులు అనుభేదబుద్ధిగలవాడై, ఆకారణమున తనయందును, తనవారియందును రాగమును, తదితరులయందు ఉపేక్ష, ఉదాసీనభావము, ద్వేషమును గలిగియుండుట. వీనినుండి విముక్తుఁడగుట యన, తనయందును, సకలభూతములయందును ఆత్మతత్త్వము అంతర్యామిగా నిండియున్నదని యెఱింగి, రాగద్వేషములను త్యజించి, సర్వభూతసమత్వము నభ్యసించుటయే గదా! ఇదియే ప్రేమరూపముగ ప్రకాశించును. కావుననే తత్త్వజ్ఞులు ముముక్షుత్వమన ప్రేమయని నిరూపించియున్నారు.

ఇవ్విషయమును, 'పరమగురుచరణసన్నిధి'యందు విస్తరించి వ్రాయఁబడియున్నది. చదువరు లీఅధ్యాయముతో గూడ నాగ్రంథమును చదువదగు.

ఈనాల్గును సాధనచతుష్టయమనుపేర శ్రీ శంకరాచార్యుల వారు జ్ఞానమార్గమున నడువ యత్నించువారలకుఁ బూర్వాధి

కారముగ విధించియున్నారు. సాధనచతుష్టయసంపత్తి లేని వారలు పరవిద్యాజ్ఞానమున కధికారులుగారు. వీని నన్నింటిని గొంతవైన నభ్యసించినవారలే బ్రహ్మజ్ఞానమును గ్రహించుట కధికారులు. అట్టి వారికిఁగాని యితరులకీజ్ఞాన ముపదేశింపరాదని తత్త్వజ్ఞులగు మహాత్ముల యుద్దేశ్యము. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనఁగా నిఁకమీఁద బ్రహ్మవిచారము అని వేదాంతసూత్రములలో మొదటిసూత్రము. అందు "అథ" అనఁగా నిఁకమీఁదననుచో సాధనచతుష్టయము కొంతవైనను సాధించినపిదపనే యని యర్థము. ఈసాధనచతుష్టయసంపత్తి లేనివార లిక్కాలమున బ్రహ్మవిద్యా రహస్యములను శబ్దమాత్రముగ నేర్చికొని మహావాక్యముల యర్థమును స్వానుభవముచే నిరూపించుకొనకయే యావాక్యములను నోటనుచ్చరించుచు బ్రహ్మవేత్తలమని నటించుచు నితరుల కుపదేష్టలయి యితరులనుసహితము భ్రాంతులుగఁ జేయుచున్నవారు. "అంధేనైవ నీయమానా యథాంధాః" అనునట్లు తామంధులయ్యును నంధులగు నితరులకు మార్గదర్శులగుచుఁ దుదకు నుభయులును మార్గము తెలియక చిక్కులుపడుచున్నవారు. సులభమును నిరపాయమును నగు కర్మభక్తిమార్గములను వదలి దుస్సాధ్యమును, నపాయకరమును నగు నీ జ్ఞానమార్గము ననుష్ఠింపఁ బ్రయత్నించుటచే నుభయభ్రష్టులగుచున్నారు. కావున నెల్లవారును జిత్తశుద్ధిగలిగి నాలుగు సాధనముల దృఢముగఁ గొంతవైన నభ్యసింపకమున్ను జ్ఞానము

దెనకు నుద్యమింపకయుండఁదగు. ఈసాధనముల నభ్యసించి తేరి యధికారియగు మహనీయుఁడే జ్ఞానమార్గమున నడువఁ జాలును.

> నాయ మాత్మా బలహీనేన లభ్యో న చ ప్రమాదా
> త్తపసో వా ప్యలింగాత్ ॥
>
> (ముండకోపనిషత్.)

ఈనాల్గింటి నభ్యసించిన జీవుని బుద్ధి యతిశుద్ధమగు. అహంకార మమకారములు పూర్ణముగ నశించును. బుద్ధి మిక్కిలి సూక్ష్మమయి యింద్రియములు మనోబుద్ధులకు వశవర్తులగు. ఆహారాది నియమములచే శరీరములు పరిశుద్ధములగు. ఇవి గలిగిన జీవుఁ డాత్మజ్ఞానమున కధికారియగును.

ఆజ్ఞాన మెట్టిదియో శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునందు సంక్షేపముగ నిరూపించియున్నారు.

> అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ।
> అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవచ ॥
>
> (గీత. ౧౦-౨౦.)

సర్వభూతముల హృదయములయందుండు నాత్మస్వరూపుఁడను నేను. సమస్తభూతములకు మొదలనఁగా నుత్పత్తి కారణము నేను; మధ్యమనఁగా స్థితి కారణము నేను. అంత్యమనఁగా లయకారణము నేను; అనఁగా సమస్తభూతములు నానుండి వెలువడి యభివ్యక్తము లగుచున్నవి. నాయందే యున్నయవి. కడపట నాయందు లీనమగుచున్నవని తాత్పర్యము.

మఱియు నాత్మజ్ఞానమును విపులముగ వర్ణించుచు జ్ఞానలక్షణములను నిరూపించియున్నారు.

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః ॥
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ ।
జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ ॥
అసక్తిర నభిష్వంగః పుత్త్రదారగృహాదిషు ।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥
మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది ॥
అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।
ఏతజ్జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥

(గీత. ౧౩, ౮-౧౨)

అభిమానము లేకయుండుట యనఁగా నడఁకువ, దంభము లేకయుండుటయు, నితరుల కించుకయైన హానిచేయక యుండుటయు, నితరులయందలి దోషములను సహించి మన్నించునట్టిక్షాంతియు, న్యాయముతప్పక వర్తించుటయు, గురుశుశ్రూషయు, శౌచమును, స్థైర్యమును, నింద్రియములను మనస్సును స్వాధీనముచేసికొనియుండుటయు, విషయభోగములయందు వైరాగ్యము, నహంకారము లేకయుండుటయుఁ, బుట్టుట, చచ్చుట, ముసలితనము, రోగము మొదలగు వానియందలి దోషమును జూచుటయుఁ, బుత్త్రదారగృహాదులయందు రాగమును, దాదాత్మ్యమును లేకయుండుటయు, నిష్టము

ప్రాప్తించినపుడు సంతోషముగాని యప్రియము సిద్ధించినపుడు దుఃఖముగాని లేక యెల్లపుడు చిత్తసమాధానము గలిగియుండుటయుఁ, బరమేశ్వరుఁడును, వాసుదేవుఁడును నగు నాయందుఁ జలింపని యనన్యమగు భక్తియు, నేకాంతప్రదేశములయందుండ నిచ్ఛయు, జనసంఘమునం దుండవలయునను నాశ లేక యుండుటయు, నాత్మవిషయజ్ఞాన మెల్లప్పుడు మఱవక యుండుటయుఁ, బరమాత్మతత్త్వమును స్వానుభవముచేఁ దెలిసికొనుటయు, నివియన్నియు జ్ఞానమనఁబడును. ఇవి కాని దంతయు నజ్ఞానమని యెఱుంగఁదగు. పైనఁజెప్పఁబడిన లక్షణములం గలిగియుండుటయే జ్ఞానమని బోధించి శ్రీకృష్ణభగవానులు మఱియు నీజ్ఞానముగలుగుటవలని ఫలము సహితము వచించియున్నారు. 'యజ్జ్ఞాత్వామృతమశ్నుతే' యని యీ జ్ఞానమువలన మర్త్యుడమృతత్వమునుబొందునని వివరించిరి.

జ్ఞానస్వరూపమును నిరూపించి జ్ఞానవిషయమగు జ్ఞేయము నిట్లు భగవంతుఁడు నిరూపించియున్నాఁడు.

అనాదిమ త్పరం బ్రహ్మ న సత్త న్నాస దుచ్యతే ॥
సర్వతః పాణిపాదం తత్స ర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి ॥
సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్ ।
అసక్తం సర్వభృ చ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥
బహిరంత శ్చ భూతానా మచరం చర మేవచ ।
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికేచతత్ ॥
అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్ ।

భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥
జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్ ॥

(గీత. ౧౩, ౧౩-౧౭.)

వేద్యమగు తత్త్వ మాదిమధ్యాంతరహితమును, సత్స్వరూపమును నసత్స్వరూపమును గాక యెల్లయెడల పాదములను, హస్తములను, జక్షుస్సులను గలిగి సర్వమును వ్యాపించి యున్నది. ఆ తత్త్వము జ్యోతులలో నన్నింటిలో నెక్కుడు జ్యోతియు, నంధకారమునకు నతీతమగునదియు నయి యున్నది. జ్ఞానమును, జ్ఞేయమును, జ్ఞానగమ్యము ననఁగా నెఱుకయు నెఱుఁగఁదగినదియు నెఱుకచేఁ బొందఁదగు ప్రాప్యస్థానమును నీమూఁడు నొక్కటియై యున్నది.

ఇట్లు ప్రపంచమునందు వాఙ్మానసగోచరమగు నదియంతయు నాబ్రహ్మస్వరూపమే. అనఁగా నెద్దానిని జూచినను అవ్యక్తమగు బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపముగ భావింపఁదగునేగాని కేవలముపాధిని మాత్రము గమనించరాదు. అన్నింటియం దంతర్యామియైన చైతన్యము నెఱుంగవలయును గాని యాచైతన్యమునావరించియుండు ప్రాకృతరూపమును మాత్రము నెఱుంగఁ బ్రయోజనములేదు. అది యజ్ఞానము. ఆత్మవిషయమును బోధించునదియే విద్యయనఁబడునుగాని యాత్మవ్యతిరిక్తమగుపదార్థమొక్కటియు లేమింజేసి యాత్మేతరవిషయములను బోధించు విద్యలును శాస్త్రములు నన్నియు

నవిద్యలే. మొదటఁ బ్రకృతిబోధకములుగనుండి కడపట నాత్మబోధకసహాకారము లగుటచే నపరవిద్యలన్నియు సనాతనమగు పరవిద్యాకళలుగ నెన్నఁబడు. కావుననే బయట చూచుటకు భిన్నభిన్నములుగఁ గన్పడు షడ్దర్శనము లొక్కొక్కటియు నాపరతత్త్వజ్ఞానమునకు సాధనములుగ నిరూపింపఁబడియున్నవి. అన్ని విద్యలు నన్ని మార్గములును భగవత్తత్త్వమును దెల్పుటకు సహాకారములుగను భగవత్సన్నిధానమును జేర్చుటయందు సమర్థములును నై యున్నవి. ఆత్మతత్త్వమును నిరాకరించు విద్య యెన్నఁడును విద్యగా నెన్నఁబడదు.

> చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
> కుంభినీధవుఁ జెప్పెడు గురుఁడు గురుఁడు
> తండ్రి హరిఁజేరుమనిచెప్పు తండ్రి తండ్రి ॥
>
> (ఆంధ్రభాగవతము. 8 స్కంధము.)

లోకమునందు బహురూపములుగఁ బ్రాకృతములగు నింద్రియములకు గోచరములగు విషయము లన్నింటియందును నప్రాకృతమగు నాత్మతత్త్వ మంతర్యామిగ వెలుంగుచున్నది. ఇట్లు నానాత్వమునం దేకత్వమును జూడఁదగు.

ఆత్మ యేకము, నద్వితీయము, క్రియారహితము నగు. కనఁబడు వ్యాపారమంతయుఁ బ్రకృతిసంబంధమైనది. ఆత్మ సర్వత్ర వ్యాపించియుండుటచేత నచలము. చలనమనఁగా నున్నస్థలమునుండి మఱియొకస్థలమునకు గమనముగదా! అంతట వ్యాపించియుండు తత్త్వ మెచ్చటనుండి యెచ్చటికి గమ

నము చేయును? ఆత్మలేనిస్థలము సూదికొన మోపఁజాలినంత గాని లేదు. చలన మనునపుడెల్ల నాత్మయే ప్రకృతిని జలింపఁ జేయుచున్నదని యెఱుంగఁదగు. చలించునది ప్రకృతియే. ఎంత సూక్ష్మచలనమైనను ప్రకృతిసంయోగము లేక సంభ వింపదు. కావున నాత్మ క్రియారహితము.

> ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
> యః పశ్యతి తథా త్మాన మకర్తారం స పశ్యతి ॥
>
> (గీత. ౧౩-౨౯.)

మఱియు లోకమునఁ గన్పడు మార్పులన్నియును త్రిగుణాత్మకమగు ప్రకృతియందుఁ గన్పడునవిగాని యాత్మయందుఁ గానరావు. పుట్టుటయుఁ, గిట్టుటయు, వృద్ధిక్షయములు ప్రకృతి సముదాయములందుఁగాని యాత్మకు లేవు. ఇట్లు నిత్యమగు నాత్మకును ననిత్యములగు రూపసముదాయములకును గల భేదము వివేకముచే నెఱుంగఁ దగు.

> యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ (గీత. ౮-౨౦.)
> వినశ్యత్స్వ వినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥
>
> (గీత. ౧౩-౨౭.)

ఈ మొదలగు వాక్యములయందు నశించునది యనఁగా మాఱునది. ప్రకృతి మాఱుచుండు. రూపములయం దెల్ల నాశ రహితమైనది యాత్మ.

> ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ॥
>
> (గీత. ౧౮-౬౧.)

సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ॥
(గీత. ౧౩-౨౭.)

అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః ॥
(గీత. ౧౦-౨౦.)

ఈయాత్మ సర్వభూతములయందు సమముగఁ బ్రకాశించు చున్నయది. సాత్వికములుగాని, రాజసములుగాని, తామస ములుగాని, యీయన్ని రూపములయం దాత్మ సమముగఁ బ్రకాశించుచునేయున్నది. కావున ఆత్మవేత్త వీనినన్నింటిని సమబుద్ధితోఁజూచును. ఆత్మవేత్త కాఁగోరువాఁ డట్లు సమ బుద్ధి నభ్యసింపవలయును.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః ॥ (గీత. ౫-౧౮.)

ఉత్కృష్టములగు వస్తువులందును నికృష్టములగు రూపము లందును సుందరములగు భూతములయందును, జూచుట కసహ్యములగు రూపములందును, బ్రహ్మవేత్తయందును, క్రూరచిత్తునందును, పాషాణమునందును, బ్రహ్మయందును సమముగ నాత్మ వ్యాపించియున్నది గావున వీనినన్నిటిని సమ బుద్ధిచేఁ జూచుటయె జ్ఞానము. ఈశ్వరుఁడు సర్వభూతముల యందును జీవకళగాఁ బ్రకాశించుచుండుటచేత సర్వభూతము లకు దండప్రణామము లాచరింపవలయునని శ్రీకృష్ణులు తన ముఖ్యశిష్యుఁడగు నుద్ధవునకు బోధించిరి. ఇదియ యుత్తమ మగు జ్ఞానమని వచించిరి.

బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేర్కే స్ఫులింగకే ।
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః ॥

* * * * *

విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం చ దైహికీం ।
ప్రణమేద్దండవద్భూమా ఆశ్వచండాలగోఖరం ॥

* * * * *

యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే ।
తావదేవ ముపాసీత వాఙ్మనఃకాయవృత్తిభిః ॥

(శ్రీభాగవతము, ౯-౨౯, శ్లో. ౧౪, ౧౬, ౧౭.)

బ్రాహ్మణుని, అంత్యజుని, దొంగను, మహాదాతను, సూర్యుని, మిణుగురును, శాంతుని, క్రూరుని, సమదృష్టితో చూచువాడె పండితుఁడు.

పరిహాసముచేయు స్వజనులను విడనాడి శరీరముతో పుట్టిన భేదదృష్టిని లజ్జనుసైతము విడిచి, కుక్క, చండాలుఁడు, గోవు, గాడిదె మొదలగు సర్వభూతములకు భూమిపై సాష్టాంగదండ ప్రణామములు చేయవలయును.

ఎంతకాలమైతే సర్వభూతములయందు నాభావము (అనగా ఈశ్వరభావము) కలుగకయుండునో అంతవఱకు పైచెప్పిన విధమున మనోవాక్కాయములతో నన్ను ఉపాసన చేయవలయును.

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమా నోపి స యోగీ మయి వర్తతే ॥

(గీత.)

ఐనను సర్వభూతములయం దాత్మను జూచుటయెట్లు సిద్ధించును? అజ్ఞానియందును జూదగానియందును మోసగానియందును బ్రహ్మఘాతకునందును, బ్రహ్మవేత్తయందును సమత్వమెట్లనుష్ఠింపనగును? అనియడిగిన వీరియందఱియందు నాత్మకళ యుండియే యున్నది. అందఱును నానావిధములగు ననుభవములను బొంది వానినుండి గ్రహింపఁదగు జ్ఞానము నంతయు గ్రహించి కడపట నాత్మవేత్తలు గాఁదగియే యున్నవారు. అందఱియందును నీరీతి నాత్మ బీజరూపములగు తనశక్తులను వికసింపఁజేసికొనుచున్నది. వృక్షమందలిశక్తి యొకచో లేఁత మొగ్గగను, మఱియొకచోఁ బక్వమై వికసింప నాసన్నమై యుండుమొగ్గగను, ఇంకొకచోట వికసించిన పుష్పముగను, వేఱొకచో లేఁతపిందెగను, గాయగను, మఱియొకస్థలమునఁ బక్వమగుఫలముగను, నానావిధరూపములు గలిగియున్నను అన్నియు యథార్థముగ నొక్కవృక్షములోఁ బుట్టి యొకస్వభావముగలిగి సమముగనుండున ట్లాత్మకళ నానానామరూపములు గల యన్నిభూతములయందు సమముగ నున్నది. అన్నింటియందును దుది నాత్మగుణము లన్నియుఁ గాలానుసారముగఁ బ్రకాశింపనున్నవియేగాని వేఱొకపదార్థ మొక్కటియు లేదు. కావున ఘోరరూపముగనున్నను, లావణ్యస్వరూపముగ నున్నను, జ్ఞానస్వరూపుఁడుగ నున్నను, నజ్ఞానపుంజముగ నున్నను, దయాసముద్రుఁడుగ నున్నను, క్రూరచిత్తుఁడుగ నున్నను, నందఱియందు నాత్మ ప్రకాశించుచున్నది. హేయ

ముగఁ గనఁబడు పదార్థమునందుండు నాత్మయుఁ గాలక్రమ మునఁ బరిణమించి యాత్మగుణములను బ్రకాశింపఁ జేయును. ఈరూపములన్నింటియం దనుభవముపొంది జ్ఞానమును గ్రహింపవలయును. కావుననేకదా భగవంతుఁడు తనవిభూతిని జెప్పుచో "ద్యూతం ఛలయతామస్మి" అని చెప్పుకొన్నాఁడు. బ్రహ్మవేత్తయందును, మూర్ఖునందును, గోవునందును, శునకమునందును, శ్వపచునందును సమత్వమునుజూచి యాత్మభావన చేయవలయును. ఇట్లు చూచుటయే యథార్థ జ్ఞానము.

అట్లేకత్వమును జూచువాని కజ్ఞాన ముండనేరదు. అజ్ఞానము నశించి యజ్ఞానజాతములగు శోకమోహములు సయితము నశింప నానందస్వరూపుఁ డగు.

> యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవా భూ ద్విజానతః ।
> తత్ర కో మోహః క శ్శోక ఏకత్వ మనుపశ్యతః ॥

(ఈశావాస్యము.)

ఏవస్తువును జూచిన నావస్తువునం దాత్మ యేవిధముగఁ బరిణామముచెందుచున్నది? ఎట్టిజ్ఞానము నీరూపమునఁ జెందఁ జాలును? అని యోచించుచుండిన నొక్కొక్కరూపమును బ్రపంచమున సార్థకముగఁ గన్పడును. అట్లుగాక హేయగుణములను మాత్రము చూచుచు, ద్వేషించుచుండినఁ బ్రకృతి సంబంధములగుగుణములు మాత్రముగనఁబడునే గాని యాత్మజ్ఞానము బుట్టఁజాలదు. అన్ని భూతములందు నాత్మశక్తి వికా

సించుచుండుటను జూడను జూడను భూతము లన్నియు భగవం
తుని మహిమను బ్రకటించునవిగఁ దెలియ వచ్చునేగాని వేఱు
కాదు. కావున నెల్లయెడల నాత్మనే సమముగఁజూడఁదగు.
ఇదియే సుజ్ఞానము. ఇట్లు చూచువాఁడే యాత్మవేత్త. ఇదియే
జ్ఞానయోగము.

జ్ఞానియగువాఁ డాత్మకళను సర్వమునఁ జూచుచుండును.
అజ్ఞానియయిత మాత్మప్రకాశమునే యెల్లచోటులం జూచును
గాని యాత్మప్రకాశమని యెఱుంగఁడు. లోకమున నొక్కొ-
క్కఁడు ననేకములగు విషయములఁ బ్రేమించుచున్నాఁడు.
ఆవిషయములయందు బ్రేమాస్పదమగున దెద్దియేని యొకటి
యుండనిచో దానినేల ప్రేమించును? ఒక్కొక్కవిషయము
నందును మనస్సును రంజింపఁజేయునదియును, సుఖము నీజాలు
నదియు నెద్దియే నొక్కటి యుండవలయును గదా! అది
యంతయు నాత్మతేజస్సే యని గ్రహింపఁదగు. పామరుఁడు
రూపలావణ్యాది గుణసముదాయమునుజూచి యొకరూపమును
బ్రేమించినను, అచ్చట నాత్మలేనిచో నాగుణములు ప్రకా
శింపవు. వానికిం గానరావు. లోకమునం గన్పట్టు సకలసౌం
దర్యములును, సకలప్రకాశములును, నాత్మయునికిచేఁ గలుగు
నవిగాని వేఱువిధమునఁ గాదు. రూపములందుఁ గానవచ్చు
రమణీయత్వమంతయు వానియందాత్మయుండుటచే వానియం
"దారోపితరమణీయత్వము" గాని యారూపములయందు
నైజమగునదిగాదు. ఈయర్థమును గీతాశాస్త్రమునందు

యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా ।
తత్తదే వావ గచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్ ॥

(గీత. ౧౦-౪౧.)

లోకమునం దైశ్వర్యవంత మైనదిగాని, ప్రకాశ మైనదిగాని విశేషోత్సాహముతోఁ గూడుకొనునదిగాని వస్తు వెద్దియున్నను అది యొక్కొక్కటియు నా తేజస్సులోఁ గళామాత్రము దాని యందుఁ గలిగియుండునదిగఁ దెలిసికొనుమని భగవంతుఁ డర్జునునకు బోధించెను. కావున లోకములో నెద్దియేని రమణీయముగ నుండిన నద్దాని కారమణీయత్వమును గలుగఁ జేయునది యాత్మయేయని నిశ్చయము. ఈవిషయము నే మైత్రేయికి నామె భర్త యాజ్ఞవల్క్యమహర్షి సుందరవాక్యములతో నుపదేశించియున్నాఁడు.

న వా అరే జాయాయై కామాయ జాయా ప్రియా భవత్యాత్మన స్తు కామాయ జాయా ప్రియా భవతి. న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవ త్యాత్మ నస్తు కామాయ పతిః ప్రియో భవతి . . . . . . న వా అరే దేవానాం కామాయ దేవాః ప్రియాభవంత్యాత్మనస్తు కామాయ దేవాః ప్రియా భవంతి ॥

(బృహదారణ్యకము.)

తా. భార్యకొఱకు భార్యను ప్రేమింపరు. భార్యయందలి యాత్మకొఱకు భార్యప్రియమగు. భర్తకొఱకు భర్త ప్రేమింపఁబడఁడు. ఆత్మకొఱకే భర్తప్రియుఁడగు. ఇట్లొక్కొక్కవస్తువును దనంతటఁ బ్రీతిఁగొలుపదు. ఆత్మకొఱకుఁ బ్రియమగు. అట్లు దేవతలు నయితము దేవతలేయని ప్రేమింపఁబడరు.

ఆత్మకొఱకుఁ బ్రియులగుచున్నారు. ఇట్లాత్మ పరమప్రియమై యుండనియెడల నొక్కటియు లోకమునఁ బ్రియరూపముగాఁ బ్రకాశింపఁజాలదు. స్థితిగూడ నసాధ్యము. సర్వేంద్రియములకు రమణీయములగు విషయములందు నంతర్యామిగా నున్న నాత్మను గ్రహింపఁదగు. ఇట్లాత్మ నెల్లచోఁ జూచుచు, వినుచు, ధ్యానించుచు నాత్మసాన్నిధ్యమును జెందఁదగు.

ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః ॥
(బృహదారణ్యకము.)

ఇవ్విధమున నాత్మ నెందుఁ జూచుచుండఁ దనయం దుండు నాత్మయు సర్వభూతములయందుండు నాత్మయు నొక్కటి యను జ్ఞానము క్రమక్రమమునఁ బొడము. కాలకర్మపరిపాకముకాఁగా పరమదయానిధియగు మహాగురువు తత్త్వోపదేశము చేయును. "తత్త్వమసి" యను మహావాక్య ముపదేశించిన బ్రహ్మాత్మైక్యజ్ఞానము పరోక్షముగఁ గలుగు. యథార్థమగు నాత్మజ్ఞానము కాలక్రమమునఁ బ్రతిమనుజునకుఁ దనయందే గలుగవలయునుగాని యితరు లెంతమహనీయులైనను దానిని బుట్టింపఁజాలరు. "తత్త్వమసి" యను మహావాక్య మాచార్యోపదిష్టమై శిష్యుఁడు దానియర్థమును మననము, నిదిధ్యాసనముచేయఁ బిదప బహుకాలమునకు నాత్మయందు "అహం బ్రహ్మాస్మి" యనుజ్ఞానము పుట్టుచున్నది.

తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి ॥
(గీత. ४-38.)

ఆ జ్ఞాన మాత్మయందే పుట్టుచున్నది. అట్టిజ్ఞానము పరోక్షమైనను మహాగురువులచేత నుపదేశింపఁబడును. అట్టి యుపదేశమును బొందుటకు జ్ఞానులును దత్త్వదర్శులునగు మహాత్ములను యోగ్యుఁడగు శిష్యుఁడు విధిపూర్వముగ సమీపించి శుశ్రూషచేసి పరతత్త్వమునుగుఱించి ప్రశ్నచేయఁగా వారుపదేశించెదరని గీతాశాస్త్రమున శ్రీకృష్ణులు వచించియున్నవారు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

(గీత. ౪-౩౪.)

అట్టి గురువులు శాస్త్రజ్ఞానముమాత్రము గలిగిన వారుగ నుండినఁ జాలదని "జ్ఞానిన స్తత్త్వదర్శినః" అని రెండు విశేషణములు నిరూపింపఁబడినవి. శాస్త్రజ్ఞానము గలిగియుఁ దత్త్వమును స్వానుభవముచే నెఱింగినవారుగ నుండవలయు. అట్టి జ్ఞానమును గురుముఖమునఁ బరోక్షముగ మొదటఁ బొందుటకైనను శిష్యునిలక్షణములు సయితము భగవంతుఁడే నిరూపించియున్నాఁడు.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరే ణాధిగచ్ఛతి ॥

(గీత. ౪-౩౯.)

యథార్థశ్రద్ధననఁగా గురువాక్యమునందు నిశ్చలమగు విశ్వాసమును గలిగియుండవలెను. జగదీశ్వరునియందు నిశ్చల

మగు భక్తిగలిగి యీశ్వరుఁడే "పరాగతిః" అని దృఢమగు నిశ్చయము గలిగియుండవలెను. ఇంద్రియములను జక్కఁగ స్వాధీనము చేసికొనియుండవలయును. ఇంద్రియ మనస్సుల స్వాధీనముచేసికొని యీశ్వరునియందు సదా భక్తిగలవాఁడై గురువాక్యమునం దత్యంతాస్తిక్య బుద్ధిగలవాఁడయిన శిష్యునకు జ్ఞానులును, దత్త్వదర్శులును నగు గురువులు బ్రహ్మాత్మైక్య జ్ఞానమును బోధింతురు. అట్లుపదేశము నొందిన పుణ్యాత్ములకుఁ జిరకాలము మనననిదిధ్యాసనములవలన నపరోక్ష జ్ఞానము తనంతట నాత్మయందే పుట్టును. గురువాక్యమును శ్రద్ధతోడ మననముచేసి నిదిధ్యాసనముచేయు ప్రశాంతమగు మనస్సున నాత్మస్వరూపము పూర్ణముగ ప్రకాశించును. అప్పుడు "అహం బ్రహ్మాస్మి" యను జ్ఞానము కలుగఁగా యథార్థముగ బ్రహ్మవేత్తయై "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" యను నట్లు బ్రహ్మస్వరూపుఁడే యగుచున్నవాఁడు. అట్టి మహాపురుషుఁడు శరీరధారియయ్యు ముక్తుఁడేయగు; జీవన్ముక్తుఁడనఁదగియుండు. అట్టి మహాత్మునకుఁ బ్రపంచమంతయు బ్రహ్మాండము లన్నియు వేద్యములే. వారికి గోచరముగాని దొక్కటియు నుండదు. మాయను జయించిన వాఁడగు. త్రిగుణాత్మికయగు ప్రకృతి యామహానుభావునకు లోఁబడినదియే. ఆతఁడు గుణముల కతీతుఁడై వర్తించు. అట్టి పురుషుఁడు లోకమున నెట్లు వర్తించుననఁగా శ్రీకృష్ణుఁడే గీతాశాస్త్రమున రెండవ యధ్యాయాంతమున స్థితప్రజ్ఞుని లక్షణ

ములుగను, బండ్రెండవ యధ్యాయాంతమునఁ బరమభక్తుని లక్షణములుగను, బదునాల్గవయధ్యాయము తుదను గుణాతీతుని లక్షణములుగను వివరించియున్నారు.

ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే ॥
దుఃఖే ష్వనుద్విగ్నమనా స్సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధ స్థ్సితధీ ర్ముని రుచ్యతే ॥
య స్సర్వత్రా నభిస్నేహ స్తత్త త్ప్రాప్య శుభాశుభమ్ ।
. . . . . . . . . . . . . . . .
రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియై శ్చరన్ ।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ॥

(౨ అ. శ్లో. ౫౫-౬౪.)

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ ॥
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మే భక్త స్స మే ప్రియః ॥
యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః ।
హర్షామర్షభయక్రోధై ర్ముక్తో య స్స చమే ప్రియః ॥
అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యధః ।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః ॥
యో నహృష్యతి నద్వేష్టి న శోచతి న కాంక్షతి ।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః ॥
సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః ॥
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్ ।

అనికేతస్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥
యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥

(గీత. ౧౨ అ. శ్లో. ౧౩-౨౦.)

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥
ఉదాసీనవదాసీనో గుణై ర్యో న విచాల్యతే ।
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥
సమదుఃఖసుఖ స్స్వస్థ స్సమలోష్టాశ్మకాంచనః ।
తుల్యప్రియాప్రియోధీర స్తుల్యనిందాత్మసంస్తుతిః ॥
మానావమానయో స్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥

(గీత. ౧౪ అ. శ్లో. ౨౨-౨౫.)

మనోగతములగు కామము లన్నిటిని సంపూర్ణముగ వదలి యెప్పుడు నాత్మయందే యానందించుచుండు. దుఃఖములుగలిగి నప్పుడు మనస్సున కలవిలపాటొందడు, సుఖమునం దుప్పొంగడు. సుఖాసుఖము లేవి ప్రాప్తించినను నిర్వికారుఁడై రాగద్వేషములు పూర్ణముగ విడిచియుండును. సర్వభూతముల యందును మిత్రభావము గలిగి సుహృదుఁడై యుండు. నేను, నాది, యనుభావములు వెదకినను గానరావు. ఏకార్యము చేయుచున్నను మనోబుద్ధుల నీశ్వరునియం దర్పించి స్వామి భృత్యన్యాయమున లోకహితమును కోరినవాఁడై కర్మములఁ జేయుచుండును. లోకులు లోకదృష్టిచేఁ గీడుచేసినను, మేలుచేసి

నను, దూషించినను, భూషించినను, సన్మానించినను, అవమానించినను, సదానందుఁడై యొక్కదానియం దాశ యుంచక యాత్మారాముఁడై యుండు.

గుణాతీతుఁడయ్యును గుణములచేష్టలను ద్వేషింపఁడు. లేని విషయములను గోరఁడు. సంప్రాప్తమైనవానిని ద్వేషింపఁడు. సుఖదుఃఖములయందుఁ దుల్యముగఁ జూచుచు, మట్టిని, ఱాతిని, బంగారమును ఒక్కదృష్టితోఁ జూచుచుఁ బ్రియాప్రియములను, నిందాస్తుతులను, మానావమానములను నొక్కరీతిగ నెంచుచు, మిత్రులను శత్రులను నొక్కవిధముగఁ బ్రేమించుచు స్వప్రయోజనకరములగు కర్మముల నొక్కటియుఁ జేయ నపేక్షించక యుండును.

వీరలు లోకమున నిట్లు వర్తించుచు లోకహితార్థ మీశ్వరుని ప్రతినిధులుగ వర్తించుచు వేఱుద్దేశ్యములేక సర్వకార్యములు లోపములేక చేయుచు శరీరముండునందాఁకఁ గాలము గడుపుదురు. ఇట్టివారలు బ్రహ్మవేత్తలు. బ్రహ్మవేత్తలగు వారలు పైన సూచించిన రీతిని బ్రవర్తనము వలన నెఱుంగఁబడుదురు. మహావాక్యముల నోటితో వచించుచు, బ్రహ్మవేత్తలమని లోకమునఁ బ్రకటించుకొనుచు, విషయసుఖముల రమించుచు, నింద్రియములు విషయములలోఁ బ్రవర్తించుచున్నవిగాని నేను సాక్షియగు బ్రహ్మస్వరూపుఁడనని నోటి మాటలతోఁ జెప్పుకొనుట బ్రహ్మవేత్తలకు లక్షణము గానేరదు. బ్రహ్మవేత్తలు లోకమునకు మేలుచేయుదురు. తమకు

సుఖము నించుకయైనను గోరకుండుటయే కాక సాధ్యమైనంత మట్టుకు దానికి విముఖులై యుందురు. ముందు వివరించిన రీతిని సాధనచతుష్టయమును బూర్ణముగ సాధించి నిస్సంగియై, లోకమున నొక్కఁడానిని గోరక కుటీచకుఁడై, యాత్మయందు దృఢనిశ్చయము గలిగి బహూదకుఁడై, యాత్మయే తానను జ్ఞానము పుట్టఁగా హంసయై, యోగాభ్యాసముచే నాత్మసాక్షాత్కారముకాఁగాఁ బరమహంస యగుచున్నాఁడు. ఈ రీతిని సాధనచతుష్టయసంపత్తి కొంత గలిగినది మొద లపరోక్ష జ్ఞానము లభించుదనుక నాలుగుసోపానము లేర్పఱుపఁబడినవి. ఈసాధనసంపత్తిగలిగిన జీవుఁడు జ్ఞానమున కధికారియై కారణగురువుల కటాక్షమునకుఁ బాత్రుఁడై యుండును. అపు డదృశ్యుఁడుగ లోకహితార్థము వర్తించుచుండు కారణగురువు ప్రత్యక్షమయి సూక్ష్మములగుతత్త్వములను గ్రమక్రమముగ నుపదేశించును. ఈయుపదేశము స్థూలదేహమున వర్తించు జాగ్రదవస్థయందు సామాన్యముగ కాదు. స్వప్నమునను, సమాధియందును సూక్ష్మశరీరధారియగు జీవునకు సిద్ధించును. ఇదియే నిజమగు నుపనయనము. దానిని సూచించునదియే బాల్యావస్థయందు జరుగు నుపనయనము. అట్టి యుపదేశమైనది మొద లామహాత్ములు రక్షించి శిక్షింపఁగాఁ గాలక్రమమునఁ బరిపూర్ణుఁడగును.

ఇట్టి జీవుఁడు యథార్థమగు సన్న్యాసమున కర్హుఁడు. ఐహికములు నాముష్మికములు నగు సుఖములయందు దృఢమగు

వైరాగ్యము గలిగియుండుటచేతఁ దత్సాధనములగు కర్మము లను బూర్ణముగ విడిచి కేవల జ్ఞానసాధనముల వెదకుచుండు. ఇట్టి పరమార్థజ్ఞానమును బడయుటకు యోగాభ్యాసము ముఖ్య సాధనము. కనుక నద్దాని నభ్యసింపవలయు. ఈయోగవిష యము మఱియొక యధ్యాయమున విస్తరింపఁబడును.

(౧౬ వ అధ్యాయము చూడుడు.)

ఐహికాముష్మికములలో నొక్క విషయమునందును మనస్సు రమించకుండియు నొకయింటనుండుఁ గావునఁ కుటీ చకుఁడనఁబడును. పిదప నాయిల్లును వదలి స్థిరనివాసము లేక గ్రామైకరాత్రముగఁ దిరుగుచు నాత్మయందు స్థిరాభిలాషగల వాఁడగుచు బహూదకుఁడనఁబడు. బహూదకుఁడు కుటీచకున కంటె నొక్క మెట్టు మీఁదివాఁడు.

రెండవస్థితియం దాత్మయందు దృఢమనస్సు గలవాఁడగు. ఈస్థితియందుండి మరలి సంసారమోహమునఁబడ నవకాశ ముండదు. ఆత్మస్వరూపమును జక్కఁగ గ్రహింపలేక పో యియు నాత్మయొక్కటియే వేద్యమగు తత్త్వమను దృఢ భావము గలిగియుండు. ఆతత్త్వమును దెలిసికొనుటకు మనస్సు నేకాగ్రముగఁజేసి చిత్తవృత్తులను నిరోధించి యాత్మయందుఁ జేర్పఁగ్రమక్రమమున నాత్మస్వరూపము కొంచెము కొంచె ముగ గోచరమగు. ఇంద్రియములను విషయములనుండి మర లించి యింద్రియసుఖములను స్మరింపక యుండునట్లు మనస్సును నిలిపి నిశ్చలముసేయ నిర్వ్యాతిమగు స్థలముననుండు పరస్సున

నిశ్చలమగు జలమునందు సూర్యబింబము స్వచ్ఛముగను బరిపూర్ణముగను బ్రతిఫలించునట్లు శాంతమగు శుద్ధాంతఃకరణమున నాత్మ ప్రతిఫలించు. అపు డాత్మస్వరూపము స్వల్పముగ నెఱింగి యాయాత్మయే తాననుజ్ఞాన మంకురించును. అపుడు "హంస" యనునామమున నొప్పు. 'అహమ్ సః' నేనే యాయాత్మ అనుజ్ఞానము కొంచెము కలుగును. మఱియు నాయోగము దృఢముకాను కాను సూక్ష్మదృష్టి యభివృద్ధియై క్రమక్రమముగ స్థూలశరీరమును వదలి సూక్ష్మశరీరమున స్వతంత్రముగ వర్తించుటకు శక్తిగలుగఁగా నాస్థూలశరీరమ నాత్మయని స్వానుభవముచేఁ దెలిసికొనును. కాలక్రమమున వరుసగ నుపాధులన్నింటి నొకదాని వెనుక నొకదానిని విడిచి వానినన్నింటి ననాత్మగఁ దెలిసికొనుచు మనోవృత్తుల నన్నింటి ననాత్మ వికారములుగ నెఱింగి కడపట నాయుపాధుల నన్నింటి కంటె విలక్షణుఁడును ఉపాధుల కన్నింటి కధీశ్వరుఁడు నగు నాత్మను దెలిసికొనుచున్నాఁడు.

> హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మ నిష్కళమ్ ।
> త చ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్త ద్యదాత్మవిదో విదుః ॥
> (ముండకోపనిషత్తు.)

ఆత్మవేత్తలచే నెఱుంగఁబడు నాత్మ (బ్రహ్మ) తత్త్వము హిరణ్మయమగు (మహాప్రకాశకరమగు) ఉత్తమోపాధియందు నిర్మలమును, నిరవయవమును, శుభ్రమును, అయి, జ్యోతులన్నింటిలో విశేషప్రకాశమగు జ్యోతి.

ఆత్మయే తానని స్వానుభవముచే నెఱుంగు. అపుడే యథార్థముగ "అహం బ్రహ్మాస్మి" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యార్థము ననుభవించి యపరోక్షజ్ఞానము గలవాఁడగును. అపుడు పరమహంసయనఁబడును. ఇట్లపరోక్షజ్ఞానము గలిగిన వారలే పరమహంస పరివ్రాజకు లనఁదగిన వారు. ఇట్టి జ్ఞానము లేనివారియం దీశబ్దము నామమాత్రముగనేయుండు. వారలనుగుఱించి యేకదా "వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్న్యాసయోగాద్యతయశ్శుద్ధసత్వాః" అని శ్రుతులయందుఁ బ్రతిపాదింపఁబడియున్నది. వేదాంతవిజ్ఞాన మనఁగా వేదాంతమునందుఁ బ్రతిపాదింపఁబడినజ్ఞానము స్వానుభవముచే దృఢముగఁ జేయఁబడినపుడు విజ్ఞాన మనఁబడుచున్నది. కావున వేదాంతవిజ్ఞానమని యుపయోగింపఁబడెను. అట్టి దృఢజ్ఞానముచేఁ దత్త్వమును నిశ్చితమై యుండవలయు. అట్టివారలు పరమహంస పరివ్రాజకులు. వారలయం దహంభావ మిసుమంతయైన నుండదు. అట్టివారలను జేరి నమస్కరించుచో వారిని బ్రహ్మస్వరూపు లని యెంచుచు "నమో నారాయణాయ" యని నమస్కరింతురు.

ఇదియే జ్ఞానమార్గము. కడపట జ్ఞానము స్థిరమయి యాత్మసాక్షాత్కారము కాఁగా జ్ఞానయోగి యగు. ఆత్మస్వరూపము స్వానుభవముచే నెఱుంగ నుత్తమ మగు "పరాభక్తి" పుట్టక తీరదు. భక్తిజ్ఞానములు వికసింప లోకహితముపొంటెఁ గర్మములను జేయుచుఁ బరిపూర్ణకర్మియు నగు.

ఇట్లు మూఁడులక్షణములు పరిపూర్ణములై యిచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులను మూఁడింటిని బూర్ణముగఁ బ్రకాశింపఁజేయుచు, సచ్చిదానందస్వరూపుఁడై లోకమున వెలయు. ఇట్టివారు బ్రహ్మవిద్యానిధులై బ్రహ్మవేత్తలయి పామర జనులకుఁ ద్రోవఁ జూపుచుఁ బామరులై లోకమున నుండువారలకును, విదేహులైన మహాత్ములకును, మధ్యభాగమున నుండువారలై బ్రహ్మవిద్యా రహస్యములు లోకమున నశింపక యుండ రక్షించుచు మానవకోటికి రక్షకులై వర్తించుచుందురు.

ముక్తినిగోరియు స్వార్థపరులైయుండుటయుఁ గలదు. ఐహికములగు వాంఛలను బూర్ణముగ వదలి స్వర్గసుఖములను సహితము గోరక యథార్థముగ నిష్కాములై వర్తించుచుండియు, భగవదర్పణముగఁ గర్మములం జేసి కాని, సగుణోపాసనము చేసి కాని చిత్తశుద్ధిఁ బూర్తిగ లేకుండుటచే సర్వభూత హితులు కాకయుండువారుం గొందఱు గలరు. వారలితరులను బ్రేమించుట బంధరూపముగ భావించుచు నీషణత్రయమును మాత్రము వదలి భూతహితమునుసహితము మఱచి యేకాంతముననే వర్తించుచు నెల్లవారి నొక్కరీతిగనే దూరస్థులనుజేయుచు స్వవిముక్తికాములై పరహితమించుక యేని చింతింపరు. అట్టివారు మరల నిహలోకమునఁ దత్కాలమున జన్మించుటకు వలయు బంధము లొక్కటియు లేమింజేసి యిహలోకజన్మము నిక్కాలమునం బొందరు. స్వర్గకాము

లును గామింజేసి స్వర్గముననుండు నవకాశము లేదు. సర్వభూతహితులు కాకయుండుటచేత సర్వభూతాత్మక మగు బ్రహ్మతాదాత్మ్యమును జెందినవారుకారు. అట్టివారు బ్రహ్మలోకమందుఁ గొంతదూరము పోయినను బోఁగలరుగాని మరల నేదో కాలాంతరమున సంసారమునం బ్రవేశించి "సర్వభూతాత్మభూతాత్మ" యగునందాఁక సంసారమున నుండవలసి యుండును. దీనినే

> ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినోఽర్జున ।
> మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥

(గీత. ౮-౧౬.)

బ్రహ్మలోకమువఱకుఁ బోయిన జీవులకుఁ బునర్జన్మము గలదు గాని పరబ్రహ్మస్వరూపుఁడను, వాసుదేవాత్మకుఁడను నగు నన్నుపాసించువారలకుఁ బునర్జన్మము లేదని గీతాశాస్త్రమున భగవంతుఁడు నొక్కి వక్కాణించియున్నాఁడు. ఇట్టివారి పునర్జన్మము సామాన్యులగు జీవులకుఁగలుగు పునర్జన్మవంటిదిగాదు.

సంసారచక్రమునకు బద్ధులై త్రిలోకములందుఁ బరిభ్రమించువారలవిషయము నిచ్చట చెప్పియుండలేదు. భేదబుద్ధి గలవారలై భగవంతుఁడు "సర్వభూతాంతరాత్మ" యను భావము లేక వివిధములగు నుపాసనలఁ జేయుచు లోకమున నుండు భూతముల విషయమగుచింత యెంతమాత్రము లేక స్వవిముక్తికాములై యుండువారలు బ్రహ్మలోకమునకుఁ

బోయినను మఱియొక బ్రహ్మకల్పమునందైనను జన్మమును బొంది సర్వభూతహితత్వము నభ్యసించి,

> సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
> ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ।
> యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
> తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥
> సర్వభూతస్థితం యో మాం భజ త్యే కత్వ మాశ్రితః ।
> సర్వథా వర్తమా నోపి స యోగీ మయి వర్తతే ॥
> ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
> సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమోమతః ॥
>
> (గీత. ౬-౨౯-౩౨ శ్లో.)

అను నీశ్లోకములయందు భగవంతుఁ డర్జునున కుపదేశించిన రీతిని సమస్త భూతములయందు నాత్మను జూచుచు, నాత్మయందు సమస్తభూతములను జూచుచు, సమాహిత చిత్తుఁడై, సర్వత్ర సమదర్శనుఁడై, సర్వభూతములను దనవలెఁ జూచుచు, భావించుచు, వాని సుఖదుఃఖములను దనసుఖదుఃఖములుగ నెంచుచు వర్తించువాఁడు నాయందు దనఁగాఁ బరబ్రహ్మమునందు వర్తించుచున్నాఁ డనఁదగు. అట్లు సర్వభూతసముఁడై సర్వభూతములయందుండు నాత్మతోఁ దాదాత్మ్యమును జెందుచుండు మహాత్ముఁడు పరబ్రహ్మముతోఁ జేరిన యోగియే యై పరబ్రహ్మ స్వరూపుఁడే యగుచున్నాఁడు. కావుననే యీపదవిం జెందిన శుకయోగి యౌవనమున నుండియుఁ గౌమారమగు శరీరము గలిగియుండియు మార్గమునఁ

బోవుచుండ నొకకొలనియందు వివస్త్రలై జలకములాడు చుండు స్త్రీలు వారిం జూచి మనోవికారమునొందక యూర కుండిరి. పిమ్మట వృద్ధుఁడగు వ్యాసమహర్షి యామార్గము న నే రాఁగా స్త్రీలందఱు సిగ్గుపడి పరుగెత్తి వస్త్రములనుధరించిరి. శుకుఁడు యౌవనముననుండియు బ్రహ్మభావముదప్ప వేఱు భావన లేక సర్వాంతర్యామిత్వమును బొందియుండుటచేతఁ బరపురుషుఁడనుభావము వారికిఁ గలుగలేదు. వ్యాసులవా రించుక "యహం ప్రత్యయము" గలిగియుండుటచేతఁ బర పురుషుఁడు వచ్చెనని లజ్జించిరి. ఇట్టి స్థితియందుండు శుకయోగి యరణ్యమున నొంటిగఁ బోవుసమయమున వ్యాసులవారు కుమారునియందుండు మమతచేత వెంటఁ జని యోహో కుమార యని పిలువఁ దరువులును బాషాణములును 'ఓ' యని ప్రతిధ్వనులిచ్చెనఁట. అట్టిపురుఁడు యథార్థ నుగు ముక్తుఁడు.

యం ప్రవ్రజంత మనుపేత మపేతకృత్యం
ద్వైపాయనో విరహకాతర ఆజుహావ ।
పుత్రేతి తన్మయతయా తరవోభినేదు
స్తం సర్వభూతహృదయం ముని మానతోఽస్మి ।

(శ్రీభాగవతము. ౧-౨-౨.)

మ. సముఁడై యెవ్వఁడు ముక్తకర్మచయుఁడై
సన్న్యాసియై యొంటిఁబో
వ మహాభీతి నొహో కుమార యనుచుడ్
వ్యాసుండు చీరంగ వృ

క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు
చక్కంజేసె మున్నట్టి భూ
తమయుం బ్రముక్కడ బాదరాయణిఁ దపో
ధన్యాగ్రణిం ధీమణిన్.

అట్టిశుకయోగి ముక్తుఁడయ్యును యథార్థముగఁ దీవ్ర మోక్షేచ్ఛ గలవారలకు బ్రహ్మజ్ఞానము నుపదేశించుటయే వ్రతముగఁ గలిగి పరీక్షిత్తున కుపదేశించు నెపమున లోకమునకు భాగవతకథలం దెలిపి లోకులను గృతార్థులను జేయుచు నేయున్నాఁడు.

---

## పదునైదవ యధ్యాయము

### భక్తిమార్గము

మోక్షసాధనములలో మూఁడవదియగు భక్తిమార్గము కర్మజ్ఞానమార్గములకంటె నిరపాయమును సుకరమును నగునది. కర్మమార్గమునం దధికారతారతమ్యములుగలిగి నానావిధములగు మనస్స్పర్ధల కవకాశమున్నయది. ఎల్లజనులకు నెల్లకర్మములు సులభసాధ్యములుగావు. కర్మములయం దేవిధమగు లోపములుండినను అవి ఫలముల నీయఁజాలక పోవుటయే గాక దోషములఁగూడఁ గలుగఁజేయును. భక్తిమార్గమున నట్టిప్రత్యవాయములు లేవు.

న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥

(గీత. ౬-౪౦.)

న మే భక్తః ప్రణశ్యతి ॥

(గీత. ౯-౩౧.)

అను గీతావాక్యములు దీనినే తెలుపును. జ్ఞానమార్గమన్ననో బహుదుస్తరమగునది. ఆమార్గమునఁ బోవుజీవుఁడు అసహాయుఁడై యొంటరిగనే పాటుపడవలయును. కొంచెము జ్ఞానము లభించినను అహంకారము వృద్ధియగుట కవకాశమున్నయది. సగుణోపాసన మార్గమునవే [illegible]విద్య సం

పాదించుట యెల్లభంగుల దుర్లభమై యుండ నవ్యక్తమగు నక్షర పరబ్రహ్మతత్త్వజ్ఞానమును సాధించుట యెంతకష్టమో అనుభవముగలవారికే వేద్యము. భక్తిమార్గ మన్ననో యెల్ల వారికి సాధ్యము; నిరపాయము. భక్తిమార్గముననుండువార లన్యోన్యసహకారులగుదురు. వైషమ్యముల కవకాశము లా మార్గమునఁ దక్కువగా నుండును.

అట్టి భక్తిస్వరూపము భక్తులకేగాని యితరులకు వేద్యము గాదు. కావున భక్తాగ్రేసరులగువార లాభక్తిస్వరూపము నెట్లు నిరూపించియున్నారో చూతము. భక్తాగ్రేసరులలోఁ జేరిన భగవంతుఁడగు శ్రీనారదుఁడు "సా త్వస్మిన్ పరమ ప్రేమా" అది భగవంతునియందుఁ బరమప్రేమస్వరూప మైనదని వచించెను. జ్ఞానమార్గముననుండువార లవ్యక్తమగు పరబ్రహ్మ తత్త్వము నెఱుంగఁగోరుచున్నారు. అవ్యక్తము నెఱుంగుట దేహధారులకు బహు దుస్సాధ్య మని భగవం తుఁడే చెప్పియున్నాఁడు.

> క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్త చేతసామ్ ।
> అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ।
>
> (గీత. ౧౨-౫.)

భగవంతులగు శ్రీశంకరాచార్యులును అవ్యక్తమును ధ్యాన ముచేయుట సాధ్యము కాదనియు, నవ్యక్తము నక్షరము నగు తత్త్వము "జ్ఞేయము" ఎఱుంగఁదగినదియే గాని "ధ్యే యము" అనఁగా ధ్యానింపఁదగినది గాదనియు స్పష్టముగ

శ్రీభగవద్గీతా భాష్యమున వ్రాసియున్నారు. సగుణబ్రహ్మ మనియు నీశ్వరుఁడనియు నెఱుంగఁబడుతత్త్వము నుపాసింప వచ్చును. భగవంతుని యవతారములగు శ్రీరామకృష్ణాదులనుగాని, ఆయామతస్థులచే భగవదవతారములుగ నుపాసింపఁబడు క్రైస్తు, బుద్ధుఁడు మొదలగు మహాపురుషులను గాని ధ్యానింపవచ్చును. మనస్సు దుర్బలము గావున నిట్టిరూపమును గుణములును గలవస్తువును భావనచేయనోపును. నిరాకారమును నిర్గుణమును నగు పరబ్రహ్మమును ధ్యానింప దుస్తరము. ఆ పరబ్రహ్మతత్త్వ మవిజ్ఞాతమని శ్రుతులు ఘోషించుచున్నవి. ఎంతమహనీయుఁడైనను ఆతత్త్వ మిట్టిదని వాక్కులచే నిర్వచింపఁజాలఁడు, మనస్సుచే గ్రహింపఁజాలఁడు. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" అను నుపనిషద్వాక్యమీయర్థమునే బోధించుచున్నది. కావుననే భక్తులకు నెల్లమతములయందును భగవంతుని లీలావతారములే యుపాసనార్హము లని నిరూపింపఁబడియున్నవి.

భక్తానుగ్రాహీ లీలావతారః ॥

భక్తులయనుగ్రహార్థము లీలావతారముల గ్రహించినవాఁడు భగవంతుఁడు. అవ్యక్తమును, అక్షరమును, నిర్గుణమును, నిరవయవమును, నిరంజనము నగు నాతత్త్వమును గించిజ్జ్ఞుఁడగు భక్తుఁడు తనయల్పమనస్సుచే గ్రహింపఁజాలఁడని యాబ్రహ్మతత్త్వము "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా

మ్యాత్మమాయయా” యన్నట్లు తనశ క్తిచేతనే తనకధీన మై యుండు ప్రకృతితోఁగూడి సగుణబ్రహ్మముగను, నానావిధ లీలావతారములుగను వ్య క్తమాయెను.

భ క్తిమార్గమున సగుణమగునీశ్వరుని భక్తుఁడు ప్రేమచే నుపాసించును. ప్రేమించుటకు సకలకళ్యాణగుణనిధి యగు దివ్య సుందర విగ్రహమును ఆలంబనముగ గ్రహింపవలయు. ఇట్టిప్రేమ నిర్గుణమును, నిరుపాధికమును, నిరవయవమునగు తత్త్వమందుఁ గలుగదు. దానియందుఁ బ్రేమాస్పద మొక్క టియును లేదు. జ్ఞానమార్గమునకు భ క్తిమార్గమునకుఁ గల ముఖ్యభేద మిదియ.

కావుననే భక్తాగ్రేసరుఁడగు నారదుఁడు “ఆస్మిక” అని యొకపురుషునందుఁ బ్రేమయని నిరూపించియున్నాఁడు. ఆ భగవంతునియందుఁ బ్రేమరూపము భ క్తి. ఉత్తమమగుప్రేమ యన సామాన్యముగఁ బ్రతిఫలమును గోరు ప్రేమగాదు. ఈ ప్రేమను నిరూపించుటయం దిట్లు వివరించిరి.

> నారద స్తు తదర్పితాఖిలాచారతా ।
> త ద్విస్మరణే పరమవ్యాకుల తేతి ॥

సర్వకర్మముల నుపాస్యునియం దర్పించుటయు నామూ ర్తిని స్మరించక మఱచినచో నపారమగు దుఃఖమును బొందుటయు, నాప్రేమయొక్క స్వరూపము. లోకమునఁ బరస్పరప్రేమాతి శయముగల వార లొండొరులయెడ నెట్లు వ ర్తించెదరో యూ

హించిన నీభక్తిస్వరూపమును గొంచెము గ్రహింపసాధ్యమగు. అట్టి ప్రేమాతిశయముచే బద్ధులగువారలలో నొండొరులకు భేదము కొంచెమైనను గానరాదు. ఇరువురు నొక్కరూపముగ భావింతురు. ఇరువురిమనోభావము లొక్కటియగుఁగాని వేఱుగ నుండఁజాలవు. ఒండొరులవియోగము దుర్భరము. వియోగము గలిగినను అన్యోన్యస్మరణ మెడతెగకయుండును. ఏకాలమునందుఁగాని యొకరినొకరు మఱవఁజాలరు. మఱువుదగులుటకంటె నధికమగు దుఃఖము వేఱుండదు. ఒకవస్తువుకంటె మనస్సునకు రమ్య మగుమఱియొకటి గలిగిననే గదా మొదటిది మఱవు దగులును? అట్టిది యొకటియు లేమింజేసి విస్మృతి యసాధ్యమనఁదగు. ఇట్టి ప్రేమ స్వల్పముగనైన మనోగోచరమైనచో భగవంతుని యందలి భక్తియిట్టిదని యూహింపఁజాలుదుము. నిష్కామమగు లౌకికప్రేమయే గ్రహింపలేనివారలకు భక్తి సాధ్యము గాదు. ఐహికసుఖసాధన మగు దృఢప్రేమ యింతబలకారిగను రమ్యముగను నున్నయది. ఇట్టిప్రేమయే నిరతిశయసుఖము నిచ్చును. అపారశక్తిమంతుఁడును, అభ్యుదయ నిశ్శ్రేయసముల నొసగూర్చు గురుస్వరూపుఁడును, నిర్వ్యాజకరుణయే స్వభావముగఁ గలవాఁడును, దివ్యమంగళవిగ్రహుఁడును నగు భగవంతునియం దర్పింపఁబడినచో నది భక్తియనఁబడును. ఈప్రేమయే పరమప్రేమరూపము. ప్రతిఫలమునుగోరి చేయు భక్తి వణిగ్వృత్తియని భక్తాగ్రేసరుఁడగు ప్రహ్లాదుఁడు చెప్పె.

నాఁడుగదా. మఱియు నారదుఁడు భక్తివలనఁ గలుగుఫల
ములఁ జెప్పియున్నాఁడు.

యల్లబ్ధ్వా పుమా న్సిద్ధో భవ త్యమృతో భవతి। తృప్తో
భవతి ॥ య త్ప్రాప్య న కించి ద్వాంఛతి, న శోచతి, న ద్వేష్టి।
న రమతే నో త్సాహీ భవతి ॥ య జ్జ్ఞాత్వా మత్తో భవతి। స్తబ్ధో
భవ త్యాత్మారామో భవతి ॥

నిజమగు నీభక్తిగలిగిన మనుష్యుఁడు సిద్ధుఁడగు. అమృ
తుఁడగు. తృప్తుఁడగు. మఱియు నీభక్తిని బొందినవాఁడొక్క
టియును గోరఁడు. శోకింపఁడు. ద్వేషింపఁడు. విషయముల
యందు రమింపఁడు. ఫలార్థియై యొక్కకర్మమును జేయఁడు.
ఆత్మయందే రమించుచు, మత్తుఁడై స్థిరుఁడై యానం
దించును.

భక్తుఁడు భక్తివలనఁ గామము లీడేర్చుకొనఁడు. భక్తి
త్యాగరూపమైనది; ఉపాస్యునకు సర్వమును నివేదించి వారి
ప్రసాదముతప్ప వేఱుకోరిక లేనివాఁడు భక్తుఁడు. "నివేద
యామి చాత్మానం త్వం గతిః పరమేశ్వర" భక్తుఁడు తనది
యగు సర్వము నుపాస్యుని కర్పించుటయేగాక తనను అనఁ
గాఁ దనమనస్సును, ఇంద్రియములను, శరీరమును వానికర్పించి
వాని స్మరణమునకంటె వాని కైంకర్యమునకంటె నుత్తమ
మగు సుఖముఁ గోరకుండు.

ఇదియే పరమప్రేమరూపమగు భక్తి. సామాన్యముగ
సంసారమున వర్తించుచుఁ బూర్వకర్మానుసారములగు శుభా

శుభ వాసనలం గలిగియుండు జీవుఁ డెట్టిట్టి యుత్తమ భక్తిని సాధింపనగునో విచారింపవలయును.

సామాన్యజనులు లోకమునఁ దమకు సుఖమునిచ్చు పదార్థములను జంతువులను మానవులను బ్రేమింతురు. మొదట కేవలము తమసుఖమునే కోరుచుఁ గాలక్రమమునఁ దమకు సుఖమొసఁగు నితరుల సుఖములను దమసుఖమునకంటె నెక్కుడుగ భావింతురు. దృఢమగు ననురాగముచేఁ గట్టబడి యుండుస్త్రీపురుషు లొండొరులయందలి ప్రేమాతిశయముచే నొక్కొక్కరును రెండవవారి సుఖము నెక్కుడుగ భావించు చుందురు. అన్యోన్య సన్నిధానమే పరమసుఖముగ నెన్ను దురు. ఆసుఖముతోఁబోల్చుటకు ద్రవ్యము విద్యయు మొద లగునవియన్నియు ననర్హములుగఁ దోఁచును. స్త్రీ తనశక్తి యుక్తు లన్నిటిని బ్రియుని సంతోషముకొఱకు వినియోగిం చును. తన మనస్సును బుద్ధిని శరీరమునుసయితము నాతనికి సమర్పించును. అట్లే పురుషుఁడును దనశక్తియుక్తు లన్నియును, శరీరమును మనస్సును సయితము ప్రియురాలి కర్పించి యా మెకు సుఖమునొనగూర్చుటకంటె నన్యమగు కార్యములేక వర్తించును. ఇట్లు వర్తించుటయం దిరువురును దమయింద్రియ సంబంధములగు సుఖములను మఱచుచు రానురాను వారియం దన్యోన్యానురాగము పరిశుద్ధమై నిష్కల్మషమైనదగు. తమ్ము దాము మఱచి యొండొరులతోఁ దాదాత్మ్యముచెంది యిరు వురు నొక్కరూపముగ నెంతురు. తనువులు రెండయ్యును వా

రొక్క-మనస్సుతో భావించుచుందురు. ఇట్టి నిష్కల్మషమగు ప్రేమకంటె వేలకొలఁది మడుంగులెక్కుడై మిగులదృఢమై గాఢమయిన ప్రేమను భక్తుఁడగువాఁడు పరిపూర్ణుఁడును, దయాస్వరూపుఁడును, సమస్తకల్యాణగుణములు గలవాఁడును, సర్వము దానైయైనవాఁడును, ఆనందదాయకుఁడును, ఆనందస్వరూపుఁడును నగు పరమేశ్వరునియందు సమర్పించును. ఆప్రేమ నెంతకాల మనుభవించినను విరాగము పుట్టదు. అది యనన్యముగ నుండును. ఎంతవృద్ధియైనను భారముగాన రాదు. దానినుండి కలుగు సుఖము లౌకికసుఖమువలె క్షీణించునదిగాదు. ఇవి యన్నియుఁ జక్కఁగఁ బరిశీలించి చూచినఁగాని పరమభక్తున కుపాస్యునియందలి పరమ ప్రేమ యాథార్థ్యమును నూహింపఁ దరముగాదు. మొట్టమొదట నైహికములగు భార్యాభర్తృపుత్త్రాదులయందుఁ బ్రేమఁజేసి కాలక్రమమున నద్దానిఁ బరిశుద్ధముగఁ జేసికొని ఆయనురాగమును భగవంతునియందు సమర్పించి పతిపుత్త్రాదులవలని సుఖమునకంటె నెన్నియోమడుంగు లెక్కుడగు సుఖమును భగవంతుని స్మరణాదులచేఁ జెందుచుఁ గ్రమమున నైహికమగుప్రేమను బారమార్థిక మగుప్రేమగ నూర్చి పరమపురుషార్థ సాధనముగఁ జేసికొనవలయును.

భక్తినిసాధించుటకు మొట్టమొదట దేహమును బరిశుద్ధముగఁ జేసికొని సాత్త్వికాహారమునే గ్రహించవలయును. భక్తి యెప్పుడును ప్రేమరూపమైనది గావునఁ నాప్రేమ ప్రేమాస్ప

దుఁడగు భగవంతునియందు వలె భగవంతుని సృష్టిలోనుండు సకలభూతములయందును బ్రవహించును. కావునఁ దా నాహారముగొనుచో నితరభూతముల కెంతమాత్రము హింసను గలుగఁ జేయరాదు. హింసను గలుగఁజేయుట ప్రేమభావమునకు విరుద్ధమగు. ప్రేమభావమునకు విరుద్ధములగు కార్యముల నన్నింటిని బ్రయత్నముతో వదలవలయును. హింస వలనఁ బడయు నాహారము ప్రతిబంధకమగుటయేగాక భూతద్వేషము నభివృద్ధిచేయును.

అహింసా ప్రథమం పుష్పం పుష్ప మింద్రియనిగ్రహః ।

భగవంతునికర్పించుపుష్పములలో అహింస సర్వోత్కృష్టమైనది. భక్తుఁడు సర్వభూతహితమును గోరువాఁడు. ఆహారనియమముమాత్రముగాక శరీరము నెప్పుడు ఇతరవిధములం గూడఁ బరిశుద్ధముగ నుంచుకొనవలయును. అపరిశుద్ధులగు వారలతో సాంగత్యమును విడువ వలయును. ఇట్టిశౌచము లేని శరీరము భక్తునకు యోగ్యముగాదు.

శరీరము మాత్రము పరిశుద్ధముగ జేసికొనినఁ జాలదు. మనస్సును సహితము పరిశుద్ధముగఁ జేసికొనవలయును. మనస్సులోని మాలిన్యములగు కామములను గ్రమముగ విడువవలయును. కామములకు లోఁబడియుండు మనస్సు కామ్యార్థములయందు రమింపఁబోవుచు నిశ్చలభక్తికి నునికిపట్టు గానేరదు. యథార్థమగు భక్తి యున్నగా మనస్సు సర్వ

కామములనుండి మరలించి యుపాస్యునియందు రమించునట్లు చేయుట. మనస్సు పలుకామ్యములయందు రమించుచుండి నచో నెట్లుపాస్యునిమాత్రము ప్రేమింప సమర్థమగు? మనో భీష్టము లన్నియు నుపాస్యునియందే త్రిప్పుచుండవలయును. మనస్సు పూర్వవాసనాబలముచేత నితర విషయములయందు రమింపఁ బరుగులిడుచుండినను దాని నట్లు పోనీయక యుపా స్యదైవమునందే మరలమరల నిలుపుచుండవలయును. దీనినే యభ్యాసమని చెప్పుదురు. మనస్సు బహుచంచలమనియును, పెనుగాలినైనను నిలుపవచ్చునుగాని మనస్సు నిలుపుట కష్ట తరమనియును మొఱయిడిన యర్జునునకు శ్రీకృష్ణభగవంతుఁడు అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను మనస్సు స్థిరముగ నిలుపుకొనవచ్చునని యుపదేశించి యున్నాఁడు గదా!

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవ ద్దృఢమ్ ।
త స్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్ ।
అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్ ॥
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥
(గీత. ౬ అ. ౩౪-౩౫.)

పూర్వవాసనాబలముచే విషయములయందుఁ గలరాగము విడుచుట వైరాగ్యము. అట్లు విషయములనుండి విముఖమైన మనస్సు నుపాస్యునియందుఁ ద్రిప్పుట యభ్యాసము. విషయ సుఖములు నశ్వరములని తెలిసి విషయములయం దాసక్తి పోయి విషయవిముఖమైన మనస్సును ప్రేమాస్పదుఁడైన యుపాస్యునియందుంచుట సులభము. అట్టి యుపాస్యునియం

దుంచిన మనస్సున విషయములందలి రాగము తగ్గించుట సులభము. ఈ రీతిని వైరాగ్యాభ్యాసము లన్యోన్య సహకార ములగును. ఈ రెండుపాయములచే మనస్సు నిశ్చలముగ నుపాస్యునియందు నిలుపనగు. అట్లు నిశ్చలముగ నిలిచినపుడు భక్తునకు నుపాస్యుని మఱపుదగులుట యసాధ్యము గదా! ఎన్ని బాధలు వచ్చినను, ఎన్ని కష్టములు సంభవించినను, ఎన్ని మనోవ్యథలు ప్రాప్తించిన నుపాస్యుని మఱువఁడు.

భక్తునకు భగవత్పాదములను జేరవలయునని తాపము గలిగి యుండవలయును. నిప్పు తగిలి మండుచుండు గృహమునఁ జిక్కి ప్రతిక్షణమును బ్రాణాపాయము గలుగునని భీతిగల వానికిఁ బ్రాణరక్షకుఁడు వచ్చునా యను తీవ్ర పరితాపము గలిగియుండు రీతిని భగవంతుని బొంద నాశయుండవలయును. అంతవఱకు దైవస్వరూపము గోచరముగాదు. నిజమగు భక్తున కట్టి సమయమున వేఱుచింత యుండదు. వాఁడు ప్రాణము తల్లడిల్లుకాలమున భగవంతునినే చింతించుచుండును గాని వేఱుచింత వాని మనస్సున నుండదు. ఇదియే భక్తుని మనో వృత్తికిని సామాన్యుని మనోవృత్తికిని భేదము. భక్తుని మనస్సు సర్వకాలములయందేకాగ్రమై, సుఖములందును దుఃఖముల యందును జలింపక యన్నియు నాదైవము నొద్దనుండి భక్తాను గ్రహార్థమే వచ్చుచున్న వని నిశ్చలమైయుండు. ఇట్లేకాగ్రమై నిష్కామమైన మనస్సును, బరిశుద్ధాహారముచే శుద్ధశరీర మును భక్తుఁడుగాఁ గోరువానికి ముఖ్యముగ నుండును. కావున

భగవంతుఁడగు శ్రీరామానుజాచార్యులవారు భక్తులుకాఁ గోరువారలకుఁ బరిశుద్ధమగు దేహము, పరిశుద్ధమగు మనస్సు నుపాస్యుని నిరంతరస్మరణము ననునీమూఁడు సాధనముల విధించియున్నారు.

భక్తి యభివృద్ధి చేసికొనుటకు సాధనములు నిరంతరముగ నభ్యసింపఁ దగినవి మఱికొన్ని గలవు. ప్రతిదినమును గొంత కాల ముపాస్యుని బూజ సేయవలయును. మొట్టమొదట క్లృప్తమగు కాలమునఁ బూజ సేయుచుఁ బూజాకాలమున మనస్సు నుపాస్యునియందునిచి కాలక్రమమునఁ గాలమంతయు నామనస్సును వానియందే లయింపఁజేయ నభ్యసించుచు రావలయును. మఱియుఁ గొంతకాలము భగవంతుని కళ్యాణగుణములను, వాని లీలావతారముల చరిత్రములను మనస్సున ధ్యానించుచు, నుపాస్యునియందు మనస్సు నేకాగ్రముగఁ జేయుట కభ్యసింపవలయును. ఇట్లు పూజలందును ధ్యానమునందును భక్తుఁడు ఆనందభరితుఁ డగును. ఆనందమును బొందునుగాని యెవ్విధమగు కామమును గోరఁడు. మఱియు నెల్లప్పుడును భూతహితము చేయుటకు యత్నింపవలయును. భగవంతునియందు భక్తియుండుటచే భగవంతునివలె నడచుటకు యత్నింపవలయును. భగవంతునియందున్న కళ్యాణగుణములను బలుమాఱు ధ్యానించుటచేతను, వానిలో నొక్కొక్కదాని నభ్యసించుటచేతను, ఆ గుణములను దనయందు దృఢముగ నెక్కొలుప యత్నము చేయఁదగు. భగ

వంతుఁడు సర్వభూతహితము నెల్లప్పుడు చేయురీతిని దానును సర్వభూతహితమునుగోరి కర్మములం జేయుచు, మనస్సును, వాక్కును, గాయమును, బరోపకారముకొఱ కుపయోగించుచుఁ దనవగు తనుకరణభోగములను బరోపకారమునకు వినియోగించు చుండవలయును. భగవంతుఁడు ఎల్లప్పుడు దయయే స్వభావముగఁ గలవాఁడు. ఇచ్చుటయే వారి నైజగుణము. భక్తుఁడును దనకుఁ గల సర్వస్వము భగవంతుని బిడ్డలగు సకల భూతముల కిచ్చుటయె ప్రథమ కైంకర్యముగ నభ్యసించును. ఇదియేగదా ప్రేమయొక్క ప్రథమ లక్షణము. స్వప్రయోజనము నించుకమైనను గోరక యున్నదంతయును బ్రేమింపఁబడువారల కిచ్చుటయే ప్రేమ. దాని నెల్లప్పుడు నభ్యసింపుచుఁ, బ్రేమస్వరూపుఁడగుటకు యత్నింపఁదగు.

లోకమున నిట్లు ప్రతిఫల మపేక్షింపక ప్రేమించుట యెంత యరుదు? సామాన్యముగ నెల్లవారును బ్రతిఫలమెద్దియే నొక దానిని గోరువారలే గాని నిష్కల్మషముగఁ బ్రేమించువారరుదుగ నున్నవారు. తాఁ బ్రేమించు వారినుండి ప్రతిఫలమించుకమైనఁ గోరుట కేవల వణిగ్వృత్తిగాని పరిశుద్ధమగు ప్రేమగాదు. పరిశుద్ధమగు ప్రేమ యల్పమైనను బ్రతిఫలము గోరఁదు.

ఈరీతిని మనోవాక్కాయముల పారిశుద్ధ్యమును, అహింసయుఁ, బరోపకారబుద్ధియు నభ్యసింప నిష్కామమగు భక్తి యభివృద్ధియగు.

సత్పురుషుల సాంగత్యము మఱియొక సాధనము. ఎప్పుడు నాత్మవిషయమగు సంభాషణములఁగాని, పరమాత్మధ్యానమునఁగాని కాలము గడుపుచుండు పెద్దల సాంగత్యమున భక్తుఁడు పరిశుద్ధుఁడగు. అట్టి వారలతోఁటి సంభాషణ మెట్టి వారినిగాని యుత్తమస్థితికిం దెచ్చును. కేవల సంసారవిషయములగు సంభాషణములుగాని వృథా ప్రసంగములుగాని వారు చేయరు. ఎప్పుడును బరమార్థ సాధనములగు సంభాషణములు చేయుచుందురుగావున వారిసాంగత్యము పరమపవిత్రమైనది. అంతియగాదు. అట్టివారి సాన్నిధ్యంబున వారిమనశ్శక్తియు, మనఃపారిశుద్ధ్యమును ఇతరుల మనస్సులను గూడఁ బరిశుద్ధములుగఁజేయు. వారిశరీరములనుండి యెల్లప్పుడు బయలు వెడలు పరిశుద్ధములగు నణువులసముదాయము సయితము సమీపమున నున్నవారి శరీరములయందుఁ బ్రవేశించి యా శరీరములను బరిశుద్ధములుగఁ జేయును. దీనినే వారిపాద ధూళియని చెప్పుదురు. ఈ కారణములచేత సత్సాంగత్యము యొక్క ఫల మింతయని లెక్కించుట కసాధ్యము.

> సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
> నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥

అని శ్రీశంకర భగవత్పాదాచార్యులవారు వ్రాసియున్నారు. ఎప్పుడును దనకంటె నుత్తములగు వారల సాంగత్యమును వెదకి సంపాదించి యనుభవించుచుండఁదగు. అట్లుగాక

యల్పబుద్ధులును, విషయాసక్తులును నగువారి సాంగత్యము చేయువారు చెడిపోవుదురు.

మఱియు సత్పురుషుల సాంగత్యమువలె సత్పురుషులగు వారిచే వ్రాయఁబడిన గ్రంథముల వ్యాసంగముచేయుట యిం కొక సాధనము. అట్టి వారలు రచించిన గ్రంథములు సద్విష యములను గుఱించినవి. కావున నాగ్రంథముల వ్యాసంగము చేయఁదగు. అట్టి గ్రంథముల వ్యాసంగము చేయుటచేత మనస్సు సద్విషయమునందే రమించుచు, నసద్విషయముల సంసర్గము లేక పరిశుద్ధమగు. భగవంతుని చరిత్రములను, భాగవతులయుఁ బరమభక్తులయుఁ జరితములను, బరమార్థ జ్ఞానమును, జ్ఞాన సాధనములను బోధించు గ్రంథములు పావన ములు గనుక పూనికతోఁ జదువఁదగినవి.

మఱియు భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదుఁడు భక్తునకు భక్తి యభివృద్ధి కాఁగలమార్గములను వివరించియున్నాఁడు.

> శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
> అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనమ్ ।
> ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చే న్నవలక్షణా ॥
>
> (శ్రీభాగవతము. ౭-౫-౨౩-౪.)

> తనుహృద్భాషలసఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వందనా
> ర్చనము ల్సేవయు నాత్మలోఁ నెఱుకయు స్సంకీర్త నల్చింతనం
> బను నీతొమ్మిదిభక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
> జ్జనుడైయుండుట భద్రమంచుఁదలతున్ సత్యంబు దైత్యోత్తమా ॥
>
> (ఆంధ్రభాగవతము.)

ఉపాస్యుని చరితముల శ్రవణముచేయుట. ఉపాస్యుని నామాదులచేఁ గీర్తనముచేయుట, అనఁగా భజించుట. ఉపాస్యుని నామరూపములను స్మరణముచేయుట, అనఁగా నంతఃకరణమునందు మఱువకుండుట. ఉపాస్యుని పాదములసేవించుట. షోడశోపచారములచే నర్చనముసేయుట. సాష్టాంగదండప్రణామములుచేయుట. ఉపాస్యుని కైంకర్యము సలుపుట, అనఁగా భృత్యునివలె నిష్కామములగు కైంకర్యములు చేయుట. ఉపాస్యునియందు స్నేహరూపమగు సఖ్య భక్తి. అర్జునుని భక్తియు నుద్ధవునిభక్తియు నిందులకు దృష్టాంతము. వారిరువురు శ్రీకృష్ణునియందు నిత్యము స్నేహముచేయుచు, వారి సాంగత్యమును కోరుచు నుత్తములగు స్నేహితులన్యోన్యాను రాగముచే బద్ధులయి యైక్యభావము నొందురీతిని భక్తుఁడుపాస్యుని జెలిఁగా భావించి సదా హరిసన్నిధానమును గల్పించుకొనియుండు. బలిచక్రవర్తివలె దేహసహితముగ సర్వస్వము నుపాస్యున కర్పించుట. అను నీ తొమ్మిది విధములగు భక్తిని హరియందు సమర్పించవలయును.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః ॥
(గీత. ౧౨-౨.)

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః ।
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ।
తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।
భవామి నచిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్ ॥ (గీత. ౧౨-౬-౭.)

మనస్సు సదా నాయందు నిలిపి సమాహితచిత్తులై, యుత్తమమగు శ్రద్ధతోఁగూడినవారలై యెవరు నన్ను ధ్యానింతురో వారలు యోగులలో శ్రేష్ఠులు. ఎవ్వరైతే సర్వకర్మములను నాయందు సన్న్యసించి నన్నే పరమగతిగా నెంచుచు వేఱు శరణము లేక నన్నుపాసించి ధ్యానింతురో వారలను జననమరణరూపమగు సంసారమునుండి శీఘ్రముగఁ దరింపఁజేయుదును. అని భగవంతుఁడు గీతాశాస్త్రమున నొక్కి చెప్పియున్నాఁడు.

మనస్సు సదా యుపాస్యునియందుంచుట, నిరంతరము ధ్యానించుట, పూజించుటయు, నుపాస్యుని పరాగతియని భావించుట, దృఢమగు శ్రద్ధగలిగియుండుటయు నివి భక్తుని ముఖ్యధర్మములగుచున్నవి. అట్టి భక్తులను భగవంతుఁడే శీఘ్రకాలమున నుద్ధరించెదనని వాక్రుచ్చియున్నాఁడు.

ఈవిధమున బహువిధములగు సాధనములచే భక్తినభ్యసించి కాలక్రమమున భక్తుఁడీశ్వరానుగ్రహపాత్రుఁడగును. ఇంతియగాదు. ఈమార్గములఁ దనశక్తికొలఁదినభ్యసించుచుఁ బూర్వాధ్యాయమున సూచింపఁబడినరీతిని దనయుపాధులను సంస్కరింపఁ జాలినవియుఁ దన్ను ఋణవిముక్తునిగఁ జేయునవియునగుకర్మములను జాగరూకుఁడై చేయుచు, సర్వభూతములను బ్రేమించుచుండఁ గాలక్రమమునఁ గర్మము పరిపక్వముకాఁగా నీశ్వరానుగ్రహమునకుఁ బాత్రుఁడగు.

అపుడు ఏకాంతధ్యానమున భక్తుఁడు పరవశుఁడై యుండ భక్తపరాధీనుఁడగు నాభగవంతుఁడు భక్తుని శుద్ధాంతఃకరణమున నొకనిమేషమాత్రమైనను జూపట్టినఁ భక్తుఁడు పరమానంద భరితుఁడగు. అది మొదలు భక్తునిమార్గమంతయు నాజ్యోతిచేఁ బ్రకాశించును. వెనుక మాటిమాటికిఁ బూర్వపు నజ్ఞానము తన్నుఁగప్పుచుండినను జ్యోతిమాత్రము మఱుపు దగులదు. అదిమొదలు విషయము లన్నియు భక్తునిమార్గము నుండి మరలిపోవుటయేగాక వానియందలి రుచిసయితము భక్తుని వదలిపోవును.

. . . . . . . . . . రసో ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥

(గీత)

పరస్వరూపదర్శనము కాఁగా విషయములయందుండిన నల్పమగు నాశయము విడిచిపోవునని తాత్పర్యము.

ఆయుపాస్యుని తేజస్సును జూచిన దృష్టికిఁ దక్కిన పదార్థము లన్నియు నిస్సారములై కన్పడును. అదిమొదలు దృష్టి యాత్మవిషయములయం దించుకయైనను దిరుగదు. అపుడు భక్తుఁ డుపాస్యునియందే మునిఁగి యెడతెగక యానందము ననుభవించుచుండు. అపుడు జగమంతయు నాయుపాస్యునిచే నిండినట్లేయుండును. అన్నింటియందు నుపాస్యదైవము తప్ప వేఱుతత్త్వముగానరాదు, లోకమునం జేయఁదగుకార్యములన్నియు నాయుపాస్యునికైంకర్యములుగ బుద్ధికిఁ దోఁచును. వేఱుకార్యమే కానరాదు. భగవంతు నెల్లచోటుల

నెల్లప్పుడును జూచుచు నెప్పుడెప్పు డేయే కార్యములుచేసినను, ఆభగవంతునికైంకర్యములుగా నెంచును. కావుననే యిద్దేశమునఁ బరమభాగవతోత్తములు శరీరపోషణముకొఱకుఁ జేయుకార్యములుఁగూడ స్వకార్యములుగా భావింపరు. శరీరమునసుండు భగవంతునియారాధనములుగ భావింతురు. గృహమునకుఁ దేఁబడుతండులములు శాకములు లోనగునవి భగవన్నివేదనముకొఱకుఁ దేఁబడినవని తలఁతురు. తాము భుజించుటయు భగవదారాధన మని చెప్పుదురుకాని వేఱు మాటలచేఁ దెలుపరు. ఇట్టియీశ్వరభావము నిరంతరముగ నుండవలయు నని పెద్దలయుద్దేశ్యము. ఇక్కాలమున భావమును వదలి శబ్దములమాత్ర ముపయోగించుటయేగాక యాశబ్దములు గొన్నిసమయముల నపహాస్యముతోఁగూడ నుపయోగించుటయుఁ గలదు. పెద్దలయభిప్రాయములును, ఉద్దేశ్యములు నెట్లపార్థము లగుచున్నవో చూడ మిగుల సంతాపాస్పదముగ నున్నయది.

ఇట్లు సర్వకాలములయందును సమస్తభూతములయందును పాస్యదైవమునేచూచుచు భృత్యుఁడై యెల్లప్పుడు కైంకర్యము చేయుచుండును. తనదగుశక్తి యొక్కటియు లేదనియు, సర్వము నాయుపాస్యునిదే యనియు దృఢనిశ్చయుఁడై యహంకారము పూర్ణముగ విడుచును. మొదటనుండియు నహంకారమును విడుచుచుండినను దానియంకురమైన నెంత మాత్రముండినను దానినిగూడ విడుచును.

అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్ ।
విముచ్య నిర్మమ శ్శాంతో బ్రహ్మభూయాయ కల్పతే ॥
(గీత. ౧౮-౫౩.)

అహంభావము బలము గర్వము కామము క్రోధము విష యములను గ్రహించుటయు నివి యన్నియును విడిచి మమ కారముసహితము లేనివాఁడు శాంతస్వరూపుఁడై బ్రహ్మస్వ రూపుఁడగుటకు నర్హుఁడగుచున్నాఁడు.

బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమ స్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥
(గీత. ౧౮-౫౪.)

బ్రహ్మభూతుఁడై ప్రసన్నమగు నంతఃకరణముగలవాఁడై యెన్నఁడైనను బ్రాప్తించినయప్రియములకు దుఃఖము నొంద దఁడు. లేనివానిని గోరఁడు. సమస్తభూతములయందు బ్రహ్మ స్వరూపము సమముగఁ జూచుచు నాయందుత్కృష్ట మగు పరాభక్తిని బొందుచున్నాఁడు.

భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్ ॥ (గీత. ౧౮-౫౫.)

ఇట్టి పరాభక్తిసహాయమున నాస్వరూపమును యథార్థ ముగ నెఱుంగును. అట్లెఱింగి యాపిదప నాయందుఁ బ్రవే శించును.

సర్వకర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥
(గీత. ౧౮-౫౬.)

సర్వకర్మములను సహితము చేయుచు నన్నే ఆశ్రయముగ భావించుచుఁ గడపట నాయనుగ్రహమున శాశ్వతమగు పురుషార్థమును బొందుచున్నాఁడు.

ఈమూఁడు శ్లోకములయందును భక్తునిచే నెక్కఁబడు కడపటిసోపానములను శ్రీకృష్ణభగవంతుఁడు నిరూపించియున్నాఁడు. అహంకారాదుల వదలి బ్రహ్మభూతుఁడై పరాభక్తి నొందుచున్నాఁడు. ఇదియే సాధ్యభక్తి యనఁబడుచున్నది. అట్టి యుత్తమోత్తమమగు భక్తి ప్రకాశింపఁగ భక్తున కుపాస్యుని స్వరూపము పూర్ణముగ నభివ్యక్తము కాఁగా నాయుపాస్యుని స్వరూపమును యథార్థముగ నెఱుంగును. అట్టిపరాభక్తిచేఁ దత్త్వజ్ఞానము సంపూర్ణముగఁ బ్రకాశింప నుపాస్యుని యందుఁ బరవశుఁడై మునింగి బ్రహ్మానందము ననుభవించుచుండు. భక్తిజ్ఞానములు పరిపూర్ణముగఁ బ్రకాశింప సర్వకర్మములసహితము జాగరూకుఁడై లోపములేక లోకులమేలుకొఱకుఁ జేయును. ఇట్లు భక్తిజ్ఞానకర్మములు మూఁడును బరిపూర్ణములుగ నాభక్తునియందు వెలయును. ఇట్లు మూఁడు శక్తులను జూపుచు సచ్చిదానందస్వరూపుఁ డగుయోగి యగుచున్నాఁడు. ఈమూఁడులక్షణములం గలుగుయోగిని కేవలభక్తునికంటెను, కేవలజ్ఞానికంటెను, కేవలకర్మికంటె నధికుఁడని భగవంతుఁడు చెప్పియున్నాఁడు.

ఇట్లు వరుసగ మూఁడు మార్గములును సంక్షేపముగ వివరింపఁబడినవి. మూఁడుమార్గములవలనను బొందఁదగుగమ్య

స్థాన మొక్కటి యనియు నిరూపింపఁబడినది. మార్గములు మొదటమొదట భిన్నభిన్నములుగ నున్నను దుద కొక్కటి యగుచున్నవి. కర్మమార్గమునఁ బరిపూర్ణుఁడు కాఁగా భక్తి జ్ఞానములు తమంతటఁ గర్మిహృదయమునం బ్రకాశింపఁ బరమ యోగి యగును.

జ్ఞానపరిపాకవశ మగు నపరోక్షజ్ఞానమును భక్తిపరిపాక మగుపరాభక్తియును నొకటియే యని పెద్దలు చెప్పుచున్నారు. భక్తుఁడు తనయందుఁ దప్ప నెల్లెడల నుపాస్యునిఁ జూచుచుఁ గడపటఁ దనయందును జూచిన జ్ఞానము వికసించి యది యపరోక్షజ్ఞాన మగు. తనయందే పరమాత్మను జూచుచున్న జ్ఞానికిని పరిపాకదశయం దంతటను బరమాత్మ కనఁబడ భక్తి వికసించి పరాభక్తి యగును. భక్తిజ్ఞానమార్గములు కడపట రెండును నొక్కటియె యగును. జ్ఞానులును భక్తులును బరి పాకదశానంతర మాధికారికాది పదములయందు నిలిచి, లో కానుగ్రహార్థము కర్మము చేసినవారిని కర్మమార్గము నవలం బించువారని చెప్పవచ్చును. కర్మయోగియు భక్తిజ్ఞానముల నవలంబించినఁగాని పరిపూర్ణకర్మయోగి కానేరఁడు. ఈరీతిని మూఁడుయోగములును బరిపాకదశయం దొకటియె యగును.

---

## పదాఱవ యధ్యాయము

## అర్చనము

యజ్ఞములును హోమములును దేవతలనుద్దేశించి చేయు దురనియును, దేవతలవలనఁ బొందిన మేలునకు మాఱుచేయు దురనియును వివరింపఁబడియె. ఐనను జీవుఁ డీశ్వరాంశమై యుండుటచేతను, సమస్త దేవతలు నీశ్వరాంశములుగనే యుం డుటచేతను, ఆ దేవతలకుంగల ఋణము తీర్చుటతోఁ జీవుఁడు తృప్తుఁడు కాఁడు. ఈశ్వరునినుండి వెలువడినకళయే కావున నాయీశ్వరునిం జేరుటను జీవుఁడు ముఖ్యముగఁ గోరుచుండును. ఇట్లు తనయుత్పత్తిస్థానమగు నీశ్వరుని జేరుటకుంగల మార్గ ములు సంక్షేపముగఁ బూర్వాధ్యాయముల వివరింపఁబడియె.

తనయందు బీజరూపముగ నుండు నాత్మశక్తులను వికసింపఁ జేసికొనుటకుఁ బ్రతిజీవునకుం బూజ యావశ్యకము. జీవుఁ డెల్లప్పుడును బూజసేయునది భగవంతునినే. ఏరూపమునఁ బూజించిన నారూపమున భగవంతుఁడే యభివ్యక్తమై యున్నట్లు భగవంతుని బూజించునుగాని భగవంతుని కంటె భిన్నమగుదానిని బూజించుటలేదు. పూజజేయుట కెప్పుడును భగవంతుని సాకారముగ భావించుట సులభోపాయము.

శ్రీమన్నారాయణమూర్తి రూపమున సకలచిహ్నములతోఁ గూడి యున్నట్లు గాని, శ్రీసదాశివ స్వరూపమునఁ గాని, లోకమాతయగు శక్తిస్వరూపమునఁగాని; భగవంతుని యవతారములగు శ్రీరామకృష్ణాదిరూపములం గాని, లోకమున కంతటికిని వెలుఁగును వేఁడిమిని బ్రాణశక్తి నిచ్చి రక్షించు లోకచక్షువగు సూర్యుని రూపమునఁగాని, క్రైస్తువు బుద్ధుఁడు మొదలగు రూపములంగాని పూజింపవచ్చును. సాకారము గాక కేవలము సచ్చిదానందస్వరూపునిగ సగుణబ్రహ్మమును సహితము పూజించుట కష్టము. జ్ఞానమార్గమున నడుచు వారలకు మాత్ర మది సాధ్యముగాని సామాన్యముగ నెల్ల వారికి నసాధ్యము. ఇట్టి యవ్యక్తోపాసనము కష్టసాధ్య మని యును, భగవంతుఁ డర్జునున కుపదేశించియున్నాఁడని ముందే చెప్పఁబడియె. సాకారముగఁ బూజసేయుట సులభమార్గము కావున నది యనేకులకు సాధ్యము.

మఱియు నర్చనము బాహ్యపూజయు నాంతరంగిక మగు నుపాసనయు నని రెండువిధములు. బాహ్యపూజయందు స్థూలలోచనములకు గోచరమగు మూర్తి భగవంతునకుఁ బ్రత్యామ్నాయముగ నుపయోగింపఁబడును. పుష్పములు మొదలగు పూజాద్రవ్యములు సహిత ముపయోగింపఁబడు. ఆమూర్తి విగ్రహముగాఁగాని, సాలగ్రామముగాఁగాని, లింగముగాఁగాని నానావిధములుగ నుండును. ఒక్కొక్కరూపమును గొన్ని చిహ్నములతో వెలసి భగవంతుని శక్త్యాదులలోపలఁ గొన్నిం

టిని నిరూపించుచుండును. పూజించు విగ్రహము శంఖచక్ర గదాధరుఁడుగను, చతుర్భుజుఁడుగను, శ్రీవత్సాంకుఁడుగను లక్ష్మీసమేతుఁడుగను నలంకరింపఁబడి శ్రీమన్నారాయణ మూర్తిని దెలుపును. ఆచిహ్నములొక్కొక్కటియు నాదేవుని శక్తులను సూచించుచు, నుపాసకుఁడు మనస్సున నాశక్తులను ధ్యానించుటకు సహాకారము లగుచున్నవి. ఆవిగ్రహము, శూలము, వజ్రము, ఖడ్గము, పరశువు, కపాలము, డమరుకము, వ్యాఘ్రచర్మాంబరము నీమొదలగు చిహ్నములతోఁగూడిన శ్రీసాంబసదాశివునిఁ దెల్పుచు నాదేవుని లక్షణములను ధ్యానించుటకు సహాకారమగును. శ్రీమన్నారాయణమూర్తి బింబమునుజూడ నాలుగు భుజములు, శంఖచక్రములు మొదలగునవి యామూర్తి నాలుగుభుజములచే నాలుగుదిక్కులను లోకమంతయును బరిపాలించి రక్షించు ప్రభువనియును, శంఖము సృష్టికారణమగు శబ్దబ్రహ్మ స్వరూపమనియును, చక్రము స్వాధీనమై వర్తించుచుండు సమష్టి మనస్తత్త్వమనియును, లేక వాని యధీనమునఁ బరిభ్రమించుచుండు ప్రపంచచక్రమనియును, శ్రీవత్సము స్వాధీనమైవర్తించు ప్రకృతిస్వరూపమనియును దెల్పుచు, నారూపమున మూర్తీభవించియుండు భగవంతుని దెల్పును. శూలము, ఖడ్గము, వజ్రము మొదలగు నాయుధములు లయకర్తయగు మహాదేవుని జూపును. వరదాభయహస్తములు రెండును లయకర్తయందు జీవులనుద్ధరించి యుత్తములుగఁ జేయు మహానుభావునిఁ దెల్పును. కపాలము

వ్యాఘ్రచర్మమును వైరాగ్యసుఖము కంటెఁ బరమగుసుఖము లేదని బోధించును. అర్ధదేహమును ధరించియుండు నంబ బ్రహ్మవిద్యాస్వరూపిణి యగు లోకమాత తనబిడ్డల నపార కరుణచే రక్షించి తండ్రిపాదములం జేర్చు మహాశక్తి యని యును, సకలార్థదాయిని యనియును బోధించును. అంబయే ముముక్షువులకు శివుని పాదపద్మములను, నాత్రోవచే మోక్ష మును, జిజ్ఞాసువులకు జ్ఞానమును, నర్థార్థులకు నీప్సితార్థము లను నిచ్చుతల్లి. విష్ణుబ్రహ్మలకు సహితము ఆద్యంతములు గన రాని జ్యోతిర్మయమగు స్తంభముగ విజృంభించిన మహాదేవుని చిహ్నము లింగము నిరవయవుఁ డనియు సూచించును.

సాలగ్రామము విష్ణువు ప్రతీకముగ భావింపఁ బడుచున్నది. ఇట్లు స్థూలములగు నింద్రియములకు గోచరములగు బింబములు బాహ్యపూజయం దుపయోగింపఁబడును. మఱియుఁ బుష్ప ములు హృదయము నుండి వెలువడు భక్తిజ్ఞానములను దెల్పును. భక్తితో నిండియుండు హృదయముతో భగవంతుని భావించుచో నాభక్తి ప్రత్యయములు సూక్ష్మలోకమునఁ బుష్పరూపమున యోగదృష్టికిఁ గనఁబడు నని యోగులు చెప్పుచున్నారు. హృదయమునుండి యుపాస్యుని పాదములం గూర్చి ప్రవహించు భావములే పుష్పములుగ నర్పింపఁబడుఁ గావునఁ బువ్వులు నాభక్తి సంకల్పములనుసూచించు. కావు ననే భక్తుఁ డుపాస్యుని బింబమును బుష్పములతోఁ బూజిం చుచో నాపుష్పములను హస్తములం గొని హృదయసమీప

మునకుం గొంపోయి హృదయమునుండి యుపాస్యునిపాద ములయం దర్పించును. మఱియు జలములు నభిమంత్రితములై పరిశుద్ధములై యుపాస్యదైవము తేజస్సుతోఁగూడినవియైన నాజలములను భక్తుఁడు తనపైఁ బ్రోక్షించుకొనఁగా భక్తుని స్థూలసూక్ష్మోపాధులు పరిశుద్ధములై యుపాస్యుని దివ్యతే జస్సును బొందుట కర్హములగుచున్నవి.

ఉపాసకుఁ డుపాస్యునిరూపము నేకాగ్రమగు దృష్టితో నొక కొంతసేపు లక్షించిచూచి కన్నులు మూసికొని యా రూపమును మనంబున సంపూర్ణముగ స్పష్టముగ నిర్మించు కొననగును. అట్లు మానసికమగు రూపమును గల్పించి ధ్యా నించుటకు బాహ్యమగు బింబము సహకారియగును. ఇట్లు సులభముగ బాహ్యబింబమునుండి యాంతరంగికమగు మాన సికబింబమును ధ్యానింప సాధ్యమగు. ఆబింబముగూడఁ గ్రమ మున సచేతనమై యుపాస్యస్వరూపమే యగును. భక్తుఁడు ధ్యానించుటయందును, స్తోత్రములందు నుపాస్యుని లక్షణము లనుగుర్తించుచు నాలక్షణములను దనయందభివృద్ధిచేసికొనం గోరుచుఁ గ్రమక్రమమున నుపాస్యునియందు మనస్సు లయిం చినఁ దదేకధ్యానపరుఁడై బహిఃప్రజ్ఞయు లేకయుండును. అపుడాయుపాస్యుని సన్నిధానమున నున్నట్లు భావించుచు శాంతిరూపమగు నానందమును బొందును. ఇవ్విధమున మంత్ర పూతమగు జలముచేఁ దనయుపాధుల స్వభావమునఁగలుగు మాలిన్యమును బోఁగొట్టి వానిని బరిశుద్ధములుగఁ జేసి బాహ్య

బింబము సహాయమున మనస్సు నేకాగ్రముగఁ జేసి మానసిక బింబమును గల్పించుకొని యాబింబమున నుపాస్యుని యథా రూపముగఁ జూచుచు, నాదేవుని దివ్యలక్షణములను, గుణములను ధ్యానించుచు, నుపాస్యునియందుఁ బరవశుఁడై యానందము ననుభవించును.

ఇట్లు బాహ్యములగు బింబములు, చిహ్నములు నుపాసనమునకు మిగుల సహకారులు. మానసికమగు బింబమును నిర్మించి ధ్యానించుట కందఱకు సాధ్యము కాదు. కావున బాహ్యములగు విగ్రహములు లోనగునవి మిగుల నుపయోగకరములు. ఎవ్వరేని మానసికబింబమును బూజింపఁజాలక యుండి బాహ్యవిగ్రహములఁ బూజించిరేని వారియందు దప్పులు పట్టుట సరిగాదు. అట్టివారిని బాహ్యములగు విగ్రహాదుల నుపయోగించకయుండుఁడని బోధించిన వారలకుఁ గీడుచేయుదురుకాని మేలు చేయఁజాలరు. ఇట్టులే బాహ్యములగు నాలంబనము వలయువారు వాని నుపయోగింపక మానసిక ధ్యానము చేయువారలయందు దప్పులుపట్టుటయును సరిగాదు.

వారివారి మనోవృత్తులకుఁదగినట్లు వారివారి యోగ్యతానుసారము రెండు నుపయోగకరములగు మార్గములే. ఒక్కొక్కరు నితరుల యుపాసనామార్గముల దూషింపక యన్యోన్యసహిష్ణువులై సుహృద్భావముతో నుండిన నందఱును గాలానుసారముగ గడతేరుదురు. అన్ని మార్గములు భగవంతుని మార్గములే. అన్నిమార్గములందును బలువురా భగవంతుని

పాదములను జేర యత్నించువారలే. ఏయేమార్గమున నుపాసించిన నాయామార్గముననే యుపాసకుల ననుగ్రహించెద ననియును, మార్గములన్నియును దనయొద్దకుఁ జేర్చునవియే యనియు శ్రీభగవంతుఁడు గీతాశాస్త్రమున నుడివియున్నాఁడు.

> యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్ ।
> మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥

(గీత. ౪-౧౧.)

విగ్రహముల నుపయోగించుటవలని ప్రయోజనము లనేకములు.

౧. ధ్యానించు వారి మనస్సులు చంచలములుగ నుండును. కనుక చంచలములగు మనస్సుల నేకాగ్రములుగఁ జేయుటకు బాహ్యమగు విషయ మావశ్యకమను విషయము ముందే విస్తరింపఁబడెను. విగ్రహమునందలి చిహ్నములు సహితము ముపాస్యుని లక్షణములను శక్తులను సూచించుచుండుటచే ధ్యానమునకు సహితము సహకారు లగుచున్నవి.

మఱియు విగ్రహము శాస్త్రీయముగఁ జేయఁబడి మంత్రములచేతను, నాగమ ప్రయోగములచేతను, ప్రాణప్రతిష్ఠ చేయఁబడినపు డాబింబము తేజోమయమై దేవతాశక్తి దనయందుఁ గలదై దినదిన ముపాస్యునిచేఁ బూజింపఁబడుచు ధ్యానింపఁబడుచు రాఁగాఁ గ్రమక్రమమున దానియందలి దేవతాప్రభావము మహిమయు వృద్ధినొందును. పూజించువాని

భక్తిజ్ఞానము లెంత యెక్కువగనుండిన నాబింబమునందలి తేజోమహిమములు సహితమంత యెక్కువగ నుండును. ఉపాస్యుని భక్తిజ్ఞానములు హెచ్చను బింబమునందలి తేజోమహిమములు సహితము దినదిన ప్రవర్ధమానము లగుచుండును. అట్టి బింబమును భక్తుఁడు సమీపించగనే మనస్సు రమ్యమగుభక్తితోనిండి ధ్యానమున కున్ముఖమగు. ఆబింబమును జూచినమాత్రమున శరీరము పులకాంకితమగుటయు, మనస్సుభక్తిపరవశమగుటయు, దేవతా ధ్యానము తప్ప వేఱు తలంపులు మనస్సునందుఁ జొరక మనస్సైకాగ్రమగుటయు నీమొదలగు ఫలము లాబింబమునుండి కలుగును. ఆబింబము యొక్క సామీప్యమునఁ బరిశుద్ధమగు తేజస్సుండుటచేత నుపాసకుని సూక్ష్మశరీరముసహితము సౌమ్యచలనముగలదియగు. సాంసారికతాపత్రయములును, హేయములగు మనోవికారములునుం దొలఁగును.

ఇంతియగాదు. లోకమునఁ బ్రేమాతిశయముచే బద్ధులగు మిత్రులొండొరులకు వియోగము ప్రాప్తించినను మిత్రుని ప్రతిరూపమగు నొకబింబమును (ఫొటోగ్రాఫ్‌ను) సమీపమున నుంచుకొని చూచునపుడెల్ల నపారసుఖమును, సంతోషమును, దృప్తిని బడయుటఁ గానమా! విగ్రహాదిపూజయుఁ దత్సమమేయయ్యు నంతకంటెను బెక్కుమడుంగు లెక్కుడు ప్రయోజనకారియయి యుండును. ఆబింబమును జూచినపుడెల్లను దివ్యమంగళ విగ్రహుఁడును, దయామయుఁడును, నానందస్వ

రూపుఁడును, సకలానందదాయకుఁడును నగు నుపాస్యుఁడు మనస్సునకుఁ బ్రసన్నుఁడగు. దినదినము తాను బూజించి ప్రేమించి భావించి ధ్యానించు బింబమగుటచే దినదినము నాబింబమునఁ బ్రీతియెక్కువగుచు నావిగ్రహము ప్రత్యక్షమగు దైవమే యైనట్లగు. ఆవిగ్రహము తనప్రాణమునకంటె నెక్కువయగు. ఆవిగ్రహము మొదట సమూల్యముగ నుండినను గొంత కాలమున కది యమూల్యమగు.

ఇక్కారణములనుబట్టి విగ్రహము లుపయోగించు టనేకవిధములఁ బ్రయోజనకరముగ నుండును. కావున నిజముగ భగవద్భక్తులగు వారలు విగ్రహము లుపయోగించువారలయం దసూయపడక వారలయందు బుద్ధిభేదమును బుట్టింపక యుండుట యుక్తము. స్వానుభవముచేఁ దత్త్వము నెఱింగిన వారు చేసిన నిబంధనల తత్త్వమును దెలియనివా రాక్షేపించుటకంటెఁ బరీక్షించి చూచుట శ్రేయస్కరము.

ఈకారణములనుబట్టియే దేవాలయములయందు విగ్రహములు పూజింపఁ బడుచున్నవి. పైని సూచింపఁబడిన కారణములుగాక దేవాలయములయందు మఱియొక గొప్పప్రయోజనమున్నయది. అచ్చటఁ బలువురు భక్తులు వచ్చి భక్తితోఁ బూజసేసి భక్తి సలుపుటచేత నావిగ్రహములయందలి మహిమయు విశేష మగుచుండును. పూజకు వచ్చువారందఱు సామాన్యముగ నక్కడ భక్తితోఁగూడి యుందురు. కావున నాస్థలము భక్తిని వృద్ధి చేయుస్వభావమును బొందియుండును.

మఱియు నచ్చటికిఁ బోవుటచే నొకరినిజూచి యొకరు భక్తు లగుట కవకాశముండును. పామరుల కక్కడ జరుగునుత్సవ ములు మొదలగునవి కన్నుల పండువై వారిమనస్సులందు భక్తి నభివృద్ధిచేయుచుండును.

దేవాలయములు నిర్మించుటయందుఁ గొన్నిరహస్యములు గలవు. దేవాలయమున నేడు ప్రాకారములో మూఁడు ప్రా కారములో యుండు. అవి జీవునికోశములను బ్రహ్మాండమున నుండు లోకములను సూచించుచుండును. ఆయేడు ప్రాకార ముల కవ్వల స్వామి యుండునట్లు ఏడుకోశములను దాఁటి లోపలికిఁబోయిన నాత్మసాన్నిధ్యము గలుగునని కాని యేడు లోకముల నతిక్రమించినంగాని భగవంతుని జూడ సాధ్యము కాదని కాని సూచించును. కొన్నియాలయములయందు మూఁడుప్రాకారములేయుండు. మఱియుఁ గొన్నిటియందొక్క ప్రాకారమును దానిలోపల ముఖమండపమును, దానిని దాఁ టిన పిదప గర్భగృహమును ననుమూఁడు నుండును. ఆమూటి నతిక్రమించిన స్వామిని జేర వచ్చును. ఇదియు నాత్మతత్త్వ మునే మఱియొకవిధముగ బోధించుచున్నది. మూఁడును జీవుని స్థూలసూక్ష్మకారణ శరీరములను మూటినిగాని యీశ్వ రుని సమష్టిరూపములగు విరాడ్రూపము, హిరణ్యగర్భ స్వ రూపము, సూత్రాత్మస్వరూపము లనుమూఁడు రూపములను గాని సూచించును. వానిని దాఁటి పరమాత్మ నెఱుంగఁదగు నని తెల్పుచున్నవి. ఇట్లు దేవాలయములు స్థూలదృష్టిచేఁ

బామరులకు భక్తిజనకములును, సూక్ష్మబుద్ధికి జ్ఞానజనకములునుగ నిర్మింపఁబడియున్నయవి.

విగ్రహము లన్నియు నర్చావతారములని భక్తులచే నెన్నఁబడుచున్నవి. పూజార్థములగు బింబములన్నియు నర్చలని పిలువఁబడుచున్నయవి. మనస్సున నిర్మింపఁబడు మానసిక బింబము సహితము అర్చయనియె యెఱుంగఁ బడు చున్నది. అర్చ లెనిమిది విధములుగ నుండఁదగునని శ్రీమద్భాగవతము నందు చెప్పియున్నది.

> శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ।
> మనోమయీ మణిమయీ హ్యర్చా చాష్టవిధాస్మృతా ॥

తా. శిలలచేతను, మ్రానుచేతను, లోహముచేతను, మన్ను మొదలగువాని మెత్తియుఁ, బత్త్రిమున రచించియు, నిసుకచేతను, మనస్సున నిర్మించియు మణిచేతను నిట్టు లర్చ లెనిమిది విధములగును.

పామరులగువారు మాత్రమే యర్చలుపయోగింప యోగ్యులుగాని మనోమయములగు నర్చల నుపయోగింప శక్తులగు వారలకు నితరములగు నర్చల నుపయోగించుట యుక్తము గాదని తలఁపరాదు. శ్రేష్ఠులగువారలు పోవుమార్గమునఁ బామరులుంగూడఁ బోవుటకు యత్నింతురు గావున శ్రేష్ఠులగువారలు వీనిని దిరస్కరించినఁ బామరులుగూడ వానిం దిరస్కరించియు, శ్రేష్ఠులవలె నిరాలంబముగ నుపాసించుటకు శక్తులుగాకయుఁ జెడుదురు.

యద్యదా చరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥
(గీత. 3-౨౧.)

కావున శ్రేష్ఠులగువారు సైతము తమ కంత యావశ్యకము కాకయుండినను బామరులగు వారలకుఁ ద్రోవచూపుటకును రుచిపుట్టించుటకును వీనిని దిరస్కరింపరాదు.

సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత ।
కుర్యా ద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్ ॥
(గీత. 3-౨౫.)

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్ ।
జోషయే త్సర్వకర్మాణి విద్వా న్యుక్త స్సమాచరన్ ।
(గీత. 3-౨౬.)

జ్ఞానులు నిరాలంబముగ ధ్యానించుచుండినను నాలంబన సహాయ మావశ్యకముగఁ గోరువారల మనస్సులను జెఱుపునట్లు బోధించరు.

ఐహికములగు వాంఛల నీడేర్చుమని కాని మరణానంతరము నరకబాధలనుండి తొలఁగించి కాపాడుమనికాని ప్రార్థించుట ధ్యానము కాదు. అదియెంతయుఁ బామరులమార్గము. భగవంతుఁడు సకలకల్యాణగుణనిధి. సర్వాత్మకుఁడు. అట్టి దివ్యమూర్తిని ధ్యానించునపుడు మనస్సు విషయములందుఁ బరువు లిడక నిలకడతో నామూర్తియందు నిలిచి తైలధారవలె నవిచ్ఛిన్నముగ నీశ్వరుని దిక్కునఁ బ్రవహించును. అట్టిమనస్సున నాత్మస్వరూపము ప్రతిఫలించి స్వానుభవము

నకు వచ్చును. ఇదియే ధ్యానము. మిక్కిలిరమణీయ మగు నొకవస్తువును జూచిన వారి మనస్సు మిగులప్రీతితో నావస్తువునందే నిరంతరము నిలిచి బలిమిగా నావస్తువునుండి మరలించినను మరలక మాటిమాటికి దానియందుఁ జేరి నిలుచును గదా. అట్లు సంపూర్ణముగ రమణీయత్వముగల పరమేశ్వరునందేకరూపముగ నిలిచి యానందభరితముగ నుండునదియే ధ్యానము. ఇట్టిధ్యానమునకు బాహ్యాలంబన మావశ్యక మని యనుభవజ్ఞుల యభిప్రాయము.

విగ్రహములను బుష్పాదులతో నర్చించు పూజలుగాక యార్యులందు సంధ్యావందనము ముఖ్యమగుపూజయే. ఆ యుపాసనమును ద్విజులగు బ్రహ్మక్షత్రియవైశ్యులు సమంత్రకముగను నితరులు స్వరమంత్రములకు మాఱు భగవంతుని నామమంత్రములతోడను నాచరింపఁ దగియున్నది. సంధ్య యన చక్కఁగా ధ్యానముచేయుట. ఇది సంధికాలమందు నేకాగ్రమగు మనస్సుతో సూర్యమండలాంతర్వర్తియగు బ్రహ్మస్వరూపమును, శంఖచక్రగదాది లాంఛన ప్రకాశిత శ్రీమన్నారాయణ స్వరూపముగఁగాని, పంచవక్త్రములుఁ ద్రిణేత్రములు కపాలము మొదలగు చిహ్నములతోటి సదాశివస్వరూపముగఁ గాని, యాదిశక్తి స్వరూపముగఁ గాని యిట్లే యేయిష్టదేవతాస్వరూపముగఁ గాని ధ్యానించుట. సంధియనఁగాఁ గలియుట. చీఁకటియు వెలుఁగును గలియు కాలము సంధ్యాకాలము. ఇవి సూర్యోదయ సూర్యాస్తమయ

ములు రెండు. ప్రాతఃకాలమున నక్షత్రములు మాసిపోను ప్రారంభించినది మొదలు సూర్యోదయము దనుకఁ బ్రాతస్సంధ్యాకాలము. సూర్యుఁ డస్తమించినది మొదలు నక్షత్రములు తోఁచుదాఁక సాయంసంధ్యాకాలము. ఇవి రెండును సంధ్యావందనమునకు ముఖ్యకాలములు. మధ్యాహ్నమును సంధ్యావందనమునకు ముఖ్యమని జెప్పఁబడుచున్నది. ఈ సమయములు మనస్సునకు సహజముగ శాంతమును గలుగఁజేయు సందర్భములని పెద్దలు చెప్పుచున్నారు.

ప్రాతఃకాలమునం దెల్లెడల నిశ్చలముగను నిశ్శబ్దముగను నుండుటచే నది మనస్సు నేకాగ్రంబుగ నిలుపుట కుచితసమయముగ నుండును. సాయంకాలమునందుఁ బగటి లోకకల్లోలములు తగ్గుచుండును గనుక నదియు సంధ్యావందనమున కనుకూల కాలము. నిద్రయం దింద్రియమనంబు లైహిక విషయవిముఖములై కేవల సుఖానుభవమున నుండుటంబట్టి ప్రాతఃకాలమున శాంతి నొందియుండును. అప్పుడు వానిని సులభముగ నేకాగ్రముగఁ జేయవచ్చును. ఆకాల మతిక్రమించిన మనస్సును నింద్రియములును లౌకికవ్యవహారములయందుఁ బ్రవేశించి బహిర్ముఖములై విషయములకై పరుగిడుచుఁ గామక్రోధాదులచేఁ గలవరమందుచుండు. అట్టికాలమున వానిని ధ్యానమునందుఁ నిలుపుట దుష్కరము. కావున నిద్రనుండి మేల్కాంచినవెంటనే యింద్రియములను మనస్సును స్వాధీనముచేసికొని భగవద్ధ్యానముచేయుట సులభము. లౌకిక

వ్యవహారములందుఁ బూనిన వెనుక వానిని ధ్యానమునకుఁ ద్రిప్పుట దుష్కరము. మనంబును ఇంద్రియంబులను ధ్యానముచే శిక్షించి భగవత్కళను వానియందుఁ బూరించిన పిదప లౌకిక వ్యవహారములుచేసినచో నావ్యవహారములు స్వాధీనముగ జరుగఁగలుగునని శ్రుతులు చెప్పుచున్నవి.

త్రికాలములలోఁ బ్రాతఃకాల మగ్రగణ్యము గనుక ప్రాతఃకాలధ్యానము మిగుల ముఖ్యము. లౌకిక వ్యవహారములచేఁ గలతఁజెందియుండు నింద్రియమనస్సుల నావ్యవహారములు దీఱినంతట సాయంకాలమున భగవద్ధ్యానమందు నిలిపినచో నవి స్వాధీనములై కలవరము తగ్గి సుఖనిద్ర కనుకూలము లగును. ఇట్లు సాయంసంధ్యాకాలధ్యానమును ముఖ్యమగుచున్నది. మఱియు వ్యవహారములమధ్యమునందు మాధ్యాహ్నికభోజనమునకుఁబూర్వము భగవద్ధ్యానము చేయుటయు మంచిదని తేటపడుచున్నది. సంధ్యావందనము ప్రతిదినమును సకాలమునఁ జేసినచో సహజముగ నింద్రియమనంబులు ఆయాకాలములయందేకాగ్రముగ నిలిచి సులభముగ స్వాధీనమగును. కావున నీకాలములయందుఁ దప్పక భగవంతుని ధ్యానముచేయుట మిగుల ముఖ్యము.

ప్రాణాయామము—బహిర్ముఖమగు మనస్సును లోపలికిఁ ద్రిప్పుట కిదిసహకారి. రహస్యములను దెలిసినవారి సహాయమున్న గాని ప్రాణాయామ మాచరించుట మంచిదికాదు. అట్లభ్యసించిన ననేక బాధలకుఁ బాలుపడుదురు.

ఆచమనము, మార్జనము—భగవన్నామ స్మరణముతోఁ గాని మంత్రములతోఁగాని యభిమంత్రించిన జలములను ద్రాగుట యాచమనము. ఆజలములతోఁ బ్రోక్షించుకొనుట మార్జనము. భక్తిచే నుచ్చరింపఁబడిన నామమంత్రములచేఁ బవిత్రములైన జలములఁద్రాగిన నంతశ్శుద్ధియుఁ బ్రోక్షించుకొనిన బహిశ్శుద్ధియుఁ గలుగును.

జలప్రాశనాదులు—ఇవి రెండు. ఇందు మొదటిది. జలప్రాశనమందు రాత్రిచేసిన పాపములు పగటియందును బగటిపూఁటచేసినపాపములు రాత్రియందును స్మరించి పరమాత్మాగ్నియందు వేల్చి నాశముచేసి పాపములన్నిటినుండి రక్షించునట్లు సంకల్పించుచున్నారు. రెండవతూరిచేయు జలవిసర్జనమునందు పాపమూలమగునజ్ఞానము పోవునట్లు ప్రార్థనచేయుచున్నారు. దీనిచే సూక్ష్మకారణశరీరముల మాలిన్యములు తొలఁగును. కామక్రోధాదులు నహంకారమును సూక్ష్మశరీర మాలిన్యములు. కారణశరీరమాలిన్యము వానికన్నింటికిఁ గారణభూతమగు నవిద్య. ఇచ్చట ముఖ్యముగ గమనించవలసినరహస్యము లున్నయవి. తొల్లిటిరాత్రియందుఁ జేసిన పాపములను బగటియందును, పగలుచేసినపాపము రాత్రియందును విమర్శించుట మిక్కిలి యావశ్యకము. తాను జేసిన మనోవాక్కాయ కర్మము లన్నియు లెక్కిడి తనకుఁ దాన సాక్షియు ప్రాడ్వివాకుఁడు (న్యాయపరిశీలకుఁడు)నై సావధానముగఁ బరిశీలించి దోషములను స్పష్టముగఁగని మరలఁ జేయకుండు

నట్లు నిశ్చయించుచు రావలయును. ఇట్లుచేయుచు రాఁగాఁ గ్రమక్రమమున దోషములు స్పష్టముగఁ దెలియవచ్చును. వానిందొలగించుటయు సులభమగును. దోషములని చక్కఁగఁ తెలియక పలుమఱు దోషములను జేయుదురేకాక దోషములని తెలిసి వానిని జేయుట సహజముకాదు. ఆత్మదోషములను బరిశీలించుచు వచ్చినచో వానిం జేయకుండఁ బాపుటకుఁ గ్రమక్రమమున నెక్కుడు ప్రయత్నము చేయుచుఁ బరిపక్వదశయందు వానిం బొత్తిగ విడువవచ్చును. ఇట్టిగుణదోషవిమర్శనములేక జ్ఞానవృద్ధి కాఁజాలదు. కావున నీవిమర్శనమును బ్రతిదిన మొక్కతూరియైనను జేయక యుండరాదు. మఱియు దోషముల స్మరించినప్పుడు ఇష్టదేవతాస్మరణము చేయుచుఁ బ్రాశనమంత్రములందుఁ జెప్పినప్రకార మాత్మాగ్నియందు బాగుగ వేల్చి దహింపఁజేసితినని భావించిన నా దోషముల ఫలముకొంతయేని తగ్గును. దీనిచే పాపాచరణమునఁగలుగు నరకానుభవమును దగ్గును. ముఖ్యముగ దోషముల నప్పుడప్పుడే సావధానముగఁ బరిశీలించి మరల వానిని జేయకుండ నిశ్చయించుకొనుచుండిన స్వల్పకాలమున నశుభవాసన లెంతదృఢముగనుండినను నవి నశించి శుభవాసనలు చేరుచుండును. కావున సంధ్యావందనమందలి యీదోషవిచారము మిగుల శ్రేయస్కరము.

ఇట్లాచమనాదులచే నుపాధులందలి మాలిన్యమును బోఁగొట్టి నిష్కల్మషమగు నంతఃకరణములో లిప్తుడై వమును

ధ్యానముచేయుట కర్తవ్యఁడగును. ధ్యానమునకు మున్నిష్ట దేవ
తను స్మరించి యర్ఘ్యప్రదానము చేసి స్తుతించవలయును.

గాయత్రీమంత్రోపదేశమును బొందినవా రామంత్రమును,
నితరులు యథోపదిష్టమంత్రములను జపముచేయుచు నిష్టదేవత
యందు మనస్సు నేకాగ్రముగ నుంచి ధ్యానముచేయవల
యును.

గాయత్రీ మంత్రమునందొక విశేషమున్నయది. మంత్రార్థ
మును విచారించిచూడఁగా నుపాసకుఁడు లోకమునందలి జను
లందఱును సద్బుద్ధిగలవారగునట్లు భగవంతుఁడు చేయుఁగాక
యని యాపరంజ్యోతిని ధ్యానించవలసినట్లు స్పష్టమగుచున్న
యది. కావున దామును లోకులందఱును బరిశుద్ధులై సత్పురు
షులునునై లోకహితమాచరించునట్లు ప్రార్థించవలయును.

మంత్రోపదేశమును బొందినవారును బొందనివారును బైని
సూచింపఁబడిన ధర్మములను గ్రహించి సకాలమున నిష్టదేవ
తల నుపాసించుచు లోకహితార్థము భగవద్ధ్యానమును
జేయుఁదగును.

## రాజయోగము

ఇదికాక మఱియొకవిధమగు నుపాసన మున్నయది. దాని
యందును సంధ్యావందనమునందలి మంత్రములను జెప్పినను
జెప్పవచ్చును. తంత్రములను చేసినను జేయవచ్చును. కాదేని
మంత్ర తంత్రములు లేక జీవేశ్వరుల రూపముల నెఱింగి జీవుఁడు

పరమాత్మయందుఁ జేరునట్లు మానసిక ధ్యానమును జేయ వచ్చును. ఇది జీవేశ్వరులను జేర్చు రాజయోగము. ఈ యోగమునకు సాధనములుగనుండు పూర్వాంగములుగలవు. అవి యోగాంగములు. వీనిని బతంజలి యోగసూత్రములందు విస్తరించివ్రాసియున్నాఁడు.

యోగాంగముల సహాయమున జీవుఁ డీశ్వరునిం జేరనభ్యసించుటయె యోగాభ్యాసము. యోగాభ్యాస మన్నమాత్రమున నెద్దియో క్రొత్తమార్గమొకటియని భావింపనక్కఱ లేదు. చిత్తవృత్తినిరోధమే యోగము. ఎల్లవారును దెలిసికాని తెలియక కాని, యోగాభ్యాసమార్గమున నున్నవారలే. ఎల్లవారు నానందమును గోరుచుఁ దత్స్వరూపమైన యాత్మసాన్నిధ్యమును గోరుచునే యున్నవారు. ఆయానందమున లేశమాత్రము గల యిహలోక విషయములయందుఁ బూర్ణానందము గలదని యజ్ఞానముచే భ్రమించి విషయసంయోగమును గోరుచున్నవారు. కడకు విషయానందములు దుఃఖమిశ్రములనియు క్షణభంగురములనియు నెఱింగి స్వర్గసుఖములను గూర్చియత్నింతురు. అవియును నశ్వరములని క్రమక్రమముగ నెఱింగి వైరాగ్యసంపన్నులై యాత్మసాన్నిధ్యమును వెదకుదురు. ఇట్లాత్మసంయోగమును గోరుట మానవులు మాత్రము గాదు. ఈశ్వరునికళయగు జీవుఁడు మృత్పాషాణాదులయందుఁ గొంత కాలము సుషుప్తియం దుండునట్లుండి పిదప నోషధివనస్పతులందుఁ గించిజ్జాగ్రదవస్థుఁడై వర్షవా

తాతపములను భూసారములను గ్రహించుచు వివిధానుభవ ములం గలిగి బీజరూపములుగనుండిన యాత్మశక్తులను గొన్నింటి వికసింపఁ జేయును. పిమ్మటఁ దిర్యగ్జంతువులగు పశుపక్ష్యాదులందుఁ జొచ్చి యింద్రియస్పర్శములవలన బహు విధములగు సుఖదుఃఖముల ననుభవించును. కడపట మానవ జన్మమెత్తి మనుష్యరూపమున జీవుఁడై వెలయును. ఈయాత్ర యందంతయు నీశ్వరుని నుండి కళారూపముగ వేఱయిన జీవుఁడు మరల నామహాజ్యోతియందుఁ జేరుటకే కోరుచుం డును. వాఁడన్నిలోకములందుఁ బొందు వివిధానుభవములు నాపదవిని బొందింప సమర్థములు కాని వేఱుకావు. ఈవిధ ముగ ననేకయుగములును గల్పములును దిరిగి దీర్ఘకాలమున కందఱును బరమపురుషార్థమును బొందనోపుదురు.

ఐనను వివేకముగల మనుష్యుఁడు తనబుద్ధికుశలతను విని యోగించి ప్రయత్నానుగుణ్యముగ నాకాలప్రమాణమును దగ్గించనోపును. దీనికి దృష్టాంతములు గలవు. అడవిని బెరుగు ములగకాయలలోని బీజములను దెచ్చి సుక్షేత్రమునవిత్తి తగిన యెరువుతోఁ జేర్చి వ్యవసాయకుశలతచే నభివృద్ధియైన చెట్లనుండి బీజములంగొని మఱియు నాబీజములనాటి కాయలు కాచునట్లు చేసి యావిత్తనములతోఁదగుమార్గమున వ్యవ సాయముచేయుచు రాఁగాఁ బండెడు కాయలు కాలక్రమమున ముండ్లుపోయి గొప్పవియై మొదటి ములగకాయలకంటె మిగుల శ్రేష్ఠమైనవిగ నగును. అట్లే మామిడిచెట్లయందు మంచి

వియగు నొకజాతిమ్రాకులతో మఱియొకజాతిమ్రాకులనుండి యంట్లుగూర్చుటచేత మంచిరుచిగల యంటుమామిడిపండ్లు పండును. మఱియు నెల్లూరుమండలమునందలి యావులయందును గోడెలయందును సాధుగుణములు గలవు. మైసూరు దేశమున నమృతమహాలునందలి వృషభములయందు బిగువును జువుకుఁదనమును గలదు. నెల్లూరిమండలమునందలి యావులకును అమృతమహాలు వృషభములకును సంబంధమును గల్పించి కోడెలనుబుట్టించుచున్నారు. వానియందు నెల్లూరు కోడెల బలమును సాధుగుణములును, మైసూరు రాజ్యమునందలి యెద్దుల పౌరుషబలమును, జువుకుఁదనమును, గష్టమునకోర్చు శక్తియుఁ గలుగుచున్నది.

ఇట్లు సామాన్యముగ లౌకికవ్యవహారములందు మనుష్యుఁడు తనబుద్ధి కుశలతచే ననేకములగువస్తువులను శీఘ్రముగ నుత్కృష్టస్థితికిం దెచ్చుచున్నాఁడు. అవి తమంతటనే వృద్ధికావలయునన్న దీర్ఘకాలము పట్టును. తనబుద్ధి కుశలతచే వస్తుతత్త్వములను యుక్తాయుక్తములను నెఱింగి విశేషప్రయత్నముచేసి తనజ్ఞానాభివృద్ధిని గూడఁ ద్వరితముగఁ జేయవచ్చును. ఇట్టి వివేకసహితమగు ప్రయత్నమే యోగాభ్యాసము.

జీవునియందాత్మశక్తులు బీజరూపములుగనుండి క్రమక్రమముగ లోకమున వికసించుచు వచ్చుచున్నమార్గములను బరిశీలించవలయును. తనయనుభవములతో నితరుల యను

భవమును సహాయముగఁ గొనవలయును. జ్ఞానాభివృద్ధి కను కూలములగు మార్గముల నవలంబించవలయును. ప్రతికూల ములగు మార్గములను విడువవలయును. దేశకాల నిమిత్త ముల నెఱింగి యుపాయముతో సందర్భానుసారముగఁ దగు భంగిఁ బూనికతోఁ బ్రయత్నించుచు రావలయును. ఈరీతిఁ దనశరీరేంద్రియమనస్సులను నిగ్రహించి శుద్ధములుగను సార్థకములుగను జేయుమార్గమే యోగాభ్యాస మనుపేరఁ బరఁగునుగాని యది యొకనూతనమార్గము కాదు. దీనిని స్పష్టముగ నెఱింగినచో యోగాభ్యాస మెల్లవారలకును సాధ్య మని స్పష్టమగును. అభ్యాసము చేయుటకుఁ బ్రారంభించిన నాజన్మముననె పరిపూర్ణముగ సిద్ధి కాకపోయినను జేసిన ప్రయత్నము వృథాకానేరదు. దానిఫలము కట్టియుంచిన మూటగా జీవుని నంటియేయుండును. ఇట్టి ప్రయత్నము చేయు చుండఁగా సిద్ధిగలుగకపోదు. ఈయర్థమును గీతాశాస్త్రమున యోగభ్రష్ట విచారమందు నొక్కి బోధించియున్నారు.

> పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
> న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥
> ప్రాప్య పుణ్యకృతాఁ లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః ।
> శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ।
> అథ వా యోగినా మేవ కులే భవతి ధీమతామ్ ।
> ఏత ద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశమ్ ।
> తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్ ।
> యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ॥
> (గీత. ౬ అధ్యా. శ్లో. ౪౦-౪౩.)

తా. ఓయి యర్జునా! యోగభ్రష్టునకు నిహపరలోకములయందు నాశనములేదు. శుభకరమగు కర్మము నొనరించిన వాఁడు దుర్గతి నెప్పుడును జెందఁడు. పుణ్యకార్యము లొనరించిన మహాత్ములు పొందులోకముల నొంది పెక్కుసంవత్సరము లందు గడపి సంపూర్ణయోగసాధకుఁడు కాఁడు కావునఁ బరిశుద్ధులై సకలవిభవ సమృద్ధులగు వారియింటఁ బుట్టును. లేదా యోగులును బుద్ధిశాలురును నగువారి వంశముననైనఁ బుట్టును. లోకమున నిట్టి జన్మము మిగుల దుర్లభమని తెలియఁనగు. అట్లు పుట్టియు, బూర్వదేహసంబంధమగు బుద్ధిసంయోగమునే పొంది మరల యోగసిద్ధికై యమ్మహాత్ముఁడు యత్నించునని యెఱుంగుము.

జీవుఁ డీశ్వరునియందుఁ జేరుటయె నిజమగుయోగము. అట్టి యోగమునకు సాధనముగ నుండుమార్గమున సోపానములుగ నెంచఁదగు నెనిమిది యోగాంగములున్నయవి. ఈ యంగములతోఁగూడిన యభ్యాస మష్టాంగయోగము.

## అంగములు

"యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయోఽష్టావంగాని"—పతంజలియోగసూత్రము.

యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధియు నను నీ యెనిమిదియు యోగాంగములు.

అందు మొదటి రెండును.—యమము, నియమము—అభ్యాసకుని యశుభవాసనలఁ దొలఁగించి శుభవాసనల నొనఁగూర్చి భావశుద్ధినిచ్చునవి. అభ్యాసకుఁడు శుద్ధుఁడు గాకపోయినచో సామాన్యలోకవ్యవహారములయందు యోగ్యుఁడు కానేరఁడు. అట్లుండ నుత్తమమగు నాత్మసాన్నిధ్య మెట్లు సాధింపనోపును? దుశ్చరితము నుండి విరమించవలయును. ఇంద్రియములను నియమించి శాంతములుగఁ జేయవలయును. మనస్సును స్వాధీనము చేసికొనవలయును. ఇట్టివి లేనివాఁడు యోగమున కర్హుఁడు గాఁడు.

> నా ఽవిరతో దుశ్చరితా న్నా ఽశాంతో నా ఽసమాహితః ।
> నా ఽశాంతమానసో వాపి ప్రజ్ఞానే నైన మాప్నుయాత్ ॥
> (కఠోపనిషత్తు.)

కావున యోగాభ్యాసమున కారంభించుటకు ముందు తనయందుండు దుర్గుణములను బోఁగొట్టి ముఖ్యములగు కొన్ని సుగుణముల దృఢపఱచుకొనవలయును. అట్లుచేయక మూఁడవది మొదలుగాఁగల యంగములతో నారంభించి యభ్యసింప నర్హుఁడు గాఁడు. యమనియమము లెవ్వి యనఁగా:

> తత్రా హింసా సత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహా యమాః ॥

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము అపరిగ్రహము నివి యమములు.

యోగియగువాఁడు సర్వభూతములను దనవలె భావించుచు సర్వసముఁడు కాఁగోరువాఁడు కావున నొకరికి హింస యెంత

మాత్రము గలుగఁజేయరాదు. హింసయనఁగాఁ జంపుట మాత్రముగాదు. కామక్రోధాది సంకల్పములచే లోకములకు బాధయగుం గావున వానిని గలిగింపరాదు. ఒరుల నొప్పించు మాటలాడరాదు. ఎవ్వరికేని బాధను గల్గించుపనిని జేయరాదు. ఇట్లు లోకమున నెంతమాత్రమైనను బాధ కలుగఁ జేయరాదు. ఆతని సమీపించు నెల్లవారును శాంతమును బొందున ట్లుండవలయును. ఎల్లవారు తన్ను రక్షకునిగాను సుహృదునిగా నెన్నుకొనున ట్లుండవలయును. అజాతశత్రువుగ నుండఁదగు. అట్టివానియందు నసత్య ముండదు. ఇతరుల ద్రవ్యము నపహరించు బుద్ధి మనస్సునం దైనను గలుగదు. మఱియు బ్రహ్మచర్యము నభ్యసింపవలయు. అనఁగా నింద్రియ నిగ్రహము గలిగి విషయచింత లేక యుండవలయును. విషయచింత యుండఁగా మనం బింద్రియములతోఁగూడి విషయములయందు సంచరించుచుండునే గాని యీశ్వరునందు నేకాగ్రము గానేరదు. అపరిగ్రహము—ఐహిక సుఖసాధనములగు పదార్థములను గ్రహించుకోరిక మనస్సునందైనను లేక యుండవలయును. ఇవి యమములు.

## నియమము

శౌచసంతోషతపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః ॥

శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము నివియన్నియు నియమములు.

శౌచము—అనఁగా పారిశుద్ధ్యము. శరీరము, నింద్రియములును, మనస్సు, బుద్ధియు నన్నియుఁ బరిశుద్ధములుగ నుండవలయు. శరీరము సకాలమున స్నానముచేతను, అపరిశుద్ధములగు పదార్థములను మనుష్యులను స్పృశించక యుండుటచేతను, బరిశుద్ధమగుచున్న యది. శరీరమునుండి సర్వకాల సర్వావస్థలయందు నతిసూక్ష్మములగు నణువులు బయలు వెడలును. ఆయణువులు సమీపమున నుండు వారల శరీరముల నంటి వారిశరీరములలోఁ బ్రవేశించును. అవి పరిశుద్ధములు నారోగ్యములునైన నితరులకు సుఖకారణములగు. పరిశుద్ధములు గాకపోయినచో నితరులకు హానికరములగు. మలిన తేజస్సు గలవియగుచో నితరుల తేజస్సును మలినముగఁ జేయును. సర్వభూత శ్రేయస్సుఁగోరు యోగాభ్యాసి తన శరీరమునుండి యితరులకుఁ గీడుచేయు నణువులు వెలువడు నట్లు శరీరము నపరిశుద్ధముగ నుంచుకొనరాదు. అట్లు పరిశుద్ధములగు క్రతువుల సంకల్పించుచు దుష్క్రతువులను దుర్గుణములను మనస్సునఁ జొరనీయకయు నింద్రియముల నియమించి, యింద్రియమనస్సులం బరిశుద్ధముగ నుంచవలయు. ఇట్లు స్థూలసూక్ష్మశరీరములు పరిశుద్ధములుగ నుంచుకొనుట కభ్యసింపవలెను.

> జ్ఞానం తపో ఽగ్ని రాహారో మృన్మనో వార్యుపాంజనమ్ ।
> వాయుః కర్మార్క కాలౌ చ శుద్ధేః కర్తౄణి దేహినామ్ ॥
>
> (మనుస్మృతి. ౫-౧౦౫.)

జ్ఞానము, తపంబు, అగ్ని, ఆహారము, మృత్తిక, కామ వర్జితమగు మనస్సు, జలము, ఉపాంజనము, గాలి, కర్మములు, సూర్యుఁడు, కాలము నివియన్నియు దేహమునకుఁ బరిశుద్ధి కరములు.

మఱియు,

> అద్భిః గాత్రాణి శుధ్యంతి మనస్సత్యేన శుధ్యతి ।
> విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి ॥
>
> (మనుస్మృతి. ౫-౧౦౯.)

దేహము నీటిచేతను, మనస్సు సత్యముచేతను, బుద్ధి జ్ఞానముచేతను, జీవుఁడు విద్యాతపస్సులచేతను, బరిశుద్ధులగుదురు.

యోగ మభ్యసింపఁగోరువాఁ డిట్టి శుచిత్వము గలిగియుండ నగు. ఏమి వచ్చినను మనస్సున కలవరమందక తృప్తితో సంతోషించవలయును. శరీరము నింద్రియములను సత్ప్రవర్త నముచే నిగ్రహించి స్వాధీనపఱచుకొనుట తపస్సు. సద్గ్రంథ ములను జదువుటయుఁ బ్రణవజపాదులను జేయుటయు, స్వాధ్యాయము. ఈశ్వరుని జెందవలయునను తీవ్రమగు నాశయే యీశ్వర ప్రణిధానము.

ఇక్కాలమున ననేకులు యమనియమముల నభ్యసింపక యే ప్రారంభముననే ప్రాణాయామము మొదలగు నాఱంగ ములను మాత్రమభ్యసించుటకు యత్నించుచున్నారు. కొంద ఱు వాయుధారణమే ప్రాణాయామయోగమని దాని నభ్య

సించుచు, నితరులకు బోధించుచున్నారు. యమనియమ ములు మిగుల కష్టములని వానిని విడుతురు. యమనియమ ముల నభ్యసించుటయన్న, విషయవాంఛలను వదలి విరాగ ముతో నివృత్తిమార్గమునందు వర్తించుట. సామాన్యములగు నల్పవాంఛలనైనను జయింపకయే సులభమగు మార్గమున యోగులు గాఁగోరి యమనియమములఁ బాటింపకయే వాయు ధారణమున కారంభించుట వెఱ్ఱితనము. యథార్థముగ నిశ్శ్రే యసముఁ గోరువారు మొట్టమొదట యమనియమాభ్యాస ముచేఁ జిత్తశుద్ధిఁబొంది మిగిలినయాఱంగముల నభ్యసింప నగును.

## ఆసనము

యోగాభ్యాసమున సుఖమైనదియు, స్థిరమైనదియు నగు నాసనమునఁ గూర్చుండవలయును. పద్మాసనము, సిద్ధాసనము మొదలగు ననేకవిధాసనములలో దేనియందు శరీరమునకు సుఖముగలుగునో యాయాసనమునఁ గూరుచుండవలయును. భూమిపై దర్భాసనము దానిపైఁ గృష్ణాజినము, దానిపై వస్త్రము పఱచి దానిపైఁగూరుచుండిన సుఖముండును. కూరు చుండునపుడు శరీరము, శిరమును మెడయు నొరుగక చక్కఁగ నుండవలయును. అట్లుండుట ధ్యానమున జాగరూకుఁడై యుం డుటకు సహాకారియగు. దేనిపైనైన నానుకొనిన యెడల ధ్యానముచేయునపుడు నిద్ర రావచ్చును. ఇట్లు భూమిపై

మృదువగు నాసనమును నిర్మించుకొని సుఖమగు నాసనమునఁ జక్కఁగఁ గూర్చుండవలయును. కూర్చుండుప్రదేశము శుచిగ నుండవలెను. స్వభావముగాఁ బరిశుద్ధమై సమమై నీళ్లబాధయుఁ గ్రిమికీటాదుల బాధయు లేనిదై యుండవలయును. గృహములందు దేవపూజకుఁ గాక తక్కినపనుల కెప్పుడు నుపయోగింపని గదియే ప్రశస్తము. ఏకాంతస్థలముగ నుండుట శ్రేష్ఠము. అచ్చట మనస్సునకు విక్షేపముగలుగఁ జేయు వస్తువులనుంచక ధ్యానమునకు సహకారులగువాని నుంచియుండుట యెంతయు ననుకూలము. ఉపాస్యదేవుని ప్రతిమయుఁ బ్రేమాస్పదులగు పెద్దల ప్రతిమలును బూజకు నుపయుక్తములగు ధూపాది ద్రవ్యములు నివి యెల్ల ధ్యానమునకు సహకారులు. అట్లు కొంతకాల మాగది పూజకు మాత్రమే యుపయోగింపఁ బడుచుండ నాగదియందలి స్థూలసూక్ష్మాకాశమంతయు దివ్యతేజస్సుతో నిండియుండును. అట్టి గదిలోఁ బ్రవేశించిన తోడనే యా తేజస్సు వ్యాపించి భక్తినిగలుగఁ జేయును. అట్టి ప్రదేశములు శుచిప్రదేశము లగునుగాని తఱుచుగ లౌకిక వ్యాపారముల కుపయోగించుచు ధ్యానసమయమున మాత్రము శుద్ధముగ నీటితోఁ గడిగినమాత్రమున నది ధ్యానయోగ్యముకాదు. ధ్యానకాలమున నేకాంతముగ నుండవలయును. ఇద్దఱు ముగ్గురు గలిసిన విక్షేపమగును. కావున నాసమయమున ముఖ్యముగనుండఁదగునవి—(౧) ధ్యానమునకు మాత్ర ముపయోగింపఁబడు పరిశుద్ధమగు ప్రదేశము,

(౨) ధ్యానమునకు సహాయములగు ద్రవ్యములుమాత్రముం డుట, (3) ధ్యానకాలమున నేకాంతముగ నుండుట. (౪) ఇట్టి ప్రదేశమున సమమగు స్థలమున "చైలాజినకుశోత్తరమ్" వస్త్రము, కృష్ణాజినము, దర్భాసనము నొకదానిక్రింద నొక టిగ నునిచి సులభమైనదియు స్థిరమైనదియు నగు నొకయా సనమున నుండి కాయశిరోగ్రీవములు సమముగఁ జేసి దిక్కు లను జూడక యుండవలయును.

ఈవిషయము శ్రీభగవద్గీతయందు నాఱవయధ్యాయమున భగవంతుఁడు విధించియుండునది చూడఁదగు.

> శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః ।
> నా త్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం ॥
> త త్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।
> ఉపవి శ్యాసనే యుంజ్యాత్ యోగ మాత్మవిశుద్ధయే ॥
> సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః ।
> సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చానవలోకయన్ ॥
> ప్రశాంతా త్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః ।
> మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥
>
> (గీత. అ. ౬, శ్లో. ౧౧-౧౪.)

## ప్రాణాయామము

ఇట్లు సుఖాసీనుఁడై నాల్గవయంగమగు ప్రాణాయామము చేయవలయును. ప్రాణాయామమనఁగాఁ బ్రాణాపానములగు నుచ్ఛ్వాసనిశ్వాసములను సమముగ నియమించుట. ఇది యనుభవజ్ఞుఁడగు గురుముఖముగ నెఱింగి యభ్యసింపఁదగినది.

అట్టిసహాయము లేక ప్రాణాయామ మెక్కువఁగఁ జేసినచో నపాయకరమగు. కావున జాగ్రతతో నుండుట యుచితము. దీనివలని ముఖ్యప్రయోజనము ఉచ్ఛ్వాసనిశ్వాసములను సమ పరచి స్తిమితపరచుట.

ప్రత్యాహారము—ఇంద్రియములద్వారా బహిర్ముఖమగు మనస్సును విషయములనుండి మరలించి లోనికిఁ ద్రిప్పుట ప్రత్యాహారము. ధ్యానమునకుం గూరుచుండ రమణీయములగు శబ్దాదివిషయములు శ్రోత్రాదీంద్రియములకు సోఁకఁగా వానిని గూర్చి మనస్సు పోవుచుండును. అట్లు పోనీయక మనస్సున బాహ్యస్పర్శములను జొరనీయకయుండవలయును. ఇట్లింద్రియములు నియమింపఁ బడ నావలిదగు ధారణ సులభమగు.

ధారణయనఁగా:—బాహ్యవిషయములనుండి త్రిప్పఁబడిన మనస్సును ఏకాగ్రముగ ధ్యేయమూర్తియందు నిలిపి వేఱువిషయములందుఁ బ్రవేశింపక యుండునట్లు చేయవలయును. మనస్సు చంచలమై పూర్వానుభవ గోచరములగు విషయసుఖములకుం బోవును. అట్లు పోనీయక మరల మరల దానిని వెనుకకుఁ ద్రిప్పి యాత్మయందే నిలుపుచు రావలయును. ఇదియే యభ్యాసమనియుఁ జెప్పఁబడును.

## ధ్యానము

ఇట్లు నిలిపిన మన స్సాత్మగుణములఁ జింతించును. ఈచింతయే ధ్యానము. ధ్యానమున నితరములగు ప్రత్యయములను

మనస్సునఁ జొరనీయక యాత్మభావన యొక్కటియే మన స్సున నిలుకడగా నుండునట్లు చేయవలయును. క్రమక్రమ ముగ మనస్సు నేకాగ్రముగఁ జేసి యాత్మప్రత్యయ మొక్క టియే మనస్సున నవిచ్ఛిన్నముగ నుండునట్లు చేయవలయును.

> శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
> ఆత్మసంస్థం మనః కృత్వా నకించి దపి చింతయేత్ ॥

తిన్నతిన్నగా ధైర్యముతో మనస్సునితరవిషయములనుండి మరలించి యాత్మయందుంచి యేమియుఁ జింతింపక యూరక యుండవలయును. ఇట్లు తైలధారవలె నవిచ్ఛిన్నమగు స్మృతి సంతానము ధ్యానమనఁబడును. అపుడు మనస్సు బాహ్య ములగు విషయములను విషయవాసనలను మఱచి యాత్మ యందే రమించుచుండును. ఇట్లుండ మనస్సాత్మయందు మునిఁగి క్రమముగ భిన్నభావమే మఱచి యాత్మతాదాత్మ్యము నొందును. ఆత్మయనఁగా నిరుపాధికమగు నిర్గుణబ్రహ్మము గాని సోపాధికమగు సగుణబ్రహ్మముగాని యగును. ఇందు నిర్గుణబ్రహ్మము నుపాసించుట దుర్లభము. శ్రీగీతాశాస్త్ర మునందు భగవంతుఁ డీవిషయమును స్పష్టముగ వివరించి యున్నాఁడు.

> క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తా సక్తచేతసామ్ ।
> అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥ (గీత. ౧౨-౫.)

అట్టియుపాసనమునందు రుచిగలిగి యింద్రియములను నియ మించి సర్వసమబుద్ధులై పూనికతోఁ జేయఁగలవారలకే యది

సాధ్యముకాని యితరులకు మిక్కిలి దుస్సాధ్యము గావున నట్టి యితరులకెల్ల సగుణధ్యానము సుకరము. శివకేశవాది దైవములలోభక్తునకుఁ బ్రేమాస్పదమగు నుపాస్యుని దివ్యమంగళ మూర్తిని మనస్సునఁ గల్పించుకొని దాని నాలంబనముగాఁ గైకొని యందుంబరమాత్మయు ననంతకళ్యాణనిధియు నగు చైతన్యమును ధ్యానముచేయవలయును. ధ్యానమున మొట్ట మొదట నామూర్తిని మనస్సున దృఢముగఁ గల్పించుకొన వలయును. క్రమక్రమమున నారూపమును బాదములనుండి శిరస్సుదాఁకఁ జిత్తమునందుఁ గల్పనచేసికొని తుదకు రూప మంతయు మనస్సున నిలుచునట్లు చేసికొనవలయును. ఇట్లు చేయుటవలన మనస్సునకుఁ బూర్ణవ్యాపారముగలిగి యితర విషయములయందు వ్యాపించకయుండుట సుసాధ్యము. అట్టి బింబమును మనస్సునఁ గల్పించుకొనుట మొదటమొదట కష్టముగ నుండియు నభ్యాస బలముచేఁ గాలక్రమమున సాధ్య మగును. ఉపాస్యుని దివ్యగుణలీలాదులస్మరణముచేతను, నద్దేవుని స్తోత్రములచేతను, బ్రతిమాది పూజలచేతను భక్తి ప్రేమలు క్రమక్రమముగ నభివృద్ధియై ధ్యేయమూర్తి దృఢ ముగ మనస్సున నిలుచుచువచ్చును. అంతట నామూర్తి స్మరణమాత్రమున నేర్పడుచుండును.

విలిఖితమివ రూపం చిత్తభిత్తౌ మురారే
స్సుమన ఇవ మనో మై రర్పితం తత్పదాబ్జే ।

ప్రతిపద ముదయద్భి స్సాత్వికైరంకితాంగా
స్త ఇహ భవపయోధేః పార ముల్లంఘయంతి ॥

తా. శరీరమున నానందబాష్పములు రోమాంచలములు లోనగు సాత్విక భావము లంకురించుచుండ నెవరిచేఁ జిత్తమను గోడయందు మురారి దివ్యరూపము లిఖింపఁబడినట్లు చేయఁ బడునో, ఆమురారిపాదకమలములం దెవరిచేఁ గుసుమముల వలె మనస్సు సమర్పింపఁబడునో యట్టివా రీ జన్మమున నీ యపార సంసారసాగరమును దాఁటుదురు. అని చెప్పఁబడి యున్నది.

## సమాధి

ఈయర్థమే పూజావిధానమునందును పాదము మొదలు శిరస్సుదాఁక వేఱువేఱుగ వివిధాంగముల పూజయుఁ గడపట సర్వాంగముల నొక్కసారిగఁ బూజించుటయు విధింపఁబడి యున్నది. విగ్రహమును మనస్సున దృఢముగ నిలుపుచు వచ్చిన మన స్సాదైవమునందుఁ గ్రమక్రమమున లయించి శరీరము పరవశమగును. అపుడు దేహేంద్రియములు నిర్వ్యాపారములు కాఁగా మనస్సేకాగ్రముగ నుపాస్యునియందు మునిఁగియుండ బాహ్యప్రజ్ఞ లేకయే పోవును. అపు డుపాసకుని మనస్సాత్మయందే యానందించుచు నాత్మస్వరూపమై యుండు. అపుడు జీవుఁడు స్థూలమగు నీశరీరమును విడిచి సూక్ష్మ శరీరముననో, దానినిగూడ విడిచి యంతకంటె

సూక్ష్మమగు కారణశరీరమునతో జాగరూకుఁడై వర్తించుచు నాయూర్ధ్వలోకముల జ్ఞానముగలిగి యుండును. ఇట్లు క్రమ క్రమమున నొక్కొక్క యుపాధిని వదలి దానికంటె సూక్ష్మ మగు నుపాధియందు వర్తించుచు, విడువఁబడిన యుపాధిని ననాత్మగనెఱుంగుచుఁ, గాలక్రమమున నుపాధులన్నియు ననాత్మలుగనెఱింగి యన్నిటికంటె సూక్ష్మము, నన్నిటియం దంతర్యామియునగు నాత్మను నెఱుంగు. ఇట్లాత్మసాక్షా త్కారముచే జీవునకుఁ బరమాత్మతో నైక్యానుభవము గలుగు మార్గమే యోగమార్గము. ఆయైక్యమే నిజమగు యోగము.

సంధ్యావందనమునకుఁ జెప్పఁబడిన కాలనియమము ముఖ్య ముగ నీధ్యానమునకు గమనించఁదగినది. ఈయోగము దిన దినమును కాలము తప్పక యభ్యసింపవలయును. అట్లభ్య సించుచుండిన దినదిన మావేళరాఁగా శరీర మభ్యాసబల ముచేఁ దనంతట దానే ధ్యానమున కున్ముఖమగును. ఎంత గాఢముగ నిద్రించుచుండినను వేళకుఁ జక్కఁగ మెలఁకువ గలుగును. ధ్యానమునకుఁగూర్చుండిన, శరీరమును మనస్సును సులభముగ ధ్యానమున నిలుచును. ఈరీతి నన్నిపనులును గాలనియమముగఁ జేయుచుండిన నాయాకాలమున నాయా పనులు చేయుటకు శరీరము మనస్సు నలవడి ప్రయత్నబా హుళ్యము లేకయే స్వాధీనము లగును. ఆకాలనియమము లేకపోయినచో నిట్టి యనుకూలముండదు.

యోగాభ్యాసమునకు మఱియు మూఁడు లక్షణము లవశ్య ములుగ నున్నయవి. (౧) యోగాభ్యాసమార్గమున నాదర ముండ వలయును. ఆదరమనఁగా దృఢమగు నమ్మకము. నమ్మకములేక చేసినచో నల్పఫలమేయగును. కనుక దృఢ మగు నాదర బుద్ధి గలిగి పూనికతోఁ జేయవలయును. (౨) అభ్యాసము నిరంతరముగ నుండవలయును. ఒకనాటి యంత రము గలిగినను ననేక దినము లభ్యసించిన సాధనపాటవము చెడును. ఎంతస్వల్పకాల మభ్యసించినను దినదినము తప్పక చేయవలయును. కొన్నిదినములు జాముల కొలఁది ధ్యాన మభ్యసించి మఱికొన్ని దినము లభ్యసింపకయుండుటచే వృథా కాలయాపన మగును. (3) మఱియు నీయభ్యాసము దీర్ఘ కాలము చేయఁదగినది. కొంతకాల మభ్యసించి యోగసిద్ధి గాలేదని యతృప్తిఁజెందరాదు. అనేక జన్మములనుండి దృఢ ములైయుండు విషయవాసనల నున్మూలముచేయక మనస్సే కాగ్రము కానేరదు. బహుకాలమునుండి విషయములయందు రమించుచుండిన మనస్సును వానినుండి మరలించి యాత్మయం దున్ముఖము చేయుట దుష్కరము.

కావున నభ్యాసము చిరకాలము పూనికతో వేసరక చేయ వలయును. ఈరీతి నాదరము నైరంతర్యము దీర్ఘకాలాభ్యాసము నను నీమూఁడును యోగసిద్ధి కత్యంతావశ్యకములు.

---

## పదునేడవ యధ్యాయము

### ఇది మంచిసమయము

చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే ॥

బ్రహ్మ జగత్తును సృజించ దైనందిన ప్రళయ మనుపేరఁ బరఁగు నొక యవాంతర ప్రళయము జరుగు కాలమును బ్రహ్మ కొకపగలని కాలస్వరూపము నెఱింగిన మహాత్ములు చెప్పు చున్నారు. ఇక్కాలము వేయిమహాయుగములుగ విభజింపఁ బడియున్నది. ఒక్కొక్క మహాయుగమును కృత త్రేతా ద్వాపర కలియుగము లను నాల్గుయుగములుగ నెఱుంగఁబడు చున్నది. ఇందొక్కొకయుగమునందును నాల్గు యుగముల ధర్మములు వరుసఁగ జరుగుచుండును. ఒక్కొక్కయుగము నందు నల్పకాలికము లగు నవాంతరయుగము లున్నట్లు తెలియవచ్చుచున్నది. అట్టియవాంతరయుగము లైదువేలసం వత్సరముల కొకటి యగుననియు, నాయైదువేల సంవత్సర ముల యుగములం దొక్కొక్కదానియందును నాల్గుయుగ ముల ధర్మములు కొంత ప్రవర్తించుచుండు ననియును బెద్దల యభిప్రాయము. ఇట్లేయుగధర్మ మా యుగమునఁ బ్రధాన ముగ నడుచుచుండ దానికిలోఁబడిన యవాంతర యుగధర్మ

ములును వరుసఁగ జరుగుచుండును. మొదటిది యగు కృత యుగము సత్యయుగ మను నామాంతరము గలిగి యందు ధర్మము నాల్గుపాదముల వర్తించుచుండుననియును, రెండవది యగు త్రేతాయుగమున ధర్మము మూఁడు పాదములుగ నడుచుచు నొకపాద మధర్మముతోఁ గలిసియుండు ననియు, మూఁడవదియగు ద్వాపరయుగమున ధర్మము రెండుభాగములుగను, అధర్మము రెండుభాగములుగను ప్రవర్తిల్లుచుండు ననియును, నాల్గవదియగు కలియుగంబునందు ధర్మ మొక్క పాదముగను, అధర్మము మూఁడు పాదములుగను జరుగుచుండుననియును దత్త్వజ్ఞులు పూర్వము తెలిపియున్నారు.

ఇప్పుడీకలియుగమున నైదువేల సంవత్సరములు గల యొక యంతర్భాగము గడచెను. ఒక్కొక్క యైదువేలసంవత్సరములకాలమునందును మొదటిభాగము కలియుగధర్మములోఁ గృతయుగధర్మములును, అనఁగాఁ గలిధర్మములలో నుత్తమములును, నటులే రెండవ మూఁడవ నాల్గవభాగముల యందుఁ ద్రేతా ద్వాపర కలిధర్మములు వరుసగఁ గలిసియుండు. కావున నీ సమయమునఁ గలియుగమున మొదటి యైదువేల సంవత్సరములు పూర్తియై రెండవ యైదువేలసంవత్సరములు గల కాలమారంభమై యుండుటవలన నీ సమయము కాలచక్రమునఁ గృతయుగధర్మము జరుగవలసిన కాలముగ నున్నదని స్పష్టమగుచున్నయది.

కలౌ పఞ్చసహస్రాంతే జాయతే వర్ణసఙ్కరః ॥

అను నీవాక్య మీయర్థమునే యించుక సూచించుచున్న యది. మొదటి యైదువేల సంవత్సరములకాలము కడపటి భాగము కలిధర్మములలో నవాంతరకలిధర్మము జరుగు కాలము కావున నైదువేల సంవత్సరముల కడపటికాలమున ధర్మము మిగుల హీనముగనుండునని పెద్దలు సూచించి యున్నారు. ఇప్పు డాకాలము దాఁటినందున మరలఁ గృత యుగధర్మము కొంత వృద్ధి కాఁదగిన సమయముగ నున్నయది. ఇప్పటి ప్రపంచస్థితిని గమనించిచూచిన నీశుభసూచకములు స్పష్టముగ వెల్లడియగుచునే యున్నయవి. ఇరువది ముప్పది యేండ్లకుఁ బూర్వము మనదేశమునందేమి, యితరదేశముల యం దేమి యెచ్చటఁ జూచినను నాస్తికవాదము ప్రబలి యుండెను. ఇంద్రియగోచరములగు విషయములకంటె నన్య మొక్కటియు లేదనియు, విషయసుఖానుభవముకంటెఁ గోరఁదగిన వేఱుసుఖము లేదనియు వాదించువారలును, దదనుసారముగనే నడుచువారును బ్రబలియుండిరి. పూర్వ వైదికాచారములును, ధర్మములును నాదరణీయములని తోఁచ కుండెను. ఐరోపాఖండమునందును, అమెరికాయందును మత మునం దాదరణబుద్ధి క్షీణించి జనులు ప్రకృతిబద్ధులై కేవల విషయాసక్తులగుచుండిరి. ఎల్లయెడల నీ తీరుననే షత్తత్త్వ విషయములగు ధర్మములు క్షీణగతి నొందియుండెను. ఇంతియ గాదు. అన్ని దేశములయందును మతాభిమానము గలవారు కొద్దిగనుండినను వారు సైతము మతమునందలి యథార్థతత్త్వ

ములను, ముఖ్యాంశములను బాగుగఁ దెలిసికొనక యముఖ్య ములగు బాహ్యాచారములే ముఖ్యము లని పాటించి యందు శ్రద్ధలేక శుష్కాచారపరాయణులై యుండిరి. ఆకారణమున నల్పములగు నాచారభేదములు సయితము పరస్పర మన స్పర్థాసూయలకు హేతువు లగుచుండెను. అన్యోన్యమత ద్వేషము లభివృద్ధియగుచుండెను. ఇప్పుడన్నన్నో యే దేశమునఁ జూచినను మతవిషయములయందే శ్రద్ధ హెచ్చుచుండెడు. అతీంద్రియములగు విషయములయందు నమ్మక మతిశయించు చున్నది. ఒక్కొక్కమతావలంబులును దమతమ గ్రంథముల యందలి సారమును గ్రహించుటకు యత్నించుచున్నారు. ముఖ్యాంశములను, నముఖ్యాంశములను వేఱుపఱచుటచే నన్ని మతములయందలి ముఖ్యాంశము లొక్కటిగ నెఱుంగుటయు దానికి ఫలముగ మతవైషమ్యములు తగ్గుచుండుటయు, నైక మత్యము, భ్రాతృభావము వృద్ధియగుటయును జూచు చున్నాము. ఇట్లు మరలఁ గొంత కృతయుగధర్మము ప్రారంభ మగుట స్పష్టముగఁగానవచ్చుచున్నది. కావున భక్తిజ్ఞాన ముల నభ్యసింపఁగోరువారి కిది మంచిసమయము.

అట్లంతకుఁబూర్వ మధ్యాత్మవిద్య లోకమున మిక్కిలి క్షీణదశఁ జెందియుండినకాలమున బ్రహ్మవిద్యాస్వరూపులు, నధ్యాత్మవిద్యారక్షకులును, బరతత్త్వ సాక్షాత్కారముగల వారును, జీవన్ముక్తులు నగు మహర్షులలోఁ గొందఱు అజ్ఞులయి సంసారసాగరమున మునిఁగి తెప్పరిల్లఁజాలక సంకటపడు

చుండు శిశుప్రాయులగు పామరజనుల యుద్ధారణార్థము లోకమునఁ బరతత్త్వజ్ఞానమును బ్రకాశింపఁజేసి ధర్మమును బ్రతిష్ఠించు నుద్దేశముగలిగి దివ్యజ్ఞానసమాజమను నొక సంఘమును స్థాపింపఁజేసిరి. ఆసమాజము ప్రారంభించినది మొదలు ప్రపంచమునందలి దేశములన్నింటియందును దాని శాఖలు వ్యాపించి, జనుల మనస్సులను కేవల మైహికవిషయముల నుండి మరలించి యాముష్మికవిషయమునందు శ్రద్ధగలుగు నట్లు చేయుచువచ్చుచున్నయవి. ఈసమాజశాఖలు ఏయే దేశములయందుఁ బ్రబలెనో యాయా దేశములయందు క్షీణగతి నొందియుండిన మతములు పునరుజ్జీవితములు కాఁగా నాయా మతస్థులు ప్రవర్ధమాన శ్రద్ధతో మతధర్మముల నాచరించుచున్నారు. ఇవ్విధమున నన్ని దేశములయందును భగవంతుఁడు ధర్మసంస్థాపనముచేయుకొఱకీసమాజరూపమున నవతరించెనో యనునట్లు గనఁబడుచున్నది. యథార్థముగ బ్రహ్మస్వరూపులై యదృశ్యులుగ లోకసంగ్రహార్థము వర్తించు మహర్షుల ప్రోత్సాహముచే వారల యనుగ్రహపాత్రులగు వారి ముఖ్య శిష్యులచే లోకమున నీసమాజము స్థాపింపఁబడినదని యాసామాజికులలో ననుభవజ్ఞులగువారు చెప్పుచున్నారు. ఈసమాజము స్థాపింపఁబడి ముప్పదియాఱు[1] సం

[1] దివ్యజ్ఞానసమాజము క్రీ॥ శ॥ 1875 సం॥ నవంబరు తే 1 దిన అమెరికాలో న్యూయార్కుపురమున స్థాపింపఁబడెను. ఈగ్రంథము 1911 సం॥ మున వ్రాయబడె.

వత్సరములు మాత్రమే యైయుండియు నది యీస్వల్పకాల
మున నే ప్రపంచమునందలి నానాదేశీయులయు, నానామతస్థు
లయు మనోవృత్తులను సవరించి పరస్పరమైత్రిని వృద్ధిచేయుట
యేగాక పురాతనగ్రంథములయందు గూఢముగ నుండిన
పెక్కురహస్యముల నిక్కాలమునకుఁ దగినట్లు సుబోధములుగ
వెల్లడిచేసి, మఱియు ననేకరీతుల లోకమునకు మేలుచేయు
చున్నది. దీనింజూడ నీసమాజము మనుష్యమాత్రులచే స్థాపిం
పఁబడినదికాదని వెల్లడికాక తీరదు. ఈసమాజమునందుఁ బ్ర
ముఖులు ననుభవజ్ఞులునై, యిక్కాలమున యథార్థముగ యో
గులస్వరూప మిట్టిదని తమనడవడిచే లోకమునకుఁ బ్రదర్శిం
చుచుఁ "బరోపకారార్థ మిదం శరీర" మ్మను సూక్తిని సార్థక
ముచేయుచు గ్రామైకరాత్రముగ సంచరించుచుఁ బరతత్త్వ
రహస్యములను శ్రద్ధాళువులకు బోధించుచుఁ గర్మభక్తిజ్ఞాన
మార్గముల సారమును స్వానుభవమునఁ జూపుచుండు 'ఆని
బెసంటు' (Annie Besant) గారీవిషయమై జీవన్ముక్తులగు
మహాత్ముల సహాయముననే యిక్కార్యమంతయు నడచు
చున్నదని సాటించుచున్నారు. ఇంతియకాక జీవన్ముక్తులగు
మహనీయులు సర్వకాలము పామరుల నుద్ధరించుకొఱకుఁ దమ
తపోమహిమ లోకమునందుఁ బ్రవహింపఁజేయుచున్నారని
యును, వారలు ముఖ్యముగ నీసమయమున నాతేజస్సు
నెక్కువగ లోకమునకుఁ బంపుచున్నారనియును, యోగ్యు
లగు శిష్యులు దొరకుదురాయని వారలు కాచియున్నవా

రనియు, నీకాలమున శ్రద్ధాభక్తులు గలిగి లోకోపకారమునకై యాముష్మికమును సాధించుటయందు యత్నముచేయువార లెప్పటికంటె నెక్కువగ వారి యనుగ్రహమునకుఁ బాత్రు లగుదురనియు, లోకులమేలుకొఱకు నొక్కి వక్కాణించు చున్నవారు.

మఱియు లోకమున ధర్మము క్షీణగతినొంది యధ్యాత్మ విద్య యాదరింపఁబడనపుడెల్లను బ్రహ్మవేత్తలును, జీవన్ముక్త లును, మరణమును దరించినవారును నగు మహర్షులలో నొకరు గాని, వారిముఖ్యశిష్యులలో నొకరుగాని, లోకమున జన్మించి యజ్ఞానులగువారలకు జ్ఞానోపదేశమును జేయుచు, భక్తిశ్రద్ధ లనువృద్ధిచేయుచు, బ్రహ్మవిద్యను లోకమున మఱువకయుండు నట్లు కాపాడుదురని పూర్వమే చెప్పఁబడియెఁగదా! గడచిన ముప్పదాఱువర్షములనుండి దివ్యజ్ఞానసమాజమూలమునను, ఆసమాజమునందుఁ బ్రముఖులుగనుండు నా మహర్షుల శిష్య సముదాయము మూలమునను, జనుల మనస్సులు పరవిద్య యందు శ్రద్ధావంతము లగుచుండుట విదితముగనున్నది. ఈ రీతిని జనుల మనస్సులు కొంత పరిపక్వముకాఁగా నామహాత్ము లలో నొక రతిశీఘ్రకాలములోనే లోకమున జన్మింప నుద్దే శించియున్నవారనియును, ఇరువది ముప్పది సంవత్సరముల లోపల నట్టియవతారము రాఁగలదనియు, నామహనీయుఁడు మనుష్యశరీరమునఁ గన్పడుకాలమున వారిమాహాత్మ్యము నెఱింగి వారియనుచరులగుటకుఁ దగినయోగ్యతను సంపాదించు

కొనుటకు విశేషప్రయత్నము కర్తవ్యమనియు, నీసమాజ మున కగ్రాసనాధిపత్యము వహించియుండు నానిబెసెంటుగారు అదృశ్యులగు వారిగురువులయనుమతిచే బాహాటముగ జాటు చున్నారు.

అట్టిమహానుభావుఁడు లోకమున జన్మించినపు డేరీతిగవర్తిం చునో, యేవిషయముల నెవ్విధమున బోధించునో నిరూపింప శక్యముగాదనియు, నేదేశమునఁగాని యేజాతివారుగాని యెక్కుడు భక్తిశ్రద్ధలుగలిగి "ఆత్మవత్సర్వభూతాని" యను న్యాయమును సార్థకమగునట్లు చేసి వర్తించుచుందురో, సాధు వులగువా రేదేశస్థులయినను, ఏమతస్థులయినను, ఏజాతివా రైనను, వారిని గౌరవపాత్రులుగ నెవరుభావింతురో ఎవ్వ రెల్లవారిసుఖదుఃఖములను దమ సుఖదుఃఖములుగ భావించు చుందురో, పరోపకార తత్పరులై స్వప్రయోజనముల సా ధించుకొనుటకంటెఁ బరప్రయోజనముల సమకూర్చుటయే శ్రేష్ఠతరమనియు, నైహిక ప్రయోజనముకంటె నాముష్మిక కార్యము లెక్కుడుగఁ గోరఁదగినవనియును, ఫలము నభిల షించిచేయు కార్యములకంటె నీశ్వరార్పణబుద్ధితో లోకోప కారముకొఱకుఁ జేయుకార్యములు చేయఁదగినవనియును భావించి వర్తింతురో, అట్టివారామహనీయుని గుర్తింపఁ జాలుదు రనియు నట్టి పుణ్యాత్ము లామహనీయుని శిష్యకోటి యందుఁ బరిగణింపఁబడఁ జాలియుందురనియును ఆనిబెసెంటు గారు మరల మరల నొక్కి చెప్పుచున్నవారు.

ఇట్టి గొప్పశుభోదయముగల యిక్కాలముకంటె మంచి కాలము ప్రాప్తించుట దుర్లభము. ఇట్టి నిరుపమాన సదుపాయభూయిష్ఠమగు సమయమును బ్రయత్నముచేత జన్మసాఫల్యసాధనముగఁ జేసికొననియెడల జీవుఁడు మరల నిట్టి సందర్భములు దొరకక విచారింపవలసియుండును.

కావునఁ బరమార్థచింతగలవారందఱును సకాలమున నా మహానీయుని శిష్యకోటియం దెన్నఁబడుటకుఁగాని, లేక వారి పరివారమునందైనను జేరి వారి నుపచరించుటకుగాని తగిన యోగ్యతను బహుప్రయత్నముతో సంపాదింపఁదగు. అనఁగా దృఢమగు వివేకమును, దీవ్రవైరాగ్యమును, నిశ్చలభక్తియు, నెన్ని కుతర్కములచేతనైనను జలింపని దృఢనిశ్చయము, ఇంద్రియ నిగ్రహము, వాఙ్నియమము, మనస్సమాధానము లోనగువానిని వృద్ధిచేసికొనదగు. మఱియు సర్వభూతముల యందు మైత్రియుఁ దనకంటె నుత్తములగువారియందు నిశ్చలమగుభక్తియు జాతి మత వర్ణ లింగవ్యత్యాసములను గమనించక, దీనులయందు ఎల్లయెడల వాత్సల్యము లోనగు గుణముల నిరంతరముగ దృఢమగు పూనికతో నభ్యసింపవలయును. అందఱియందును దోషములఁ బరికించుబుద్ధిని వదలి గుణగ్రహణముచేయుట నలవాటుచేసికొనుట కర్తవ్యము. అట్లుచేయక యహంకార మమకారములు అసహిష్ణుత దోషదర్శనపరులుగనుండుట యీ మొదలగు భేదబుద్ధిజన్యములగు గుణములకు లోఁబడినచో నైహికాముష్మికములకు రెండింటికిఁ

జెడినవారలగుదురు. సంగ్రహముగ గీతాశాస్త్రమునందుఁ బదారవయధ్యాయమున భగవంతునిచే నుపదేశింపఁబడినరీతి నాసురసంపద్గుణములను సాధ్యమగునంతదనుక సమూలముగ విడువ యత్నించుచు, దైవీసంపద్గుణములను దృఢముగనభ్య సించుచు నుత్తమపురుషార్థమును బొంద జనులెక్కుడుగఁ బ్రయత్నింతురుగాక యని పరమదయాసాగరుండగు భగవం తుని బలుమారు ప్రార్థించుచున్నాము.

సర్వే జనా స్సుఖినో భవంతు

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

